శ్రీరస్తు

# సారంగధర చరిత్రము

చేమకూర వేంకటకవి ప్రణీతము

(లఘుటీకా సహితము)



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

# ప్రకాశకుల విజ్ఞప్తి

చేమకూర వేంకటకవి రచించిన 'సారంగధర చరిత్రము' నిదివఱలో మేము ప్రకటించి యున్నాము. దానిని టీకతోఁ గూడ ప్రకటించినచో నెక్కువ ఉపయోగముండునని తోఁచుటచే నీ గ్రంథమును సటీకముగఁ బ్రకటింపవలెనను అభిప్రాయము మాకు పెక్కేండ్ల క్రిందటనే కలిగినది.

"సారంగధర చరిత్రము" పెక్కు రీతుల పాఠములతోఁ గూడి యున్నది. అట్టిదానిని టీకతోఁగూడ ప్రకటింపఁదలంచినచో—తొలుత వ్రాతప్రతుల పాఠములను సేకరించి, సాధుపాఠమును నిర్ణయించుట ప్రథమ కర్తవ్యము. ఈ గ్రంథమునకు తంజావూరులోని 'సరస్వతిమహాల్' లైబ్రరీలో అయిదు మాతృక లున్నవి. మా కోరికపయి శ్రీ గన్నవరము సుబ్బరామయ్యగారు శ్రమపడి ఆ పాఠముల నన్నిటిని మా ముద్రిత ప్రతిలో నెక్కించి, ఇరువది యేండ్ల క్రిందటనే మా కొసంగిరి. తర్వాత ఆవశ్యకములగు కొన్ని గ్రంథములను ముద్రింపవలసి వచ్చుటచేతను, ఆ తర్వాత కాగితపుఁ గరవువలనను దీని ప్రసక్తి కొంత వెనుకపడెను. మేము తలపెట్టిన కార్యమును కొనసాగింపఁదలఁచి - పాఠాంతరములతోఁగూడిన ప్రతి నొసఁగుచు, సాధుపాఠములను నిర్ణయించి - లఘుటీకను వ్రాయవలసినదని శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిని కోరఁగా మా కోరిక మేరకు ఆయన పాఠపరిశీలన మొనర్చి లఘుటీకను వ్రాసి యొసంగిరి .

'సారంగధరచరిత్ర'కు పీఠిక గాని, ఆశ్వాసాద్యంత పద్యములు కాని కానరావు. కొన్నికొన్ని వ్రాఁత ప్రతులలో విజయవిలాసములోని పీఠికయు, ఆశ్వాసాద్యంత పద్యములును కానవచ్చుచున్నవి. చేమకూర వేంకటకవి "కృతులొకని కీను; మీకె యంకితములంటి" అని విజయవిలాస కృత్యాదిలోఁ జెప్పికొని యున్నందున నీ గ్రంథమును రఘునాథ నాయకునికే యీయఁబడినదని చెప్పవచ్చును. పాఠకుల సౌకర్యమునకై యిందు విజయవిలాస పీఠికాపద్యములు, ఆశ్వాసాద్యంత పద్యములు చేర్పఁబడినవి.

ఈ గ్రంథమున కిదివరలో శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి లఘుటీకయు, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి 'జితకాశి' టీకయుఁ గలవు. శ్రీ వేంకటరాయశాస్త్రిగారి టీక అత్యంత సంగ్రహరూపము. శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు కొన్ని పద్యములకు విపులముగ టీకలు వ్రాసి, కొన్నింటిని విడిచిపెట్టిరి. 'విజయ విలాసము'లో నున్నవను కారణముననేమో! ఆశ్వాసాద్యంత పద్యములు - టీకారహితముగ వదలిరి. మేము ప్రకటించు టీక సంగ్రహరూపమైనను, మూలకారుని అభిప్రాయమును వ్యక్తముచేయుట కెంతయు ఉపయుక్తమైనదనిమాత్రము చెప్పఁగలము. 'జితకాశి' లో విడువఁబడిన కొన్ని విషయము లిందు చూపఁబడినవి.

ఇట్లు
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ

# సారంగధరచరిత్రము

## పీఠిక



లెల్లప్పు డొసంగ నీసకలధా
త్రీచక్రము౯ బాహుపీ
ఠిలగ్నంబుగఁ జేయ దిగ్విజయ మీ
డీకొన్నచందాన నే
వేళ౯ సీతయు లక్ష్మణుండుఁ దను సే
వింపంగ విల్ పూని చె
ల్వొప్పిలక౯ దగు రామమూర్తి రఘునా
థాధీశ్వరుం బ్రోవుతన్. 1

ఉ. శ్రీకలకంఠకంఠియు ధరిత్రియు దక్షిణవామభాగముల్
గైకొని కొల్వ వారిఁ గడఁగ౯ గడకన్నులకాంతిఁ దేల్చి
తా, నాకమలాప్తతం గువలయాప్తతఁ దెల్పెడు రంగభర్త
లోకైకవిభుత్వమిచ్చు దయ నచ్యుతు శ్రీరఘునాథశౌరికిన్.

ఉ. శ్రీరుచిరాంగి నీభవనసీమ ధురీణంబుగ [1]నిల్చె నేలు దీ
థామణి నీవ యన్నక్రియ దక్షిణపాణి నెఱుంగఁజేయుశ్రీం

---

1 నిల్చు

గారరసాబ్ధి వేంకటనగస్థిరవాసుఁడు పూర్ణదృష్టి నెం
తే రఘునాథభూరమణదేవు గుణంబులఁ బ్రోవుఁ బోవుతన్. 3

తే. ధీయుతుఁ డటంచు నలువ దీర్ఘాయు వొసఁగి
కాయు రఘునాథవిభు వజ్రకాయుఁ గాఁగ
వీరవరుఁ డని హరుఁ డత్యుదారకరుణఁ
జేయు నెప్పుడు విజయు నజేయుఁ గాఁగ. 4

మ. మొగుడుం దమ్ముల విప్పునప్పుడు రజంబుల్ జక్రవాళంపుఁ
గొం, డగడిల్ దేలుగ దైనపట్లుఁ దమముల్ మందేహులల్
దోలి వ్రాసి గడల్కొంతతియందు సత్త్వముఁ బ్రకా
శింపల్ ద్రిమూర్త్యాత్మకుం, డగు తేజోనిధి వేడ్కఁ జేయు
రఘునాథాధీశుఁ దేజోనిధిన్. 5

శా. మాద్యద్దంతముఖార్చనానియమముం బాటించు నెల్ల
ప్పుడుల్, సద్యఃగపూర్ణ ఫలాప్తిచే మనుచు నంతర్వాణులల్
మామనో, హ్యాద్యుం డౌ రఘునాథశౌరియని కార్తి
న్నాటికిల్ బోటికిల్, విద్యాబుద్ధు లొసంగి ప్రోతు రతనిల్
విఘ్నేశుఁడుల్ వాణియున్. 6

శా. ప్రాగల్భ్యంబున విష్ణుశంభుమతముల్ పాటించి సర్వంసహా
భాగం బందు సమప్రధానగతి యొప్పల్ రాజలోకంబులోఁ
దా గణ్యం డని యచ్యుతేంద్రరఘునాథక్షోణిభృన్మౌళికిల్
శ్రీగౌరుల్ సమకూర్తు రాహవజయశ్రీగౌరులల్ నిత్యమున్.

మ. ప్రకటశ్రీహరియంఘ్రిఁ బుట్టి హరుమూర్ధం బెక్కి యాపా
దమ, స్తకముల్ వర్ణన కెక్కుదేవి సహజోదంచత్కులోత్ప
న్ననా, యకరత్నం బని యచ్యుతేంద్రరఘునాథాధీశ్వర

స్వామికిన్, సకలైశ్వర్యములు న్నిజేశువలనన్ దాఁ గల్గఁగాఁ
జేయుతన్. 8

క. ఆరాజశేఖరుఁడు ప్రియ
వారిజముఖి తోడుగాఁగ వర్ధిలువిమల
శ్రీరుచిరవంశమున ధా
త్రీరంజనసుకృతి చెవ్వనృపతి జనించెన్. 9

క. ఆచెవ్వనృపాలాగ్రణి
యాచంద్రార్కముగఁ గాంచి నరుణాచలవృ
ద్ధాచలములఁ గట్టించె మ
హాచతురసమీరగోపురావరణంబుల్. 10

తే. ఠీవి నచ్యుతరాయలదేవి యైన
తిరుమలాంబకు ననుజ యై తేజరిల్లు
మూర్తమాంబను బెండ్లి యై కీర్తివెలయఁ
జెవ్వవిభుఁడు మహోన్నతశ్రీ జెలంగె. 11

క. ఆమూర్తమాంబ కఖిలమ
హీమండలనాథుఁ డచ్యుతేంద్రుఁడు సుగుణో
ద్దాముఁడు జన్మించెం ద
ద్భూమీపతి రంగధాముపూజన్మించెన్. 12

శా. శ్రీరంగేశుఁడు వచ్చి యచ్యుతధరిత్రీభర్త యై భాగ్యరే
ఖారూఢిన్ విలసిల్లి తానె తనకున్ గైంకర్యముల్ చేసెఁగా
కేరా జైనను జేయఁగాఁ గలిగెనే యిట్లీవిమానం బహో
భూరిస్నిగ్ధముగా మహామణిమయంబుల్ గాఁ గిరీటాదులున్.

చ. గెలిచిన గెల్పు లర్థితతికిన్ దిన మిచ్చిన[1]యీవులున్ వహుల్
తలఁచిన విక్రమార్కు లొకలక్షయుఁ గర్ణులు కోటియున్

1 యీవులన్.

గదా, కలిగిన నీడువత్తు రనఁగాఁ దగు సాహసదానసద్గుణం
బులు ధరయందుఁ బుట్టఁగనె [1]పుట్టినయచ్యుతభూమిజానికిన్.
శా. వీరాగ్రేసరుఁ డర్థిపోషణగుణావిర్భూతభాస్వద్యశో
ధౌరేయుండు మణీతులాదికమహాదానావళుల్ సేయఁ దా
నౌరా! మార్గము వెట్టినట్టిఘనుఁ డాహా!లోకమం దచ్యుత
క్ష్మారాణ్మౌళియొనర్చు పుణ్యమహిమల్ శక్యంబె లెక్కింపఁగన్.
క. ఆపుణ్యఫలంబు[2]ననె ద
యాపాథోరాశి యైనయలయచ్యుతభూ
మీపతికిన్ రఘునాథ
క్ష్మాపాలుం డుదయమయ్యె జైవాతృకుఁడై. 16
ఉ. పుట్టిన దాదిగాఁ దనదుపుణ్యమె దాఁకగ వైరిభూమిభృ
ద్ఘట్టమదంబు దాఁ దిగ సదా దిగధీశనుతప్రతాపుఁడై
పట్టమహాభిషేకబహుభాగ్యధురంధరుఁడై యయోధ్య య
న్పట్టణ మేలుసామియొ యనన్ రఘునాథవిభుండు వర్ధిలున్.
మ. రసికుండౌ రఘునాథుకీర్తిసతి యారా తోల్త వాగ్బంధమున్
రసవాదంబును రాజవశ్యనిధి నేరంబోలుఁ [3]గాకున్న వె
క్కసపుంబ్రౌఢి వహించి శేషఫణి మూఁగం జేయఁ చాఁ రాద్రి
న్నుల్లసము ల్వాల్కఁగ ఛత్త్రచామరమహాలక్ష్ములన్
శక్యమే? 18
చ. నలువగ నెన్నినైన రఘునాథనృపాలుఁడు గల్గఁగా మహీ
స్థలి నిఖిలైకధర్మములుఁ దామరతంపర లై చెలంగెఁ గో
ల్లలుగ నశేషసజ్జనకులంబు సుఖంబు గనెన్ సమస్తవి
ద్యలుఁ గసటెల్ల బాసి మొఱపై వెలవెట్టెసభాంతరంబునన్.

1 పుట్టినవ 2 గనె 3 లేకున్న.

ఉ. శైలము లెక్కి యష్టమదసామజసాళులమీఁదుగా మహా
శైలమువెన్ను దాఁటి పలుగొమ్ము మొనం బడి సర్వదావిష
జ్వాలలు గ్రమ్ము శేషుతలచాయనె యోడక వచ్చి కూడె నా
భూలలితాంగి కెంత వలపో రఘునాథ[1]నృపాలునందునన్. 20

సీ. రత్నాకరాంతోర్వరావిహారుం డౌట
నగ్రహారము లసంఖ్యముగఁ జేసె
నమితదానవినోది [2]యగుటఁ గణ్యాంతర
భద్రకుంభీక్షణపరతఁ దనరె
దక్షిణనాయకోత్తముఁ డౌట మేలైన
మలయజగంధిమండలము నేలె
భరతవిద్యాధురంధరుఁ డౌట రంగస్థ
లంబు రామాలంకృతం[3]బు చేసె

తే. నౌర కర్ణాటసింహాసనాధిరాజ్య
భరణనిపుణగుణోద్దండబాహుదండ
జనితసాపత్న్యసంవాదజయరమామ
హీలలితకేళి రఘునాథనృపతిమౌళి. 21

శా. రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు
నీడౌ నన్, దేజఃప్రౌఢవచో వివేక నయ భూతి శ్లాఘులన్
మించు నౌ, రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వ
జ్ఞుండు నెబ్బంగులన్, యోజింపన్ రఘునాథభూరమణ
వర్యుండే ధరామండలిన్. 22

సీ. అదిరిసింగపుఁబల్ల మనఃరించె నేరాజు
మేలుఁదేజికిఁ బదివేలు సేయఁ

---

1 నృపాలమౌళిపై 2 యౌట 3 బొనర్చె.

జికిలిబంగరుదిండ్ల పికిలికుచ్చులయందం
లం బెక్కు నేరాజు లక్షసేయఁ
గనకమయంబుగాఁ గట్టించె నేరాజు
సాటి లేనినగళ్లు కోటి సేయఁ
గంఠమాలిక మొదల్ గాఁ బెట్టె నేరాజు
సొమ్ములు పదికోట్లు సేయ
తే. నతఁడు విభుమాత్రుఁడే బహుళాగ్రహార
నిత్యసత్రమహాదాననికరపోషి
తాహిమాచలసేతుద్విజాభిగీర్ణ
పుణ్యవిభవుండు రఘునాథ[1]భూవిభుండు. 23
చ. త్రికరణశుద్ధి నచ్యుతుని శ్రీరఘునాథనృపాలువై ఖరిఁ
సకలమహీసురావళికి సత్త్రము లెప్పుడు బెట్టలేఁడ కా
యొకదొరయందు లెక్కవిని యొక్కొకనాఁటికె యింత
రొక్కమిం, తకుఁ దెగసాగెనా యనక తా ముద మందినఁ
జాలు నెమ్మదిన్. 24
సీ. అడుగుమాత్రమె కాక యుంతకెక్కుడుగ నీఁ
జాలెనే యల బలిచక్రవర్తి
యావేళ కటుదోఁచినంతమాత్రమె కాక
కోర్కెకెచ్చిచ్చెనే యర్కసూతి
తూఁగినమాత్ర మిత్తుననె గా కిచ్చువ
చ్చినది కోమ్మనియెనే శిబివిభుండు
కలమాత్ర మపు డిచ్చెఁ గాక కట్టడ గాఁగ
ననిశంబు నిచ్చెనే యమృతకరుఁడు

1 భూవరుండు.

తే. వారి నేరీతిఁ బ్రతిసేయవచ్చు నెల్ల
యర్థులఁ గృతార్థుల నొనర్చునట్టియప్ర
తీపవితరణికి మహాప్రతాపతిగ్మ
ఘృణికి నచ్యుతరఘునాథనృపతిమణికి. 25

ఉ. తప్పులు వేయుఁగల్గినను దాళును నమ్మినవారిపట్లఁ దాఁ
జెప్పినమాట యూర్జితము సేయు నొకం డొరుమీఁదఁ
గొండెముల్, సెప్పిన వానికై మనవిచెప్పినరీతిగ నెంచు
నీడుగా, రిప్పటిరాజు లచ్యుతనరేంద్రుని శ్రీరఘునాథశౌరికిన్.

సీ. ఆకారమున నలునంతవాఁ డౌనె కా
హయసమ్యగారూఢి నంతవాఁడె
యతిదయామతి రామునంతవాఁ డౌనె కా
యసమానగురుభక్తి నంతవాఁడె
యమృషోక్తి ధర్మజునంతవాఁ డౌనె కా
యన్నసత్త్రఖ్యాతి నంతవాఁడె
యాలంబునఁ గిరీటియంతవాఁ డౌనె కా
యమితనాట్యప్రౌఢి నంతవాఁడె

తే. రసికమాత్రుండె యతఁడపుర ప్రడీన
సారసారస్వతాధారశారికాశు
కవనకృతముఖశుకకళాకలనహృష్ట
బుధజనాస్థాని రఘునాథభూమిజాని. 27

ఉ. మాటలనేర్పులా సరసమార్గములా కొలువుండురీతులా
పాటలగంధులా కళలభాగ్యములా బహుదానలీలలా
నాటకశాలలా యొక టన న్వల దెన్నిటఁజూడ నన్నిటన్

మేటియుఁ గీర్తిలోలుఁడుఁ జూమీ రఘునాథనృపాలుఁ
డిమ్మహిన్. 28

వ. అని రఘునాథమహీకాంతు ననంత శోభనగుణమ్ములలోనఁ
గొన్ని యభివర్ణించి. 29

తే. నన్ను నడిపిన[1]బహుళసన్మాన మొంచి
యఖిలవిద్యావిశారదుఁ డగుటఁ గాంచి
యవని నింతటిశాజెవ్వఁ డని నుతించి
కృతు లొసఁగఁ గీర్తికలదని మతిఁ దలంచి. 30

ఉ. తా రసపుష్టిమై బ్రతిపదంబున జాతియు వార్తయుఁ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గునెనేకకృతుల్ ప్రసన్నగం
భీరగతిఁ రచించి మహి మించినచో నిఁక శక్తు లెవ్వర
య్యా రఘునాథభూపరసికాగ్రణికిఁ జెవి సోఁకఁ జెప్పఁగన్.

మ. కలిగెం గాఁ దనసమ్ముఖం బనియె సత్కారంబు తాఁ జేయు
నా, తల [2]నెందే శిరసా వహింతు రనియుం దాఁ గాఁ లే
దెందు సాధులకుం దిక్కని[3]యుం దయఁ మనుపురీతు ల్గాక
శక్యంబె విద్యల మెప్పింపఁగ నచ్యుతేంద్రరఘునాథస్వామి
నెవ్వారికిన్. 32

చ. అని గణియించి యైనను గుణాంశ మొకించుక కల్గినం బళా
యను నదిగాక మిక్కిలి నిజాశ్రితపక్షము గల్గు సత్కృపా
ఖని యణుమాత్ర మైన నొక కానుకఁ దెచ్చినఁ గొండగాఁ
గనుఁ, మనమున నచ్యుతేంద్రరఘునాథుఁడె శ్రీరఘునాథుఁ
డెన్నఁగన్. 33

1 యధిక 2 నెంతే 3 నిచ్చలుం.

క. శుభవాసరమున నయ్యెడ
నిభరాజముఖోపదానిరీక్షేచ్ఛ మహా
విభవాభిరాముఁడై భా
వభవాకృతి భద్రపీతవాసోజ్జ్వలుఁడై. 34

సీ. కుందనంపుఁబసిండి కుళ్లాయిజగలపైఁ
జౌకట్లనిగనిగల్చొకళింప
హురుముంజిముత్యాలయరచట్టపై గొప్ప
[1]పతకంపుహారము ల్పరిఢవిల్ల
వెలఁజెప్పరాని కెంపుల[2]వంకజముదాడి
పీతాంబరంబుపైఁ బెరిమె నెఱప
గబ్బిమన్నె కుమారగండ [3]పెండారంపు
జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప

తే. దొరల మంత్రులఁ [4]గవుల నాదరణ సేయ
కరముకంకణకాంతి నల్గడల నిండ
నిండుకొలువుండెఁ గన్నులపండువుగను
ఠీవి నచ్యుతరఘునాథభూవిభుండు. 35

తే. అట్టు లొడ్డోలగం బున్న యవసరమున
వినయభయసంభ్రమములు నావెంట నంట
ననుఁ గృపాదృష్టిఁ జల్లఁగాఁ గనుచు నుండ
సమ్ముఖమ్మున [5]కరిగి యంజలి ఘటించి. 36

ఉ. ఏలికమాత్రమే! మహిమ నీశ్వరుఁడే తలపోసి చూడ నా
పాలిటిరామభద్రుఁ డని బంగరుఁబూవులఁ బూజ జేసి నేఁ

1 పదకంబు 2 వంకిజముదాళి 3 పెండేరంబు 4 కరుణ. 5 కేఁగి.

జాల నలంకృతిం బొసఁగు సత్కృతి కానుక చేసి కీర్తి భూ
శ్రీలలితాంగులన్ వలనఁ జేసినశ్రీరఘునాథశౌరికిన్. 37

ఉ. శ్రీరసభావముల్ వెలయఁ జెప్పి ప్రబంధము లెన్ని యేనిమీ
పేరిట నంకితం బిడిన బిడ్డల [1]నెందఱ: బేరుపెట్టినన్
దీరునె మీఋణం బయినఁ దెచ్చితిఁ గాన్క పరిగ్రహింపుమ
య్యా! రఘునాథభూపరసికాగ్రణి! మామకకావ్యకన్యకన్.

సీ. ఘోటక ఖుర పుట క్షుణ్ణ ధరా జాత
పాంసువుపై నుల్లభంబు గాఁగ
భటసింహవిక్రమోద్భటసింహనాదముల్
స్వస్తివాదంబులచంద మొందఁ
బదిదిక్కు లొక్కటఁ బగిలి బీఁటలువాఱఁ
భేరీనినా[2]దముల్ బూరటిల్ల
విజయసమారబ్ధ వేళ కౌతుకమున
మొగమున గరువంపుమురువు దోఁప

తే. నార పెండ్లికి నేఁగిన ట్లనికి నేఁగి
యతులతంత్రంబు లివి [3]యేటిలఖ్ష మనుచు
రేక మోవక గెల్చుట నీకె చెల్లు
సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 39

ఎంచి రంటివి గాని యీసారి గట్టిగాఁ
దెగుఁ గార్య మనువార్తఁ దెలుపవైతి
మించి రంటివి గాని మేదిని యదరంగ
నడిచె సైన్యం బని నుడువవైతి
వంటి రంటివి గాని యాభీలతరభటో
ద్భటసంగరం బని పలుకవైతి

1 నెందఱి 2 దంబు 3 యేమి.

మొగిసి రంటివి గాని ముకుటముల్ త్రెగి రాజ
శేఖరుల్ పడుట సూచింప వైతి
తే. వనుచు నీఘాటి కెరవాలునహితవీరు
లదరు ననుమాట వెడలక బెవరి పల్కు
[1]చారుఁ గని నేర మెంతురు సారెసారె
సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 40
సీ. భిన్నకటంబులై పేరు పెంపును లేక
గంధనాగంబు లెక్కడ నడంగె
బాహ్లిక శక సింధు పారసీకోద్భవ
హయఘట్ట మేగొందియందు డిందెఁ
బోటుగంటులఁ దూటి పోవుదారుణమైన
మాస్టీలగమి యొందు మ్రగ్గిపోయె
గర్వంబు మేనులు గన్నట్టు లుండెడు
దొరలయామిక లెందుఁ దొలఁగి పోయెఁ
తే. బరులపాళెంబు లీరీతిఁ [2]బన్న మొంద
మాయ వన్నెను నీఖడ్గ మంత్రవాది
గెలిచినను నేటిమేలైన గెలుపు గంటి
సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 41
సీ. రంభ వాకిటను దోరణములు గట్టెడు
తీవర మొకకొంత దీలుపడియె
మేనక యింటిలో మేల్కట్లు సవరించు
సంరంభ మొకకొంత సడలువాఱెఁ
గనకాంగి యింటిలోఁ గర్పూరవేదికల్
సవరించు టొకకొంత జాగుపడియె

1 చారులను 2 భంగ.

హారిణి బంగరుమేడ నరవిరిసెజ్జలు
నిర్మించు టొకకొంత నిలుక డయ్యె
తే. మబ్బుగొబ్బున నీశౌర్యమహిమ వినక
తెగువతోడుత నెదిరించి తిరిగి విఱిగి
పాఱిపోయినమన్నీలపాటు సూచి
సమరనిశ్శంక! రఘునాథసాహసాంక! 42
సీ. అతులభూరిప్రతాపార్కదీధితిచేత
గట్టిగాఁ గాఁకలు పుట్టు పిదప
ఘోరారిగళరక్తధారాళవృష్టిచే
నాని దుక్కిఁ బద నైనపిదప
హయధట్టఖుర పుటహల్యాముఖంబున
నంతట దున్నినయట్టిపిదప
మొలచిననీకీర్తి మొలకలు తఱుచుగా
వెదపెట్టి పైరు గావించుపిదపఁ
తే. గాపు నిలుపవె బేతాళగణము నెల్ల
నట్టిపట్టుల కరిగి నీ వరుల నోదె
పాటు చేసితి వనుట యేపాటి తలఁప
సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 43
సీ. ఒకరు వోయినదెస కొకరు వోవక పాఱి
నరివీరులకు దాహగరిమ మించె
గడగడ వడఁకి న ల్గడల కేఁగక భీతిఁ
జెందినవారిపైఁ జెమట పుట్టె
మున్నాడి యొలగోలు మూఁకలఁ బోట్లాడు
పరులపైఁ బాటలప్రభలు మీఱెఁ

1 యరులపై

జేగ దెచ్చుక కొంత సిగ్గున నెదిరించు
 రాజులయొప్పు బీరము దొలంగెఁ

తే. దెగువతోడుత ధరియించి తీవ్ర[1]కోప
భరిత[2]రూక్షాక్షినియమిత ప్రభుల పేర
నీవు ఘర్మార్కవిస్ఫూర్తి నెఱపునపుడు
సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 44

సీ. తలలు వీడఁగఁ బాఱు ధరణీశ్వరులఁ జూచి
 యంటి వెన్నాడనియట్టిమహిమ
పడినయేనుంగుల ప్రక్కల కొదిగిన
 రాజులఁ జూడని రాజసంబు
జళిపించుచంద్రహాసములు పాఱఁగ వైచి
 మ్రొక్కువారలమీఁద మొనపుకరుణ
నెత్తురు గనుపట్టి హత్తిసభీతిచేఁ
 గలవరించినవారిఁ గాచుగరిమ

తే. మెన్నఁదనమీఁద బలముతో నెనసి మొనసి
విలుగు రాణువఁ బొమ్మను వీరవరుని
కీర్తి గంటిమి జగదేకకీర్తనీయ
సమరనిశ్శంక! రఘునాథ సాహసాంక! 45

క. అని విన్నవింపఁ జిత్తము
ననలొత్తఁ బరిగ్రహించి నాపై నింతిం
తన రానివత్సలత్వము
కనిపింపఁగ హర్షభరవికస్వరముఖుఁ డై. 46

1. తాఱ 2. రోషార్చి నిజముఖ.

తే. కల నయిన మిమ్ముఁ గాఁ కన్యుఁ గొలువ నంటి
కృతు లొకరి కీను మీకె యంకితము లంటి
పలికినప్రతిజ్ఞ చెల్లింప వలదె యిట్లు
వాఙ్నియమరూఢి నీయంత [1]వాఁ డెఁకేఁడి. 47

క. వాసించుఁ గవిత చెప్పిన
నీసర వొ వొకట భక్తివిశ్వాసంబుల్
నీసొమ్ములు సామాన్యుఁడ
వే సూర్యవరప్రసాది విజ్జగ మెఱుఁగన్. 48

క. ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు వెల్లెడ బెళు కౌ
కృతి వింటి మపారము గా
క్షితిలో నీమార్గ మెవరికిఁ రాదు సుమీ. 49

తే. క్షత్త్రధర్మమ్మెకద నీకుఁ గలది మొదలఁ
దమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ముఁ గొలిచి;
[2]తిపుడు కృతియును జెప్పి మా కిం పొనర్చి;
తొకటఁ గా వన్నిటను బ్రయోజకుఁడ వీవు. 50

తే. అని సుధామధురోక్తుల నాదరించి
మంజులపదార్థభూషణాంబరకదంబ
కరి తురంగాది వాహనోత్కరము లిచ్చి
న న్నసాధారణముఁగ మన్నన [3]యొనర్చె. 51

చ. అభినవభోజరాజబిరుదాంకుఁడు శ్రీరఘునాథశౌరి[4]కిఁ
శుభమతి నేలినందులకు సూడిదచేసితి నౌర మిక్కిలిఁ

1. వాఁడులేఁడు 2. రిపుడు 3. లొనర్చె. 4 నన్.

సభల గణింప మన్నన లొనర్పఁ బ్రబంధము నింతయు త్తమ
ప్రభునకు నంకితం [1]బొనరుపం గలిగెం గద యంచు వేడుకన్.

ఉ. ఆనతి యిచ్చినా యది శిలాక్షర మెవ్వని నేని మెచ్చినా
వానిఁ గృతార్థుఁ జేయుఁ బగవాఁ డయినన్ శరణంబుఁ
జొచ్చినా, యానరు నేర మెంచక తనంతటివాని నొనర్చు
నిచ్చినా, యేనుఁగుపాఁడి యీఁడు గలదే రఘునాథనృపాల
మౌళికిన్. 53

ఉ. ఎందును విద్య[2]లే యెఱుఁగ రెవ్వ రెఱింగినఁ గొంతమాత్ర మే
యందును సాహితీరసమహత్త్వ మెఱుంగ రెఱింగిరేని యా
యంద మెఱుంగలే రెఱిఁగినప్పటికిన్ విని మెచ్చి యీయ రె
న్నందగునచ్యుతేంద్ర రఘునాథవిభుండె ప్రవీణుఁ డన్నిటన్.

సీ. ఏ రాజు భుజశౌర్య మేదులక్షానాది
వజ్రిలచెలిమికి వశ్యవిద్య
యేరాజువిక్రమసారంబు విశ్వేషి
మహిమపలాయనమంత్రశక్తి
యేరాజువీక్ష సమీహితకర్ణాట
రమనాట్యవిద్యకు రంగభూమి
యేరాజుచరితంబు వారాశివేష్టిత
మేదినీపతులకు మేలుబంతి

తే. యతఁడు చెలువొందుఁ జినచెవ్వయచ్యుతేంద్ర
బహుజననపుణ్యపరిగణ్యఫలనిభాత్మ

1. బొసలుపం 2. మేలె.

పుత్రభావప్రమోదసంపూర్ణహృదయ
పంకజాతుండు రఘునాథపార్థివుండు. 55

సీ. సింహాసనము మాట శిథిల మౌటలు విని
గట్టిగా నిలుపఁ గంకణము గట్టెఁ
గోటిసంఖ్యలు మీఱఁ గూర్చినధనరాశి
గొల్చువారల కిచ్చెఁ గొల్చువలెనె
తుండీరపాండ్యాది మండలేశ్వరులపై
దండెత్తి విడిసె నుద్దండమహిమ
నేల యీనినయట్లు నిలిచినవైరులఁ
బంచబంగాళ మై పాఱఁ దఱిమె

తే. గర్వితారాతిమస్తకఖండనోత్థ
రక్తధారానుషంగాతిరక్తధార
నిజకృపాణికఁ గావేరినీటఁ గడిగె
నిఖిలగుణశాలి రఘునాథనృపతిమౌళి. 56

సీ. ఘనఘనాఘనముల [1]కాలసంకెలఁ బెట్టు
పాండ్యుని వెన్నాడి పాఱఁ దఱిమెఁ
దుండీరనాథుండు దుర్గమునఁ బరవంగఁ
జూచి ప్రాణము దయఁ గాచి విడిచెఁ
గయ్యాన వెనుకఁ ద్రొక్కనిరాజు లెదిరింపఁ
జేరిన రాజకౌశికులఁ బట్టెఁ
బోరాడఁగా రానివైరులకోటలు
పంపులచే లగ్గపట్టి తివిచె

1. కాలి.

తే. నితఁడు సామాన్యుఁడే ధర నెంచి చూడ
విజయనిస్సాణ[1]రాణనిర్విణ్ణహృదయ
భీతరాజన్యసైన్యనిర్భీతిదాన
బిరుదనిజపాణి రఘునాథభిదురపాణి. 57

ఉ. ఇచ్చునెడన్ బదార్థ మడి గిచ్చునొ తా దయసేయఁ గా
దనన్, వచ్చునొ మించి యొక్కఁడన వచ్చినఁ దా నది
యిచ్ఛగించునో, యిచ్చిన నిచ్చనే సరిగ నెవ్వరిపై దయ
చేసెఁ జేసనే, యచ్చతురాస్యుఁడుం దెలియఁ డచ్యుతు
శ్రీరఘునాథుచిత్తమున్. 58

# షష్ఠ్యంతములు

క. ఏతాదృగ్గుణఖనికిన్
సీతాదృఙ్మోహ[2]నాంఘ్రి సేవాధనికిన్
శాతాసికలితబాహా
స్వీతాసిక విమతరాజనిఖిలావనికిన్. 59

క. సాత్త్వోన్మనోజునకు క్షో
దక్షమరసభావసుకవితాభోజునకున్
దాక్షిణ్యగణేయునకున్
దక్షిణ సామ్రాజ్యవిభవధౌరేయునకున్. 60

క. సుస్థిర లక్ష్మీమహితమ
ణిస్థగితగృహాంగణునకు నేపాళనృపా
లస్థాపనచణునకు సక
లాస్థానప్రణుతవరగుణాభరణునకున్. 61

---

1. రావ 2. నాంగ.

క. కీర్త్యౌదార్యధరితా
మర్త్యమహీరుహసుధాబ్ధిమహీకాఘృణికిఁ
ధార్త్యవదరికరిసృణికిఁ
మూర్త్యంబాగర్భశుక్తిముక్తామణికిన్. 62

క. అఘటనఘటనాచాతు
ర్యఘనోర్జితకార్యనిర్వహణధూర్వహధీ
మఘవాచార్యున కచ్యుత
రఘునాథవసుంధరాధిరాడ్వర్యునకున్. 63

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన సారంగ
ధరచరిత్రం బను శృంగార ప్రబంధమ్మునకుఁ గథాక్రమం బెట్టి
దనిన. 65



శ్రీరస్తు.

# సారంగధరచరిత్రము

## ప్రథమాశ్వాసము

---

క. రాజనరేంద్రుఁడు రిపుఫణి
రాజనరేంద్రుఁడు కళాపరాక్రమరేఖా
రాజితభోగపరాజిత
రాజనరేంద్రుఁడు సుధాకరకులుం డలరున్. 1

సీ. తనయభ్యుదయము [1]నిత్యముఁ గోరు నిజసుహృ
ద్ద్విజ[2]బుధవ్రాతంబు వేడ్క నుండఁ
బగలెందుఁ బొడ గానఁబడకుండ నడఁచినాఁ
డమృతమే [3]యీరూప మయ్యె ననఁగ
[4]దనపాదమునకును దమతలలకు లంకె
పాటని దుర్గాధిపతులు [5]వల్కఁ
[6]జల్లఁదనము గల్గుసన్మార్గవర్తి మేల్
మాయన్న యని ప్రజల్ గాంచి మ్రొక్క

ఆ. జారచోరాదులకు భీతి సంఘటిల్ల
నహితచక్రము లల్లల నాడుచుండ

---

1. సంతతము గోరుకొనుసుహృ 2. విబుధావళి యెలమి నుండ 3. యీరూప 4. దత్ పాద; దనపాదముద్రకు 5. పల్క 6. నయమున గల్గు సన్మార్గము మాయన్న, నీయండ యని ప్రజల్ నిలిచి మ్రొక్క.

నేలె నారాజు కువలయ మింపు దనర
నాడి తప్పక భరతమర్యాద వెలయ. 2

గీ. మహిని రాజనరేంద్రుండు మాళవపతి
*రాజరాజనరేంద్రుండు రాజరాజు
ననఁగఁ జే రెన్నికను [1]నెక్కి యతిశయిల్లు
నింద్రవిభవుండు రాజమహేంద్రవిభుఁడు. 3

క. కల రాయిలరాయనికిం
గులసతి రత్నాంగి భోగకుటిలశిరోజా
తిలకము చిత్రాంగియు [2]నన
నెలజవ్వను లిరువు [3]రంబుజేందునిభాస్యల్. 4

క. ఆతనికిఁ శక్తిత్రయ
రీతిం గడుఁ బెంపు గాంచిరి నయార్ణవుఁడుఁ
నీతిజ్ఞుఁడు మతిమంతుఁడుఁ
ధీతిలకంబు లరయఁ సుధీతిలకంబుల్. 5

వ. ఇటు దొరతన మమరి యానర [4]విభుండు. 6

గీ. ఈ క్రమంబున రాజనరేంద్రవిభుఁడు
నీతిరహితంబు గాకుండ నీతిరహిత
మానవుల భూమి [5]రామరాజ్యముగ నేలు
చుండి రత్నాంగిఁ గనుఁగొని యొక్కనాఁడు. 7

సీ. సంతానరహితసంసారంబు నాయక
రత్నంబు లేనిహారంబు గాదె

---

* మహినిరాజనరేంద్రుండె మనుఃభురిడు.

1. పెక్కనలరుచుండు 2. నను 3. రుందురిం 4. వరుఁడు 5. స్వా రాజ్యముగను.

పుమపత్యదూర మానమితసామ్రాజ్యంబు
ధాత్రిఁ జంద్రుఁడు లేనిరాత్రి గాదె
యాత్మజవ్యతిరిక్త మగువర్తనముఁ [1]జూడ
నారి లేనిశరాసనంబు గాదె
సుకుమారశూన్య మానకళంకజీవనం
బలమరాళము లేనికొలను గాదె

గీ. నందనవిహీన మైనసేనావితాన
మరయ శిఖరంబు లేనిగోపురము గాదె
నేత్రపర్వంబు గావించుపుత్త్రుఁ డింక
మనకు నెన్నఁడు [2]గల్గునో వనజగంధి. 8

మ. చిలుగుంబల్కులు విన్నఁ జిన్నిగొనబుం జెయ్వుల్ గనుంగొ
న్న నో, దల మూర్కొన్నను ముద్దుగొన్నఁ దనువుం దా
ర్కొన్న నూహింపనుం, బలుకన్ రానిసుఖంబుఁ జెందు
నటుగాఁ బంచేద్రి[3]యోత్సాహ మై, తలిదండ్రు ల్వేలసిల్లఁ
[4]గాఁ దనయుఁ డేతన్మాత్రుఁడే యెన్నఁగన్. 9

ఉ. చక్కిలిగింత వెట్టినను సారెఁ గికాకిక నవ్వుచున్ బయిం,
బక్కఁ బడంగఁ జక్కనికుమారుని మక్కువమీఱ నేడ్పరాఁ,
జెక్కిలి [5]గీఁటి యెత్తి యెదఁ జేరిచి ముచ్చట దీఱునట్లుగా,
నక్కట ముద్దు లాడ వల్లభ [illegible] కలదా యిటువంటి
భాగ్యముల్. 10

క. ఈశ్వరకృప గద యిట్టి[illegible]
లైశ్వర్య[6]మ్ము[illegible] ప్తమగుటకున్ గాశీ!

1. సద, సద్వివేకము లేని [illegible]భావు 2. కలుగదా 3. యాపూర్ణ
4. బుత్రుఁడిటనే 5 మీటి 6. సౌఖ్యంబు లెల్లఁ బ్రాప్తము లగుటన్.

విశ్వపతి మనకు నిపు డొక
శాశ్వత[1]యశుఁ డైనసుతుఁ బ్రసాదింపఁ[2]డొకో. 11

గీ. తాఁ గుమారునిఁ గని ప్రమోదంబు [3]గాంచు
నట్టిసర్వజ్ఞుఁ డఖిలభక్తాళిఁ బ్రోచు
శంకరుఁడు మహాదేవుఁ డాస్వామి నమ్మి
నార మఁట మనకోర్కి యీడేఱు టరుదె. 12

గీ. ఇపుడు శైవవ్రతంబు లే మేమి గల[4]వు
సలుపఁ దగు [5]వాని నటు లైన సఫల మగును
భక్తజనులకు ముంగొంగుఁబసిఁడి గాఁడె
చూడు మెలనాగ యల చంద్రచూడుఁ [6]డరయ. 13

క. నెలపూదాలుపు మనపూ
జలు మెచ్చునె యని మదిఁ విచారింపకు చీ
[7]కిలిమాకిలిగా నల్లిన
చెలఁది తెర లూచి సుతసించుట లేదే. 14

క. ఇటుఁ బూజింతము నేర్చిన
యటుల గిరీశు నొకయాకు నలమునఁ గొండం
తటి దేవరకును గొండం
తటిపత్తిరి వెట్టువారు ధరణిం గలరే. 15

గీ. అని ప్రియోక్తుల శివుఁ గొనియాడి యపుడు
సకలజనములు శివపూజ సలుప కున్న
[8]నాజ్ఞ యని చాటఁ బనిచి శివాలయములు
ధరణిఁ గట్టించె నూరూరఁ దప్పకుండ. 16

---

1. నుతు 2. డకో 3. నొందు 4. వొ 5. నవి యటులైనసఫలము లగు 6. మహిమ 7. గిలిమాగిలినల్లినయూ 8. నాన.

క. రాజశిఖామణిపూజలు
రాజశిఖామణి యొనర్చె రమ్యదళా[1]ళిన్
రాజీవకుముదచంపక
రాజీవకుళాదికుసుమరాసుల వేడ్కన్. 17

క. వివిధఘనదానములు భూ
ధవమణి పరిశుద్ధుఁడై ముదంబున నొసఁగెన్
శివభక్తులు పెద్దలు నగు
నవనీసుర[2]వర్యులకు శివార్పణ మనుచున్. 18

గీ. అంతఁ గాశీవిభునిపూజ కరుగుదెంచి
పత్నియును దాను నత్యంతభక్తితోడ
[3]స్నాన మొనరించి నయనహస్తములు మోడ్చి
దేవ[4]పురహర [5]శ్రీమహాదేవ యనుచు. 19

సీ. స్నానం బొనర్చె మందాకినీధరునకు
వస్త్రం బొసఁగెఁ గృత్తివాసునకును
రత్నాసనము వెట్టె రజతాద్రి[6]నిలయున
కలఁదె గంధము భసితాంగునకును
సవరించెఁ బుష్ప[7]ంబు చంద్రశేఖరునకు
నిచ్చె ధూపం బనలేక్షణునకు
నునిచె దీపము పరంజ్యోతిస్స్వరూపున
కమృతాన్న మిడియె విషాశనునకు
గీ. దండ మ[8]ర్పించె నలజగద్వందితునకు
నమిత ధారాళ నారాళ హర్షబాష్ప

1. ళి 2. కోటు 3. ధ్యాన 4. హరహర 5. శివ; హర 6. పిరిదికి
7. ముల్ 8. ర్పించెగా.

నిబిడపులకాంకురాంకితనేత్ర గాత్రుఁ
డగుచు రాజనరేంద్ర ధరా[1]ధివిభుఁడు. 20

సీ. మంత్రాభిషేక మేమర్యాదఁ జేసెనో
 తల కెక్కినవిషంబు దొలఁగ లేదు
గారుడమణిహార మేరీతి నిడియెనో
 మెడఁ జుట్టుకొన్నపా మెడల లేదు
నుదుట [2]గందం బెట్లు నూల్కొన దిద్దెనో
 నెఱయ మూసినకన్ను దెఱవ లేదు
ధూపవిశేష మేరూపునఁ గూర్చెనో
 వెంటాడు భూతముల్ విడువ లేదు

గీ. దెలియ నమృతకరుం డనఁ దేజరిల్లు
నోషధీశుకులంబున నుద్భవిల్లి
యెన్నికకు నెక్కు[3] రాజమహేంద్ర విభుఁడు
పంచశరవైరిపూజ గావించునపుడు. 21

ఉ. చేరి నృపాలుఁ డర్పణము సేసినచక్కెర లుప్పతిల్లుపం
డేరము లారగిం[4]చుచు నుతింపఁదొడంగె మహేశుఁడింపునన్
సారెకుఁ గుత్తుకన్ విషము నాలుకబెల్లము వెట్టి యాడుటల్
మేర లటయ్యె సామి కని మేలము లాడుచు గౌరి నవ్వఁగన్.

గీ. ఇట్టు లత్యంతభక్తిమై నెపుడు నంగ
రంగవైభవముల సమగ్రంబు లైన
యారగింపుల సంతుష్టి నల[5]పరించి
శివుఁ ద్రికాలంబులందుఁ బూజిం[6]చుచుండె. 23

1. వరుండు 2. గందపుబిందువదియెట్లుపెట్టె 3. రాజనరేంద్ర
4. పుచునటింప... 5. దరించి 6. పఁదొణఁగె; పుచుండె.

క. నందనసంతానము మది
యందుం [1]గోరుచు భజింప నాశ్రితపటలీ
నందనసంతానం బగు
నిందుకళాధరుఁడు పార్వతీశ్వరుఁ డంతన్. 24

సీ. వరదానసంపద వామోత్తమాంగముల్
శైలజాగంగల సాటిఁ దెలుప
గోపప్రసాదైకగుణరూఢిఁ జూపులు
చందమామల్లుని సాటిఁ దెలుప
ఖలశిక్షసాధురక్షణ[2]మునఁ గటియుఁ గేల్
శార్దూలమృగముల సాటిఁ దెలుప
ననుపమాజ్ఞాసిద్ధిఁ బనుకగంగాళి[4]ంబు
సరసీరుహా[5]సను సాటిఁ దెలుప

గీ. బంధురాష్ట్రవిభూతులు పరిఢవిల్లఁ
దనదు రాజ[6]శిఖామణిత్వంబు వెలయఁ
బ్రమదమున మందహా[7]సాననములతోడ
వచ్చి ధరణీతలేంద్రుని స్వప్నమునను. 25

ఆ. ధారుణీనాథ విను మేను దావకీన
సదమలాత్మగంతభక్తికి సంతసిలితి
నీవు చేసినపూజ వర్ణింపఁ దరమె
యిదిగొ [8]యిట్టె ఫలించు నీయీప్సితంబు. 26

క. సత్కాంగి కుదయ మహా నొక
పత్నము పంక్తితసయుం ఘ రమణీయకళా

1. గోరిభజియింప 2. తీశుం 3. గల్గు 4. ష్మ 5. ఘుల 6. శిరో... తెలుప; ...జలియ 7. సహా 8. నిపుడె.

నూత్నహరిణాంకుఁ డాసుత
రత్నము [1]పేరిడుము మాకు రాజనరేంద్రా. 27

క. అని యేఁగె నంతలో ది
గ్గన మేల్కని విభుఁడు హా మహాదేవ యటం
చును మేను గగుర్పొడువఁగ
ననుమోదాశ్చర్యమగ్నుఁ [2]డై యున్నంతన్. 28

ఉ. బల్లునఁ దెల్లవాఱిన నృపాలుఁడు మంత్రులఁ బిల్వఁ బంచి
యు, త్ఫుల్లముఖారవిందుఁ డయి తోఁచిన వేడుక నే మనంబు
రం, జిల్లఁగ రేయి గన్నకలఁ జెప్ప న దెంతయు నాను
పూర్విగా, సల్లలితాంతరంగు లయి సామి హసా దని
వార లూఁకొనన్. 29

ఉ. చెప్పిన సంతసిల్లి నృపశేఖరరత్నము వంటినందనుం
డొప్పులకుప్ప గల్గుఁ దన[3]కున్నతిఁ బేరిడుమంచు వేడ్కతో
నప్పరమేశ్వరుండె యిటు లానతి యిచ్చిన నెంతభాగ్య మ
ప్పప్ప! భవత్ప్ర[4]భావవిభవాఢ్యత యే మని సన్నుతింపఁగన్.

క. అనుచుఁ జెలరేఁగి మంత్రులు
గొనియాడుచు నుండి రంతఁ గొన్ని దినంబుల్
జనఁ గనకాచలకార్ముక
వినుతైకకృపాకటాక్షవీణామహిమన్. 31

క. నెల మసలెన్ రత్నాంగికి
బలిసెం జిట్టుములు నరుచి బడలిక [5]లూర్పుల్

1. పేరిడుమునాకు; నిడునాడు పేరు 2. డయ్యెనటంతన్ 3. దున్నతి
4. తాపవిభవ; తాపమహిమా 5. యూర్పుల్.

తెలు పెక్కెఁ దళుకుఁజెక్కులు
నలఁతికవును గొప్ప యయ్యె నా రేర్పడియెన్. 32

శా. శ్రీవే భోజన మేటి కొల్ల విటు లేలే మేన బల్వామ్ము లీ
వేవిం బూనవు వెల్లఁబాఱె మొగ మేమిా రాజుతో నల్గినా,
వో వామాక్షిరో [1]తెల్పవేయనుచు గర్వోక్తు ల్చెలు
ల్పల్కఁగా, వేవిళ్లం బొరలెన్ లతాంగి పతికిన్ వేడ్క
లొక్కాన ల్సాగఁగన్. 33

శా. మిం[2]చెం బొరచికొరికల్ గడు విజృంభించెం దనుగ్లాని గా
న్పించె న్మేచకకాంతి చూచుకములన్ [3]జెక్కిళ్లపైఁ
దెల్పు రె, ట్టించెన్ గూర్కులు సందడించె నడ చండించెన్
మృదామోదమున్, గాంచెన్ పాతెఱ యోసరించెఁ ద్రివ
ళుల్ నానాఁటికిన్ బోటికిన్. 34

వ. ఇవ్విధంబున [4]నిర్భరగర్భభారనితాంతతాంత యగునక్కాం
తకుఁ బుంసవనాది సమస్తశుభకృత్యంబులు నిర్వర్తించిన
యనంతరంబ నవమాసంబులు [5]గడచన నొక్కపుణ్యలగ్నం
బునం గుమారుండు [6]జన్మించిన. 35

క. దిక్కులు మెఱసెన్ నెఱసెన్
[7]జొక్కులరం జిల్ల గాడ్పు జొబ్బిల్లి సుధా
భుక్కులమంజులసుమన
స్సృక్కులవానలు గురిసె మొరసెఁ దూర్యంబుల్. 36

---

1. యంచునర్మరసగర్భో 2. చిన్నారుచి 3. నేత్రంబులన్
4. దుర్భర 5. గడచిన 6. దయించిన 7. చుక్కలలరెఁ జల్ల. జొక్కులు
శేఁజల్ల...; జొక్కులవలి నాలిగాలి; ... జొబ్బిల్లి సుధా, భుక్కుల
మనూనసూన;

చ. బిసబిస వాలుకీలుజడ పిక్కలు దొర్కుచువెన్ [1]నటింపఁగా
మిసిమిసిపాలిగుబ్బచనుమిట్టలు పయ్యెద నుబ్బ నెత్తఁగా
నసురుసురై యలంతినడు మల్లల నాడఁగ [2]ముందుముందుగా
నొసపరిబాగులాడి యపుడొక్కతె వచ్చి నృపాలుతోడుతన్.

క. మగవానిఁ [3]గనిరి శంబరు
పగవానిం బో[5]నివానిఁ బట్టపుదేవుల్
జగతీనాయక నావుడు
మొగ మొ[6]కయింతయి బుజాలు మూఁడయి వేడ్కన్. 38

క. ఆమేలు వార్తఁ దెచ్చిన
భామకు బడిబడిని వెంటఁ బడువారలకున్
భూమిపతి భూసురార్థి
స్తోమములకు లెక్క లేనిసొమ్ము లొసంగెన్. 39

క. జననాథచంద్రుఁ డివ్విధ
మున బహువిధదానములనుఁ బుత్రో[8]త్సవ మిం
పొనరంగఁ జేసి సూతక
దినములు వెడలించె [7]ముదము దేజరిలంగన్. 40

ఉ. పొంగుచు బంధుమిత్రబుధపుంగవమంత్రిజనంబుఁ జూచి తె
ల్పెం గలలోన వచ్చి మును పే తనపేరిడు మంచు వేడ్కతో
నంగజవైరి; యాయనదయం గద గల్గె నటంచుఁ బల్కి సా
రంగధరాహ్వయం బిడియె రాజనరేంద్రుఁ డనుంగుఁ[8]జూలికిన్.

వ. ఇట్లు కృతనామకరణుం డై రాజసూనుం డనుదినప్రవర్ధమానుం డగుచున్నంత. 42

1. న్నడింపఁ 2. ముద్దుముద్దుగా 3. గనియె 4. లు సుతుని... 5. వా 6. కింతయి 7. ప్రభుత 8. బోటికిన్.

ఉ. [1]పాలడలోనఁ బోసి చనుఁబాలు నెయుం గిలకొట్టి కాళ్లపై
బాలకు నుంచి వ్రేల్ సెలవిపై నెడగా నిడి యుగ్గు వెట్టి యా
కే లటు బొజ్జపై నిమిరి కెం జిలు చేతుల నెత్తి [3]గట్టురా
చూలియనుంగుసామికిని జోతలు జోత లటంచుఁబల్కుచున్.

క. కన్నుంగవఁ గాటుక యిడి
చన్నిచ్చుచు నేడు పుడిపి చక్కనిముద్దుం
జిన్నికుమారుని మారుని
[4]పెన్నుద్దిని బత్తి నెత్తి పెంచిరి దాదుల్. 44

గీ. లాలి గట్టిరి గంధోపలాలితాఖి
[5]లాలిసుమసాంద్రచంద్రోపలాలిసౌధ
లాలితస్థలి హారునియిల్లాలిఁ బాడి
మేలిజవరాలిగములు రాచూలి కపుడు. 45

ఉ. పూ నెఱె మేని రాకొమరుఁ బొత్తులలోపల నుంచి గట్టువి
ల్కానివరప్రసాదమునఁ గల్గినచక్కనియన్న నిద్ర పో
వ్వా నను గన్నతండ్రి యని మక్కువఁ [6]జొక్కఁగ జోల
వాడి రిం, పూనినజాళువాపసిఁడియుయ్యెల నయ్యెలనాగ
లూఁచుచున్. 46

క. జోల ల్వాడిరి యమృతపు
జాలుం జొక్కొట్టఁ జాలుసరసపుఁజూపుల్
డోలాయమానముగ ను
య్యాలో జంపాలో యనుచు నాలోలాక్షుల్. 47

---

1. పాలెడ 2. జిగి 3. బట్టిరా 4. పెన్నుజ్జిని 5. లాలి కులచంద్ర కాంతో పలాలి 6. జొక్కుచు.

సీ. కను ఱెప్ప వేయక కనుఁగొంచుఁ [1]దనలోన
[2]నుంగుంగ యని సారె నుగ్గడింప
నెలనవ్వు పాలబుగ్గలపై[3] దువాళింప
నత్తత్త యని [4]దోఁగి యాడు[5]చుండ
[6]విద్దెముల్ సేయుచు వింత లే కెవ్వరు
చప్పటు ల్చఱచిన [7]సరస కరుగ
జిలిబిలిముద్దుమాటలతోడ దాదిప్రే
లంది మెల్లనె తప్పటడుగు లిడఁగఁ
గీ. గనుమొఱంగి చెలుల్ మఱుంగున నడంగి
తొంగి చూచి దోబూచి యన్నం గికొకి
కన్నగఁ గుమారుఁ గౌఁగిట గారవించి
యలరుదురు [8]వేడ్కఁ దలిదండ్రు లనుదినంబు. 48

మ. కరముల్ సాఁచి తమిన్ ద[9] యింద యని రాగం బొప్పఁ[10]గాఁ
జీరఁ దా, పరమోమండలిరావిరేక తులకింపన్ జేరి బింబా
ధరం, బరు దారన్ రసవంత మై మెఱయఁ[11]గా నంకంబుపై
నిల్పి బా, పురె సారంగధరుండు ముద్దు గురియుంబో
తండ్రి యుప్పొంగఁగన్. 49

గీ. ఇనకరస్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్నిసారంగధరుఁడు భాసిల్లు[12]కరణి
నినకరస్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్నిసారంగధరుఁడు భాసిల్లె [13]నంత. 50

---

1. దాఁదాని 2. యుఁగ్గుగ్గనుచు చాల(సారె)నుగ్గడించు 3. దువా 4. డోంగి; డోంగి 5. చుండు 6. విద్దెము 7. నరగనలుగు;...నరుగు 8. వెంట 9. మమ్మకను;మమ్మనను 10. రాజీరి 11. నయ్యూకంబునన్ 12. భాతి 13. నపుడు.

ఆ. [1]ఇట్లు తల్లిదండ్రు లెంతయు గారాన
నేఁటఁ బెంచువానిఁ బూఁటఁ బెంచి
సరవి వరవిభూతిఁ జౌలోపనయనాది
సత్క్రియాచయంబు సలిపి రంత. 51

వ. ఇట్లు యౌవన ప్రాదుర్భావంబై తేజరిల్లి శాస్త్రంబులు క్రోడీకరించి పురాణంబులు హృద్గతంబులు గావించి నీతులు [2]విస్తరంబుగాఁ దెలిసి గజహయరథారోహణంబు లభ్యసించి బహువిధాయుధసాధనల నారితేఱి సకలవిద్యాపారీణుం డయ్యె నప్పుడు. 52

క. సారంగధరుఁడు మించెఁ
ధీరత బహు[3]వేదశాస్త్ర దీక్షాగురు [4]వై
సారెకు నవక్రవిక్రమ
భూరి కళావిభవసారపుంగవు లెంచన్. 53

సీ. శ్రుతిమార్గముల నంటి శోభి[5]ల్లుఁ దెలివిమై
నాతనిచూడ్కి యే మనఁగ వచ్చు
సాధుకుంజరపంక్తిసంగతి విలసిల్లు
నాతనినడక యే మనఁగ వచ్చు
దాక్షాయణీనాథుఁ దగిలి లోఁగొనఁ జాలు
నాతనితేజ మే మనఁగ వచ్చు
నించువిల్కాని జయించు నాతనినిర్మ
లాకారమహిమ యే మనఁగ వచ్చు

1. క్రమముతోఁ దలిదండ్రుల గారవమున, నాటఁబెంచినవానిని
2. లాలాజలంబులు చేసి గజహయారోహణంబు 3. శోప 4. డై 5. ల్లె.

గీ. వసుధఁ బుట్టెడు పెరిఁగెడు వారిలోనఁ
గని విని యెఱుంగ [1]మంతటిఘనుని నౌర
యీడు జోడును సరి సాటి యెందు లేద
తం [2]డమర్త్యుండు గాక మర్త్యుండె తలఁప. 54

క. మాడెత్తు మాట యెవ్వరి
నాడఁడు సత్యంబు వీడ నాడఁడు ఖలులం
గూడఁడు పరకామినులం
జూడఁడు సారంగధరుఁడు సుతమాత్రుండే. 55

క. ఔరా యని జను లెన్నఁగఁ
గూరిమితోఁ దండ్రిమాట గురువాక్యముగా
గోరంతయు జవదాఁటక
యా రాజకుమారచంద్రుఁ [3]డలరఁగ నంతన్. 56

మ. వనజాతాహితవంశవారినిధిభాస్వత్కౌస్తుభం బైనరా
జనరేంద్రుండు నవీనయౌవనవిలాసశ్రీజగన్మోహనాం
గుని సారంగధరున్ విశేషగుణయుక్తున్ యౌవరాజ్యాభిషి
క్తునిఁ గావించి నిజాన్వయంబు సమమాశోకాప్తవంశంబునన్.

క. పేరుగలఘూర్జరాధిపు
గారాబుఁగోమార్తెఁ బెండ్లి గావించె దగన్
సారంగధరునకున్ మన
సారంగను మంజువాణి యను [5]నలివేణిన్. 58

క. తారావళి యఁట నఖము లు
రోరుహములు రెండు మంజరు[6]లె యఁట నేత్రా

1. మింతటి 2. డు దేవుండు 3. దలరుచునుండెన్ 4. కనువిధి, వా: రూఢిగ 5. లోలాక్షిన్ 6. లఁటసు నేత్రా.

కారంబులు ధవళము లంట
యారమణి మంజువాణి యనఁ జెల్ల[1]దొకో. 59

గీ. సకలవైభవ[2]ములతోఁ బొసంగ నిటులు
రాజరాజవిభుండు గారాబుఁ గోడలు
పరిణయ మొనర్చి యానందభరితుఁ డగుచు
నుం[3]డెఁ గొన్నిదినము లంత నొక్కనాఁడు. 60

సీ. నిలుచుండి చంకఁ జేతులు వెట్టుక కిరీట
ములు గల[4]రాజులు కొలువు సేయ
వేటాలు [5]తునియలు వేయు మేలైనవ
జీర్లు వచ్చి సలాము చేసి నిలువ
శరణాగతారాతిధరణీరమణు లయ్య
జియ్యలు వెట్టుచు సేవ [6]సలుప
సాటికిఁ [7]బోటికి సరససంగీతసా
హిత్యాదివిద్యలు నృత్య మాడ

గీ. మనవిసనవుల కేతెంచి మన్నెవారు
వేళ [8]యెప్పు డౌనో యని వేచుచుండ
నమ్మహీపా[9]లుఁ డపుడు సింహాసనస్థుఁ
డగుచు నొడ్డోలగం బున్న యవసరమున. 61

మ. పులితోలక్కసెల నంట దోపినపిడెంబుల్ [10]పీలిపూఁదావళం,

---

1. దకో 2. మెసఁగంగసరగనిట్లు 3. డి యంతవిజృంభించియొక్క 4. తార 5. గనెలుగావేయువజీరులు, చేరవచ్చి; తునుకలు ఘాటిగావేయం మేలైన వజీరులు సలాముసేయ; 6. సేయ 7. బేటికి సరససంగీతంబు సాహిత్య విద్యలు సన్నుతింప; నృత్తమాడ 8. యెప్పుడౌనో: ఎప్పుడౌనో 9. లవిభుఁడ 10. నూలిపూఁ.

బులు బల్సింగపుఁజుంచుదండకడియంబుల్ చెంపలన్
జెక్కుపీఁ, కలు కెంజేగుఱుబొట్లు జుంజుఱుసిగల్ గౌర[1]ంపు
మైపూఁతలున్, బలుదూపు ల్వేఁడవిండ్లు[2]ను న్జెలు వొనర్పన్
వచ్చి కే ల్మోడ్చుచున్. 62

క. [3]జల్లులు పునుఁగుజవాదుల
పిల్లులు కుందేటిలేటిపిల్లలు మొదలౌ
నెల్లసువస్తు[4]వులను శో
భిల్లం గానుక లొసంగి భిల్లజనంబుల్. 63

శా. సామీ వింజపుఁగొండకాఁడవిపజ్జన్ [5]గూడెముల్ గట్టిమీ
సేమంబే సత మిచ్చఁ గోరి [6]బలుబైసన్ బాగ్గెమున్ గల్గి యా
భూమిన్ వేఁటలఁ దోఁటలం దిరిగి మీపున్నెన మాకచ్చికం
బేమిన్ లేక [7]సుగాన నుండుదుము నీవే దిక్కుగా నెమ్మదిన్*.

ఉ. అయ్యపరాకు మాని తెలియన్ విను లచ్చనదేవుఁడున్ సిరా
మయ్యయు సీతమ్మకొఱకై తొలుతన్ గనుపట్టుముచ్చ
బల్, దయ్యపు మూఁకఁ జెండినపొలానకు మొన్నను [8]వేఁట
లాడుకోఁ, జయ్యన [9]బోయి యాయడవిచాయలఁ గంటిమి
వాల్మైకంబులన్. 65

క. అంద[10]ల మందల లే కిపు

---

1. న్న 2. బూనిచెలువొప్పన్ 3. బిల్లులు 4. లమటి 5. గూళె 6. కొని 7. సుఖాన 8. మాట 9. బోవనప్పాలముచా 10. లిమందులు. * ఈ 62, 63, 64 పద్యములకు మాఱుగా క్రిందిపద్యము కొన్ని ప్రతులలోఁ గలదు.

ఉ. బెట్టుడుతల్ పునుంగులును బెబ్బులి జున్నులు చారపప్పునున్
జిట్టలు జుంటితేనియలు సింగపుఁ బిల్లలు బల్మైకంబు వా
శట్టుల మందు మూలికలు కర్గజవాదియుఁ బచ్చకప్రముం
బట్టిన బొంగులున్ బొగడపండ్లును కానుక లిచ్చి రయ్యెడన్.

డందలమంద లయి యున్న వయ్య మేకంబుల్
చెందామర కొలనివలెన్
దెందేప ల వేమి సెప్ప దేవ్రఁ [1]దెలుంగున్. 66

సీ. క్రోల్పులు ల్కంపిల్లి గొటగొటమని రొప్పి
బలుసింగముల నైనఁ బట్టఁ జూచుఁ
గండక్రొవ్వునఁ గన్ను గానక పందులు
బిరుదేనుఁగుల నైన నొరయఁ జూచుఁ
[2]గాఱుపుల్ దిని యాము కవిసి మఱబోతులు
కారుపోతుల నైనఁ గదుమఁ జూచుఁ
బోత[3]రించి సివంగు లీతలాతల [4]చేసి
గబ్బియొల్లుల నైన గిబ్బఁ జూచు

గీ. సామి వానిచలంబు మచ్చరము బలిమి
యెక్కు దేవంక నే మని యెంచ వచ్చు
నొకటి నొక్కటి సడ్డసేయక మెలంగు
నాపొలంబునఁ దరతరం బై మేకములు. 67

గీ. జింకదాఁటు[5]లు మంచితేజీలపిల్ల
లనఁగఁ [6]దగి యుప్పరము దాఁటునప్పు డడ్డ
మైనఁ బడ దాఁటు నెల[7]లేఁడి నైన దాఁటుఁ
జిఱుతపులి నైన నే మని చెప్పవచ్చు. 68

గీ. ఏనుఁగుమదంబువలెను గాఱెనుపపోలు
పంది[8]నేవెల్లువలు చిక్కుఁబాఱు చెమ్మ

1. దెరియుఁగన్ 2. ఘనపులున్ 3. రల్లి 4. నేచి 5. ల 6. నుప్పర మును 7. లేటి నైనవాఁడి 8. నెయివెల్లువల.

దఱుఁగ దలమందు వేసవిఁ దఱుమఁ గలుగఁ
జాల్ మెకా [1]లందు దొప్పున జాఱి పడును. 69

ఉ. ఉల్లములోన నేమనుచు నుందువొ యేనొకదబ్బ దబ్బరన్
బల్లిదపున్వరాహములు భద్రగజంబులమీఁద [2]నాదికోఁ
బెల్లుగ నెక్క వానికొసవెంద్రుక యొక్కటి రెమ్మి దీసినన్
జిల్లున వెళ్ళఁబో చమురు చిమ్మనగ్రోవిని [3]జిమ్ముకైవడిన్. 70

సీ. [4]తాము శక్తిహాయంబులై మంద మని సుమీ
మొగులు [5]చొచ్చినయట్లు లెగురుచుండు
దిక్కూలములు మోచి రెక్కొండ మని సుమీ
యల దరుల్తాము [6]గోరాడుచుండుఁ
బాతాళ మటు సొచ్చి [7]బ్రదుకుద మని సుమీ
తాము వేమలు భూమిఁ ద్రవ్వుచుండు
మింటఁ జందురుఁ జేరి [8]మే లౌద మని సుమీ
తాము నుప్పరమును దాఁటుచుండు

ఆ. హరులు గరులు గిరులు హరిణంబు లనయంబు
తోలుతఁ [9]బెద్ద లరుగునోళ వెఱింగి
యటులు పోవనిత్తుమఁటవయ్య తముఁ జుట్టి
పట్టి నేలతోడఁ గొట్ట కిపుడు? 71

సీ. వెదురుచే ల్కలుపు దీసి దినంబుఁ గాపాడు
కమతీలు మా కేకలములు సుమ్ము

---

1. లోదుడ్డు దెప్పున 2. నాలుగేన్ పెల్లగుచుండు నె; నాలుగేన్ వ్లే (ళ్ల) గుడుండు 3. బెట్టుకైవడిన్ 4. ఆము 5. సీద్దెచ్చి నట్లెనరుచుండు; 6. గోడాడు! 7. బ్రతుకు 8. మీటుద 9. బెద్ద లెఱుఁగునోళ; పెద్దలరుగుసుళు; పెద్ద లెఱుగు నెళ.

[1]కరిముత్తియపురేకఁ గనిపెట్టుసంగాత
కాండ్రు మా కల్ల సింగములు సుమ్ము
[2]జింకవేఁటలఁ గాచి జంకించి దొడ్డిఁ దో
ల్గొల్లలు మాకుఁ గోల్పులులు సుమ్ము
పుట్టజు న్నంగళ్లఁ బెట్టుంచువాడుక
కోమట్లు మా కెల్లుగొడ్లు సుమ్ము
గీ. వాటిలో నిసుమంత తాటోటు చేసి
యటమటింపక యుండఁ బైయద్దికముగ
నేవఁ దిరుగాడువిశ్వాసు లెపుడు మాకు
జాగిలంబులు సుమ్ము మాసామి కాన. *72
సీ. ఒకసింగ మల్లసత్తికిఁ గ్రిందు పొచ్చుట
మాడాక కటు నిల్వ నోడి కాదె
వాలుఁదోల్పంచి పాతాళంబుఁ దూఱుట
మాడాక కటు నిల్వ నోడి కాదె
హరిణం బొకటి రాజు శరణంబుఁ జొచ్చుట
మాడాక కటు నిల్వ నోడి కాదె
వడి దచ్చియేనుఁగుల్ కడభూమిఁ జేరుట
మాడాక కటు నిల్వ నోడి కాదె
గీ. కనుగలిగి [3]మున్నె తప్పించుకొనియోఁ [4]గాక
కొట్టి కోలాహలము చేసి కూలఁ గ్రుమ్మి
చెండి చెకపిక లాడమా యుండెనేని
మించి పోయినసుద్దుల నెంచ నేల. *73

---

1. గజ...కనిబట్టు 2 చొక 3. ముందె 4 గాదె.

కొన్ని ప్రతులలో నీ 72, 73 పద్యములు లేవు.

క. కైవడి మెకములఁ గ్రుమ్మెడి
కైవడి మా [2]యావ చేవ కనఁ బోయెదుగా
దేవర [3]మా దేవరవలె
వేవే[4]గ మె సామి వేఁట విచ్చేయవయా. 74

చ. అన విని మందహాస మొలయం [5]దమితోఁడ విభుండు పొం
దుః మీఁ, వెనుకనె వత్తు నన్నియును వేఁటకు నాయితపెట్టుఁ
డిప్పుడే, య[6]ని యచిరత్న రత్నఖచితాభర[7]ణాంబర పంక్తు
లిచ్చి పం, చినఁ గొని చెంచుతేండ్రపుడు సింగఁడు బూ
రఁడు నై ముదంబునన్. 75

క. చని రంత [8]వేఁటఁ బోవం
జన మీఁ రాయిత్తపడి వెసన్ రం డనుచున్
జనవరులన్ జనవరులన్
మనసరులన్ దొరల ననిపి మహీపతి దానున్. 76

గీ. అంతిపుర మేఁగి మజ్జనం బాడి [9]వేఁటఁ
బోవు[10]తమి దేగపదనుగ భోజనంబు
సేసి యాఖేటవిహారణోచితము గాఁగఁ
దత్తఱంబునఁ గై సేసి [11]బిత్తరముగ. 77

సీ. ఒంటుముత్తెములతో నొంటుకెంపులకాంతి
చెక్కులజవ్వాదిఁ జికిలి సేయ
హురుమంజి[12]ముత్యాల యొరగుపాగ మెఱుంగు

1. టి 2. చాయయీవె 3. చిత్తమురావలె 4. గన్ సామివెంట 5. దమతోఁడ 6. నుచు చిరత్న 7. ణంబులు పట్టుకోక లి, చ్చినఁగొని; ణంబులు వేడ్కతోఁడనిచ్చినఁగొని 8. వెంట 9. వెంట 10. తటి 11. చిత్తరువుగ 12. పూసలయొరగుబాగు; హురుమంజిపూసల నొరగబాఱు మెఱుంగు - నొసలిబంతికి బెట్టు ముసుఁగువేయ.

నొసలిబి త్తరిబొట్టు ముసుఁగు వేయ
జాతినీలపుఁదాళిచాకచక్య ప్రభల్
కస్తూరినెఱెవ్రాఁతఁ గు స్తరింప
సొగసుసూర్య పటంపుసురెవాలుఁ మైదళ్కు
హొంబట్టుదట్టిపై నోలగింపఁ

గీ. జేతివజ్రంపుఁబిడితోడిచిక్కటారి
చాయ వలెవాటుదుప్పటిసంకుఁ [2]దోమ
రాచిలుక తేజి నెక్కెడురా తనంగఁ
జక్కఁదన [3]ముప్పతిల్లంగ జనవిభుండు. 78

గీ. నగరు వెలువడి వేఁటసన్నాహమున [4]కు
హితులు మన్నీలు దుర్గాధిపతులు దొరలు
వేత్రహస్తులు రాతులు వీరభటులు
బలసి [5]యిరువంకలను జేరి కొలిచి రాఁగ. 79

సీ. మురు వైనచక్కనిమొగముట్టు సవరించి
నవరత్నమయఖలీనం బొనర్చి
పచ్చసూర్య [6]పటంపుఁబల్లంబు ఘటియించి
బిరుదుత [7]లాటంబు నిరవుకొలిపి
చికిలిచొకాటంపుఁ బికిలి కుచ్చు లమర్చి
యపరంజిపక్కెర [8]యలవరించి
సమకట్టుజల్లులు సమకూర్చి యిరువంక
గొరకసింగిణిపాదఃల్ గూర్చి కట్టి

1. పుటంపు 2. దోఁప 3. మొప్పవచ్చెనజ్జ 4. న 5. యిరుదెసబలఁ
మంత; యిలవంకబలవంక 6. పుటంపు 7. లాడంపు 8 లల.

గీ. పంచకము ఱోమ్ము విరివి యై పరిఘవిల్ల
మోడి శిర [1]సెత్తరము గల్గి మొయిలులోని
జలము తేనోపుపాదరసంబువంటి
యుత్తమాశ్వంబు సాహిణి యొకఁడు నిలుప. 80

ఉ. ఉక్క[2]డ మైనమంచిమను వొప్పెడునాహయ[3]రత్న మెక్కినన్
గక్కస మేమి లేక రవగాలును జోడన *యడ్డవేడెముల్
లుక్కుదువాళి జంగనడలుం గనిపించుచుఁ బోయిపోయి రా
జక్కడ వన్నె సోఁక నటు హా యనినన్ గదలెన్ [4]జరీలునన్.

గీ. [5]ఎనయఁ జెవిఁ బొడిగించి తోఁకినహయంబు
దనదువక్షంబు నేలపైఁ దాఁకినటుల
నోరిలోఁ గాళ్లు వెళ్లెడునో యనంగఁ
గంచుమించుగ ధరణి [6]గ్రక్కదలఁ గదల. 82

గీ. అసమతురగసమారూఢుఁ డైనవిభుఁడు
కద[7]లునప్పుడు దిక్కులు గగనతలముఁ
గప్పెఁ గెంధూళి సాంధ్యరాగంబు మించి
గదిసెఁ జీఁకట్లు చక్రంబు లొదిగె నంత. 83

క. వల ఉరులు బోనులు సివం
గులబండ్లును బోసఁగఁగా జిగురుఁగండెల డే
గల జాగిలములఁ గొని యపు
డలబలములతోడ మృగయు లరిగిరి వెంటన్. 84

---

1. సెత్తుటయుః; సెత్తడము 2. ళ 3. మెక్కివాగెః * యడ్డ వేడెము, లుక్కు 4. రయంబు 5. ఇటులు; ఎనయఁగడుజొడగించి 6. ప్రక్కలుగ 7. లె నయ్యెడ; లునయ్యెడ.

క. భూభాగ నభోభాగ స
మాభోగ [1]నిరోధి మేదురాశ్వవ్రజ రిం
ఖాభీషణఘననినదస
మాభీలదిగంతబలసమన్వితుఁ డగుచున్. 85

మ. చని యంతం గనియెన్ బ్రమోదమున నాసర్వంకషోదారధీ
ఖని కూలంకషదానతోయ ఝురకృత్కాశల్య మేఘాయితా
త్యనఘాస్తోకయశోఘనుం డెదుట రుంద్రాభ్రంకషా శేషపు
ష్పనిధానావనిజాగ్రగణ్యము విరాజద్దండకారణ్యమున్. 86.

మ. కని సొంత్తే వారి పుండరీక సపది గ్రస్త ప్రతిత్యక్త దం
తినికాయైణతతుల్ నిరాకులసముద్వృత్తంబులై వర్తిలన్
ఘన నిస్సాణ మృదంగ కాహళ హుడుక్కా భూరి భేరీనిగుం
భన గంభీర విజృంభణ ధ్వని కదంబంబుల్ వనిం బొల్చినన్. 87

క. సెలవిండు లెక్కువెట్టుచు
సెల విండుఁ నృపాల యనుచుఁ జేరి కిరాతు
ల్వాలకేల మ్రొక్కి చూడుము
వల కేల మెకాలఁ దోఁపవలె మే మునికిన్. 88

గీ. పులులఁ జట్టలు చీరి దుప్పులను లేళ్ళ
నేకలమ్ములఁ గ్రుమ్మి కూరాకు నేసి
యమరఁ జమరులఁ బట్టి పాలార్తు మిపుడు
సామి చూడుము నీబంట్లసత్తు వనుచు. 89

క. ఆరభటుల్ విలసిల్లఁగ
వీరభటుల్ గెడపి రపుడు విభుకట్టెదుటన్

1. నినాద.

సైరిభముల మదవదనీ
చైరిభముల సింహశరభశార్దూలములన్. 90

సీ. జిగు రంటినటుల వెన్ దగిలి [1]పోనీక యీ
సింగాణి [2]మనుఁబోతుఁ జెండివైచుఁ
గడుఁదురీఁగయుఁ బోలె వడిఁ దోలి కఱచి యీ
కస్తూరి దుప్పుల [3]గావుపట్టుఁ
[4]దొట్రించి గొర్లలోఁ దోడేలు సొచ్చిన
[5]ట్లీగబ్బి లేళ్ల నట్టిట్టు సేయుఁ
దగరు[6]వైఖరిఁ దూఱి తెగువ నీసురగాలి
పీఁటవెట్టినపందిఁ బీఁచ మడఁచు

గీ. నని యిటులు [7]వేఱువేఱ నాయకునియెదుటఁ
[8]బోటుబంటుఁదనంబులు వేఁటకాండ్రు
మెచ్చి పొగడుచు మెకములమీఁద గొలుసు
[9]లులిపి జాగిలముల నుసికొలిపి రపుడు. 91

చ. [10]ఒడిసెలరాతిచందమున నుర్వడి సింగిణికోల వాఱుకై
వడి లగు డాఁకటం బఱచువైఖరి బిస్సున పొళువంబు దూ
ఱెడుక్రియఁ దూఱుఁ బాఱి కిటిబృందముఁ జిందఱ సేసెఁ
జెంచులు, యొయ్యడరున బాపురే శుని నరేశుని మెచ్చఁగఁ జేసి
తా ననన్. 92

1. పూనికమఱి 2. మనుబిళ్లు వళ్లెవెళ్లు 3. గావువెట్టు 4. దూండ్రించి; దుండ్రించి 5. ట్లులగబ్బిపులులనిట్టట్టు 6. కైవడి 7. వేరువేర 8. కాటుఁ బాటు 9. లుడిపి; మెలిచి. 10. ఒడిసెటి.

చ. తికమక గాఁగఁ జేసి నలుదిక్కుల నార్భటి సేయుసారమే
యకముల సెల్గి కొట్టి సుఱుమాడుచు నొక్కవరాహ మేఁగెఁ
జే, వకలిమి నప్పు డాయెఱుకువాండ్ర దలింపుల కేమి సడ్డ సే
యక తనయిచ్చగా సరగున న్వెడివడ్డమదేభ మో యనన్. 93

వ. ఇవ్విధంబున నేకలంపుగుంపుల శునకపరంపరలు చింపి
చెండాడుచున్నయెడ. 94

క. వడిఁ దేజిఁ దోలి [1]రాజుర
వడి డొంకెన [2]పోటుగా నురఃస్థలి నపు డా
పిడికిటిగోరకఁ వేయఁ
బిడికిటి బిట్టగసి బిల్ల [3]బీటుగఁ బడియెన్. 95

చ. బలువిలుకాండ్రు మెచ్చ నరపాలకుఁ డేసినయాశుగం బన
గ్గళ ముగ నేఁగు కేసరిని గాఁడి రసాస్థలిఁ దూఱఁబోతె నా
వలఁ దనపేరు దాలిచినవాయువుఁ గ్రోలుట యెట్లు భోగిరా
ట్కుల మని నాగలోకమునకుఁ బగ దీర్పఁగఁ బోవుకై వడిన్.

ఉ. భూమివరేణ్యుఁ డేయుశరముల్ పులులఁ గఱచి మోవ నా
టుటఁ, పై మఱి వెళ్లునెత్తురులు భాసిలె నౌ నవి పుండ
రీకముల్, తాము శిలీముఖంబులుఁ గదా యటు గావున
రక్తసీధువాః, స్తోమము లాని కుత్తుకకుఁ దొట్టిన వెళ్ళఁగఁ
గ్రాసెనో యనన్. 97

క. నీపాలఁ బెట్టుకొను మన
నీపాల [4]యనుగతిఁ జేర నెగసిన లేడిఁ

1. రాజుర్వడి 2. వాటు 3. మీటుగ 4. నృటులచేరజనిన లేడికి
ని దాఁ.

జేపట్టి పులిని జీఱె ద
యాపరుఁ డై రాజమౌళి కది యుక్తమె కా. ౯౮

చ. సమదగజంబుపై [1]కులుకుసామజవైరికి సూటి పెట్టునా
గమకముఁ జూచి భూపతిముఖంబున వ్యాధులమూఁక నిల్వలే
కమితభయా[2]ప్తి నోరసిలె నౌ నవు నేనుఁగు పోవువీథి సిం
హము మెడగంట యెవ్వరొరయంగల రానెలవంక బాణమున్.

చ. అల *వెలయం గజావలహృదంతరముల్ నలి నజ్జు చేసె సం
ధిలుతమి ఋక్షసంఘముల తేజము దూలిచెఁ బుండరీకమం
డలిఁ దెగటార్చె నిర్గద [3]టడంచె సహో కరచాతురీగతుల్
విలసిల రాజు నైజగుణవిక్రమముం గొనియాడ నయ్యెడన్.

క. వాలమ్ముల దంష్ట్రాకర
వాలమ్ముల నెత్తి [4]వైచి వాలమ్ముల వే
జాలమ్ములఁ దగిలినకిటి
జాలమ్ములు దూఁలె నింద్రజాల మ్మనఁగన్. 101

క. ఆవల చించుక [5]వెడలిన
నావలఁ బోనీక చెంచు లవు డడ్డం బై
యావల నులుమాడినఁ గని
యావలను విభుండు మెచ్చి హర్షము నొందెన్. 102

చ. శ్వసనునిఘోటి [6]ఘోటివలెఁ జంగున దాఁటి పయిం జనం
గఁ దా, రస మయి యొక్కఁ డొక్కయపరంజిపరుం జిగు
రొత్తువాలువాల్, వెసఁ గొని [7]కొంకి కొంకిఁ దెగవ్రేసి

1. నలుకు 2. ర్తి * వెనయఁగా 3. లడంచె 4. నెలసి వాలమ్ము లైనై 5. కదలిన 6. లేటి 7. కిన్కఁగొంకి.

బడిఁ బడి లేచికుంటు మూ, నిసిపరు వంటు గానఁబడె నేఁ
డనఁ గానఁ బడంగఁ జీలిచెన్. 103

క. భటుఁ డొకఁడు పందిపోటున
బొటవ్రేలికి సూటిపెట్టి పూని యదల్పన్
గిటి [1] దూటి మట్టిమొనఁ బడ
నటు చిమ్మిన జొమ్ముఁ [2]నాటి యావల వెళ్లెన్. 104

క. బొఱియల[3]కడ నెఱియలయెడ
నెఱి యలవడఁ బొంచి శునకనికరము త్రుంచెన్
బరియలుగా మురియలుగా
నురియలుఁగా[4] యన శశముల నుడుముందుడులన్. 105

మ. కెడసెన్ దుప్పులు డింకవేసె నెలుఁగుల్ [5]గిట్టెన్ పులు
ల్సింగముల్, కడ[6]గోట్టెన్ మనుఁబిల్లు గంతుగొనె జింక ల్బె
ద్దె దోరెం గిటుల్, మడిసెన్ గారెనుపోతు [7]లేదు లిలిగెన్
మ్రగ్గెన్ వృకవ్రాతముల్, గడుఁతు [8]ల్చిక్కె గజాళి పాక్కె
నపు డశ్వాన్ దుమాదూళిగన్. 106

వ. ఇవ్విధంబున భూవరేణ్యుం డయ్యర[9]ణ్యంబున ననేకమృగ
విహగఘూ[10]టంబుల నిరాఘాటంబుగా గీటడంచి యాఖేటక
విహారంబు చాలించి యొల్లెడలం బెల్లుగాఁ ద్రెళ్లిన యిఱ్ఱి జింక
దుప్పి కడితి మనుఁబోతు కొండగొఱియ యేదుపంది [11]కుం
దేలు [12]గురుపోతు మొదలయిన తినుమెకంబులబొందులను

---

1. చూఱి 2. దాఁకి 3. యెడ పఱి 4. (గ శశమునుడు 5. గిట్టెన్ 6. కోడెన్ 7. లీల్గెహరిణుల్ 8. ల్చిక్కెగజాళి చొక్కె 9. ణ్యాని. 10. టకంబుల 11. కుందేలు 12. కుఱుపోతు.

శకుంతబృందంబులను బొందుగా నొక్కకంపువఁ బ్రోవు
వేయించి యందుల బుళిందులు సొగయ మృగయాధిదేవతా
ప్రీతిగాఁ జేయం దగుకృత్యంబు సేయించి గొల్లరకును సమాం
శం[2]బులుగా మాంసంబులు పంచి యిప్పించి యుత్తమంబు
లగుదంతిదంతమౌక్తికనికరంబులు నికరంబు లయిన క
స్తూరీసంకుమదపంకంబులుఁ బొంకంబు లగుచమరవాలజా
ల[3]ంబులు నాదిగాఁ గలసమస్తవస్తువులుఁ గైకొని పుష్ప
రసాది బహుపదార్థంబులు పాకనిపుణపాచకరచితమహిత
పిశితఖండంబు లఖండంబులుగా నేదిష్ఠభూమండలాఖండల
మండలంబులు నిండువేడుకలఁ దెచ్చి యొప్పించిన నిష్ట
మృష్టాన్నంబులు సంతుష్టిగాఁ దానును సకలజనంబులు
భుజియించి యయ్యేలమావుల[4]క్రీనీడలఁ గొండొకసేపు పరి
శ్రమంబు వాయ విశ్రమించి యంత నమ్మహనీయోత్తమ
గంధర్వ్వుఁడు వరూథినీసమన్వితుం డై మంత్రిపుంగవులు
కుఱంగటం[5]గొలిచి చనుదేరఁ గదలి ముందటఁ గంచుకు
లెచ్చరింపఁ జెంచుల నవలోకించి పదియైదు ప్రొద్దులు
నిలిచి యివ్వనవిశేషంబులు చూడ నభిలాష యయ్యెడు
నియ్యడవి నుండ వసతియైనస్థలంబు గలదా యని యడి
గిన నయ్యాటవికు లయ్యా యిక్కడికి యోజనత్రయంబున
ఘోరకాంతారంబుఁ జొచ్చి పోవ నొక్కరమ్యస్థలంబు
[6]గలదు తత్స్థలంబునఁ జుట్టామడ[7]పెట్టునం దామర
కొలంకులు శృంగారవనంబులు నెడతెగక యుండుఁ దదీ

---

2. బుగా 3. మ్ములు 4. క్రిందినీడల[?] 5. గా నిలిచి 6. గద్దు
7. పెడఱ్ఱునం.

యమధ్యస్థలంబున [1]నరఘోదకంబుల ఘనదీర్ఘిక [2]కద్దందుఁ దొల్లి సీతారాములు విహరించుచుందు రని పెద్దలవలన వినినార మని విన్నవించి దానికిం బ్రోపపెట్టుచుం [3]జనఁ జన మధ్యమార్గంబున. 107

సీ. కను [4]మాయఁ జని సీతఁ జెనకు కాకాసురుఁ
గను [5]మాయఁగాఁ బాటికొనినచోటు
తల కెక్కు వలపునఁ దగులు శూర్పణఖము
క్కును జెవుల్ రాపాడుకొనినచోటు
సపరివేషం బైనచంద్రబింబము వోలె
గుడి వ్రాసి జానకి నిడినచోటు
కుహనా మృగ నిశాటు గహనాధిదేవత
కనురక్తి బలి యిచ్చినట్టిచోటు

గీ. కనుఁగొని విభుండు రామలక్ష్మణులు ధర్మ
[6]సాధువులు విష్ణుమూర్తులు సంచరించి
నార లీపుణ్య మగునరణ్యానిఁ జూడఁ
గలిగె నని సంతసిలుచు నావలఁ జనంగ. 108

గీ. అరిది యావనులు సరసు లనఁగి పెనఁగి
యొనసి శాఖోపశాఖ లై యింపు మీఱి
ప్రబలి తామరతంప రై పరిఢవిల్లి
యెదుటఁ గన నయ్యె వాసనాపదము లగుచు. 109

1. నొక్కయనర్ఘ 2. కలదాదు 3. జనిచని-మధ్యే 4. మాయ 5. మాయఁగాఁబాదు 6. సాధులగు.

క. ఆతావు లపుడు గంధవ
తీతలనాథుండు సన్ను[1]తించుచు బలసం
ఘాతము [2]దిగు మని మెల్లన
నాతలి కటు పాదచారి యై చని చెంతన్. 110

సీ. మరుమావులరవం బమరుమావు లరు దైన
తావి క్రొన్నన[3]చెట్లు గ్రేవఁ దనరఁ
బ్రామానికపునిగ్గుఁ బ్రామానికపుశిలా
పట్టభంగంబులు పరిఢవిల్లఁ
గనదంబుజాతకోకనదంబులఁ జరించు
రాయంచజక్కవరవము లెసఁగ
నాకాశరుచిఁ గేరు నాకాశ[4]గంగతో
నీకాశ మై వారి నిండి తొలఁక

గీ. మొలకతెమ్మెరకూనలు [5]పొలయ వెలయ
దేవనిర్మిత మైనట్టి దిగ్గియఁ గని
[6]దిగ్గి యగణిత విభవముల్ [7]దేజరిలఁగ
రాజు మంత్రులుఁ దాను హర్షంబుతోడ. 111

వ. ఇవ్విధంబున నయ్యవనీవిభుం డమ్మహనీయస్థలశృంగారంబున
కత్యంతసంతుష్టాంతరంగుండై యచ్చట విశ్రమించి తత్త

1. తింపుచు 2. లచ్చటదిగమని 3. పట్టు 4. నిమ్నగా 5. వెలయ పొలయ; వొలయ వెలయు 6. దేవ 7. దేజరిల్ల.

ద్విశేషంబు లప్పటప్పటికిం గనుచు వనవిహారంబు* సలుపు
చున్నయెడ. 112

క. సారంగధరుఁడు లా
సారంగధరుండు సాధుసంస్తుత్యనయా
చారుండు ధర్మమర్మవి
చారుం డప్పు డుబుసు పోక సమ్మద¹లీలన్. 113

గీ. ²పావురంబులఁ బట్టెడి వారిఁ జీరి
యుద్ధ³వడి ర మ్మనిన భృత్యు లొకనిఁ బట్టి
పదుగు ర త్తఱి బడిబడిఁ బావు తెంచి
పులుఁగులను దె మ్మనుచు వారిఁ ⁴బిలువ నపుడు. 114

చ. జిలుఁ గగునాభినామములు చెంపలగందము లోరపాగలుఁ
వలిపపుసాలు వింతవలెవాటులు లాఁగులు రావి⁵రేకలుం
గలిగినగుజ్జురూప⁶రులుఁ గంబడిచింపులు నీలిపాంత లీఁ
కలుఁ దగు పారువంపుఁబుటికల్గొనివచ్చి కుమారుసన్నిధిన్.

క. మే లైన లకో⁷రీ లా
డ్డీలుం బదటీలు పల్లటీ ల్పక్కావాలుఁ
జీలుం బకదార్గును గూ
కీలు ⁹ననెడుపేరులం దగిన పారువములన్. 116

మ. వినయం బేర్పడ ముంగలఁ నిలుప నావిర్భూతకౌతూహలం
బున నారాజకుమారమన్మథుఁడు సొంపుల్ మీఱ మాధుర్యధు

---

* వినోదప్రసంగంబులం బ్రొద్దుగడపుచుండె; నంత నిక్కడ. 1. ఖేలన్ 2. పావురం 3. విడి . లొకరివెంట 4. బిలుచుటయును 5. రేకులం 6. ములు ...పాతలుఁ, కలుజగు 7. లును నొ 8. లూఁ,చీ 9. న్ననుపేరులు గలిగిన పారువముల్.

ర్యనవీనస్వనగుంభనంబు మొద లౌనానాయావినోదంబు లె
ల్లను హాళిఁ విని వారివారిమనవు ల్పా[1]టించి పాలించుచున్.

క. పారావతరత్నం బని
పే రిడి [2]జగబిరుదు వేసి పెంచినదానిఁ
గూరిచి తనసరి రాజకు
మారులతోఁ బందె [3]మొడ్డి మాత్సర్యమునన్. 118

క. క్రేవ వల యొడ్డి [4]గొంటిం
బావురముఁ దిగిచి వడి నభంబున [5]కెగయం
గా వైచి వ్రాలకుండఁగఁ
జే విసరుచు బెదరు పుట్టఁ జేసినయంతన్. 119

లయగ్రాహి

పేరెములు [6]వాలుచు సమీరునిపాటూపాటిని
[7]గేరడము [8]లాడెడు మహారయముతో న
య్యారె యన మీఱి గరుదారవముచేఁ జనలు
బూరటిల మాకొలమువారిఁ గనమా యహా
రారె యిది వింత గద రోరి యని యెంతయు న
న్నారునిపయిం దిరిగి సారెకును జూడన్
దూర మెగఁ బాఱుచుఁ జొకార మయి యన్నలువ
వారువముచందమునఁ బారువము మించెన్. 120

సీ. అభ్రమాతంగంబు హస్తంబు[9]లోఁ జిక్కి
కదలెడుపుండరీకం బనంగ

---

1. లించిలాలింపుచున్ 2. వెస-; బలు... హెచ్చినదానిన్ 3. మొగ్గి; మొసఁగి
4. యొడ్డియుం; యొడ్డిన 5. కెగరం 6. వెట్టు 7. గారె; గార 8. ఆడుచు 9. చే.

వారినిధు ల్వ్రాలఁ గంప †బెరుగు నంబరకేశు
తలవాఁకఁ [1]దేలాడునెల యనంగ
మిన్నేటిదరులందు మేఁత లాడుచునున్న
యెదుటు రాయంచ లేఁగొదమ యనఁగ
వడిఁ బోవుచో జాతి పడునభోమణి తేరి
తెల్లనిచిన్నారిజల్లి యనఁగ
గీ. తెక్క [2]లార్చుచు లకుముకిపక్కిరీతిఁ
దెలుపుము [3]ధరణి నే మైనఁ దెలుపుఁ గనినఁ
బెట్ట యని గమకించి [4]నూ పెట్టుకొనుచు
నుండెఁ బారువ మప్పు డయ్యుదజనంబు. 121

సీ. కంటికిఁ జే యోరగా నిల్పి కన్గొని
యన్నన్న యెంతద వ్వనెడువారు
వలిపచేల ముసుంగు వైచి వేమఱు సూచి
హో కంటిఁ గంటి నే ననెడువారు
మెడలపై హస్తంబు లిడి తప్ప కీక్షించి
యారా మిక్కిలి పొడ వనెడివారు
పళ్లెంపునీటిలోఁ బలినీడ పరికించి
కనిపింప దేచాయ ననెడువారు
గీ. గొబ్బగొబ్బునఁ దల లెత్తి కొంద ఱందుఁ
జూడఁ జూడంగఁ బాగలు వీడి పడిన
నవ్వినోదము గని నవ్వినట్టి [5]వారు
నైరి తత్పక్షి విహరించు నవసరమున. 122

† నంబరకేశును 1. దేలెడు 2. లార్పు 3. ను ధరనే 4. వార 5. వార, లైరి కొందఱు నొడ్డినిధాన మెఱయ;... నైరియొడ్డినయొడ్డనివారు (ధార) మెఱయ.

క. [1]మినుకు మిను కనెడి మింటం
బొనపౌన నలతెల్లమబ్బుపొంతన దిగు[2]వా
టున నదె కలదో లేదో
యనుమాత్రము గాఁగఁ గంటి[3]వా నృపతనయా. 123

గీ. అనినఁ జెలికాండ్రపలు [4]కతఁ డాలకించి
కించి [5]దుపహాసమున విలోకించి గంటిఁ
గంటి నౌ నౌను నే ముందుఁ గంటి ననుచు
ననుచు మదిఁ దాని మరలింతు [6]నను చుఁ దలఁచి. 124

ఉ. పెట్టను బట్టి తెక్కె వె[7]లుపించి కనంబడునట్లుగాఁగ న
ట్టిట్టొక రెండుమాఱులు పయిం జుఱటించ లేఁ జేతఁ ద్రిప్పుచుం
బిట్టుగఁ గేక వేసి వినఁ బిల్చిన వెండి గరంగి ముద్దయై
న[8]ట్టిరు తెక్కలుం ముడిఁచి యబ్బురపుంబలునిబ్బరంబునన్.

సీ. సౌధ కేతన పటాంచల వాత ధూత ని
రత గాంగ డిండీర ఖండ మనఁగ
సితమానిపూర్వావసిత భూ పునర్దిదృ
క్షాగతేంద్రాగ లతాంత మనఁగ
నవహార సంఘట్టన [9]స్రస్త పతయాళు
గగనలక్ష్మీ మౌక్తికం బనంగ
మధ్యందినానంతమణి లూన మందేహ
సంత్యక్త [10]బిరు దాంక శంఖ మనఁగఁ

1. మనుచు 2. పా 3. రా 4. కాతఁడా దరించి 5. దప 6. నని తలంచి 7. శ 8. ట్టెఱకల్ ముడుంచుకొని 9. గ్రస్త 10. బిరుదాం క.

గీ. బంకరుహాసంభవకళత్ర పత్త్ర పుత్త్ర
సురకులధురీణ కంఘాణ కరి కృపాణ
రమ్య థావళ్య జైత్ర పారావతంబు
రాఁ [1]దొడఁగెఁ జుక్క [2]దెగి వడు క్రమము దోఁప. 126

గీ. అంతలోనన చిత్రాంగి యది యెఱింగి
క్రీడ సలుపుచు బంగారు మేడమీఁద
[3]మొలకవన్నెలు చిలుక రాచిలుకఁ బట్టి
[4]చిలుకపలుకుల నటు చూపి పిలిచె నంత. 127

మ. కని చిల్కం బసపెంటిగాఁ దలఁచి[5]యాకైలాటపుంబుల్గు [6]గ్ర
క్కన మిన్నందిన మేడమీఁది[7]కటుచక్కందేలి పెఁబాళి వి
చ్చినతెక్కల్ పయిఁడంబె ప్రోఁతలు దగన్ జిత్రాంగి
రత్నాంగినం, దనుఁ గారింపఁగ వచ్చినట్టివిధియో నా వచ్చి
వ్రాలెన్ [8]దమిన్. 128

వ. కెలఁకుల నిట్లు వ్రాల [9]వలకేలను మెల్ల[10]నఁ బట్టి దువ్వియా
నళినపళాక్షి పక్షి యనునామము దీనికె చెల్లుఁ బిల్చియుం
బిలువక ము[11]న్నె వచ్చె నిజుప్రేమ దొలంకఁగ నింక దీనిచేఁ
గలుగునిజంబుగాఁ దనకుఁ గాంతుఁలుదీర సుఖంబు చెందఁగన్.

గీ. సందియము లే దొకింతయు నిందు కిపుడు
వచ్చు సారంగధరుఁ డిందు [12]వచ్చినపుడె

---

1. దొణగె 2. తెగివడ్డ; దిగిపడు 3. ములకవెన్నెల చిలుకరా చిలుక;... వెన్నల...;రాచిలక; పి (ప) లక; 4. వలసివల్లమి నటుచూపి పిలుచు నంత 5. యక్కై 6. గ్రక్కన 7. రాకెఁ దళుక్కంగాంతితో జాలి; ...కటుచక్కంచేలి పైబాళి; 8. వడిన్ 9. నటు; తన 10. నె దువ్విపట్టి 11. న్నపచ్చెగడు 12. వచ్చున; వచ్చెనేని.

[1]తగులు నాచేత ననుచు సంతసము నొంది
మేడ దిగి వచ్చి యప్పు డామెఱుఁగుఁబోఁడి. 130

శా. బంగారాన మెఱుంగు వెట్టినగతిం బైపై గుబాళించు లేఁ
జెంగల్వం గడుఁ దావి గట్టినటులన్ [2]జిన్నారిజాబిల్లి మీఁ
దం గన్పట్టు సుధారసం బిడు క్రియన్ దన్మోహనాంగంబునన్
[3]సింగారించె వధూటి కామణి మణీ[4]శ్రేణీపరిష్కారముల్. 131

వ. ఇవ్విధంబున బహువిధాభరణభూషిత యై యయ్యేడ. 132

సీ. రహి గట్టి తగఁ గర్ణమహనీయవిభవంబు
తాటంకములమీఁదితగులు [5]గల్గి
యచలాయతనితంబ మతిశ[6]యిల్లి చెలంగఁ
గాంచి వజ్రప్రభాకలనఁ దనరి
కృశ [7]మై కవును పేదఱికము వాయక యొప్పఁ
బ్రణుతింపఁ [8]దగునీవిఁ బరిఢవిల్లి
యలరారె మి న్నంది యరుణకరంబులు
ఘనకంకణములతో నసఁగి పెనఁగి

గీ. యాఁర యద్భుతశృంగార మభినుతింపఁ
దరమె వాసన [9]కుల్కుకుందనపుబొమ్మ
కలికిరూ పైనరత్నమో కాక యల్ల
మోహినియొ నాఁగఁ జిత్రాంగి మురు వెసంగి. 133

క. ప్రియ మై [10]రమణీయ మణీ
మయ మై యతిచిత్ర[11]చిత్రమంజిమ నయ మై

1. తగిలె నాబారి 2. శీతాంశురాజత్కళం; శీతాంశుబింబంబునన్ 3. శృంగా 4. రేఖా 5. గడిగి 6. యించి 7. మైనకాన్; మధ్యమును 8. నీవిచే 9. గల్గు 10. దివ్యమణీమణి 11. భిత్తి.

నయ మైనచిలుకపలుకుల
నయగౌరవమునం జెలంగిన యగౌరవమునన్. 134

క. వెయ్యాఱులు త[1]నయుడిగవు
టొయ్యారులు గొలువం జెలువ మొలుకంగం గొలువై
గయ్యాళి చిలుకతేజీ
వయ్యాళి పిసాళిమీఱి వాలె నున్నంతన్. 135

మ. సరసాగ్రేసర వాసరప్రభుతనూజస్థూలలతా పురం
దరజిద్భోగధురంధరా భరతశాస్త్రప్రౌఢమార్గైకలా
స్వరసోత్పాదనకోవిదా శ్రవణభూషాదివ్యరత్న[2]ప్రభా
తరణిశ్రీకరగల్లభా [3]విభవభృత్తంజాపురీవల్లభా. 136

క. తరుణీమన్మథ యాశ్రిత
భరణాగుణాభరణశౌర్య బహురాజ్యధురం
ధర సత్యాదిమచక్రే
శ్వర యభినవభోజరాజవరబిరుదాంకా. 137

తోటకము:—

అతులాగమశాస్త్రనిరస్తసురే
జ్య తులా[4]ధికవిద్వసనాస్తశత
క్రతులాభ శుభోదయకారణర
త్నతులాపురుషాదికదానచణా. 138

1. నును 2. త్విషా, తరుణ 3. శుభవిభాతంజా 4. ధిప.

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణప్రసాదలబ్ధ ప్రసిద్ధవాగ్వైభవ [1]చేమకూర లక్ష్మణామాత్యతనూభవ సదారాధిత బుధసమాజ వేంకటరాజప్రణీతం బైన సారంగధరచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

1. సుధాసార జనితయశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యకుమార సమారాధిత.

శ్రీ ర స్తు.

# సారంగధర చరిత్రము

## ద్వితీయాశ్వాసము



జానకీమనోహర
¹పూజాంచిత హృత్పయోజ పోష్యాఖిలది
గ్రాజ సకలార్థిజనని
ప్యాశ్రిజకృపా యచ్యుతేంద్రరఘునాథనృపా. 1

వ. అవధరింపుము. 2

క. ఆరీతిఁ బారువము పో
సారంగధరుండు తోడిజననాథసుతుల్
పారెకుఁ గేకలు ²వేయఁగఁ
గారాకూర మయి మనసు కళవళపడఁగన్. 3.

ఉ. బెంగ ³లిడఁగ గెంటి యటఁ బెంటిని గానక దేలిపోయి చి
త్రాంగి విచిత్రరత్న భవనాంగణసీమ*ను దేల వ్రాలె నా
బంగరుముద్దు⁴బావురము బాపురె యంతిపురంబులోని ⁵కే
భంగుల నవ్వుల న్వేదకఁ బంపఁగరా దిక నేమి సేయుదున్.

---

1. పూజాన్విత 2. వై పఁగ 3. పడంగ గెంటి(వి)యిఁల...; ...గంటి యిట బెఁటిని...,పోయె * నిదేల 4. బారువ 5. కె, బ్భఁగుల.

గీ. తామసము సేయఁ దగ దింక దీమసమున
నేరుపరి నైననేఁ బోక తీర దనుచుఁ
బోవ మతిమంతుసుతుఁడు సుబుద్ధి దీర్ఘ
దర్శి గావున సారంగధరున కనియె. 5

ఉ. మన్నన చేసి మీరు బహుమానముతో [1]నను నేలినారు నేఁ
గన్నది దెల్పకుండిన నఘంబగుఁ గా దని [2]వెగ్గలింప కీ
విన్నప [3]మాలకింపుము వివేకివి గా[4]ని మఱొండు గావు నీ
కెన్నఁడు లేని యోజ యిది యే మటు పోయిన హాని
యయ్యెడున్. 6

ఉ. రా జొకఁ డూర లేఁడు చెలి ప్రాయపు బిత్తరి నీవు రూపరే
ఖాజితమన్మథుండ వటు కావునఁ బోఁ దగ దయ్య [7]నీకు నో
రాజకుమార యెక్కడి పరాకిటు సూడఁ గదయ్య భామినీ
రాజులచిత్తము ల్దెలియ రా దెటుపోయెటువచ్చునో కదా. 7

క. వలపు సట వావులా నహి
యలసత్యము సున్న తలఁపు లభ్రచ్ఛాయల్
తలఁ దడవి బాస చేసిన
జలజాక్షుల నమ్మరాదు సారంగధరా. 8

గీ. వయసువాఁడును మిగుల బాగయినవాఁడు
నన్నిట నొయారి వైయుండునట్టివాఁడు
దైవగతి నొంటిపాటునఁ దగిలెనేని
యోజ చెడి పైకొనదె యెట్టియువిద యైన. 9

1. మము 2. వేగిరింప; వెగ్గలింప 3. మాచరింపుచు; మాదరింపుము. 4. మఱియొండు గాదు; నసెఱుఁగరాజ 5. యందు; యింది 6. యుంట నైనయు 7. గా.

వ. అది య టుండ నిమ్ము. 10

ఉ. ఇంతులచూపు నాటుకొను టెం తరుదే మగవారిచిత్త
[1]ముఁ గాఁ, గాంతలకన్నుసన్న నె మెలంగుఁ గదా మరునంబ
కంబు లా, దత్యంతము [2]లెంచి చూడ జవరాండ్రయొడాట
ములందు శక్యమే, యెంతటివాని కైనఁ జలియింపక
బిగ్గ మనంబు నిల్పఁగన్. 11

ఆ. నిజము భీష్మునంతటిజితేంద్రియున కైన
[3]నాశ పుట్టు మది నిరాశ పుట్టె
దితరు లనఁగ నెంత యేకాంత మై యున్న
ధనముపట్ల యువతిజనముపట్ల. 12

క. వినమే తొల్లిటి తపసుల
వనితలకుఁ లోను గానివా[4]రలు గలరే
మన మనఁగ నెంత గరఁగక
మనమనఁగా నెంత కలికి మటుమాయలకున్. 13

చ. గుఱుతుగ స్త్రీలకుఁ మగలకుఁ మది నిల్కడ లెందులేవు నీ
వెఱుఁగని[5]నీతియుం గలదె యేటికిఁ ద త్తఱపాటు [6]మీఁదిచే
టెఱుఁగవు నీవివేక మిపు డెక్కడఁ బోయె విచారహీనతఁ
గఱటితనంబు[7]నఁ బదరి కార్యము సేసిన మెత్తురే [8]ఘనుల్. 14

చ. నృపతికుమార లోకమున నీసరి చక్కనివారు లేరు నీ
విపు డటు పోయినప్పుడె పయింబడి ని న్వలవంత బట్టు న

1. ముల్ ...సన్నల 2. వేచి 3. నాసపుట్టు మదిని రోసపుట్టు, ని
4. రుం 5. నీతులు గలవె 6. దటత్తె 7. తో 8. జపుల్.

చ్చపలమృగాక్షి నీ వది [1]సైసంగక వచ్చితి వేని రాజుతోఁ
గపటముగాఁగఁ జెప్పినను గల్లరిఁ జేయుఁ జుమీ నిజంబుగన్.*

క. తల గలిగినఁ గుళ్లా[2]యులు
గల వేవగ నైన నీవు గలిగినఁ దాదృ
క్కులరవము లెన్ని [3]యైనన్
గలిగెడుఁ బోకు మని యడ్డగా ల్వేయంగన్. 16

క. కోపమునఁ జూచి యప్పుడా
భూపాలకుమారుఁ డను సుబుద్ధికి నోనా
పాపా మ్మూర[4]క వలవని
పాపము గట్టెదవు చాలుఁ బదివే ల్వచ్చెన్. 17

చ. అరమర లేక నీ వహరహంబును మచ్చికఁ గూడిమాడి మున్
బెరిఁగిన మందె మేలమున భీతిల కంటివి గాక యిట్టు లొం
డొరు లని పోవ నోపుదు రఁటోయి ప్రధానికుమార నేఁడుని
ష్ఠురతరఘోరపాతకపుసుద్దులు నీవలనన్ వినంబడెన్. 18

ఉ. ఎక్కడిసుద్దు లయ్య యివి యెవ్వరి కైననుఁ జెల్లుఁ గా కిలం
దక్కినయోజ లావిమలతామరసాక్షికిఁ గల్గ నేర్చునే
యక్కట తప్పి దారి యటు లైనను నా హృదయాంబుజాత
మా, దిక్కునఁ [5]జిక్కునే పరసతీవిముఖం బని నీ వెఱుంగవే.

---

* 15-వ పద్యము తర్వాత ఆ. పా:- వ. అడియునుం గాక,

క. చిత్రాంగి నిన్నుఁ దలఁపున
పుత్రుఁడ వని చూడలేక పొగులును వినుమా
శత్రుపురా లటు పోకుము
చిత్రాంగి యన్నట్టి మేడచెంతకు నధిపా.

1. సహింపక 2. యలు 3. యేనిం 4. కె 5. నిల్చునే; జిక్కునా.

క. ఆదేవి యొక్కటియు మఱి
యీ దేవియు నొక్కటియునె యిద్దఱు నాకుఁ
గాఁడిలితల్లులు గారే
భేదంబులు గలవె తల్లిబిడ్డల కెందున్. 20

క. [1]ఆమె యఁట నన్ను బలిమిఁ
గామించు నఁట యొడఁబడక క్రమ్మఱి నే రా
సామికి వెగటుగ నను నఁట
యీమాటకె యాజ్ఞ వెట్టు నఁట విభుఁ డహహా. 21

ఉ. ఆయమ పాతకం బని భయంపడ కూరక యేల నాప
యిఁ, మాయలు వన్ని భూవరుమనంబుఁ [2]గనారిలఁ జే
యుఁ జేసెఁ బో, యాయన యేల పుత్త్రుఁ డని యాత్మఁ
[3]దలంపక నొంచు నాయె నో, లే యిది వట్టిశంక పనిలే దిటు
వంటివె నీతిమార్గముల్. 22

క. నామదికిఁ సరి పో దిది
యేమి యవశ్యంబు పోదు నిప్పుడె దెత్తుఁ
నాముద్దు [4]పావురము నని
భూమీ[5]వరసుతుఁడు గడచి పో నతఁ డనియెన్. 23

ఆ. ఈ సుబుద్ధిమాట లెంతలే [6]యని పోయె
దీసు బుద్ధి నిడుఁ జూమీ లతాంగి
నిలు పరాకు మాని తలపోసి చూడుమా
నిలుప రాకు [7]మనుచు నలుగ నేల. 24

---

1. అమ యఁటఁ నన్నఁట; 2. గలంగఁగఁ 3. దలంచక 4. ఁబొరువ 5. శసుతుండు 6. వని 7. మంచు.

గీ. నిన్నుఁ జూచిన నెటువంటి నెలఁత [1]కైన
మనసు గరఁగక యుం[2]డునా మనుజనాథ
[3]తనయ చిత్రాంగి తల్లి నా కనియె నకట
వారకాంతల కెందైన వావి గలదె. 25

క. ఏకాంత నైనఁ బురుషుం
డేకాంతమునందుఁ జేరె నేనియు నతనిన్
లోకాపవాద మంటదె
చీకాకుగ ధైర్య మెడలఁ జేయఁడె మరుఁడున్. 26

క. వేగ నరేంద్రుఁడు రాకే
బాగా యిటు చనఁగ వాఁడిపలు మొన సోఁకన్
భోగంబున నిను [4]మెదుపదె
భోగిని యైనపుడు చేరఁ బోరాదు సుమీ. 27

ఆ. ఉగ్రశాసనుండు నిగ్రహిం[5]పఁగ రాజు
తనయుఁ డనుచుఁ దప్పు తాళి [6]వినఁడు
తండ్రి సేయునాజ్ఞ తాళెద నంటివా
నింద నిజము గాఁగ నిలుచు నీకు. 28

గీ. చదువుకొంటివి నీతిశాస్త్రంబు లెల్ల
నీ వెఱుంగని మేరలు లేవు జగతి
నైనఁ దెలిపితి నీమన సయ్యె యింక
ధాత వ్రాసిన వ్రాఁతకుఁ దప్పు గలదె. 29

---

1. తైన 2. దురా 3. యల్ల 4. బోదువక 5. పక 6. మిదఁడు.

క. ఈ రాసుతుసమ్ముఖమునఁ
జేరి యెవరు బుద్ధి[1]మతులు చెప్పెడివారల్
లే రైరి రాయని పెద్దలు
దూరుదు [2]రటు గాన నళికుతో ననవలసెన్. 30

క. నా [3]వలనఁ గొదువ లే దిఁక
దేవరకును విన్నవించితిని మీచిత్తం
బీవిధముఁ దెలుపకున్న ధ
రావరసుత మీ రెఱుంగరా సర్వజ్ఞుల్. 31

క. అనిన నగి యెందుఁ గలదే
మన సెఱుఁగని[4]కల్ల యొడలు మఱచినసివమున్
గనె [5]దేలా మనసునకున్
మనసే తార్కాణ [6]మని కుమారుఁడు వేగన్. 32

క. వల దన్న మాన కరిగెన్
జలమునఁ దనపాలివిధి వెసన్ గొనిపోవన్
దొలుజన్మంబునఁ జేసిన
*కొలయును [7]బుణ్యంబు కట్టి కుడుపక [8]యున్నే. 33

క. [9]చనుచో వాకిటిపెద్దలు
గని దిగ్గన లేచి రాజుగా రిట లేరే
యని [10]కొదుకుచు ననలేకుం
డిన నే మాయె నని మంచటి[11]లఁ బల్కి తగన్. 34

1. తెలియసె 2. రందుకొఱక 3. వల్లఁగొఁవ 4. కల్ల యె (యొ) 5. చందుకేమి మనసుకు 6. చుని * కొలపుణ్యము లెందుఁగట్టి కుడుపకుయున్నే; ... పోనే 7. పాపంబు 8 పోనే 9. చననట 10. కొతు. 11. ల్లంబలికెన్.

సీ. సికపువ్వుటెత్తుతావికి వెంటఁ బడు తేంట్ల
    ఝంకృతి మాగధ స్తవము గాఁగఁ
గడిఁది రాయకుమారగండ పెండేరంపు
    [1]రవళి కంచుకిలోక రవము గాఁగఁ
తల చుట్టి వచ్చు[2]దృగ్గాళధళ్యప్రభ
    లిరువంక వేయుచామరలు గాఁగ
నలు[3]దెస ల్మిఱుమిట్లు గొలుపు దేహచ్ఛాయ
    తలఁగఁ ద్రోయఁగ రాని బలము గాఁగ
గీ. రాజసంబునఁ గక్ష్యాంత[4]రములు గడచి
యరిగె నపుడు జగన్మోహనాంగవిజిత
రాజరాజకుమారసారంగధరుఁడు
రాజరాజకుమారసారంగధరుఁడు. 35
గీ. అంత నొకకాంత యరుదెంచి యతనిఁ గాంచి
[5]సరగఁ జని యమ్మ సారంగధరుఁడు వచ్చు
చున్నవాఁ డని దెలుప నయ్యుత్పలాక్షీ
కోర్కు లీడేఱె నని [6]మెచ్చుకొనుచు నపుడు. 36
ఉ. కంతుఁడొ కాక యారజనికాంతుఁడొ లేక [7]జయంతుఁడో
యితం, డెంతవిలాస మెంతకళ యెంతయొయార మటంచు
విస్మయాక్రాంతమనంబుతోడ[8] పులకల్ [9]దొలఁకరఁగను దెప్ప
వేయ క, క్కాంత మహాభిలాషఁ దటకాపడి చూచెఁ
గుమారశేఖరున్. 37

1. రవము 2. నేత్రధగద్ధగ; గోద్ధతు (ద్యుతు) 3. దిక్కుమిఱు
4. రంబు 5. సరుగ 6. మెచ్చి 7. వసం 8. సపులక 9. స్తనయై; స్తనియై;
చిలుకక్.

చ. ఉరుకుచడెంద మెంతమృదువో మఱి తియ్యనితుంటవింటనే
విరవిర వోవునారిఁ గొని [1]పెన్నెఱిగొజ్జఁగతూపుచేత న
చ్చెరువుగఁ బొంచి కంటికి దిసింపనివాఁ డపు డేసి యార్చెఁ
బో, సురసుర స్రుక్క మెత్త నగుచోటనె గుద్దలి వాఁడి
యౌఁ గదా. 38

క. ఇంతంత గానితమి న
క్కాంతామణి [2]యట్టు లతని గనుఁగొని మణిపీ
ఠాంతరము డిగ్గి యతఁ డ
ల్లంతట రా హర్షమగ్న యై తనలోనన్. 39

క. సారంగనయన తనమన
సారంగను గౌఁగిలించి యలరఁగ నపుడా
సారంగధరునిఁ గూర్పఁడె
సారంగధరుం డటంచు సారెం గలఁగున్. 40

ఆ. ఔర వీనిమోహనాకారరేఖ వే
మాఱు మారు హరికుమారు మాఱు
[3]వీనికన్నుదోయివిరిదమ్మి తొగలతీ
రేపు మాపు బాపు రేపు మాపు. 41

సీ. చక్కగాఁ సోగ యై ముక్కు కోటేరు పె
ట్టినరీతి సంపెంగ[4]ఱెక్క [5]దెగడ
లచ్చియన్నకుఁ దమ్ములకు[6]ను వాదులు పెట్టి
కళకళ నగుమోము కళల నీన

---

1. వేసరి సంపగి తూపుచేతమచ్చరమునఁ బొంచి పొంచియును (చ.చ్చియును) జూపనివాఁడపుడేసి యార్చెఁబో; వేనలినజ్జగు, వేనలినజ్జుగ, 2. యటులనతని
3. వెల్లిదమ్మితొగల వీనికన్దోయితీ 4. తేరు 5. దసర 6. వాదులిడురీతి.

కండెము ల్దిరిగి [1]బల్గొండలు దాపించి
  నటువలె నెగుబుజా లతిశయిల్లఁ
[2]గమ్మితీసినలీలఁ గనుపట్టునెమ్మేని
  మిసమిస ల్కడు మిఱుమిల్లు [3]గొలుప
గీ. నడుగులచె[4]డంగు నంచల నాన గొల్పఁ
జెలఁగి యమ్మక్క [5]యొకటనొచ్చెమ్ము లేక
నిలువునీరునఁ బండిన ట్లలరినాఁడు
వేయుఁ గన్నులు వలయుఁ బో వీనిఁ జూడ. 42

ఉ. [6]తీరయి మల్చివేసినగతిన్ దొడ లున్నవి అొమ్ములోని వి
స్తారము చెప్పరాదు బలుదల్పు నదల్పను బాలు గాఱు
నో, రౌర మొగమ్ముచక్కఁదన మన్ని య టుండఁగ నిమ్ము
వీని యొయ్యారమె లక్ష[7]సేయు నహాహా యనుచున్ దల
యూఁచు సారెకున్. 43

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁ డిటువంటివాని నే
నెక్కడఁ జూచి కాన జగతీశ్వర చిత్తరువందు వ్రాయ రా
దిక్కమనీయరూప మొకయింతయు భాగ్యము గాదె [10]యొచ్చెము
ల్దక్కనమూర్తి నా కితఁడు దక్కినఁ దక్కినమాట లేటికిన్ 44

క. [8]ఎవ్విధమున నే నీతని
జవ్వన మిపు డపహరింతు సఖ నని మనం
బువ్విళ్లూరఁగ వెనుకన్
బువ్విలుదొర కలువతూపు[9]మొన దీడంగన్. 45

---

1. గిల్కొ 2. గవిసినలీలఁగన్ గనుపట్టునెమ్మేను 3. గొనఁగ 4. నంగునచలకాన, డంగు కొవెలలాస 5. యొక్కయొచ్చెమ్ము 6. తీరుగ 7. సేయు చెయహా 8. ఇవ్వి 9. పూనిచెలంగన్, మొనదీటంగన్. 10. పొచ్చెము.

చ. వలపు దువాళి సేయఁ బికవాణి కదంబ[1]పుఁగమ్మవాసనల్
కులుకుఁ బయోధరంపుమెఱుఁగుల్ హృదయంబున నాటు
నంబకం, బులబెడిదంపువాఁడితనముల్ గనిపింపఁగ జాఱు
పైఁటతోఁ, బొలపుఁ బిసాళి వాలుఁదెలిచూపులతోఁ దమ
కంబుతోడుతన్. 46

సీ. రూకంత గాని లే దే కైవడి సమంబు
వచ్చు బంగారు మైహెచ్చుజిగికి
గోగంత గాని లే దేరీతిఁ బ్రతి వచ్చు
యావర క్తిమ మించు మోవిరుచికి
నిసుమంత గాని లే దెటువలె నెన వచ్చు
సైకతంబు విశాలజఘన[2]మునకుఁ
గంటిలోఁ [3]బడునంత గాని లే దెటు లిడు
వచ్చు కాటుక కప్పువాల్కురులకు

గీ. ననుచు నఖిలాంగశృంగార మభినుతించు
గతిఁ దులాకోటిమణికోటి కాంచిదామ
కింకిణీగణ కంకణాకీర్ణ కలక
లారవమ్ములు గులుక సౌయ్యార మొలుక. 47

క. ఇంద్రనందనుఁ గాంచి మోహించి వచ్చు
నుర్వశి తెఱంగు దోఁప నయ్యుర్వసితప
యోదకచ పాకశాసని యొఱపు నెరపు
నక్కుమారునిఁ గని చేర నరుగుదేర. 48

---

1. ముగమ్మ 2. రమను 3. బడినంత.

గీ. అపుడు మంజీరకలకలం బాలకించి
వలదు వల దన్న గతి దోఁపఁ బలికి పెనఁగు
నంచగమిఁ గాళ్లఁ ద్రోచి యేతెంచె శకున
మడ్డగించినపని సేయ నగునె యెందు. *49

క. తనుఁ గన్నవారి నా[1]మడఁ
గను మన్నది తేటపడఁగఁ గడువేడుకతోఁ
బినతల్లికి నెదురుగ వే
చని యప్పు డింపెసయ వినయసంభ్రమపరుఁ డై. 50

ఆ. రాజు లేని[2]వేళ రాఁ జెల్ల దిందు నా
వలనఁ దప్పు గలదు లలన †సైఁచి
మనుచు మనుచు వేఁడుకొ[3]నురీతి మ్రొక్కె సా
రంగధరున కనుఁ గురంగనయన. 51

క. వసు[4]ధేశుఁడు నీవును నా
కు సమం[5]బని మదిఁ దలఁపఁగా నాకు నయయో
యసమాంబకుండ వయ్యుక్
బొసఁగునె తోడఁబడఁ బ్రణామ[6]ముల్ ఘటియింపన్. 52

గీ. అని సుశీలయుఁ బలె నా గయాళిజంత
చేయి చూపి ముం[7]గలిగ విచ్చేయు మనుచు

---

* 49. తర్వాత అ. పా.—ఉ. మ్రొక్కిన నక్కునం బొదివి ముద్దుల మోమున మోముఁ జేర్చి లేఁ, జెక్కిలినొక్కి చొక్కనల చేడియఁ గాంచి కుమారుఁ డెంచి యిం, పెక్కఁగ గారవించి, నెవరెక్కుడు మాపినతల్లి తల్లికిం, దక్కువ గాదటంచు నది తక్కువగల్ గనఁడయ్యె నయ్యెడన్. 1. మట 2. వెనక † సైఁపు 3. ని మ్రొక్కె మ్రొక్కె 4. ధీశుడు 5. బు మదిం దలఁపఁగా 6. ములు... పన్,... ఘటింపంగన్ 7. దఱఁగ.

నయ్యనఘుఁ [1]దోడుకొని యేఁగె నతివినయము
ధూర్తలక్షణ మని మదిఁ దోఁప నపుడు. 53

క. గంబూర గులికి యనురా
గం బూర మనంబు చల్లఁగాఁ బన్నిటఁ దా
బింబోష్ఠి యతనిపాదా
బ్జంబులు గడిగించెఁ గూర్మిసకియల చేతన్. 54

చ. జనవరసూనుఁ డందులకుఁ జాలఁ బ్రియంబు దొలంక నన్నెలం
తను గని నీ కుమారుఁడఁ [2]గదా యిటు తక్కినవారికి న్బలెన్
జననిరొ [3]నాకు నింతయుపచారము సేయఁగ నేటి కన్న నేఁ
డనవుడు నాకుమారుఁడవె యాటను జేయుదు నంచు నేర్పునన్.

క. పేర్చినబలుమానికములు
నేర్చినయొక జాళువాపసిఁడిగద్దియపైఁ
గూర్చుండఁ బెట్టి వినయము
గూర్చి నృపాలసుతుఁ గూర్చి [4]గూర్మి పొసంగన్. 56

గీ. తలిరుఁ గెమ్మోవిఁ జిఱునవ్వు మొలక లెత్త
నలరుకమ్మనివాసనల్ గుబాళింపఁ
గెలనఁ దియ్యని [5]తేనెలు చిలుకుచుండఁ
గలికిలతకూన యాకొమ్మ పలికె నపుడు. 57

ఉ. నీసుగుణత్వమున్ జెలువు నేర్పును నెచ్చెలులెల్లఁ జెప్పఁగా
నీసొగ వోని మోహమున నీసులవింపఁగ విందు నవ్వరే
ఖాసుమకాండ నేఁడు పొడగంటిని గన్నులపండువయ్యె నేఁ
జేసినభాగ్య మెవ్వరును జేయ రయారె ఫలించెఁ గోరికల్.

---

1. దోడ్కొనుచు నేఁగె 2. నునేనల 3. మాకు 4. గూరిమి యొసఁగన్ 5. తేనియల్.

ఉ. చందురునిఁ జయంతుని వసంతునిఁ గంతుని నాదిగా జనుల్
కొందఱు మోహనాంగు లనుకో విని పోవుటెకాక చూడలే
[1]దెందును వారిరూప మదియెట్టిది యో యిదె నిన్నుఁ గంటి నా
నందము గాఁగ నేఁడు సుదినంబుగ నా[2]సదనంబు రంజిలెన్. 59

ఉ. తొల్లి మనంబులోఁ గలుగుతుందుదు కెల్లను బాసెఁ గామినీ
హల్లకబాణ యెంతపని కైన నిధానము నీవు గల్గ నే
[3]నల్లవిభుండు రాఁ డని మహాపరితాపము నొంది యేల చిం
తిల్లఁగ వెన్నఁ బెట్టుకొని నేతికి నేటికి నంగలార్పఁగన్. 60

క. ననుఁ జూడరాఁ డ దేమో
యని నిను [4]దూఱుకొనుచుందు ననయము నాపై
నెనరు గలందుకు గుఱు తిదె
కనిపించెను మనము వేడుకలు గనఁ [5]గల్గెన్. 61

ఉ. నాయపరంజిమేడ యొకనాఁడునుఁ జూడవుగా యగోచరం
బౌ యురుమంజిమ త్రియపుటన్ను వనోరణగండ్లయంద మా
చాయల కెంపుటోవరులచందము నా చెలువల్లొలంకు రే
రాయల రా యరంగులసరాగము నామణికుడ్యభాగముల్.

ఉ. అందు వినోదమార్గములు నందు విశేషము లందు హార్ద్య
లిం, బొందఁగఁ జూచి మానికపు టోవరిలో సొగసు ల్న
టింపఁగా, గందము వక్కలాకులును గైకొని వేడ్క నొ
కింతసేపు నీ, వందుల విశ్రమించి చనుమా [6]చనుమాన
ముతోడ నావుడున్. 63

1. దిందుల 2. పదనంబు 3. దల్ల 4. దూరు (రి) 5. గలిగెన్, కెల్లన్ 6. యను.

చ. వెడనగ వంశురింపఁ బృథివీవ రసూనుఁడు వల్కు నప్పు డ
ప్పుడఁ తుకతోడ నా కెప్పుడు ప్రాణపదం బగు[1] పావురంబు పైఁ
గడుఁ బోడవేఁగి పెంటిఁ బోడగానక యిచ్చట[2] వ్రాలె దానివెం
బడిఁ బడి రాజు లేనియెడ మాపినతల్లిని నీవు గావునన్. 64

చ. రవి [3]యణు రశ్మికిన్ జొరఁగ రాని భయానక మైన నీమణీ
భవనము [4]వచ్చి సొచ్చి పదపంకజములు గని మ్రొక్కఁగంటి నీ
దవుకరుణావి[5]శేషమున నన్నియు నున్నవి యేటి కమ్మ పా
రువము నొసంగు పోయెద సరోరుహలోచన యన్న
నవ్వుచున్. 65

క. పోయెదు గా కిపు డే మని
యాయన[6] చెయివట్టి వట్టియాసల నపు డా
గాయకపుజంత చెంతం
బాయక తోడుకొని మేడపయికిం జనియెన్.[7] 66

వ. అయ్యెడ. 67

ఉ. పాయని మోహతాపమున భామిని యుండఁగ నందు
మీఁద నేఁ, డీయెడ హాని వచ్చు నని యెంచక నూరక
పిట్టరేఁపుచే, నీయన [8]కన్నుఁ గాన కిపు డిచ్చట వచ్చునె
యమ్మచెల్ల న్మే, మో యిది కారణం బనుచు నూహాలు
సేయుచుఁ బ్రోడచేడియల్. 68

ఆ. తత్తఱింపఁ దొడఁగి [9]రిత్తఱి నిది యేమొ
సూటి గాదు తలఁ[10]పఁ బాటి గాదు

---

1. పారువంబు 2. వ్రాల 3. శశిరశ్మికిన్;...యిటున్; 4. సొచ్చి వచ్చి 5. శాసమున 6. చేపట్టి 7. వ. అయ్యెడ 8. యేలవచ్చెనొకొ రిచ్చల వచ్చునె;కించ వచ్చె నొకరిచ్చల...; రేఁచవచ్చెనొకలిచ్చవసించునె 9. యిత్తఱి; 10. పుబాడి.

తగదు మాను మన్నఁ బగవార[1] మగుదు మీ
కటికిమనము పులినకటికి మనము. 69

క. అటు గనుక నీమె చెప్పిన
యటువలె [2]నియ్యకొని లియ్యమై యుండంగా
నటుమీఁద దైవగతి యని
యటు నిటు [3]నడయాడుచుండి రా చెలు [4]లంతట. 70

సీ. నిశ్రేణి శోణమణిశ్రేణి కాంతులఁ
జరణాబ్జరాగంబు శిరము దన్న
జాతరూప కవాట జాత రూప స్ఫూర్తి
నంగవల్లిచ్ఛాయ యవల ద్రోయ
జాల మౌక్తిక వజ్ర జాల మంజుద్యుతిఁ
గనుదోయిజిగి యోరగంటఁ జూడ
న స్తంభ నీలమయ స్తంభ రుచితోడ
నెఱికొప్పుఁగప్పుడా [5]లోరసికొనఁగ

గీ. నవ్విలాసిని యతిమనోహరము లైన
చవికె [6]లరఁగులు పాకలు చప్పరములు
నాది యైన [7]విశేషమ్ము లన్ని యతని
కెచ్చరించుచు మేడపై కేఁగునపుడు. 71

గీ. చంద్రకాంత వితర్దికా సాంద్ర కాంతి
యింద్రనీల [9]మయ స్తంభ రుంద్రదీప్తి

1. మగుదుమాక; మవుదుమాక; మాదుమాక 2. జేసికొని 3. తిరుగాడు
4. తెల్లక 5 లోరపుసెరవ 6. లరుగులు టాంకులు; లరఁగులు దాంకులు
7. వినోదమ్ము 8. పుచు 9. మణి.

రెండుఁ బెనఁగొని యరు దొనరించె మదికి
గంగ యమునయుఁ గూడినభంగి మెఱసి. 72

ఉ. నాయక మైన కెంపు[1]గమి నాటినచోటులు సాంధ్యరాగమున్
జేయఁగ నింద్రనీలములచెక్కడపుంబనిచక్కి యంధకా
రాయిత మై[2]వెలుంగ మగరా లమరించినపట్లు వెన్నెలల్
గాయఁగ మువ్వొలుంగులకుఁ గందువయో యన మించె
నందులన్. 73

చ. పరిమళపేటు లారజపుఁబల్కులచిల్కలుఁ బౌరు[3]వంపుఁ బం
జరములుఁ దూఁగుటుయ్యెలలుఁ జప్పరమంచము లించు తా
విపూ, సరములు ధూపవాసనలసంభ్రమముల్ గల కేళి
రత్నమం, దిర[4]మున నక్కుమారుని మణీమయవేదిక నిల్పి
చెంగటన్. 74

ఉ. ఏకడఁ జూచినన్ రతుల [5]యేఁకట తీరఁగ వ్రాసినట్టి కో
కోకకళారహస్యములు గోప్యము లౌచవుపీతిబంధముల్
నాకపురీ విలాస[6]కలనా గణికామణి కాముకాది నా
నాకృతులున్ విచిత్రగతు లచ్చట నచ్చపలాక్షి చూపుచున్.

ఉ. ఈ విటు లెస్స చూచితె మహాన్నెలజాణవు వల్లవీకుచే
ష్టావిరతానురాగయుతుఁడై [7]తగ నెయ్యపుటాలమందలో
నావగ లెల్ల [8]నక్కలికి యారసి గైకొని యున్కి నోవయో
హావకళాభిరామ జలజాంబక కేళివినోదవై[9]ఖరుల్. 76

---

1. గని 2. యొసంగ;...పట్టు 3 వాల 4 ముల 5. కేఁకట; కేఁటగ తీరఁ; కేటుగ తేటగ, 6. లలనా 7. తగి. 8. నగ్గలిక 9. ఖరిన్.

క. [1]ఒకఁ డూరు వ్రాసఁ జెలి యం
దుకె జంకెనఁ [2]జూచెఁ జూచితో మఱి కటిపీ
ఠముఁ బెనఁ[3]గెడు 'గ్రామో నా
స్తి కుత స్సీమా' యటంట సిద్ధం బయ్యెన్. 77

క. [4]అనుచు విటీవిటసంఘము
కనఁబడ గోపాలుఁ జూపి కడు నేర్పుగ నా
డిన సరసవాక్యములు విని
వినములు చేసికొనఁ దెలియ విను మని [5]పల్కెన్. 78

ఉ. అల్లన గాధిరాజసుతుఁ డర్మిలి మేనక ము[6]ద్దొనర్ప రా
గిల్లి కుచంబు లాన [7]దమకించుట గంటివె రాకుమార యా
నల్ల నగాధిరాజసుతుఁ డర్మిలి మేనక ము[8]ద్దొనర్ప రా
గిల్లి కుచంబు లానఁ[9]దమకించుట బాల్యముగాదె [10]మానినీ.

మ. పలునొక్కుల్ని గుడక్ష గళ ల్వ్రేలయఁగాఁ బ్రైపైఁ జెమర్పక్ష
సము, త్కలి[11]కల్ పెంపు దగం బెనంగి యలసత్వం బొప్ప
సం దీక విం, తలు గా నుండుటఁ గంటివా రతివినోద ప్రౌఢి
రాచూలి యాఁ, దలిరుంబోఁడిరో కంటి వా రతివినోద
ప్రౌఢి[12]జె ట్లౌఁ గదా. 80

ఉ. నిక్కగఁ జూడు చిత్ర మిది నెమ్మది వేడుక నోలలాడు న
మ్మక్కలగుట్టు బట్టబయ లై గనిపింపఁగఁ [13]షొన్న కొమ్మమీఁ

1. ఒకసలియూరుననున్నం 2. యంగఁజూడఁదొ, మఱి, 3. గుదు
4. అని యచ్చట విట సంఘము 5. మఱియుంక 6. ద్దొనర్చి 7. గను
8. ద్దొనర్చి 9. గను 10 భామినీ. 11. కంబేర్పడగం, కంటొప్పదగం;
కందేపుదగం 12. చేటా 13. కారిపొన్నపై, న

దెక్కరమించు చున్కి యవునే మగువా యది చిత్రపాటలతా
నిక్కము కృష్ణలీల గద నీ విపు డెన్నినమార్గ మంతయున్.

క. అని యిటు లతఁ డాకామిని
యనువాక్యము లెల్ల వేతె యర్థముగా నే
ర్పున విడిచి మాట లాడిన
మన సేమియు విఱుగ కపుడు మదవతి [1]కణఁకన్. 82

క. [2]పసనికదంబము మంజుల
[3]వసనకదంబము ననర్ఘ [4]వరమణిభూషా
విస[5]రంబులు విరినెత్తా
విస[6]రంబులు దిగిచి వలపు వెలి విసరంగన్. 83

క. ఓయి నెఱజాణ తలకొనఁ
జేయుము విరు లివె జవాది చెయిపట్టుము వా
లాయ మెదఁ జేర్పు కలపము
కో యని యీఁగానె మరుఁడు కో యని యార్చెన్. 84

గీ. మంచివే లైన దిదిగో కొ ష్మించుఁ గప్పు
రంబు సగపాలు [7]నించి వీడెం బొసంగి
పూనుమీ మెయి భోగంబు భూషణంబు
[8]లెసఁగ నీ వని [9]యూఁటాఁగ యొసఁగ రాఁగ. 85

మ. అవి చే నంటి చెనంటిఁ జూచి యతఁ డిట్లన్ దల్లిదండ్రుల్
మనం, బు విరాజిల్లఁగఁ గూడఁ బెట్టినధనంబుల్ లోకమం

---

1. కడకన్ 2. పసిఁడి 3. మసరు 4. మణిగణ 5. రమ్ముల 6. రమ్ముల 7. గూర్చి 8. లొసగ 9. యీరాగ.

దుఁగ గొమ్మా, ళ్ళవిగా కెవ్వరి [1]వమ్మ [2]కావలయు వేళఁగ వచ్చి
కొంపోదు నే, [3]నివి నీపెట్టియ నాదుదాఁపురముగా నిం
దుండ ని మ్మన్నియుఁగ. 86

క. అని ప్రియము గడ[4]ల్కొనఁ బ
ల్కిన నెంతయు హావభావలీలాగతులఁగ
[5]ధ్వనిచతురోక్తులచే నా
యన మది మేకొలుప లేక వ్యాకులమతి యై. 87

ఉ. ఆతరళాక్షి డెందమున నారఁట మొందుచు నేమి సేయుదుఁగ
[7]రాతికిఁ దోడు వోయినది రాసుతు*డెందము మెత్తగాదుఁదా
దాతికి వచ్చి యుండ నీఁకఁ దాలిమి చెల్లునెమారుఁ డంటిమా
ఘాతకుఁ డోర్వ రాదు సముఖంబున నేటికి రాయబారముల్.

మ. అని యూహించుచు లజ్జఁ బో విడిచియేకాంతంబుగా నద్దె
స, ల్గనుచుఁగ బైఁట దొలంగ నీవి వదలఁగ గామాంధకారం
బు నె, మ్మనముఁగ గప్పినఁ గన్ను గాన కపు డామ త్తేభ
గంభీరగా, మిని యత్యంతనిరంకుశోద్ధతిని బల్మిఁగ బట్టఁగాఁ
జూచినఁగ. 89

క. గడగడ పాపభయంబున
వడఁకుచు నిది యే [9]టిగొడవ వచ్చె నటంచుఁగ
వడి లేచి యతఁడు తల్లీ
తడ వాయెను వచ్చి పోయెదను నే ననుచుఁగ. 90

1. దమ్మ 2. యెన్నిపుడేలఁగ 3. ఁడివి 4. లుకొనఁ 5. దన...
యుందా.. నందా, సెందా 6. డఁబొ(నొ)ందుచు 7. రతిగొన్న త్త యైనను
గొరంత యది రాసుతు నెమ్మనంబుదా * నెమ్మది 8. పు 9. డ.

క. నిన్నెదు రెదురే సూడఁగ
నిన్నాళ్ళకు సెలవు గాఁగ నిట వచ్చితి విం
క న్నీవు తిరిగి పోయెద
నన్నన్ నేఁ బోవ నిత్తునా నవమదనా. 91

మ. అతిమోహంబున మించుతల్లి నిట నీ కాసించియున్నా ననా
తరసౌఖ్యోన్నతిఁ జెందఁ గోరి సుకుమారా రాసుతా యా
త్మజా, కృతి నన్వేఁడుకఁ [1]దేల్పుమిా తలఁపఁగా నేణీకిశో
రాక్షీ స, మ్మతి సారంగధరుండ వయ్యు నలయింపన్ జెల్లునే
నాపుడున్. 92

మ. అతిమోహంబున మించుతల్లి [2]నిట నీ కాసించి యున్నా ననా
రతసౌఖ్యోన్నతిఁ జెందఁ గోరి సుకుమారా రా సుతా యా
త్మజా, కృతినన్ వేడుకఁ దేల్పు మంటివి ధరిత్రిన్ 'సత్య
వాణీ సర, స్వతి' యన్వాక్య మ దేల తప్పు నిజమే వాక్రుచ్చి
నా విద్యోడన్. 93

వ. అని పోఁ [3]గుచ్చెలు వీడ లేనడుము జవ్వాడన్ జగన్మోహన
స్తనకుంభంబులమిాఁద హారములు నృత్యం బాడ లోఁ
దాల్మి యూ, డనిఁబాడన్ బులకాంకురంబు లొనఁగూడం
గట్టివాయింతి వే, చని యవ్వాకిటి కడ్డమై నిలిచి కాంతున్
బట్టఁగాఁ బోయినన్. 94

ఉ. అంటకుమిా లతాంగి నను నంటిన నేమి మనోహరాంగ నే
నంటు పడంగ లే దనుచు నంటెద[4] నిన్ను న టంటు గాదు న
న్నంటుఁగఁ జెల్లునే జనకు [5]నంటినపిమ్మట [6]నైన నేఁడు నీ

1. దేల్పుమంటివి గదా యే 2. వట 3. కుచ్చెలు; కుచ్చియ
4. నంటెదఁగానియటంట 5. డంటిన 6. నంటివైన.

యంటున నంటు గాని నెటు లంటును గెంటక మేనఁ బ్రాణ
ముల్. 95

క. మే లాఅడి వెట్టంగా
మేలా నిలు [1]పోవలదు సుమీ చల మేలా
మేలావర [2]సద్రూపక
మేలా [3]వరియింపు మనుచు మీఁదఁ [4]బడినన్. 96

గీ. హా మహాదేవ యని [5]చెవు లంటి కేల
వడిఁ గడకుఁ బోవ నప్పు డవ్వనిత [6]వనిత
మణిగణోజ్జ్వలకంకణక్వణన మొలయఁ
బట్టుదుప్పటి చేఁ జుట్టి పట్టుకొనియె. 97

క. పట్టి [7]చలపట్టి యూ రా
పట్టిని గూర్చుండఁ బెట్టి పకపక [8]నగి యూ
కట్టిఁడి యగుమరునకు ననుఁ
గ ట్టిడి యొప్పించి యెందుఁ గదలెద వింకన్. 98

సీ. చూపుకన్నెఱికంబు [9]వాపె మే నది మెచ్చి
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనఁగ వలదె
చెవులలో నమృతంబుఁ [10]జిలికె నో రది మెచ్చి
తీయవాతెఱ విందు చేయవలదె
[11]బుగబుగ వాసనల్ [12]నిగుడించుఁ [13]గెమ్మోవి
యది మెచ్చి [14]మోము ముద్దాడ వలదె

---

1. పోవలేఁజుమీ 2. సుకతాపస 3. రమియింపు 4. బడియెన్ 5. చెవియంటి 6. రణిత; జీర 7. చెయి 8. నగుచున్ 9. వాప 10. చిలుక; చిలుకు 11. ఘుగ ఘుగ 12. నిగుడంగ; నిగుడించి 13. కెమ్మొగంబిది 14. మేను; నొక్క-

యుల్లంబుఁ [1]గరఁచెనీ యొయ్యారపు మది మెచ్చి
పొసఁగ దానికి నీవి యొసఁగ వలదె
గీ. ఏమ్ము సారంగధర వేగిరమ్ము [2]మాని
కలరవమ్ముల [3]నణకించు గలరవమ్ము
నాదు మొలనూలి గంటల నాదు వినక
చేఁట నీయుర మానక చంట దగునె. 99
మ. అనిశం గాలినశూలము [4]ల్చెవులలో నంటించినట్లైన [5]నూ
నినపెంపిమ్మున సొమ్మసిల్లి మగుడన్ [6]వే తేటి యమ్మంత్రినం
దనువాక్యమ్ములు నిక్కమయ్యెనని విన్నం బోయి కన్నీళ్లు గాఱ
నునుంజెక్కుల వాతెఱం దడుపుచున్ రాచూలి లో†జాలిగన్.
గీ. *పులుకు పులుకునఁ జూచి యుక్కలికితోడఁ
బలుకుపలుకున దైన్యంబు [7]దొలుకఁ బలికె
ననుఁ బెనుప నోపుపినతల్లి వనుచు నమ్మి
చెల్లఁబో యిటు వచ్చిన దెల్లఁ [8]గలిగె. 101
చ. మదిఁ దలఁపన్ విసం దగని[9]మాటలు నోరెటు లాడెఁ జె
ప్పఁగా, నెదిరి మనంబులోఁ దెలుఁగ కేమిటి కీవలవంతఁ
దల్లడిం, చెదు మది వావిఁ బో విడిచి చెల్లరె తల్లియ దైవ
మంచుఁ గో, విదు లన విందు నాకు వినవే పరభామలు
దోడఁబుట్టువుల్. 102

---

1. గరఁగెనీ యొ; గరచినీ యొ; గలఁగా నొ 2. మాను 3. నదలించు
4. యందంటిం 5. నూనని 6. తాడేలి; చెప్పిన్ని † జారఁగన్ 7. దొలఁక
8. గలదె; 9. మాటిది.

* పా. అం:—అడలుచు నరేంద్ర కాంత చేవిడక యిట్లు, పాముఁ లను బట్టఁ బసిరిక పాముపంటి, యాశిశువు పల్కుఁ బినతల్లివంటినిన్ను చెల్లఁబో, నమ్మివచ్చిన దెల్లఁ గలిగె.

మ. వల దమ్మా యిటువంటి కాని[1]పని యోవామాక్షి యీ వెఱ్ఱి
బు, ద్ధులు నీ కేల ఘటిల్లె నమ్మ తెగువన్ దుర్భాష లి ట్లాడి
యీ, కొల నా కేటికిఁ గట్టె దమ్మ మఱి లోకుల్ విన్న నే
మందు ర, మ్మ లఘుత్వంబుగఁ జూతురమ్మ తగ దమ్మా ధర్మ
మూహింపుమా. 103

క. తమతల్లి పురంధ్రీజా
త మతల్లి గదా దదీయ తనుజుఁడ నఁట [2]హా
*రమణీ యేతఱి [3]నైనను
రమణీయేతరగుణంబు రా నేర్చునొకో. 104

గీ. ఈతలఁపు [4]నుజ్జగింపు భూమీశునాన
యింకఁ బదివేలు [5]నేల నా హృదయ శుద్ధి
యెరు లెఱుంగరు మదనారి యొకఁ[6]డె గాక
యనుచుఁ [7]దర్జనిఁ జూపి యయ్యనఘుఁ డనిన. 105

శా. ఆనీలాలక [8]లేఁతన వ్వ్యాలయ నిట్లన్ గ్రమ్మఱన్ [9]నిన్ జగం
బౌ నౌ మే లన నీవ తెల్పుకొన నేలా నీగుణంబుల్ సతీ
సూను గ్రామణి వాదు నీహృదయ మిచ్చోఁ గంటి నే[10]దేవతం
గా నే నీపినతల్లిఁ గాను విభుభోగస్త్రీని భావింపఁగన్. 106

క. భావజునిబారిఁ బడుచో
వావిఁ దలఁప నేల ధర్మవర్తన మేలా
నీ వింత యేల వెనఁగెదు
నే విడ నాకన్నులాన నినుఁ గూడ కిఁకన్. 107

---

1. పనులో 2. తా 3. ఁదనకి 4. వేసిపెట్టు 5. వచ్చె 6. డుదక్క 7. దర్జిం చిపలికి 8. తేఁగె 9. నీచలం; బౌ నిజం 10. దైవముం,గా నేనీపినతల్లి భూవిభునిభోగ.

* రమణీయ గుణము విడిచిరయు, రమణీ నాకితరగుణము రా నేర్చునొకో.

గీ. తక్క[1]నుడువులు [2]విడువుము పెక్కు లేల
యొకగడియమాత్ర [3]మిట గూడి యున్నఁ జాలు
ననుచుఁ గదియంగఁ దలపు మూయంగఁ దివురు
నాకలికితోడ ధీరత నాతఁ డనియె. 108

చ. వడి నరపాలుభోగసతి వావులు నాకుఁ బ నేమి యంటి వం
గడమున కెల్ల [4]సొ డ్డనినఁ గా దటు నే సల[5]చిన్న నాఁడ [6]వే
ర్పడితి న టన్నఁ బోవునె స్వభావము తల్లివి నాకు నేక్రియం
బడఁతుక నీవు వావి చెడ మందు మహిం గల దమ్మ
యొందులన్. 109

క. వల దిటువలెఁ గక్కూఱితి
పలుకులు పలుకంగ నింత పదరం దగునే
తలపోసి చూడు లెస్సఁగ
నెలఁతా రత్నాంగి యొకటి నీ వా[7]క్కటియే. 110

క. కాయములుఁ [8]గోమరు దిమిరపుఁ
బ్రాయములుఁ దలంప నస్థిరంబులు వీనిఁ
స్థాయిగ నమ్మి యకృత్యము
సేయఁగఁ బూనెదవు మీఁద [9]సిలుఁ గెఱుఁగవుగా. 111

ఆ. ఇపుడు ధైర్య మూ[10]ని యిసుమంత పుష్పకో
దండధరునిబాధ తాళ లేవు
పాప [11]మెంచి మీఁదఁ బటుకార్లఁ బట్టించు
దండధరునిబాధ తాళఁ గలవె. 112

1. నొడువులు 2. నుడువుము 3. మిటు; మిఁక 4. నొట్టనిన 5. పిన్న నాఁడె 6. వే ర్వ డితి 7. ఁటియుఁ నే 8. కొమికెలిమిరపు 9. చేటెఱుఁగు 10. ది 11. మెఱి.గి.

మ. ఖరభానుప్రియసూనుఁ[†]డెప్పుడో నినుంగాంరించునే కా విభుం
డలచేలోఁ బలినిమ్మ[1]పంటివలె నత్యాసక్తి మన్నింప సౌ
ఖ్యరసైకస్థితి [2]నుండి కావరమునన్ గన్గాన కాపత్సరం
పర[3]గాఁ ద్రుళ్లైద వేలయో పిధిఁ దగింపన్ నీతరంబేమహీన్.

చ. అనవుడు నవ్విశాలతరళాక్షి కటాక్షములందు నంకురిం
చిన[1]కినుకన్ బటాబయలు సేయక నవ్వుముసుంగు వైచి యి
ట్లను నతనిం గనుంగొని యనంగునిమామ వెలుంగుసానఁ దీ
రినకరవాఁడి తూపుఁ గికురించిన యొంక మిటారి చూపునన్.

ఉ. ఎన్నఁడు నేర్చినాఁడవుర యీ మటుమాయపుమాట లీవు నా
కిన్ని దలంప నేమిటికి నిప్పుడు [4]దోసము పెద్ద చేసి యా
దున్నవయాళికానిఁ గడు దో[6]డ్డగఁ జెప్పి భయంబు సూపి చ
క్కన్నను దుద్దు వెట్టి యుఱుకంగఁ దలంచెదు మాను
మీవగల్. 115

గీ. [7]నినుఁ [8]గలఁచుభర్త కోపగాఁ డనఁగ నేల
కోల బుజమున నిడి దున్నఁ దోలువాఁడు
[9]అవ్వ యన నేల రాజౌనొ [10]రడ్డి యౌనొ
నాఁటి కిపు డేమి రారాదె యేటి [11]కలఁచ. 116

క. ఇక్కల్ల దెలిసి విభుఁ డిం
కొక్కప్పుడు సేయుచేఁత కొప్పితిఁ బని లే
దెక్కడితగ వెక్కడికోల
యెక్కడివా వేల కొమ్మ లెవ్వరి సొమ్ముల్. 117

† డిప్పుడు 1. పండు 2. నొంది 3. గాఁ ద్రెళ్లైద 4. యలుకన్ 5. రోస 6. డ్డు 7. నను 8. గలయు 9. ఊ 10. ర 11. కలఁప.

గీ. వలచి పట్టినఁ దాలిమి వదల కిప్పు
డెన్ని చెప్పెదు తగవు లీ [1]వేకతమున
మొనసి యూరకె రతిరంగమునకు రాని
సుద్దు లివి యేల చాలిం[2]చు [3]సుగుణి వాదు. 118

క. వలవదు[4]రా రతి మరునకు
వలవదు [5]రా రంభ యతువరసూనునకుఁ
వలవ దురాశలఁ బెట్టఁగ
వలవదు రా వట్టి[6]జాలి వార్తలు [7]విడరా. 119

సీ. దారువనస్త్రీలఁ దగిలెఁ గా[8]ని య దేమొ
నీవలె ముక్కంటి నేరఁ డయ్యె
గారాబుఁగూఁతు[9]నే గవిసెఁ గాని య దేమొ
నీవలెఁ బరమేష్ఠి నేరఁ డయ్యె
నలయహల్యాకాంత నంటెఁ గాని య దేమొ
నీవలె [10]జంభారి నేరఁ డయ్యె
గురునియిల్లాలితోఁ గూడెఁ గాని య దేమొ
నీవలె నుడురాజు నేరఁ డయ్యె

గీ. వారికంటెను [11]హెచ్చైనవాఁడ వౌర
నీకుఁ గలబుద్ధి వారికి లేకపోయె
నీవు నాఁటికి లేక పోయితివి గాక
చేరి [12]వారలయోజలు చెలుప [13]లేవె. 120

1. వీ 2. పు 3. సుగుడి 4. గా 5 గా 6. జో 7. విడుమా
8. కదియెమొ (తక్కిన పాదములలో నిదియే పా.) 9. ఠి 10. నసురారి
11. కడుదొడ్డ 12. మఱివారి 13. గలవె.

ఉ. నావుడు నిట్టనుఁ సుజననాయకుఁ డీ వెడమాట లేల త
ల్లి వినవమ్మ యీజగము లెల్ల సృజింప భరింప నోంపఁ జా
లైవత లెట్లు వర్తిలిన లెస్సవుఁ [1]గా కవి చెల్ల వొడ్లకుఁ
నీ విపు డెన్ను రంభ రతి నీవలెఁ బుత్త్రులఁ బల్మిఁ బట్టిరే.

క. మన నేరవు పతిమ[3]తి రాఁ
గన నేరవు [4]సుగతి తగవు గా దన్న నహో
యన నేర వెంత సెప్పిన
విన నేరవు చాలుఁ జాలు విడు [5]పోవలయుఁ. 122

క. అని పల్కు నతనితాల్మికి
మనమున [6]నెఱి విఱిగి చాల మఱియును గలిఁ బో
సిన[7]వెనుక నుట్లకడఁ జూ
చినగతి నను నతివ యాస చెడ్డది గాదే. 123

క. ఊా యైనఁ గరఁగు నే నిపు
డీ యాడినమాటలకు నొకింతఁ గరఁగ వే
మోాయి యిది నీకు మంచి[8]దో
కో యాఁడుది యుసురు మన్నఁ గొఱ గాదు సుమీా. 124

చ. కలికి పిసాళి వాలుఁ దెలిగన్నులపై నిడనేల కెంపు నా
పలుచనిమోావి కెంజివురుపై నిడరా నెఱజాణ నా[9]యెదఁ
నిలుపఁగ నేల గోళ్లు బలునిబ్బర పబ్బర పుబ్బు గబ్బి గు
బ్బలపయి నిల్పరా సుగుణ పైపయి [10]రేఁపకు కోపతాపముల్.

1. కవిచెల్ల పేరికిఁ; చెల్లునేరికిఁ: చెల్లదొడ్లకుఁ 2. గతి 3. ది 4. సుదతి 5. విడుమనినఁ 6. జాలంగ విఱిగిమఱియు (०) ను 7. వెనక 8. దకో 9. మదిఁ 10. రేఁచక; నెంచక.

ఉ. వే దన మించునీవిరహవేదన తాళఁగఁ జాలఁ గంతునిన్
సా దన రాదుగా తనదుసాదన చూపఁ దొడంగె గాడ్పు దా
నీఁ దన [1]వచ్చునే మెదల నీ దనలాకృతి వేఁడి సూపుచున్
బో దనఁ[2]జెల్లునా కడకుఁ బో దనయంబు శుకంబు ప్రేలుచున్.

సీ. లతకూన యని తగు ల్మ[3]తిఁ దలంపఁడు గదా
వేఁడితావు[4]లఁ జల్లి వేఁచుఁ గాని
జలజగంధి యటంచు సంభ్రమింపఁడు గదా
చుఱుకుసోఁకు[5]ల మీఁద సుడియుఁ గాని
చిలుకలకొలికి యం చెలమిఁ బైకొనఁడు గా
చిగురుటా[6]కుఁగటారిఁ జిమ్ముఁ గాని
కలువకంటి యటంచు నలరఁ జేయఁడు గదా
యుడుకువెన్నెల గాయఁ దొడఁ[7]గుఁ గాని

గీ. మధుఁడు సారంగధరుఁడు మన్మథుఁడు విధుఁడు
*వసులపాఁతఱ లై [8]వీరు నుసుల నీయ
[9]రెటుల నిటు దాళఁ గల దని యెఱుఁగ వైతి
కటకటా నీకు దయ లేదు గా యొకింత. 127

గీ. [10]త్రిమ్మరి గదా సదాగతి తెలిసి చూడ
మెఱయఁడు గదా యనంగుఁ డేతఱి [11]మఱి మడి
యఁడుగ[12]దా యల్ల జైవాతృకుండు దలఁప
నిట్టిచెడుగులచే బాధ [13]లెట్టు లోర్తు. 128

---

1. జెల్లునే 2. వచ్చునా; జెల్లునే 3. ది 4. లు చల్లి వెఱచు 5. లు 6 కెదనాటు
7. రు * వసుల పాఁపర వీరెందు మెసలనీయ; వసుల పాతరలై వీరు నుసలనీయ
8. కేమి నుసల 9. రెట్టులిఁక 10. దిమ్మరి 11. నిఘదిని 12. ఁడా 13. కెట్టు

*క. రాపాపు లేల సేసెదు
రారా ననుఁ జలువ కలువరా రా మేడక్
రా రా యని తలిరాకుజి
రా రాయని కేళి నేలరా రాకొమరా. 129

మ. పరిరంభం బొనరింపరా కరుణ నాపై నింపరా యాలకిం
పర యేరా యధరామృతం బొసఁగి నన్ మన్నింపరా యంచు
దై, న్యరసం బుట్టిపడ న్నెలంత వలవంతం గొల్కులం
జిల్కపాం, డర గండ చ్యుత బాష్పధార కొనగోటన్
మీటుచున్ బల్కఁగన్. 130

చ. విని విన నొల్ల కావలికి వేఱె పరాకుగఁ జూచి జూడఁ డే
మన నెటు వచ్చునో యని భయంబున నోరు మెదల్పఁ డె
వ్విధం, బున నిది యూడ వేసికొని పోదు నటంచు నుపా
య మెంచు న, మ్మనుజవరాగ్రగణ్య సుకుమారుఁడు లోభి
యుఁ బోలె నయ్యెడన్. 131

క. ఇట్టట్టు చూచి యీ చెలిఁ
బట్టిన వలరాచ గబ్బి బలుబూతంబున్
నెట్టుకొని వీడఁ జేయఁగ
గట్టిగ మాటలవశంబు గా దని వేగన్. 132

*అ. పా:—రసికుఁడవు గావు ఏమిరా రాకుమార, ఎంతరారాపు సేసెద వింత పనికి; ఆసపడి వచ్చినటువంటి యాఁటదాని, తలఁపెఱుఁగవు సౌజాణ తన ము జంత?

1. కలికి 2. బుప్పతిల 3. గు...ల్కపాం 4. ల్కనన్ 5. నూ

గీ. అప్పుడు గురుభామ చిత్రాంగి యలమి బలిమి
నొడిసి పట్టినఁ బైకోక విడిచి చనియెఁ
దా నవీనకళానిధి యై నెగడిన
యట్టి సారంగధరుఁ డయ్యె నబ్బురంబు. 133

గీ. పాము సేసినగతి వట్టిచల్లడంబు
తో వెడలె స్త్రీకి లోఁగాక దేవుఁ డనఁగ
†నీరు పైకొని వచ్చిన నేరి కైన
కోక యనుబుద్ధి గల్గునే లోకమునను. 134

క. [1]లేఁగ పులిచేతఁ జడఁబడి
యేఁగెడుగతి నట్టు లేఁగ నెంతయుఁ గినుకన్
లోఁ [2]గామిని తన కాతఁడు
లోఁగామిని వంతఁ జింతిలుచు నిట్టనియెన్. 135

క. ఎటువంటి సుగుణి నయ్యో
యిటువంటిదె రసికముగ్ర యేఁగెదు పై దు
ప్పటి విడిచి నేర్పు చెలి [3]నేఁ
చుటె మఱి నీయంగ మెల్లఁ జూపితివి గదా. *136

† ఇంతి...వెడ..; నెలఁత యిటుతన్నుఁబట్టిన నేరికైన కోకయను బుద్ధి గలుగు నేలోకమునను; నెలఁతయటుతన్నుఁబైకొన నేరికైన, లోగమను బుద్ధి పుట్టునే. 1. లేఁగ...చాత..., ...లేఁగె నెంతయు మఱియా 2. గామియుఁ; గామినవడ 3. మించుటె; నేఁచుటకే.

* 136 తర్వాత నధికపాఠము:—ఓరిచుది నిల్పఁజాలక, కోరిక నినుఁ బట్ట నోరికోలఁదులు కర్ణ, క్రూరములు పదరి నన్నుఁగన్, జేరికి గొనకేగెదేల సిగ్గఱితో(వో)రా. దీనికిపాఠాంతరము:—ఓరి...నోపక,...నోర...మిగులన్; క్రూరముగ...,...చెడిపోయెదురా.

క. ఆరోపింతును నాపై
నేరము విపరీతముగను నీపై రారా
యూర[1]కె యుఁకైన రాజకు
మారక నామాట వినుట మంచిది సుమ్మా. 137

శా. ఔనా పోయెదవా ననుం [2]గడఁచి యేలా యింక నీతోడ
నెం, తే నేమించఁగ నాఁడఁ జిక్కె నిదిగో నీయంగమచ్చం
బు నా, చే నీలోనని రాజు రావలెఁ గదా చెక్కింతు నీ
కీలుకీల్, గానీ యిందుల కేమి తాళు మని కేలన్ రొ
మ్ము తాటిం[3]చుచున్. 138

క. సారెఁ బగ చాటి పలుకం
గా [4]రిచ్చల విఱిగి పోవఁ గా ల్గాడక యా
భూరమణసుతుఁడు సద్గుణ
[5]హారుం డట నిలిచి యిట్టు లనుఁ బటుబుద్ధిన్. 139

క. తల్లీ నాపై నీకుం
జెల్లునె కోపంబు మదన శిత శర పాళీ
[6]హల్లక నిహతి వ్యథ చేఁ
దల్లడపడి వట్టిదూఱు తగవా పూ[7]నన్. 140

మ. ఇపు డీ వాడుభయంకరోక్తులకుఁ గానే లోఁగి దుర్వృత్తి న
ల్పపుసౌఖ్యం బగునీమనోరథము దేర్పం బూనినన్ లోకమం
దపకీర్తిం బడి మీఁదఁ ద్రె[8]ళ్లి యమబా[9]ధానీకమున్ జెంది

..క యింకను 2. కలఁచి...నెం, తేనెంచగ ..నా, చేనేడిప్పుడు;
...నా, చేనీదిప్పుడు;...సెం, తేనే 3. పు 4. రివ్వు; రవ్వ 5. ధా రుం...
డటు 6. హల్లీసకనిహతవ్యథ 7. ఁజన్ 8. వ్వి 9. ధన్ నిక్రమం.

హీ, నపుంజాతిం దుదిఁ బుట్టఁగా వలయుఁ గాంతా పెక్కువే
లేం డ్లిలన్. 141

గీ. అ [2]ట్లగుటకంటె నీక విననమ్మ యొకటి
జగతిలోఁ గీర్తి వెల[3]యఁగాఁ దెగువ మీఱి
నీకు రాజున కింపు [4]సంధిల్లఁజేత
కియ్యకొని యుండ [5]నటమీఁద నీశ్వరాజ్ఞ. 142

ఉ. కావక రాజు చిత్తము వకానక లై తెగఁ జూచునట్టు లా
హా విపరీత మైనపలు కాడెద నంటివి ముక్త 'వినాశకా
లే విపరీతబుద్ధి' యని లెస్స బయల్పడఁ జెప్పినారె కా
నీవిధి యాడఁమీ యనఁగ నీవిధి నాడెదు సుమ్ము భామినీ.

క. నీ కపటోక్తులె పట్టి మ
హీకాంతుం డలిగెనేని యీధారుణి య
య్యాకాశవాణి యొఱుఁగ[6]రె
నీ కాకొల తోడుతోడనే సిద్ధించున్. 144

గీ. అని పలికి పోయి వచ్చెద ననుచుఁ జక్కఁ
దననగరి [7]కేఁగి యువరాజు తగినరీతి
దొరల భృత్యుల సఖుల [8]నందోఱను బనిచి
తుంబురుకు డెందమునఁ జాల సందడింప. 145

సీ. పట్టు పాఱు మటంచుఁ బారావతంబును
[9]వెకలినై నే నేల విడువఁ బోతి
విడువమా యన్నాళ్లు విడిచిన [10]నది పోయి
యేటికిఁ జిత్రాంగియింట వ్రాలె

1. యోనిం 2. ట్లులగుకన్న 3. యంగ 4. సంధిల్లుచేత 5. నటు
6. డ 7. కేగుచును 8. నెల్లరను; నెల్లరుల; నందఱ 9. వెఱ్ఱి 10. నేఁడది.

వ్రాలిన నది యట్టె వఱదఁ [1]బోనిమ్మని
యూర[2]క యేమిటి కుండ నైతిఁ
జనవుమై నుండక పినతల్లి యని పోవఁ
జెడుగుణం బామెకుఁ బొడమ నేల

గీ. పొడమెఁ బో యిది బుద్ధి గా దుడుగు మనిన
మాన కిటువలెఁ జెల్లునే మచ్చరింపఁ
గాఁణం [3]బన్నిటికి నల్లపారువమె క
దా య దెక్కడఁ దాఁపుర మాయె [4]నాకు. 146

క. [5]మాయ నెటు లైన మీఁదట
నాయమ బాధలను [6]బడుట యది నిశ్చయ మే
మాయ [7]నెటు లైన మీఁదట
నాయమ బాధలను [8]బడుట యది తప్పెఁ గదా. 147

గీ. అని ప్రమోదించు నుసు రను నలతఁ [9]గుందుఁ
గుడిచి కూర్చుండి [10]తన చేసికొనిన నేర
మికి వగచుఁ బాన్పుపై వ్రాలు మిన్ను విఱిగి
పైఁ బడినరీతి నివ్వెఱపాటు నొందు. 148

క. మదపతికిఁ గోక చేపడి
నది [11]మొదలుగఁ [12]గుట్టు పాఱి యడలుఁ గుమారుం
డెదలోనఁ జీర చిక్కిన
యది మొద[13]లుగ బిడ్డకుట్టు లను చేర్పడఁగన్. 149

---

1. బొమ్మని నేను 2. కేమిటి కినైయుండ 3. బిన్నిటికి 4. దనకు 5. అయొ 6. బెట్ట నది 7. నటు 8. బెట్టుటది తప్పు 9. నొంచు 10. తాఁ జేసికొన్న 11. యాదిగ 12. గుంటు 13. లుఁగా.

గీ. అంతఁ జిత్రాంగి మదనబాణాగ్ని వేఁగి
హస్తగత మైనసొమ్ము పో నాడుకొన్న
కరణిఁ బరితాప మంది యేసరణి నైనఁ
జెలుతు సారంగధరు నింక సిద్ధ మనుచు. 150

సీ. పాముని యపకీర్తి ప్రాపిం[1]చుఁ దన కన్ను
పోలిక నల్లని మైల గట్టి
తల సూపఁ బాసె నంద[2]ఱిలోనఁ దన కన్న
కైవడి వాసెనకట్టు కట్టి
తనుఁ ద్రోయుదు[3]రగాధ ఘనకూపమున నిట్టు
లను[4]భాతి మూఁలయింటను వసించి
తన దేహ మిటులఁ జిందఱ[5]లో ననెడురీతిఁ
గులుకుగుబ్బలు వాఁడిగోళ్ల [6]వ్రచ్చి

గీ. యెంతపాపాత్ములా లని [7]యిటులనింక
బ్రహ్మ నిజఫాలఫలకాక్షరములు [8]గట్టి
[9]పెట్టునన్నట్లు కస్తూరిపట్టు వెట్టి
[1] సొటసొటలు వోవు విన్న నై సొంపు దఱిఁగి. 151

క. రక్తి గల చెలులయెడ నా
సక్తియు సూక్తియును లేక జాలి విదాళిన్
ముక్తాహార మనోహర
ముక్తాహార యయి క్రోధమున సౌధమునన్. 152

---

1. చె 2. ఱి 3. రుగదా; రుగాధ 4. లీల 5. కొనునను 6. నుచ్చి 7. యింకమీఁద 8. వ్రాసి 9. పెట్టు ననునట్లు; పెట్టునట్లులఁ 10. సొట సొటలఁబోఁ
ఒ; సొటలు వోవుచు.

గీ. జంత యిటు లల్గి యుండ రా జంత నచట
సరసిచెంత బిసాగ్రంబు సరసి కొంత
మగని కందిచ్చుకోకిప్రేమ గని తనదు
[1]దుండిమొడఁ దగు లెంచి యం దుండి యప్పుడు. 153

ఉ. కేలుఁ జో కాటప్పుం [2]దలిరు కేశమదాళులు కౌనుదీఁగె లే
నూలును జన్ను మొగ్గలు గనుం దెలిదమ్ములు మోవి తేనెయుం
జా [3]లగునవ్వుఁదేటయు భుజాబిసము ల్లని యవ్విలాసపాం
చాలుఁడు ప్రేమఁ బద్మిని నిజప్రియఁ గా మదిలోఁ దలం
[4]చుచున్. 154

చ. [5]దళ మగుతమ్మిపూఁగోలనితావిసెకల్ [6]గవియంగ ముంగలన్
జిలుకలు గోయిలల్ చెఘలు చిందఱవంగఱ [7]సేయ సూరెలన్
మలయసమీరముల్ వెనుకమర్లున నుల్కిపడం బయింబడన్
గళవళ మంది చుట్టుకొనెఁ గంతునిమందియటంచు నాత్మలో.

ఉ. అక్కట యేమి సేయుదు రయంబున నిప్పుడె పోదు నంటి
నా, మిక్కిలి దూరదేశము సమీపమె మాళవభూమిమం
డలం, బెక్కడ దండకావన మి దెక్కడఁ జక్కనిముద్దు
గుమ్మ నా, చక్కెరబొమ్మఁ జూడ కిట సైఁపఁగఁ జాల
వియోగవేదనన్. 156

వ. అని యత్యంతసంతాపంబున నాందోళించుచు. 157

క. రాజిత విభ్రమ [8]లవ కల
నా జిత సుర మానవాంగనన్ జిత్రాంగిన్

---

1. దుండిమెడ తగు లెంచె నందుండి 2. దళుకు 3. లును 4. పుచున్ 5. దళముగ 6. గది 7. యుంసూరటన్ 8. వలనన్; నవకళ.

లేజవ్వని మవిలోనిడి
రా జవ్వనిలోపలన్ విరాళిం [1]గ్రాఁగెన్. 158

గీ. అట పరావనిభృన్మౌళిఘటితపాదుఁ
డైన చక్రేశ్వరుండు సహస్రకరుఁడు
[2]రామవిశిఖాగ్ని తేజఃస్ఫురణ హరింప
వ్రాలె నన వ్రాలెఁ జరమాంబురాశిలోన. 159

మ. తమి మందేహులతోడఁ బోరి యినుఁ డంతన్ వీఁగి తన్
జేర న, స్తమహీభృన్మణి వెన్క వేసికొని మిత్త్రప్రేమ
రక్తప్రవాహముగాఁ బోరె ననంగఁ జిక్కి యలదైత్యశ్రేణి
కాన్పింపకుం, డ మొగు ల్మాయలు వన్నె నాఁ దనరెఁ
[3]సంధ్యారాగముల్ ధ్వాంతముల్. 160

ఉ. ద్రోహమె నీతిగాఁ దలఁచి దుర్మదుఁడై కనుఁ గాన కా
త్మప, త్నీహరణం బొనర్చె నని దేవగురుండు శపింపఁగాఁ
జుమీ, యాహరిణాంకుఁ డిట్లు తుము రాయె నటంచన
జారచోరు లు, త్సాహము మీఱఁగా [4]నపుడు తారకముల్
నెరసెన్ నభంబునన్. 161

గీ. నల్ల[5]మూఁకలపై దండు వెళ్లఁ దలఁచి
రాజు వే[6]యించు వెలిగుడారం బనంగఁ
దోఁచెఁ [7]బాండిమ ప్రాచిఁ దోడ్తోన [8]యపుడు
కువలయదళమ్ము [9]లందెల్లఁ గూచి యున్యై. 162

---

1. గ్రుంగెన్ 2. జామదగ్ని శరాగ్ని తేజము హరింప;...వహింప
3. జూడన్ సంజకెంజీకటుల్; జూడన్ సంజక్రొంజీఁకటుల్ 4. బలుక
5. ప్రజపై సరగ 6. సిన 7. ధవళి 8. యందు 9. లప్పుడు.

క. కలువలు కిలకిల నవ్వె౯
దొలిమల సెలయేటి యవలి తుహినాంశుకరం
బులు గని యప్పు డేటావలి
గిలిగింత లటంట వానికి౯ సరి దాఁకెన్. 163

సీ. కరము లొయ్యనఁ జాఁచి యిరుల[1]నెఱుల్ చక్కఁ
గాఁ దిర్చి తెల్వి సంఘటిలఁ గూర్చి
కడు నయనచకోరికల ఋద్ధు గావించి
చనుజక్కవల గొల్ల నెనయ నాని
కళలు రంజిల్లంగఁ దొలునాఁడు తనుఁగూడి
[2]యిటుఁ బ్రొద్దు గ్రుంకునప్పటికి రేపు
వడి వచ్చి [3]నిలుతు నీ కడల నేఁటికిఁ జాలు
నని యేఁగుటను జేసి యవ్విధమునఁ

గీ. దామరల [4]నిక్కువమ్ముగఁ దనకు ముదము
లతిశయిల్లంగ వే వచ్చి యప్పు[5]డె నిల్చె
దమివిటుఁడు తూర్పుదిక్కు లేఁగొ[6]మరువయసు
బిత్తరిముఖంబునను బొట్టు వెట్టి[7]నట్టు. 164

గీ. రిక్క లె[8]నయంగ నుదయభూభృత్తటమునఁ
దెలివిఁ బొద[9]లు మృగాంకమండలముఁ జూచి
వేగ విల్లెత్తి పచ్చనివింటిబోయ
యట విరహి[10]జాలములను వేఁటాడఁ దలఁచె. 165

1. న్నెఱులు; నరుల్ 2. యట పోయిప్రొద్దు గ్రుంకుటకు 3. నిల్తు
4. (లు) స్రుక్క కుముదసంతతిచయమ్ము 5. డు 6. మిరె 7. నటుల
8. గ 9. లు 10. జాలములవేఁటలాడ.

వ. అప్పు డల్ల హల్లక[1]హీంతాభిజన జన వల్లభ తల్లజుం డా
యల్ల కౌనల దందహ్యమాన మానసుం డగుచు [2] నిబిడ
రస కుసుమ కిసలయ విసర శీతల చూతలతికా నికాయ
కాయమానంబున నిశాకాంత కాంతమణి వేదికా నితాంత
[3]కాంత లతాంత శయ్యాంతరంబున మేను సేర్చి పరిచార
కుల నందఱం బనిచి యేకాంతంబున నొక్కరుండ
చిత్రాంగీ లతాంగీ దిదృక్షాసదృక్షాతి[4]జాగరూకరూక్షా
క్షుం డై యుపరిప్రదేశ ప్రసూన వితాన నిర్గళ దనర్గళ
మరందోద[5]కబిందు ధూళి పాలికలు చందన చర్చలుగా
మరు ద్దోధూయమాన ప్రాంత శారద భూరుహ దళ వ్రజం
బులు [7]వ్యజనంబులుగాఁ దన్నివాసం బయత్న శిశిరకృత్యం
బులు [8]ఘటియించుచుండ నిమ్మ కెరువు వేసినచందంబున
నందు [9]నంతకంతకుం బరితాపం బగ్గలం బై [10]యావల నీ
వలం బొరలం దొడంగె. 166

క. మధుమాసం [11]బఁట శుకపిక
మధుపాదిమనోజబలసమన్విత వన[12]మే
యధి[13]వాసం బఁట యాపై
విధుఁ డుదయించె నఁట విరహి వేఁగుట యరుదే. 167

---

1. హీ తవంశజగజ 2. బిసకిసలయ కుసుమ...శీతల 3. కాంతలతాంత
4. జాగరణ రూక్షా; జాగరూకాక్షుండై 5. కానర్గళ 6. బింద 7. వ్యజనంబు
లూత్న 8. ఘటియింప 9. నంతంతకుం 10. ఇవ్వలవ్వలం 11. బున
12. మై 13. పతియెంచకనా.

ఉ. వెట్టగ మందమారుతము వీవఁగఁ [1]దోడనె రాలెఁ బైవిరుల్
మిట్టిపడంగ వీఁడె దవిలెం బథికుం డడకొత్తులోనిపోఁ
కట్టుల నంచు గాలి గలయప్పుడె తూరుపు [2]పాఱఁ బట్టుమ
న్నట్టిప్రకార మేర్పడ ననంగుఁడు నించినతూపు[3]లో యనన్.

చ. వెనుకొని యంతలో మరుఁడు వెండ్రుకపట్టైడుతూపులేర్చి బో
రుననలయించువిల్లుగొని త్రొక్కనిచోటులు ద్రొక్క*తేజిపైఁ
బనుపడ నెక్కి నీళ్లపయిఁ బాతెఱఁలీలఁ జెలంగు మంచి తి
య్యనిపద నైన[4]వాల్పుఱపి యట్టిటు చేసె నృపాలు డెందమున్.

వ. అత్తఱిఁ దత్తఱిల్లి చిట్టాడిన గుట్టున నెట్టనం దెట్టగిలంబడి [5]చుట్టు ముట్టినట్టిమరు కరాళి తేజీల శిశిరకరాళి [6]మలయానిల రమాసూనుల నుద్దేశించి వసుధేశుండు సుప్రలాప విప్రలాపంబుల నిట్లనియె. 170

సీ. ఓచందమామ నిన్ జూచినయప్పుడె మా
చిత్రాంగి [7]మొకమింత చేసికొనును
రాచిల్కలార మీరాశ గన్నప్పుడె మా
మదిరాక్షి [8]నోరార మాటలాడు
నెలదేఁటులార మి మ్మీ[9]క్షించినపుడె మా
గజయాన తలఁ గ్రుచ్చి కౌఁగిలించుఁ
దమిఁ జకోరములార మిముఁ గాంచినపుడె మా
కలకంఠి కన్నులఁ గప్పుకొనును

---

1. దోడనప్రాలె 2. వాఱఁ బట్టుకొన్నట్టి 3. లౌనన్ *వాజిపై
4. వాల్మిలిపి; వాసలిపి 5. మట్టును(ము)ట్టినట్టి 6. చకోరకాని(ల)కర
7. మొగ 8. నోరూర 9. క్షించు.

గీ. దయ గలిగి కూర్పుచుట్టంబు లయితిరేని
[1]యటకు మీ రేఁగి [2]నా విరహార్తి వేగ
దెలిపి మాపద్మగంధిఁ [3]దోడ్తెచ్చి నన్నుఁ
గూర్పఁగదరయ్య మిము వేఁడుకొనెదఁగాక. 171

గీ. తనదుపైఁ రైనయిరులు చిందఱలుసేయు
దనుచు నినుఁ బట్టఁ జూచుఁగా యాతమంబు
రాజ నీవేరివాఁడ గోత్రపతి వీవు
వల దనక మారుతోఁ గూడి కలఁచ నేల. 172

మ.* నను నీగోత్రజు [4]నేచనేల యనుటల్ న్యాయంబుగా దబ్జచ
య్యనఁ దోఁబుట్టువు లైనయబ్జముల నీ వయ్యో వ్యపగల్
మీఱఁది, మైనయం జేయుదు వౌనవుర్ గువలయాపేక్షల్,
మదింగల్గు రాజునకుం దమ్ములమీఁదఁ గాంక్షలవి యెచ్చోఁ
బుట్టఁగా నేర్చునే. 173

గీ. పాము తనర గా మనియెడు పలుకు నిజము
గా మెలంగినరాహువు గఱచి నిన్ను
నేమి సేయక పోయె న దేమి యకట
యోషధీశుండ నీ వోటనో మృగాంక. 174

---

1. యకట 2. తావిర; యీవిర 3. తో తెచ్చి యిపుడు
4. నేఁచు నేటి కనుటల్ నాయంబుగా దబ్జ;
* పాఠాంతరము : నను నీగోత్రజు నింత యేఁచుటకుఁ గా న్యాయంబె నీకబ్జచ
య్యనఁ దోఁబుట్టువు లైన యబ్జముల నీవయ్యో వగల్మీఱఁ గా
ననయంబుల్ గతిగందఁ జేయుదువు నీ కట్టాగె యెట్లేని రా
జునకుం దమ్ములమీఁదఁ బ్రేమగలదా సొంపారఁగా నెందులన్.

చ. సకలము కాలకూటసహ[2]జన్మి సుధాకరుఁ డంద్రు నిక్క మా
నోకో యిది యంచు నో[1]సితమయూఖ నినుం దెలియంగఁ
గోరి యూ, రక యటు చేరినంతఁ దలప్రాణము దోఁకను
వచ్చె లెక్క సే, యక దిగ గ్రింగె నేని యకటా యలరా
హువు [3]మన్కి గాంచునే. 175

సీ. మలయపవమానబాలకుల్ మందులు గద
యమృతకరుఁడవు గద నీవు కమలవైరి
యకట యిటు లయ్యుఁ బెంపు సేయంగఁ దగునె
యంగజవ్యాధులను మాన్పకం గరంబు. 176

చ. పలుమఱు పచ్చరాచలువబండల వ్రాలుచుఁ బారిజాత[4]వం
జులలవలీనికుంజముల సోలుచు విన్నదిఁ దేలుచున్ సురల్
నెలకొని కంటికిన్ నిదుర లేక [5]చరించుచు నుండు టెల్ల నీ
కళలు భుజింపఁగా నయిన కాఁకకుఁ గాక సుమీ సుధాకరా.

చ. గరళపుముద్ద దిన్న కఱకంఠుఁడు నీకళ దాల్పఁగా నిశా
కర జడగట్టి మీఁద హిమగాంగజలంబుల [6]నించి యందు మే
[7]నొరయఁగ నుండఁ జేసె నటు లుండియుఁ దా సగ మయ్యె
హా సుధా, కరుఁడవె యైన నిన్ వెడలఁ గ్రాయఁగ నేమిటి
కల్ల రాహువున్. 178

క. వ్రతమా యిటు లేచ మధు
వ్రతమా నీ కుచితమా విరాళిం బడునా
రుత మాలింప వయో చా
రుతమా మోదయుతమా చిఱుతమారుతమా. 179

1. సకలుఁడు 2. జన్మ 3. మన్ని 4. మం, జులలవలీ 5. చలింపుచు 6. నందు నించి 7. నొరయకనుండ.

పంచచామరము.

జోహరు మీఁకుఁ జల్లగాఁగఁ జూడుఁ డోసమీరకం
జహారులార మంటమారి శంబరారిఁ గూడి నన్
గోహరు సేయ నేల సారెకున్ జలంబునం భుజం
గహారుపాద మాన మీరు కాఁక లింకఁ [1]రేఁచినన్. 180

ఉ. [2]ఆవిమలాత్ముఁడున్ మధునిశాటమహా[3]బలభేది యైనలో
కావనుపట్టి వై మధునిశాట మహాబలులందుఁ గూడి లో
కావళి [4]నేఁచ నేల విరహార్తులమీఁదనె [5]నీదుశౌర్యముల్
భావజ యీహాళాహళి[6]హాలాహలిముందఱఁజూప వైతిగా.

సీ. కరమండలా[7]గ్రైకకలన భాస్వద్విజా
వలిః బాఱఁ దోలినతులువ వీవు
నెమ్మి నెక్కుడు గాఁగ నమ్మి యుండెడు మేటి
గురుని కె గ్గొనరించుకుమతి వీవు
మిత్రుండు వడినంత మెఱసి ధామంబు ముం
దుగ నాక్రమించిన ద్రోహి వీవు
తమ్ముల మిగులఁ [8]బాదమ్ములఁ గారించి
యల [9]మింటఁ గనిపించుఖలుఁడ వీవు

---

1. ఁజేపినన్; నేఁచినన్ 2. ఆవిమలాత్ముఁడా 3. పాఠభేదములు:
...,బలభేదియైన లో, కావళినేఁచ వేల విరహార్తునిమీఁదనె నీదు శౌర్యముల్,
భావజ యీ హాలాహళి గపాలికి ముందఱ జూనలేవుగా,
గావున నీమహాత్వ మదిగానగ వచ్చెగదయ్య మాకిటన్.
4. నేఁప నీవు 5. చూపు శౌర్యమున్ 6. యు భర్గుని ముందఱఁ
జూపలేవుగా 7. నేకకలన. 8. వాదమ్ము 9. బంటు.

గీ. కటకట వియోగిలోకంబు కటకటపడ
ననలశరముల నేచకు మనిన నీవు
మానుదువె నీగుణంబు [1]లా నౌను మేన
మానుపోలిక యిది గద [2]మానుమార. 182

ఉ. విం ఖరవృత్తిఁ జూపఁ [3]దగవే విరహార్తులపై [4]మరందవ
త్సృంఖళ శేఖుచాపములు పూ నిటు లేటికి సాము సేసె ద
ల్కాంఖిల మా శరీర మని కాన కనంగ యయో 'శరీర
మా, ద్యం ఖలు ధర్మసాధన' మ టన్నది విన్నది [5]లేదొ
యెన్నఁడుఁ. 183

చ. చిడిముడిపాటునన్ జెఱకుసింగిణిఁ బూని మధుప్రియత్వ
మే, ర్పడ వడిలావు లున్నహరిపైని జివుక్కున నెక్కి యు
క్కునన్, [6]వెడలెడు [7]చంద్రుఁ జూచి తమి నేఁ డిదె గోవధ
మాచరించు పూఁ, పడరఁగ నీవు పచ్చితుర కౌదువు పాం
థులకున్ మనోభవా. 184

వ. అని యనేకప్రకారంబుల నవ్విశ్వంభరాజంభారి యుపాలం
భం బొనరించి మందరగిరియునుం బోలె వనరాశిమధ్యం
బున మరు న్నిశాచర కర భ్రమితుం డై లోభియునుం
బోలె నతనుదుష్టమార్గణగణక్షుభితుం డై పద్మాకరంబు నుం
బోలె మధుపరాజితసుమనఃపాళి యై విరాళిం దూలి
యున్న సమయంబున. 185

1. తా నౌను 2. రాసుమార 3. దగునేవిరహార్తురపై 4. ధురం. ధరత్సృంఖ 5. లేజ 6. వెడలెదు 7. సందు చూచి 8. మణియుంబోలె.

చ. ఇనుఁ డుదయాద్రి [1]నండగొని యిప్పుడె సంజను [2]ముట్ట
డింపఁగన్, బనిచి [3]రయంబుతోడనసమాన జవాశ్వము
లేర్చి దాడి దా, నొనరిచె [4]నోటమిం బయట [5]నుండక పా
ష్మని వేగుఁ దెల్ప వ, చ్చినగతి వేగుఁజుక్క పొడిచెన్ జనె
[6]రాజును బశ్చిమాద్రికిన్. 186

మ. ఇనుఁ డన్రాముఁడు ప్రేమ సారసవనం బీడేర్పఁగాఁ [7]జొచ్చి
మిం, చినసంధ్యారుచి రక్తధారలు ప్రవర్షింపంగ వింటం
గరం, బను వంద న్నిగిడించుచో సమయవాయవ్యాస్త్ర
ముద్వృత్తి [8]వె, నొక్కన మారీచనిశాచరుం డన మృగాం
కుం డంబురాశిం బడెన్. 187

గీ. ద్విజకులమ్ముల[9]కూఁతలు దెసల నెగసె
నింకె సద్గుణతేజముల్ పంకజాత
మఱు విజృంభించెఁ గువలయం బట్టిటు వడె
[10]నట్టు లగుఁ గా యరాజకం బైనయెడల. 188

చ. *కొలఁదిగఁ జక్రకైరవ చకోర సరోజదళంబులన్ జలం
బలవడఁ గూర్ప విప్పఁ గలయట్టియినుం డలచందమామ క

1. యండ 2. ...గన్ ముచ్చిలంబడన్ 3. రయంబ తావెనుకఁ బ్రాఙ్ముఖ పార్శ్వ లేర్చి; రయంబతోను (వు) నసమప్రజవాశ్వము లేర్చి 4. నొంటిపై 5. నొందక పా, దని 6. సోముఁడు 7. బొంచి కా; చొచ్చికా 8. నె, కొక్కన 9. కీర్తనల్ 10. నట్లయగు.

* మొదటి రెండవ పాదములకు నిట్లు పాఠాంతరములు కొన్ని ప్రతులఁ

ర్శిలిఁ గర మిచ్చి పుచ్చుకొనుమిత్త్రుఁడు [1]చీఁకటికాన నీఱుగా
నలఁచువిభావసుండు గననయ్యెఁ బతంగుఁడు [2]ప్రాఙ్ముఖంబునన్.

వ. అయ్యెడం [3]గాలోచితకృత్యంబుల నిర్వర్తించి సమస్తచమూ
సమూహ సమేతుం డై [4]నరపాలపురుహూతుండు గదలి
నిజరాజధానిఁ జేరం జనుదెంచి నగరు ప్రవేశించుసమ
యంబున. 190

సీ. శృంగారము [5]లెసంగు బంగారపుమెఱుంగుఁ
బోండ్లు కురుఁజులపై గొండ్లి సలుపఁ
బణ్యాంగణములందుఁ బుణ్యాంగనల్ గ్రందు
[6]గా సారె ముత్యాలసేస చల్లఁ
జెలరేఁగి మణిసౌధముల మూఁగి యవరోధ
కామినుల్ సోరణగండ్లఁ జూడ
వాద్యఘోషణముల హృద్యభాషణముల
వందిమాగధులు [7]చెల్వొంది పొగడ

గీ. గడలవోఁజులరోద లిరుగడలఁ జెలఁగ
దొరల నందఱ మన్ననల్ దొరల ననిచి

(i) అలఘువిభుఁ డ్రథాంగకుముదాళిచకోరక వారిరుద్దళం
బులవెసఁగూర్ప విప్పఁగల ప్రోడయినుండలచందమూమ క, ర్శిలి.

(ii)...కముదాళిచకోర కి శోరనిరు
ద్దళములఁగూర్ప విప్పఁగలదాఁక చెలంగు నినుండు రాజుక, ర్శిలి
(ఈ పాఠమున మొదటిపాదమున గణభంగము.)

1. చీఁకటుతెల్లనీరుగా 2. ప్రాఙ్నగంబునన్ 3. కాల్యకృత్యంబులఁ దీర్చి; కాలోచిత... 4. నృపాలపుంగవుండు 5. లెసంగ 6. చెలఁగంగ 7. కైవారమొర(ల)య.

వడి నిగుడఁ దేజిఁ [1]గొల్వుచావడిని డిగ్గి
యరిగె నత్తటి మహిభర్త యరిగెలెత్త. 191

గీ. అతుల నంతఃపురంబున కరిగి విభుఁడు
కొలువుసింగార[2]ము సడల్చి కొందఱు నుడి
గంపుఁగుంభస్తనుల జలకంబుఁ బట్టుఁ
డనుచు నానతియీ [3]నంత నతిరయమున. 192

సీ. రమణి నిల్పె మనోహరమణిపీఠి యొకర్తు
తల యంటె నీలకుంతల యొకర్తు
అటకలి [4]యిడె లెస్స యట కలికి యొకర్తు
[5]జలజగంధి యొకర్తు జలక మార్చెఁ
దడి యొత్తె నొక్కపుత్తడిబొమ్మ నృపతికిఁ
[6]జెలు వొచలువ లిచ్చెఁ జెలువ యొకతె
సికఁ జుట్టె విరు లొక్కసిక[7]తామయనితంబ
వెలఁదికస్తురి నొక్కవెలఁది యలఁదె

గీ. ధూప మొనరించె నొక్కవిధూపమాస్య
తిలక మొనఁగూర్చె భామినీతిలక మొకతె
[8]మించుఁదొడవులు దొడిగెను మించుఁబోణి
భోజనము వెట్టె నొక్కయంభోజనయన. 193

1. గొలువుసావడి 2. మెడలించి 3. (దడనతి; (దడవతి; వారలతి 4. వెట్టివేయట 5. జలకమారిచె నొక్కజలజగంధి 6. చెలువైన చలు వొక చెలువయొసఁగె; చలువ మెసంగెను జెలువయొకతె 7. తోచ్చయనితంబ 8. మించుఁదొడవు దొడిగె నొకమించుఁబోణి; మించుఁదొడవులు దొడిగొక మించుఁబోణి.

క. ఈరీతి [1]శిరసు మజ్జన
[2]మారోగిణ మయి మణీమయపుఁ బాదుక లో
య్యారముగ మెట్టి యుడిగపు
నీరజముఖి కేలు వట్టి నృపుఁ డిం పెసఁగన్. 194

క. సొగలగు వెండితెరల
లాగునఁ దెలనాకు మడిచి లలన యొసంగన్
బాగాలు వేసికొని తన
బాగా లున్నట్టి మేడపజ్జకు [3]నేఁగెన్. 195

గీ. ఏఁగుచోఁ దొంటిచందాన నించుకైన
మెలఁగుచెలికత్తియలయలబలము లేక
ప్రాణవల్లభ[4]పొలకువ [5]గాన రాక
విన్ననై యున్న యాసౌధవీథిఁ జూచి. 196

క. వాలిక మెఱుంగుఁజూపు ని
వాళిగ నొనరించి యెప్పుడు వడిఁ జేయును దా
నాలింగన మేమో యిపు
డాలింగన మనుచు నృపతి వ్యాకులమతి యై. 197

క. అరుదెంచి యలిగి యుండెడి
యరుదెంచి[6] మదిన్ వితాకుఁడై తహతహతోఁ
దరియంగ నరిగి శాతో
దరి[7]యంగం బపుడు గాంచి [8]దయ దయివాఱన్. 198

1. శిరము 2. మైరహిభోజక మొనర్చి మణిపాదుకలొ 3. ఁజనియెన్; నరిగెన్ 4. యలుకుడు 5. నాన 6. మనంబు తాల్మి యరుదెంచి వడిన్ 7. యంగము వాడు 8. దరియంగలఁకన్; దైవారంగన్.

గీ. హంసతూలికాతల్ప మంతల్పమే ల
తాంగి కడఁ ద్రోచి నేలఁ బడంగ నేల
వెలగఱవుసేయు [1]కౌశేయములు గలుగఁగ
నూన మగుమైల నష్మైన నూన నేల. 199

ఉ. కప్పూరపుఁ విడెంబు కుతుకంబునఁ జేయ వ [2]దేల వాసనల్
చిప్పిలుకుంకుమంబు మయి లేప మొనర్ప వ దేమి చీఁకటుల్
గప్పెడుకీలుకొ ప్పౌఱపుగా సవరింప వ [3]దేటి కిప్పుడో
యొప్పులకుప్ప నీ వలిగియుండెడికారణ [4]మేమి తెల్పవే. 200

సీ. ఇం పైననీపాట కెన గా దటంచునో
యెలనాగ వీణ వాయిం[5]ప వేల
నీరీతి [6]మాటలు నేర దటంచునో
కలకంఠి చిలుకతోఁ బలుక వేల
తళుకొత్తు నీదుచెక్కులఁ బోల వంచునో
శుకవాణి [7]యద్దముల్ చూడ వేల
యొకయునిపాలిండ్ల కుద్ది [8]రా వంచునో
యలివేణి పూబంతు లంట వేల

గీ. కడు నొయారంబు లైననీనడలకరణి
నడువ[9]క నెఱుంగ వంచునో నంటుతోడ
నంచబోదల నడిపించి పెంచ వేల
మోద ముప్పొంగి చిత్రాంగి మోహనాంగి. 201

1. వెలచేలములును దలుగ...నూననేమి. 2. దేమి 3. దేమియిప్పుడో
4. మెద్ది; మెత్తి 5. చ 6. మాటాడ 7. యద్దంబు 8. గాదంచునో
9. నేరవటంచునో; గా నేరవంచునో.

ఆ. పోతుటీఁగ [1]కైనఁ బొలయంగ రాదు నా
యానఁ జేసి మందయాన నిన్ను
నెవ్వ రెగ్గు సేసి రెఱిఁగింపవే మది
నలుక వలదు నీకు నలుక వలదు. 202

సీ. తరుణి మహాప్రసాదం బని నీమాట
మంతురల్ శిరసావహింతు రెపుడు
రమణి నాబాంధవరాజహంసా[3]ళి నీ
యడుగుల [4]కేవేళ మడుఁగు లొత్తు
నండజవరయాన యవని నీపేరు సె
ప్పినఁ బాఱుపా మైనఁ బెగడి నిలుచుఁ
గమలపాణి యొకింత గదిసి ని న్నొకనాఁడు
[5]నట నిక్కి చూడ బ్రహ్మాయును వెఱచు
గీ. నింత చన విచ్చి యరమర [6]యింత లేక
నిన్ను నత్యాదరమున మన్నింప లేదె
[7]మగువ నే నన కున్న నీమన సెఱుఁగదె
నీకు నేమిటఁ గొదవయ్యె [8]నేఁడు సెపుమ. 203

క. వలపు మదిఁ దెలియ [9]నూరకె
యలిగితొ నినుఁ దక్క [10]వేఱె యతివలపొందుఁ
గల నైన నెఱుఁగ [11]దీనికి
తలిరువిల్తుండె సాక్షి తామరసాక్షీ. 204

1. మేన 2. పుమీ 3. వళి 4. కెప్పుడు...లొత్తు;...లిడుదు 5. నటు 6. లింత 7. నీవన 8. నిపుడు 9. కూరకె 10. దక్కఁ నతివల 11. నిందుకు.

సీ. తరుణి నీనూఁగారు సరి యొందు లే దని
డగ్గఱి పాముఁ బట్టంగవచ్చు
వనిత నీముఖకాంతి కెన యొందు లే దని
కెంటక ద్విజరాజు నంటవచ్చు
నింతి నీకౌనుతో[1] నీ డెందు లే దని
యెదురుగా హరికిఁ జే యెత్తవచ్చు
సుదతి నీకనుదో[1]యిసవ తెందు లే దని
ధాత్రిఁ దమ్ముల [2]వైచి దాఁటవచ్చు
గీ. నతివ నీకనుబొమల క ప్రతి యటంచు
[3]నెట్టిధర్మంబుపై నాన యిడఁగ వచ్చు
నిచ్చకము కాదు సుమ్ము నేఁ డిది నిజమ్ము
భద్రగజయాన నలరాజుపాద మాన. 205

గీ. ఉప్ప నైనట్టి చక్కెర[4]లప్ప లీడె
చేఁదువగ గలయమృతంపుఁజెలమ యెనయె
పుల్ల నుండెడి తేనెకరుళ్లు సరియె
వనిత కడుఁ దియ్య [5]నౌనీదువాతెఱకును. 206

క. [6]అతిసమ్మోహ మొనర్చుట
నతిమధురిమ సారెఁ జిలుక నలరించుట నో
లతకూన నీదుమోవికిఁ
బ్రతి బింబమె [7]కాక లేదు ప్రతిబింబ [8]మిలన్. 207

1. ప్రతి 2. వేసి 3. నిట్టె...పెట్టవచ్చు 4. లప్పలీడొ; లుప్పతిల్లె 5. సున్న 6. మతి 7. కాని 8. మిఁకన్.

సీ. అతివ నీమోవి ముద్దాడఁ గల్గినఁ జాలు
దివ్యామృతంబు సిద్ధించినటుల
[1]తొయ్యలి నీపైఁటఁ దియ్యఁ గల్గినఁ జాలు
దుర్గాధిపత్యంబు దొరకినటుల
ముదిత నీ మొలనూలు ముట్టఁ గల్గినఁ జాలు
భూలోక మంతయు నేలినటుల
యలివేణి నీనీవి యంటఁ గల్గినఁ జాలు
నలమూలధనము నా కబ్బినటుల

గీ. ఇంతమాత్రము సేయవే యిందువదన
తాళఁ జాల మనో[2]జాగ్నిఁ దలిరుఁబోణి
మనవి చేకొను మిఁక నైన మంద[3]యాన
యేల దయఁ జూడవే నన్ను లోలనయన. 208

క. కుటిలాలక నీగుబ్బలు
బటువులయి మొగా[4]ని కెగయు బంగరునిగ్గుల్
పొటమరిలుఁ బుట్టచెండ్లా
నటుగా దే నింత పట్టి యాడుదునఁట వే. 209

గీ. మదవతీమణి రాలతో మాటలాడుఁ
గదవె నీవట్టువమెఱుంగు గబ్బి కులుకు
టెఱుకు సిబ్బెపు గుబ్బపాలిండ్లు దెలియ
[5]నీవు మా టాడ కుండెడి దేమి చెపుమ. 210

1. ఒయ్యారి 2. జాజ్వ 3. గమన 4. న 5. నిపుడు.

శా. ఏమే [1]పల్కవు మోహనాంగి యిటు లేలే యల్క చిత్రాంగి
నిన్నే మంటిం గలకంఠి నావలనఁ దప్పేమే యొయారి
యయ్యో, నామీఁదం దయ లేదఁటే చెలి నను [2]స్మన్నిం
పవే కోమలీ, నీమాటల్ జవదాఁట నుందుఁ గదవే నీరేజ
పత్రేక్షణా. 211

క. ఇంతీ మదనునిపట్టపు
దంతీ యొసపరి మిటారితండములో మే
ల్బంతీ యేమే రతివూ
బంతీ దయఁ జూచి నన్ను బ్రతి[3]కింపఁగదే. 212

వ. అని బహుప్రకారంబులఁ [4]బ్రార్థించి. 213

క. ఏ మనిన వినసియగ్గజ
గామినియలు కార్పఁ దరము గామిని నృపతి
గ్రామణి సాఁగిలి మ్రొక్కను
గాముకులకు నెగ్గు సిగ్గుఁ గలదే యెందున్. 214

క. ఆ నతిఁ గైకొని యాతని
యానతి మీఱనిది వోలె నత్తఱిఁ జిత్తం
బూనినకపటము నెఱపం
బూనినదై యాగయాళి బూమెలు మెఱయన్. 215

క. ఒడలు నసివాళ్లు వాడక
వెడయూర్పు నిగిడ్చి మెల్లనె కరాంబుజ మ
య్యెడ నూఁది లేచి బడిబడి
బుడిబుడియేడుపు లెసంగ భూవరుతోడన్. 216

---

1. పట్టపు 2. స్మన్నించవే 3. కించ 4. చూచి;...బలుకుసన
యంబున.

గీ. నిబ్బరిక [1]మేడియును మేదినీవరేణ్య
నీ వరణ్యమునకు వేఁట పోవఁ బ్రొద్దు
గడప లే కెందుఁ జేతఁ జిల్కఁ గొని దాని
[2]చేతఁ గొంతయుబుసుపోయి చెలఁగునంత. 217

క. సూరెల ముదికొముది సిం
గారము గార మయి పాముకన్వలె మెఱుఁగుల్
వాఱు చెలువారు నొకతెలి
పారువ మిట వ్రాలె [4]వెఱఁగుపడి వడిఁ జూడన్. 218

ఉ. రింగులవల్లెవాటు సవరించి [5]మెయిన్ మృగనాభి నించి వే
భంగులనీటు వెట్టి యలపార్వముఁ బట్టునెవంబు వెట్టి సా
రంగధరుండు [6]నేమము దొఱంగుమదిం జను దేరఁ గొంకు మీ
ఱం గడ కేఁ దొలంగి వడి రాఁగని రాగనిమగ్న చిత్తుఁడై.*

ఉ.*ఎక్కడ నేర్చెనో నలువయీ చెలువన్ సృజియింపఁజూడ*మీ
[7]చక్కని మేను నీమెఱుఁగుజన్గవ యీనగుముద్దుమోము నీ

---

1. మేది విను 2. చేత నేనటు లుఁబుసుగాఁ జెలఁగునంత 3. శృంగార
4. దానిబడి 5. మయిన్; పయిన్ 6. నేమము నః రంజను దేరఁగళంకుగొంకు దే

* ఈ పద్యమువెంట నీ క్రింది పద్యమున్నది.

'కలదు లేదన నసియాడు కౌనుతీరు
తళుకు మొగమున కెగయు గబ్బలబెడంగు
చూచి యాతని నిడువాలుఁ జూడ్కు లపుడు
నిండువేడుక మిన్నంది కొండఁ దాఁకె'.

* ..మా, చక్కని...నా మెఱుఁగు...యానగు...నా, చెక్క...
లావిఱుఁదు...నానును ... నాతళుకు ... నాకలహంస 7. చక్కఁదనంబు
నాకళలసంపద యానొబగైన మేను నా, చెక్క.

చెక్కులకాంతు లీపిఱుందుచెల్వము [1]నీనునుంగౌనుతీరు నీ
చొక్కపుంగొప్పు నీతళుకుంజూపులు నీకలహంసయానముల్.

గీ. అని వయస్యయవిస్మయాయత్తు డగుచుఁ
జిత్తజవికార దుర్వారచిత్తుఁ డగుచు
మరులునను జేరి నన్నుఁ జీరి మత్తుఁ డగుచు
నిట్లనియె మానవయహీన[2]వృత్తుఁ డగుచు. 221

క. వనిత గజనిమ్మపండ్లను
ఘన[3]ముగ నో యూరఁ జెప్పఁగా విందుము నీ
చనుగుబ్బల [4]లావణ్యము
[5]వినినప్పుడె వానిపులుసు విఱుగుం జుమ్మా. 222

క. తలతల మనువజ్రంబుల
తలతల మనునీదురదనతతిఁ బోలదె కా
యలచుక్కలనిగనిగ యో
[6]పొలఁతీ నీకాలిగోరుఁ బోలదు సుమ్మా. 223

క. *నీ కలికితనమునకు బి
బ్బోక[7]శ్రీకిన్ వయోవిభూతికిఁ దలఁపన్
నీకున్ [8]తేనికిఁ దగునే
నాకు న్నీకుఁ దగుఁ గాక నాళీకముఖీ. 224

క. నెమ్మేను గంధవహము మొ
గమ్ము కళానిధి యనంగకలితము నడు మా

1. బాచనుదోయినీరు 2. వృత్తి నగుచు 3. మని 4. యొయ్యారము 5. గనినప్పుడెపులుసువిఱుగుఁగానందులకున్ 6. పొలఁతుక * పాఠాంతరము కాకికి ధరలో సంబిక, శ్రీకెటను వయోవిభూతిఁజెల్లునె తలఁపన్ 7. శ్రేణికి మనోవిభూతికి 8. రాజునకునగునే; రాజునకగునే; రాజునకుఁదగునే.

కెమ్మోవి మధువు నొఁ గద
కొమ్మా యెటు లోర్తు నేలుకొమ్మా నన్నున్. 225

సీ. నెఱిగొప్పు కొనగోర నివిరి చూచెద నన్నుఁ
జెలి నీ వది ఘనంబు [1]చేసికొనెదు
గట్టిచన్గవ చేత ముట్టి చూచెద నన్నుఁ
జెలి [2]యది యొకకొండ చేసికొనెదు
[3]పసిగొను పిడికిటఁ బట్టి చూచెద నన్నుఁ
జెలి యది గగనంబు చేసికొనెదు
మించుమే నటు కౌఁగిలించి చూచెద నన్నుఁ
జెలి యది బంగారు చేసికొనెదు

గీ. తెప్ప లెత్తిటు చూడవే యొప్పులాడి
యెంత దయలేనిదానవే యేణనయన
యాసపడువారి నెఱుఁగవే యలరుఁబో[4]ణి
చాటు కేఁగెద వేటికే జలజగంధి. 226

గీ. అనుచు నాకేలు వట్టిన[5]యప్పు డధిప
యేమి చెప్పుదు [6]నానెగు లీశ్వరుండ
యెఱుఁగు నాసిగ్గుఁ గాచువా రెవరు లేక
మిట్టి మీా నై పడు చెనంటి నిట్టు లంటి. 227

శా. ఓరీ నాపతి లేనిచో భయము లే కొక్కింత శుద్ధాంత మొ
య్యారం బేర్పడఁ జొచ్చి నన్నుఁ గని కామాంధుండ వై
ప్రేలెదీ, వారాజన్యునిసొమ్ము ప్రాయమును నాప్రాణంబుఁ బో

1. చేసికొనెదె. (తక్కినమూఁడు పాదాంతములందునిట్లే.) 2. యిప్పు డది 3. అసిగొను...; వలిగొను; మినుకుఁగొనొకసారి పుణికి చూచెదన (మ)న్న 4. డి 5. యపుడె యధిప 6. నాదిగు లీశ్వరుండె.

ష్మూరకే, యిూరీతిఁ బినతల్లిఁ [1]బట్టిన ఖలుం డెచ్చోఁ గలండే
మహీశ్. 228

క. అనినం గామవికారము
నను బలిమిం గౌఁగిలించి నఖముల వ్రచ్చెన్
జనుఁగవ 'ముంజేకంకణ
మున కద్దం బేల' చూడు[2]ము మహీపాలా. 229

వ. అని రయంబున నాఖండల భుజాగ్రమండలాగ్ర ధారానవ
విదారిత ధరాధరావరణధారాధరంబునుం బోనిపయ్యెద
చెఱంగు మఱుంగువాయం దిగిచి యయ్యెడ. 230

క. కమ్మెలు [3]వోయినబంగరు
బొమ్మరములయొమ్మెఁ గడకుఁ బో మ్మనురేఖా
సమ్మిళిత స్తనకుంభత
టమ్ము [4]దిటమ్మునను జూపి డగ్గుత్తికతోన్. 231

ఉ. [5]ఇంతకుఁ గీర్తి రాఁగఁ ద్యజియించెద ప్రాణ మెంత యీ
విధం, బంతయు నీకుఁ దెల్పుటకు నై [6]యిటు లుండితి నీ
దుపట్టి [7]న, న్నింతయు ప్రేమఁ బట్టి రమియించిన యప్పుడె
మాను [8]వైతి నీ, కింతటనుండి కోడలఁ జుమీ నను ముట్ట
కు రాజశేఖరా. 232

గీ. కలికి రత్నాంగి నీకులాంగన రమించు
మించుమేడకు నరుగు మమ్మెఱుఁగుఁ[9]బోఁడి

---

1. నేచిన 2. మామహి 3. దాఁకిన 4. దిటమ్ముగను 5. ఇంతటకీర్తి గాఁగ ఘటియింతు నె ప్రాణము 6. యిటనుండితి; యిటనుంటిరి 7. న, న్నింతటనుండిబట్టి 8. వైతినా 9. బోణి.

[1]పోఁడిమిగ నిన్ను రతిఁ దేల్చి పొందఁ [2]జాలుఁ
జాలు నాతోడి గొడవ నీ కేల యధిప. 233

చ. అని యపు డంతఁ బోక మఱి యాయనృతోదరి రాజు
చేత నుం, డిన బెడిదంపుఁజాయల పిడెం బొర వెళ్ల జరీన
దూసి గొ, బ్బున మెడమీఁదఁ బెట్టుకొనఁ బోవ నహో
యని సంభ్రమించి మిం, చినతమిఁ బట్టి యింతపని సేయు
దువా మదిరాక్షి నీ వనన్. 234

క. ఔఁ దల ధరణీపాలన
యూఁ దలవం పాయె నిప్పు డందఱిలో నె
చ్చోఁ దలపెట్టక నెన రి
చ్చోఁ దలపెట్ట కటు విడువు ఘాతువు నన్నున్. 235

క. అని మఱి బాములఁ బడ లే
నని కైదువు [3]దుస్సి దాఁటునాయితముబలేక
బెనఁగు నల యుఱియచే సురి
య నులిమి [4]బలిమి విడిపించి యను నసురక్తిన్. 236

క. నిను మానము గొను హీనుని
ననుమానము మాని నూనుఁ డనుమోహముచే
తను [5]మానక తునుమాడుదు
వినుమా యణుమాత్రమధ్య వెత వీడ్కొనుమా. 237

వ. అని బరవసంబుగాఁ బలికి యక్కలికి నూఱడించి మేర
డించినకోపాటోపంబున నచ్చోటు వాసి మాటవాసి
గలరాజమహేంద్రవాసి యుగ్రాకారుం డై మండుచు సభా

1. ఫోణిమి 2. గలదు 3. వేసి 4. యపుడు విడిపించినను నసురక్తిన్
5. జాడక; మాడక.

మండపంబున కేతెంచి బ్రద్దలవారి నలుగడలం బంచి యాప్తామాత్యబంధుజనంబులం దగిన వారల రావించి [1]యథోచితాసనంబుల నుండ నియమించి కొండొక[2]సేపు చింతించి కొంత సంకోచించి చెప్పక దీర దని నిశ్చయించి చిత్రాంగి తన కెఱింగించిన [3]తెఱంగును జెయ్యివ్వలకరణియుం [4]దనకన్న విన్న సరణియు నామూలాగ్రంబుగాఁ దెల్పి యింక నెయ్యది కర్జం బనిన [5]సభ్యులందఱు డెందంబుల విస్మయం బును సంశయంబును బాపభయంబును బెనఁగొన ముందు వెనుక దెలియక బహిర్లిఖిత చిత్రాకారంబుల ప్రకారం బున నిశ్చేష్టితులై హరీ యనక హరా యనక నూర కున్నయెడ నందు నయమార్గవుం డను మంత్రిపుంగవుం డి ట్లనియె. 238

గీ. ఘోర మగుపాతకం బిది నోర నుడువ
రాదె కా మదిఁ [6]దలఁపంగ రా దొకరికి
నిట్టి యన్యాయ మేజాతి నెన్నఁ డైనఁ
దొంటికతలందుఁ జెప్పఁగా వింట గలదె! 239

మ. తననీటు ల్మెఱయఁగ రయం బడరఁ దొల్తన్ రాణివాసం
బు[7]లోఁ, జనుచే నేరమి యాఁ గదా సవతి యీర్ష్యం
బట్టి చంపింప నే, గ్నన నీకై వడి మాయ వన్నినది పోవా
మంటిమా యామె నీ, కనుమానంబు దొలంగఁ దెల్పెఁ
గద యూహాపోహ లిం కేటికిన్. 240

---

1. యుచితాసనంబుల 2. తడవు 3. వి:ంబును 4. దనకన్నసరణియుం; తావిన్నకన్న 5. సభికులందఱు డెందంబున 6. దలఁపను రా దెవరికి;...దొరు లకు 7. లన్.

మ. అలఘుప్రాభవ యింక [1]నీకొలను రాజ్యం బేమి గా
నున్నదో, తొలఁగెన్ గీర్తి భవత్ప్రతాపబలముల్ దూరీ
కృతం బయ్యె న, క్కులకాంతారకుఠారకుం దనయుఁ
డన్ గూర్మిన్ గృపన్ జూచి భూస్థలిలో వెల్వడఁ [2]గొట్టి
నట్టయిన నాజ్ఞల్ జబ్బు దాఁకున్ [3]బయిన్. 241

క. జననిం బొడరినపాపా
త్మునిఁ గొబ్బునఁ బట్టి తెచ్చి తునిమింపఁ దగున్
పని లేదిఁక సంకోచము
మనుజాధిప కార్య మనుడు మతిమంతుఁ డనున్. 242

గీ. అధిప యిది శాస్త్రమతము గా దరసి చూడ
ధనము వోయిన [4]ఘనమనస్తాప మయిన
నొకటి తనయింట దుశ్శీల మొదవిన నది
బయలు సేయంగఁ దగ దనునయము గలదు. 243

చ. చనవున నొక్కవేళ రభసంబు మెయిన్ బినతల్లులిండ్లకున్
దనయులు ప్రేమతోఁ జనుట త ప్పగునే తమచేయుతప్పు లె
ల్లను మగవారిపై నిడి చలంబున బొంకొనరింతు రెందు జ
వ్వనుల మనోగతు ల్దెలియువా రిల నెంతటివారు గావలెన్.

క. [5]మనమున నిడు టొక్కటి వెలి
నను టొక్కటి సేయు టొకటి యంతయుఁ గపటం
[6]బె నిజంబు లే దొకింతయు
నన్నృతోదరి యనుట సార్థ [7]మతివల కెల్లన్. 245

1. నీ కొలము 2. గొట్టనట్టయిన 3. మహిన్ 4. మతిమనస్తాప 5. మానసున 6. బునిజంబు 7. మతివకుఁ జెల్లున్.

మ. అనిశక్రౌర్యము కల్కిచూపులనె కా దత్యంత కాఠిన్య మం
గనపాలిండ్లనె కాదు చాపలము స్త్రీకందోయినే గాదు త
గ్గనికౌటిల్యము జోటిముంగురులనే కా [1]చెప్ప నుల్లంబునం
దును [2]బేటాడుచు నుండు నిక్క మిది యెందు న్మమ్మరా
దింతులకా. 246

క. జనకు నయిన సోదరు నై
నను సుతు నైన నొసపరిఁ గనం దరుణులకుకా
దను వెక్కును లజ్జాపద
మని హారితో ద్రుపదపుత్త్రి యనెఁ గద తొలుతకా. 247

ఉ. ఓన్నృప నాకుఁ జూడ నలయుగ్మలి నీసుతునిఁ మనోహరా
నూనవిలాసుఁ జూచి నిలుపోపక పట్టిన లోనుగామి నెం
తే నెగు లూని వానిఁ బొలియింపఁగ మాయలు పన్నె
నిట్లు గొం, [3]దేనకు [4]ధర్మరాజులను నిక్కముగా మిముఁ
జెప్ప నేటికిఁకా. 248

చ. పొలఁతుక మీకుఁ గానఁబడఁ బొందుగఁ [5]దెల్పినదే నిజం
బకా, దలఁచెద [6]రీ ర దెంతయును దబ్బర సూ 'మగ
వాఁడు బొంకెనా, యల దడి గట్టినట్టు లగు [7]నాఁడుది
బొంకిన గోడ వెట్టిన, ట్లలవడు' నన్నమాట వినరా వన
రాశిపరీతభూభుజా. 249

గీ. ఇలఁ జెరవ మూయ మూఁకుడు గలదు గాక
నోరు మూయంగ మూఁకు డెందులను గలదె

1. దల్లనుల్లంబునం; కా జల్లనుల్లంబునం 2. పేటాడుచు 3. దేనకు 4. ధర్మరా జలుగు నిక్కముగా 5. తెల్పుటచే నిజంబుగా 6. రిప్పు డెంత 7. నాటది.

యొరు లనుట కేమి సారంగధరునిమీఁద
నాకు సంశయ మొదవ దోనరవరేణ్య. 250

క. ఏతన్మాత్రుఁడె చేతో
జాతారికృపాకటాక్షజాతుఁడు సుగుణా
న్వీతుఁడు తెలియక యాఁడెద
[1]రాతని కటువంటిగుణములా నరనాథా. 251

క. చెలిమాటలకై తొడఁబడి
ఖలుఁ డని సుతుఁ దునిమితేని కైకకొఱకుఁ గా
నలకు రఘురాము ననిచిన
యలదశరథుమాడ్కిఁ బిదప నడలుదువు సుమీ. 252

వ. అని పలికిన మొగంబులు [2]దెలివొంది కొలువువా రెల్ల
మతిమంతుం గొనియాడిరి నృపాలుం డిట్లు నానాప్రకారం
బుల మంత్రుల నొరసి [3]యడుగ వార లాడునుడువులకు
నుఱ్ఱూఁతలూఁగునుల్లంబునఁ గార్యనిశ్చయం బిద్ధి యన
నేరక యపారమోహసాగరంబున మునింగి తనలోన. 253

క. ఇటు చూచినఁ జెలి[4]పైఁ ద
ప్పటు చూచిన సుతునినేర మవుఁ గా [5]దనఁగా
నెటువలె వచ్చునో మీఁదట
నటమటమో లేక నిజమొ యని యెఱుఁగముగా. 254

ఆ. అల్లనీళ్లలోనికు ల్లయినది యిది
యిట్టి లనుచు నిశ్చయింప రాదు

1. వాతని 2. దెలిసి 3. యడుగనాడునుడుగులను 4. తప్పగు నటు
5. దనరా, నెటువలె.

కప్పి పుచ్చ రాదు ఖండించి యాడరా
దేమి సేయువాఁడ నింక ననుచు. 255

క. వ్రాలినచెప్పలు వెతఁ గై
వ్రాలినహృదయాంబుజంబు వసుమతి[1]మీఁదన్
[2]వ్రాలినచూపులు మొగమున
[3]వ్రేలుకనలు ముక్కుమీఁదివ్రేలుం దనరన్. 256

క. ఉన్నంత నృపాలున కని
యె న్నీతిజ్ఞుఁ డనుమంత్రి యీ మతిమంతుం
డెన్నినప్రకార[4]ముననే
యన్నులు చపలాతిచంచలాత్మలు సుమ్మీ. 257

క. తనకల్ల తెలుపదే కద
మన కల్లలితాంగి బుద్ధిమంతు నొకని నే
ర్పున మెల్లన రాకొమరుని
మన మెల్లను దెలిసి చూడ మన మంపఁ దగున్. 258

వ. అనిన మతిమంతుం డందుకొని యవ్విభున కిట్లనియె. 259

చ. మిగుల దృఢంబు చేసి కద మీ రడుగం దగ వేడఁ జెల్లు ని
మ్మగువనె యింక నిక్కమగు మాటకు నిందడిగింపుఁ దూర
కే, బెగడుకుమారు నాఁడిని బెట్టఁగఁ [5]జెల్లునె వింట లేదె
'యింట గెలిచి రచ్చ గెల్వు' మనునానుడి నానుడి నానుఁడీ
చెవిన్. 260

క. మదిరాక్షుల నమ్మకు నయ
విదుఁడవు గద వేగిరంబు వెరవరిఁ జెలుచుర్

1. సెలకోఁక 2. వ్రాలుంజూపు 3. వ్రేలంగను; వ్రేలఁగనలు 4. మేనిజ, మన్నులతుక లెంచ 5. జెల్లదు.

బదరకుమీా లెస్స పదిం
బదిగ విచారించి సేయ మంచిది సుమ్మీా. 261

క. అనవుడు జనపతి యడుగం
[1]బనిపిన నే మాయె దోసమా ని ప్పనిసం
తనె నోరు పొక్కుదు గదా
[2]యనిపి యటుం దెలిసి చూత మని కడు వేగన్.  262

క. నడిసన్న పెద్దవారలఁ
[3]గడఁకన్ దగువారిఁ బిలిచి కల్ల గలిగినన్
[4]నుడువులవలననె కానం
బడుఁ గద తెలియుఁ డని పెట్టి పంపిన వారల్. 263

సీ. కల నైనఁ బరకాంతఁ దలయెత్తి చూడఁడు
[5]పఱచువారలఁ గూడి [6]పలుకఁ బోఁడు
మిగుల సిబ్బితికాఁడు మొగమోట గలవాఁడు
పలికి బొంకఁడు బహుభాషి గాఁడు
నేర్చినవారిని నేరనివారినిఁ
దనవారిఁగాఁ జూచు [7]వినయపరుఁడు
కినిసి యెవ్వరిని [8]నొచ్చిననోటఁ బలుకఁడు
కపట మెఱుంగఁడు గర్వి గాఁడు

గీ. మేరమానిసి సా దుపకారి గోల
నిర్మలుం డట్టివానికి నింద మోవఁ

1. బనిచిన 2. యనిచి యటుం; యని యప్పుడు 3. గడకన్ 4. నొడువులవల్లనె కానం 5. పడుచువారల 6. నడువ; మెఱయ 7. దయా పరుండు 8. నొచ్చెడుమాట.

జేసెఁగా విధి కటకటా దోసకారి
దయ్యమున కేడ సత్యంబు దలఁచి చూడ. 264

గీ. అనుచుఁ దమలోనఁ గడు నొచ్చుకొనుచుఁ బనుల
[1]జోక సొగసూను నా రాజసూనునగరి
కేఁగి యువరాజునకుఁ దమ్ము నెఱుక సేయుఁ
డనిన నవసరములవారు నపుడె పిలువ. 265

క. చని కని మ్రొక్కిన మితపరి
జనయుతుఁ డగు రాజసుతుఁడు సవినయ[2]మతి యై
తనకగ్గదెసరస నుచితా
సనయుక్తులఁ జేసి యనుఁ బ్రసన్నాననుఁ డై. 266

ఉ. వచ్చినకార్య మేమి జనవల్లభుఁ డంపఁగ నన్నుఁ బిల్వఁగా
వచ్చితిరో తగు ల్గలుగువారలకై మనవుల్ ఘటింపఁగా
వచ్చితిరో వచింపుఁ డని వారల సారెకు వెల్లదమ్ములన్
మెచ్చనికన్నులన్ బెదరు మేకొననెమ్మొగమూఁచిపల్కినన్. 267

ఉ. భూరమణుండు మీకడకుఁబొమ్మన వచ్చితిమయ్య యెయ్యెడన్
మీరలు రాజు[3]కంటె నినుమిక్కిలి మా కనురక్తిమై మముఁన్
గౌరవ[4]లీలఁ బ్రోతు రటు గావున నొక్కటి విన్నవింతు మో
భూరివివేక వీరి నటు పొమ్మనుఁడా యని యేకతంబునన్. 268

క. ఒకయించుక మదిఁ గొంకుచు
ముకుళితహస్తు లయి వినయమున రాజకుమా

---

1. సొగసొగసును గలనృపసూనునగరి 2. మతుఁడై 3. కన్న 4. వృత్తి.

రక వెఱచి చెప్పుదుమొ వెఱ
వక చెప్పుదుమో యటంచు వారలు [1]పల్కన్, 269

క. ఇది యేమో యని యొదవడి
యదవద యై గుండె భగ్గు మని తల్లడపా
టొదవఁగఁ బలుకుల దీనత
గదురఁగ నది యేమి దెల్పఁగదవయ్య యనన్. 270

సీ. అవనీత[2]లేశుఁ డల్లవనీతలమునకు
మొన్న వేఁటాడంగఁ జన్న పిదప
నంగజాలలు గా దనంగఁ జాలఁ [3]జలమ్ము
మీఱ మొక్కలము[4]న మీఱ లలుకఁ
బారువమ్మును బట్టఁ [5]బాఱు నెనమ్మున
రాణివాసముఁ జొచ్చి క్షోణిపతికిఁ
బ్రాణపదం బైన యేణాక్షిఁ జిత్రాంగిఁ
గనుఁగొని [6]మోహంబు పెనఁగొనంగఁ

గీ. దమకమునఁ బట్టినా రని తమ క[7]డలుచు
నాపడంతుక [8]దెల్పినఁ గోపగించి
[9]మిమ్ము నిది యంతయును నిక్కమ్ముగాఁగ
నడిగి నమ్మనె నిప్పు డప్పుడమిఱేఁడు. 271

చ. అనిన నమశ్శివాయ యని యక్కట యొక్కడనుండి సంభవిం
చెను వినరానిపాప మిది చెల్లరె మాయలు వన్ని యీవిధం

1. పలుకన్ 2. లేంద్రు 3. జలంబు 4. మొక్కలముగ 5. బాఱు నెవమ్మున; బాఱుమెత్తమ్మున 6. మోహమ్ము 7. మదర; మడుచు; 8. దెలిపిన 9. మమ్ము.

బున నలయింతి నాపయిని [1]బూఁపెను నేరమి [2]యిట్టిప
ల్కులే, వినవలసెం గదా యిపుడు వీనుల నే మనువాఁడ
[3]సింధుకర్ణ. 2.2

క. ఆయమ్మ యాగ్రహం బెడఁ
బాయక [4]మఱుఁగుపడ విన్నపముచేసిన భూ
నాయకుఁ డిది యాఁ గా దన
కీయెడ నామీఁద [5]నాగ్రహింపం దగునే. 273

గీ. తల్లి నామీఁద నఁట లేనితప్పు మోపె
[6]నఁట యఁల యనుంగుఁదండ్రి దా నదియె నిశ్చ
యంబు [7]సేసె నఁట యిఁకఁ గా దన్నఁ బోనె
యేరి నన నేల కల్లరి నేనె యగుదు. 274

క. నా పాలిటిదైవముగా
భూపాలుఁ దలంతు నేను బొరపొచ్చెములే
కేపట్లం జిత్రాం[8]గిని
[9]నాఁపినతల్లిని దలంతు నాతల్లివలెన్. 275

క. ఇది యిటువలెఁ గా కెన్నఁడు
నెదలోఁ [10]గొండొకవిచార మే నెఱుఁగమి కా
మదనారియె సాక్షి యిఁకం
బదివేలును నేల పనికి మాలినమాటల్. 276

---

1. బూఁపెనె, బూన్పెను, మోపెను 2. యింతరోఁతయున్ 3. దీసికిన్ 4. నా మీఁద 5. నిగ్ర 6. నట్టులె ..దండ్రియు 7. సేసెనునింకఁ ...యెవరి; సేసె .. బోవ, చెట్టులైనను 8. గిన్ 9. లోపలరత్నాంగికన్నను విశేషముగాన్ 10. నొండొక.

ఉ. ఏ నిఁక నేమి సెప్పిన మహీపతి బొంకుగ నెంచు నెందు 'రా
జానుమతంబు ధర్మ' మని యండ్రుగదా బుధు లైననేమి 'యె
ద్దినె నటన్నఁ గొట్టమున నేర్పడఁ గట్టు' మటన్నచందమే
కానఁగనయ్యె నొక్కయుపకారము సేయుఁడు మీర లీయెడన్.

క. మీమది శంకా[1]తంకం
బేమియు లేక సభవార లెల్ల వినంగా
నామాటలుగాఁ గొన్ని మ
హీమండలవిభునితోడ నెఱిఁగింపఁ దగున్. 278

క. మండలపతి తప్పొప్పులు
రెండు విచారించి తగినరీతి న్నీతిన్
[2]దండన సేయఁగఁ దగు ను
ద్దండము సేయంగ శుభము దలకొన దెందున్. *279

గీ. మీర లన్నిట సడిసన్నవారు దెలుప
[3]వలదొకో నన్ను సడిసన్నవానిఁగా నొ
నర్చుటకు దైవసన్నిధానమునఁ బెట్టి
నిజము సేయించి పిదప మన్నింపు మనుఁడు. *280

గీ. అనఘమతులార నన్నుఁ జిత్రాంగియెదుట
నునిచి [4]తారకాణించంగఁ గనుక నట్టి
కల్ల నావల్ల గోరంత గలిగె నేని
యాజ్ఞ కే నర్హుఁడను జుమీ యని యనుండు. 281

---

1. తంకము, లేమి... 2. దండము 3. వలదొకా 4. తారకాణింపంగ; తార్కాణసేయఁగా; తారకాణించఁగాఁగనఁగ; తా...కనకనిట్టి,... కనకయెట్టి.

* 279-80 పద్యములు కొన్నిప్రతుల ముందువెనుకలుగా నున్నవి.

క. కాదే వినుఁ డొక్కటి యిం
కా¹దేవినె గలది ²గలిగినట్టు దెలుపు నీ
పై దే నేరము జుణిఁగిన
గా దని ³యడుగు మనుఁ డామె గట్టిగఁ దెలుపున్. 282

క. అటుమీఁదట జగదీ⁴శ్వరు
ఘటనం బెటు లుండె నటులఁ గా కుండదుగా
⁵యి టులనుఁ డని వారికి నా
దటఁ ⁶దాంబూలంబు లిడి యతం డపు డనిపెన్. 283

శా. దాక్షిణ్యాకరమూర్తి షోడశమహాదానాదిధర్మక్రియా
దక్షా యాశ్రితదీనరక్షణకళాధౌరంధరీసత్కృపా
వీక్షా శాశ్వతకీర్తి వైభవరమాభృచ్చోళసింహాసనా
ధ్యక్షా ⁷దుర్ధమరాట్కిరీటదలనైకాక్షేయకాక్షేయకా. 284

క. యాచనకవినుత వనితా
నేచనకతనూవిలాస శృంగారకళా
సూచనకమ్రకవిత్వా
లోచనకందళితహర్షలోలుపహృదయా. 285

స్రగ్విణి.

దుగ్ధరాశివిద్యోతికీర్తి సుధా
భుగ్ధురీణామనాగ్భగవర్తి దయా
దృగ్ధుతాశేషధాత్రీమరున్నిస్స్వతా
స్నిగ్ధసారస్వతస్నిద్ధసారస్వతా. 286

1. దేవిని 2. గలిగినట్టె...; గలిగినట్టుల దెలియన్. 3. తెలుపు
4. శ్వర 5. యిటనుం 6. తాంబూలమిడి వడి 7. దుర్మదరా.

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణప్రసాదలబ్ధప్రసిద్ధవాగ్వైభవ చేమకూర లక్ష్మణామాత్యతనూభవ సదారాధిత బుధసమాజ వేంకటరాజప్రణీతం బైన సారంగధరచరిత్రం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# సా రం గ ధ ర చ రి త్ర ము

## తృ తీ యా శ్వా స ము



ధుర్యశౌర్యధైర్య
స్థైర్యధరమూర్ధన్య యాదిగర్భేశ్వర వి
ద్యాధిక [1]వితరణదీక్షా
రాధాసుత యచ్యుతేంద్ర రఘునాథనృపా. 1

వ. అవధరింపు మివ్విధంబున నవ్వసుంధరావరకుమారుం డగు
సారంగధరుండు మంత్రిపుంగవుల ననిచి యనివార్యశౌర్య
ధురంధరుం డై యుండె నంత. 2

చ. [2]అనిపినఁ బోయి వారు నతులై యతులైకవినీతరీతి ని
ట్లని రవధారు [3]ధారుణీ తలాధిప శేఖర స్వామియానతిం
బనివిని యక్కుమారుఁ గని మామదిలో ననుమాన మెల్లఁ బో
వను విశదంబుగా [4]తెలిసి వచ్చితి మయ్య యనేకభంగులన్. 3

క. [5]ఔ ధన్యుఁడు గాఁ డన్యుఁ డ
సాధారణుఁ డతఁడు దైవసన్నిధి [6]నిదగన్

1. రక్షణ 2. అనిపినవారుపోయినతులైకవినీతిని నీతిదోఁప ని 3. ధారుణినయుంబున నేలెడిసామియానతిం, బనిచిన 4. నడిగి 5. అధన్యుఁడు 6. నతనిన్.

శోధన చేసినఁ [1]గాని య
శోధన యొం డొకటి తెలుపఁ జొప్పడ దింకన్. 4

క. మనవి గల దొకటి చిత్రాం
గినె [2]యీమాఱు బెదరించి కినుకన్ నీవం
కనె [3]త ప్పిది గట్టిగఁ జెపు
మన నృపుతోఁ దాన దెలుపు నని యతఁ డనియెన్. 5

చ. అన విని మంచిదే యని నృపాగ్రణి వారల నెల్ల వెంటఁ [4]దో
డ్కొని వెస రాణివాసమునకుం జనినం గని నాతి సెజ్జ ది
గ్గన [5]డిగి జాళువాపసిఁడికంబము [6]చెంగట నిల్చి ముగ్ధచా
డ్పున వసివాళ్లువాడు మొగముం [7]గదియంగ మునుంగు
[8]దార్చుచున్. 6

క. కొనగోరఁ దీసి కాటుక
కనునీరు [9]చిటుక్కు మనఁగఁ గడమీటుచు వం
చినతల యె త్తకయుండెడు
నన్నతోదరి కనిరి [10]రాజనుమతి వారల్. 7

మ. వనజాతేక్షణ కేళికాకలగవవ్యాజంబునన్ వచ్చి ని
న్నను సారంగధరుండు మీయతులసౌందర్యంబు వీక్షించిమో
హానిమగ్నుం డయి బల్మిఁ బట్టెనని మీ రన్నా రటం [11]చెల్లరు
న్వినఁగాఁ బల్కి కుమారునిం దెలిసి రండీ యంచు రాజంపినన్.

1. గాక 2. యీమాఱుమూదలించి 3. తప్పగు నిజము దెలుపు 4. డో, కొని 5. దిగి 6. చాటున 7. డిగియంగ 8. దాల్చుచున్; దార్పుచున్; దీయుచున్ 9. చుటుక్కు 10. నృపతియనుమతి 11. చందరు

వ. *మే మానృపా[1]లుకడకుం జని [2]తద్వృత్తాంతం బంతయు నెఱింగించి. 9

శా. ఏరా యోరి వివేకహీనమతి ద్రోహీ నందనుం డంచు ని
న్నారా నమ్మిన [3]దంతయుం గలిగె నెం దైన [4]న్నగర్లోనికిం
బోరో రారా కొమార్లు వావివరుసల్ బుద్ధిన్ విచారిం[5]పకే
గారాబుంబినతల్లిఁ బట్టితివి యోగ్యంబే నినున్ జూడఁగన్.

క. [6]అని యనుఁ డని యినుఁ డాగ్రహ
మున నంగారకునిచందమున మండుచు [7]నుం
డిన వాఁ డని గట్టిగఁ జెపు
మని మే మెంతయును దూఱ నతఁ డి ట్లనియెన్. 11

మ. అమరంగాఁ దనమీఁది నేర మిపు డాహా నాపయిం [8]మోపి
తం, డ్రిమనం బి ట్లిడ నేసెనే యయినఁ [9]గానీ గట్టిగాఁ
దెల్ప నా, యమనే యిం కొకమాఱు మీ రదుగుఁడీ య
న్నాఁడు [10]గాఁగాను దో, సము సు మ్మెందు నిరాపనిందలు
[11]గడించం దెల్పు నిక్కంబుగన్. 12

చ. అనవుడు రాజుదిక్కు మొగ మై యలుకన్ గలకంఠి కంచు గీ
సినగతిఁ [12]పెద్దపెట్టునను జిట్టుడుకుం గనునీరు సోన యై
చినుకఁగ నేడ్చి యే లగడుచేసెదు రచ్చలఁబెట్టి యింత యో
వనధిగభీర నాకు సరివారలలోఁ దలవంపు లయ్యెడున్. 13

* మేము రాజుపనుపున బాలకునిపాలికిం బోయి యావృత్తాంతం బెఱింగించి

1. లబాలుపాలికిం 2. యేతద్వృత్తాంతం బెఱింగించి 3. దంతయుం 4. న్నగర్లోని 5. చకే 6. అనుడును విని యతఁడాగ్రహ 7. నొడ్డినవాఁడిది 8. జూ పె(పి)తండ్రి; మోపి స్వా(సా), మి 9. నేమీ; 10. రాఁగాని దో, షము 11. ఘటించం 12. పేరెలుంగునను.

క. మానముకన్నను [1]హెచ్చు
ప్రాణ మని తెగింపఁ బల్కిఁ [2]బ ట్టైదు సేయం
బూనితి నగుఁబోటులు నా
కా నీకే సిగ్గు [3]కలుగ దఁట నా కేలా. 14

క. కందోయి చల్లగా నిటు
గం దోయినృపాల లెస్సగా నిఁక నొకమా
ఱందఱముందఱ నీ వని
చిందఱవంద [4]ఱయి గుట్టు చిట్టాడంగన్. 15

క. కయ్యానకుఁ గాల్ ద్రవ్వుచు
గయ్యాళితనంబు మీఱఁగా డగ్గఱి యా
తొయ్యలి యాఁచక [5]యాఁచక
పయ్యెద [6]గొబ్బునను బటాన బయలుగఁ జేసెన్. 16

ఉ. ఆపగిదిం ద్రపారహిత యై కుచరేఖలు చూప నందఱున్
హా పరమేశ్వరా యనుచు నొదల [7]వంచిరి [8]జంత [9]యంతయున్
నాపయిఁదప్పెయానిదియు నాదియొ యాతని[10]చేలయానొకా
దో పరికింపుఁడా యనుచు దుప్పటిముందఱఁబెట్టి వెండియున్.

క. కొడుకుపయి నీకుఁ గడుఁ బ్రే
ముడి గావునఁ గతకుఁ గాళ్లు ముంతకుఁ జెవు లీ
వడిగెదవు రాజ నీ కె
క్కడియభిమాన మని పలుకఁ గాంతుం డలుకన్. 18

1. ...హెచ్చుగ,నేనాప్రాణమనితలఁపనీవిటుసేయం, 2. ...బట్టిటు సేయం 3. లేదు గద 4. ఱగు 5. వాఁచక 6. గొంగునను బటాక; గొబ్బునను బటబయలుగ 7. వాంచిరి 8. జింత 9. యింతయున్ 10. చేత.

క. ఇది మాయాపట మనఁ గూ
డదు గద యిఁక సంశయం బెడలఁ జూచితిరే
కద [1]పదపదఁ డని యానయ
విదులం దోడుకొని వచ్చి విభుఁ డలసభలోన్. 19

క. మాతృశిరంసాయుతుఁ డగు
పాతకి దండన మొనర్పఁ బరిమాణం బే
[2]రీతి చెప్పుఁ డని విపశ్చి
జ్జాతములం గూర్చి యడుగ జననాథునితోన్. 20

క. విజ్ఞాపనం బొనర్చిరి
విజ్ఞానేశ్వరము చూచి విద్వజ్జను ల
[3]య్యజ్ఞుని వనిఁ గరచరణం
బాజ్ఞ నిశావేళఁ జేయ నర్హం బనుచున్. 21

ఉ. ఆతఁడె వారిమాట విని యట్లనె నిర్దయవృత్తి నమ్మహీ
నేత తలారులం బిలిచి నేఁడు సుతుం గొనిపోయి కాళ్లనుం
[4]జేతులు నాజ్ఞ సేయుఁ డని చేముదుటుంగర మిచ్చెఁ గోపమే
మాతురు[5]గాని బిడ్డఁ డని చూడరుగా ధరణీతలాధిపుల్. 22

ఆ. పట్టి నట్టు లాజ్ఞ వెట్టఁ గట్టడిసేసి
సరగ లోని కరిగి శయ్య [6]కొరిగి
యినుఁడు దుఃఖవార్ధి మునిఁగి యుండఁగ [7]నల్ల
యినుఁడు నంత వార్ధి మునుఁగుచుండె. 23

1. పదుఁడనుచున్నానయ 2. రీతిం జెప్పుఁ డని సద్బుధ 3. య్యజ్ఞునికరచరణాదుల, బాజ్ఞ 4. జేతులుఁగోసిరండనుచుఁజే 5. గాక 6. నొరిగి 7. నంతనినుఁడు.

గీ. [1]ప్రామినుకుమానికమ్ముల భరణి యైన
తరణి శరనిధి మునుఁగఁగా [2]సరగఁ దిగిచి
వేయఁ బోల్ [3]పై వసుతతి నారాయణుండు
కా కది కృపీటజాతాప్తిఁ గాంచ నేమి. 24

చ. గగనపయోధి దాఁటి రవి గంధవహాత్మభవుండు రేయియ
న్జగతికుమారియంతికమున న్రభసంబున నిల్చి వచ్చు నో
యగమున రామచంద్రుఁ డని [4]యాయపరాంబుధిలంకఁ జొ
చ్చి వెల్లుగఁ దరికొల్పునగ్నిశిఖలో యన [5]సంధిలె సాంధ్య
రాగముల్. 25

గీ. లోకములకంట నలమ వేలాకృశాంగి
మిహిరకరరస మూనిన[6]మిన్ను పెంచు
[7]కదియ సాంధ్యవిభాదీపకలిక [8]యిడఁగఁ
బడినకాటుక యనఁ దమఃపటలి నెఱసె. 26

క. చవుదంతి వియన్నదిలో
నవగాహ మొనర్చి [9]చల్లు నల వమథులో వా
దివి [10]యలచుక్కలుఁ దోఁచఁగ
దివియల[11]వారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్. 27

సీ. రాగిదేరెడుచొకారపునీలిచల్లడం
[12]బులడంబు చీఁకట్ల బలము సేయఁ

---

1. ...మానికమ్ములుభారమైనఁ 2. సరణి 3. పైనసుదతి 4. యంద పరాం; యుండపరాం 5. మించెను 6. మిచ్చువిచ్చు 7. గదిసి 8. యిడిన 9. చల్లునవ్వమథులో 10. యలచుక్కలచేఁదగ; రేఁజుక్కలెనయ 11. వారలను గొనుచుఁ జగువ 12. బులుచిమ్మ...బలియ; ...నడరసేయ.

గోరమీసములపైఁ గోపోగ్రరసములు
చిందు ద్రొక్కఁగ మొగాల్ జేవుఱింప
మృత్యుదంష్ట్రి లనంగ [1]మీఱాలైనలోవంక
కత్తు లు[2]న్నతభుజాగ్రముల మెఱయ
నలుకుమానుసులగుండెలు [3]గుభు ల్లన ఘల్లు
రనుమ్రోఁతగుదెలు వేటాడుచుండ
ఆ. [4]కూఁక వెట్టి యీల [5]గొట్టుచు బడిబడిఁ
బాఱుతెంచి చుట్టువాఱుకొనిరి
*దివ్యరత్ననికరదేదీప్యమాన మై
యతిశయిల్లు రాజసుతునియిల్లు. 28

వ. అప్పు డందులఁ గ్రందు[6]కొనుసందడిఁ గొందలమంది పరిజనంబు లేడ్చుచు లోపలికిం [7]బాఱి యబ్బారి యొఱంగించిన నిప్పు ద్రొక్కినచందంబున మిట్టిపడి [8]తట్టిం బడిన పులుఁగువిధంబున [9]నిట్టట్టుపడి తరలి పోఁగూడక యావ ద్రావి నవానిగతి నారటించుచు మిన్ను విఱిగి పైఁబడిన [10]కైవడి ఱిచ్చలువడి రాకుమారుఁ డాత్మగతంబున. 29

మ. జననీ నాపయి లేనిదోస మిటు లీర్ష్యం దండ్రితోఁ జెప్పి యా
యనకుం గోపము [11]రేఁచి త్రుంచు మన నాహా యెట్లు
నోరాడెనై నను బోదా సదసద్వివేకగుణముం ధర్మంబుఁ

1. మేటైన 2. ఘన 3. వ్రక్కలించుఘల్లనుమ్రోఁత 4. కేఁకె; బిగియ 5. వెట్టుచు * దివ్యరత్నఖచిత...మై; దివ్యమాత్నరత్న దేదీప్యమానమై; కదిసి దివ్యరత్నఖచితదేదీప్యమై 6. కొనంగసందడి 7. పోయి యార్భటి 8. తట్టిలం బడిన, తట్టునంబడిన, తట్టంబడిన; తొట్టిల 9. నిట్టట్టుతరలిపోఁ 10. వడువున ఱిచ్చలువడి 11. వెంచి త్రుంపు.

బోకార్చి య, మ్మనుజాధీశుఁడు నట్లనేయఁ దగునే [1]మందు
ల్గదా భూపతుల్. 30

క. ఈలాగున ధర్మముఁ ని
ర్మూలంబై పోవు టెఱుఁగ మునుపే [2]యొట కేఁ
బోలే నైతి నహో విధి
యేలా పో నిచ్చుఁ బ్రాప్తి యిటు లుండఁగన్. 31

క. కెరలిపడి జనని దూఱుట
ధరణీపతి నసుట వెఱ్ఱితన మిఁక నేలా
పరితాప మొంద నాకుం
గఱకంఠుఁడె దిక్కు గాక కలరే యితరుల్. 32

క. అని నిర్విచారుఁడై యా
మనుజేశకుమారుఁ డనుపమానగభీరుం
డనవద్యశుభాకారుం
డనిమిషగిరిధీరుఁ డున్న యంతఁ దలారుల్. 33

క. రాసుతుఁ [3]డని తోడిఁబడఁ దెగి
గాసిని బెట్ట కడియాసఁ గాచుక మన మీా
మోసాల నున్న నెక్కడ
మోసా [4]లానో యటంచు ముంచినభీతిన్. 34

క. క్రిక్కిఱిసి నగరిలోనికిఁ
[6]జక్కన దురదురన చొచ్చి చనుచో నేమిం

1. మత్తుల్ 2. కడుకున్ 3. డనుచు(ం)ను దొడిఁబడఁ 4. ...లానో ...ముంచిన 5. లి 6. జక్కఁక మలమలను.

జెక్కు సెమ[1]ర్చక యుండెడు
నక్కోమపునిఁ గాంచి వార లతిదుఃఖితులై. 35

ఉ. కానకుఁ గొంచుఁబో [2]యిపుడె గాళ్లను జేతులు గోయఁ
[3]డంచు లో, నూనిన[4]కిన్క రాజు ముదుటుంగర మిచ్చెను
మాకు బుద్ధి యే, మానతి యిందు మీ రనిన నట్లనె
సేయుఁడు గొంక నేల రాజాన యతిక్రమిం[5]పఁ దగునా యని
యాదృఢచిత్తుఁ డాడినన్. 36

ఉ. ఏయెడఁ గోపగించి ధరణీశుఁడు గొల్చినవారి నేక్రియం
జేయుఁ[6]డ టన్నఁ గా దనక చేయవలెంగద [7]యంచు నట్టిటుల్
రాయిడి చేసి కర్కశపురజ్జువుల న్నవమోహనైకరే
[8]ఖాయుతదేహునిన్ విఱిచి కట్టి రయో పెడచేతు లంటఁగన్.

క. చిందె నట హారములు తెగి
క్రిందెలిముత్యములు పెన్నెఱు ల్వీడి విరుల్
జిందెను మును సింగారము
చిందుచు [9]నున్నాఁ డటంట సిద్ధము గాఁగన్. 38

గీ. ఇట్టు లారాచపట్టిని బట్టి చాల
గొట్టు సేయుచు నడురేయిఁ గొంచుఁబోయి
[10]నఱకుద మటంచు నప్పు డానగరికడన
యుంచి [11]వా రింత నంతఁ గాపుండి రంత. 39

1. ర్చ 2. యిపుడు; యి యట 3. మంచు 4. యల్క 5. చ 6. మటన్న 7. యన్న 8. ఖాయత 9. నున్నాఁడనుట 10. నఱకుదు 11. వారంతనంతగా నుండి రంత.

గీ. అదురుగడ గాఁగ నవ్విధం [1]బంతఁ దెలిసి
బెగడి యేడ్చుచుఁ జేతులు పిసికికొనుచుఁ
[2]జెమ్మరించుచు నోయమ్మచెల్ల యేమి
సేయుదుమె యంచు రత్నాంగి[3]చెలులు మిగుల. 40

క. తల వీడఁ బాటి తమ గా
దిలియేలికసానితోఁ దదీయవిధంబుల్
దెలియఁగఁ జెప్పిన హా యని
[4]నిలువుకు నిలువుననె [5]యొరగి నేలం బడియెన్. 41

గీ. నోరఁ దడి లేక యప్పు డానీరజాక్షి
కంటఁ బుట్టెడుకన్నీరు గాఱఁ బొరలి
పొరలి యేడ్చుచునుండ నబ్బోటు [6]లెల్ల
కస్తిపడ కమ్మ యని యెత్తి కుస్తరింప. 42

క. [7]అప్పుడటు దెలిసి మదిలో
ముప్పిరిగొనువుత్తమోహమున సకియలు తఱ్
గప్పుకొని వెంట రాఁగా
నప్పావనచరిత మహీతలాధిపుకడకున్. 43

మ. జిలుగుంబయ్యెదకొంగు జాఱి వెనుకన్ జీరాడ ముత్యాలపే
రులు వక్షోజతటిం బుటం బెగయఁగాఁ ద్రోపాడఁ జన్నుల్ కటి
స్థలిపై వేనలి మొగ్గ వ్రాల నడుగుల్ చండింప నేత్రాంబుజం
బులు గన్నీట వసంతమాడ నరిగెన్ బూఁబోఁడి ఖేదంబునన్.

---

1. బందు 2. జలదరించుచు 3. చేటులపుడు, బోటులపుడు, చిత్రాంగి చేటులపుడు 4. నిలిచిననిలువుననె 5. సొరగి 6. లేల, కస్తిపడెదమ్మ 7. అప్పుడు దెలిసియు.

క. అరుగునెడ నంతిపురమున
నరవిరిపాన్పపయి [1]నొరగి యావల ధరణీ
శ్వరుఁడును నీవల నొకయం
తరువునఁ జిత్రాంగి చెలులుఁ దా నుండంగన్. 45

గీ. అనఘచారిత్ర యెవ్వ [2]గే మనినఁగాని
గెరలని సుశీల సంపన్న గేస్తురాలు
అత్తరుణిఁ జూచి యప్పుడు నోరెత్తి పలికెఁ
[3]దాళనిచ్చునె పుత్త్రవాత్సల్య మెదను. 46

సీ. మగనికూరిమి గల్గి జగములో మిక్కిలి
వన్నెకెక్కినయట్టివారు లేరె
యిల భోగభామినుల్ [4]కులపాలికలకన్న
మేరగా నడచినవారు లేరె
సవతి[5]పట్లను నీసు సవరింప కేపట్ల
గారాబమునఁ బెంచువారు లేరె
నెనరుతోఁ బినతల్లి యని కొమాళ్లింటికి
వచ్చిన దయఁ జూచువారు లేరె

గీ. తగునె యక్కట బుధనుతోదారగుణవి
రాజి సన్మార్గవర్తనఁ దేజరిల్లు
పరమసాధువు సారంగధరునిమీఁద
నొకటికిఁ బదాలు [6]గల్పించితో లతాంగి. 47

1. నొఱగి (శ. ర. పా.) 2. రేమన నొకింత 3. దాళవచ్చునె పుత్త్రవాత్సల్యమెచటఁ;...మెవరి 4. కులభామినులకంటె 5. పట్టులనీసు...రించ, పట్టనియీసు... 6. గల్పించనో.

చ. పడుచుఁదనాన [1]బట్టి నినుఁ బట్టి పెనంగె నటంచు లేని యా
గడములు గొన్ని యంగమునఁ గానఁబడన్ సవరించి యీసు
[2]చేఁ, దొడిఁబడఁ బోయి ప్రాణవిభుతో నెఱిఁగించి తెగించి
వాని నో, పడఁతుక యాజ్ఞసేయు మని [3]పంచితి [4]వెంతకు
నెత్తుకొంటివే. 48

చ. పొలఁతుక లెస్స యున్న నొకపూఁటయుఁ జూడఁగఁ జాల
వీవు మా, యలకొడిగట్టి తెంతటిగయాళివె బేరజపున్విచా
రముల్, దెలియనివానిపైఁ గలవి లేనివి [5]కొన్ని ఘటించి తం
డ్రిబి, డ్డల [6]కెడ సేయఁ జూచి తకటా [7]మది నీ కిది యెంత
దోసమే. 49

చ. కఱకుఁదనంబుతోడఁ [8]బసికం దని యాత్మఁ [9]దలంప వైతి వి
త్తెఱఁగు వినం గ[10]లుక్కు మనదే పగవారిమనంబు వెన్కముం
దఱలను బిడ్డఁ బాప మమతం గని పెంచినదాన వైనఁగా
యెఱుఁగుదు గొడ్డు[11]రాలి కిల నెక్కడిమోహము లెంచి
చూడఁగన్. 50

క. పినతల్లివి పెనుపఁగ నో
పినతల్లివి గాన వచ్చి పిలిచిన నయ్యో
కనికరము లేక వానిం
గని కరము నిరాపనింద గట్టం దగునే. 51

---

1. వచ్చి 2. నన్ 3. పంపితి 4. వెంతటికెత్తుకొంటివే 5. కొన్ని గడించి, 6. సెడ 7. మఱి 8. గసుగందని 9. సెఱుంగ 10. భగ్గుమనదే 11. రాలికిని, రాలికిఁక.

చ. కటికిమనంబు[1]తో నిటులఁ గల్లలు చెప్పిన నాతఁ డైనఁ దా
గటకట [2]యట్టివాఁ డవును గాఁ డని రెండును నిశ్చయింపకే
యెటువలె నాజ్ఞ[3]వెట్టు మనెనే తరళాక్షి కుమారుఁ డంచు న
క్కటికము [4]లేక యాఁ జెవులె కన్నులు రాజులకుం
దలంపఁగన్. 52

ఉ. ఏసడిసన్న మానిసి[5]వా యేమి యెఱుంగవు పారుపట్టయో
వేసర కెన్ని నేరిచితివే మటుమాయలనీలికాన [6]నా
మూసినముత్తెమై[7]మెలఁగు ముద్దుఁగుమారునిమీఁద నెట్టుగాఁ
జేసితి వింత మచ్చరము చెల్లు నటే మఱి [8]యాఁడుదానికిన్.

క. అని తా నాడినమాటలు
విని తాళఁగ లేక బిగువు వెలయఁగ నపు డ
వ్వనితామణి యి ట్లనియెన్
జనితామర్షమునఁ జూపు జం కెనఁ జూపన్. 54

చ. [9]జలరుహనేత్ర న న్నిపుడు సారెకు దూఱుచుఁ గేరి నిక్క
చున్, నిలుగుచు విఱ్ఱవీఁగుచును నిక్కము [10]గాఁగను నాతఁ
డేమియున్, దెలియఁడు సాదుబిడ్డఁ డని నేరుపుమాటలఁ
[11]దేల నాడి గా, దిలిసుతు[12]చేతఁ జక్కటులు దిద్దెద వెంతటి
నంగనాచివే. 55

1. తోడనిటుగల్ల...డైనఁబో 2. యిట్టివాఁడవుచుకాదనకూరక 3. సేయం 4. లేఁజ 5. వాకింత...పాఱుపట్టివే 6. యో (యా) మూసిన... 7. వెలుఁగు 8. యాటదానికిన్ 9. జలరుహపత్రనేత్ర నిడుసాగెఁబెట్టుచుఁ జాలనిక్కుచున్ 10. గానతఁడేమిదోసమున్ 11. నేలనాడి 12. నెంత.

ఉ. *వేదులు పల్కెద నన్నదర ప్రేయఁగఁ జూచెద విందు నంతయుం
బేదలు లేరు నీవు కడుఁ బెద్దఱికాల్పచరించి యూరకే
[1]వాదులు చేసె దేల చెలువా యవుఁ గాసువారు లేరఁటే
సాదిపిసాళి నీదుతనుజాతుఁడు వాఁ డలపిన్న పాపఁడే. 56

ఉ. ఎంతకు లేవు బాలుఁ డనియే పచరించెద వింతెకాక నా
చెంతకుఁ జేరి నీకొడుకు చేసినచేఁతఁ దలంప వైతి వో
కాంత నిజంబె [2]యేరికిని గాశికిఁ బోయినసుద్దులే ప్రతి
ష్ఠింతురు గాని యానడుమఁ జేసిన[3]పాపము లెంచరే కదా.

ఉ. ఏల [4]వితాదిసంతు లివి యెవ్వరు మెత్తురు నోరిలోపలన్
వ్రే [5]లిడినప్పుడుం గఱవ నేరఁడు నీసుతుఁ డడ్డపాప గాఁ
డే లలితాంగి నీ వనక [6]యే రిఁకనందురె యాయెఁ బొమ్ము చా
ల్చాలును వ్రేళ్ల [7]సందులను జాఱెడువారలు లేరె యెవ్వరున్.

క. సూనుఁ డని చాల నెంజిలి
[8]యానెదుగా తల్లి దోస మన కిటు బలిమిన్
బోనీక పట్టి పెనఁగిన
వానిన్ మఱి యేమి సేయ వలయుం జెపుమా. 59

వ. అని పలికినచిత్రాంగిపలుకులు చెవులకు ములుకులపోల్కినిం గిల్కొని నచ్చిలుకలకొలికి యులికిపడి యాచెంత నున్న మహీకాంతునిఁ గని యార్తరవంబున నిట్లనియె. 60

---

* వేదురుబట్టి 1. వాదుకువచ్చెదేల, వాదనచేసెదేల 2. యెవ్వరును ...ప్రకాశింతురు 3. దోసము 4. బజాఱిఱంతు 5. వ్రేలటువెట్టినం గఱవఁ నేరఁడు కేవల గోల నీసుతుం 6. యేనిఁకనందునె 7. సందిమఱి 8. యానెదవే నీదు దోసమున...,యూనెదవే నీవు దోసమున కిటు.

వ. వెనఁగినఁ బోవ సీకు పసిబిడ్డఁడు వాఁ డఁట యమ్మచెల్ల కా [1]దనఁ దను నంట వచ్చె నఁట తక్కినమాట లిఁ కేల చూచి యుఁ, వినియు నెఱుంగ మయ్య యివి వింతలుచెప్పెడివారు చెప్పినఁ, వినియెడువారి కైనను వివేకము దా వలదా యొ కింతయుఁ. 61

క. మతకరిమాటలు చెవి నిడి
గతకల్మషుఁ బుణ్యచరితుఁ గారణజన్ముఁ
సుతుఁ దునుమఁ దగునె ముద్దుల
రతనమ్ము నయో యి దేదొరతనమ్ము నృపా. 62

మ. తొలుతఁ రాజులు [2]భోగ కామినులయందుఁ మోహితుల్
గారొ యిం, పొలయఁ వారి కపారమైనధనమిరోయందు
కే మిట్లు పు, త్త్రిల దండింపఁగ నిచ్చు వారి విన మెందున్
నేఁడు చిత్రాంగి మం,దులు నీకుం దల కెక్కె [3]నొఁ బరవశా
త్ముల్ గారె కామాతురుల్. 63

ఉ. అక్కట చూడఁ జాల [4]కటు లాకుటిలాలక మాయ వన్ని దు
ర్వాక్కులు దెల్ప|వాని [5]కిటువంటిగుణంబుల నే నెఱుంగనా
యెక్కడి[6]మాట పొమ్మనక యీ వది నిక్కము చేసి బిడ్డ [7]న
యొక్కని [8]నేఁడు చంపఁగ నయో దయమాలి తెగింపఁ
జెల్లునే. 64

---

1. దనునటయంట (ముట్టు) 2. మోహా 3. కాపరవ 4. కిటు 5. కటు.. ఁ దే నెఱుంగ 6. సుద్ది. 7. నినొక్కని 8. నేఁడయో దయ యొక యింతలేక (?).

క. ధరణీపతు [1]లే యొకటియుఁ
బరికింపక యిట్టు లదయభావమున [2]వధిం
తురనే గద 'రాజ్యాన్తే
నరకం ధ్రువ' మనిరి తొంటినయమార్గవిదుల్. 65

చ. చలమున [3]జంతమాటలె నిజం బని కానక కన్నపట్టి ని
ర్మలు వధియించె నెంతదయమాలినవాఁ డని లోకులాడరే
వలపున స్త్రీలబుద్ధి వినువారొకరేఁ గడతేరినట్టివా
రలు గలరా వివేకము [4]తెలం గిటు లయ్యె ని దేల వల్లభా.

ఉ. ఇచ్చక [5]మాడు నట్టి వెలయింతుల నెందఱనే గడించుకో
వచ్చుఁ గుమారుఁ [6]డట్టిగుణవంతుఁడు గల్గఁ డెఱుంగఁ జెప్పి
తిన్, మచ్చర మేల యింక నయినన్ విడిపింపఁగ [7]దయ్య
యంచు లో, హెచ్చినవెంజిలి న్నగువ యెమ్ములు చిల్లులు
వోవ నాడినన్. 67

గీ. మదిని [8]ద్వేషంబు కోపంబు మల్లడిగొన
నిలువ కట రాగ మతనికన్నుల వసించెఁ
[9]గటములను జేరె నపు డనుకంపమహిమ
చనునె దుర్జనసంగతి సాధువులకు. 68

ఉ. [10]ఏనటు వేఁటఁ బోవఁ గని [11]యిందులకున్ బెళు కావగింజయం
తైనను లేక చేయ నగునా తగునా యన [12]కింత సేసెనే
వానికిఁగా వహించుకొని వచ్చితివా యతివా కులోద్వహుం

1. లెందొక 2. ఘటిం, తురెయాఁగద 3. చెప్పుమాటలు 4. కరం బిటులయ్యె. తెలుంగరటయ్య యిదే 5. మాడనిట్టి 6. డిట్టి 7. రాద 8. ద్వేషంబు రోషంబు 9. కటుమరలఁ 10. నేనటువెంట 11. నేడలుకన్; యిందళుకన్ 12. కింత సేసెఁగా; కింతసేయఁగా.

డౌ [1]నఁట బుద్ధి దా నెఱుఁగఁ డందమె యందమె యిట్టిచం
దములే. 69

చ. అది మటుమాయలాఁడి యని యంటివిగా యొకనాఁడు
రానివాఁ, డదురుగడం దదీయనిలయంబున కేటికి వచ్చె
నైన నిం, పొదవిన [2]ప్రేమ నే నచట నుండఁగ వచ్చెనె వాఁడు
పోవ ని, మ్మదియు నిజాంశుకంబు [3]తగు లొటకుఁ గారణ
మేమి [4]దెల్పుమా. 70

క. జనపతి యా లని బిడ్డని
యనుఁగుంజుట్టమని చూడ నగునే యెందున్
పనియలుగ నాజ్ఞ వెట్టకి
నెనరున మఱి సేయరానినేరము సేయన్. 71

చ. అనియొకయించు కైనఁ దన కాస్పద మీ కతఁడాడఁజూచి మా
నిని యిటుఁ గూడ వానిపయి [5]నేకద నేరమి మోవఁ జేసితో
జనవర నిక్క మౌ నవును [6]సబ్బిణి నీప్రియురాలె వాఁడె దు
ర్జనుఁడు వె దుళ్ళపందిరియు రాజులమాటలు [7]చిక్కనౌఁ గదా.

చ. అడవుల కేఁగి యాకలము లైన భుజించెద మయ్య దీమసం
[8]బెడలఁగ దూరదేశముల కేనియుఁ బోయెదమయ్య కోడలుం
గొడుకును నేను రాచసిరికూటము [9]లప్పుడె వచ్చె మాకుఁ జా
ల్పిడుపుఁ [10]డనంగదయ్య [11]నవవిభ్రమమోహనకోమలాంగునిన్.

---

1. నవు 2. ప్రేమచే నచట 3. గుఱుతొటకు 4. చెప్పుమా 5. నేరమి యూరక మోప 6. సభ్యయు 7. నిక్కమౌ; చక్కనౌ 8. బెడలకమారు 9. లిప్పుడె 10. మనంగదయ్య 11. నవవిభ్రమకోమలపల్లవాంగునిన్.

గీ. అని యప్పుడు నిల్పరానిమోహంబుకతనఁ
దనదుప్రాణేశ్వరుని పదద్వయముమీఁద
వేగ తా నడ్డపడి యైన వేఁడుకొనెదఁ
గాక యని చేరఁ జనుదెంచు[1]కద లెఱింగి. 74

శా. నామీఁద దాన సుమీ 'మ ఱేమి యనిన స్వా ఱాడఁగా
వచ్చినన్, వామాక్షీ యతిఘోరపాతకునిఁ గావం జెల్లు[3]నా
వాని నీ, [4]వేమేఁ జెప్పిన విందుఁ గాని విన నే [5]నీమాట ప్రో
ఛా ష్మనెన్, మోమెూ [6]టించుక లేక యెంతకఠినాత్ముల్
రాజు లూహింపఁగన్. 75

గీ. అనిన గజయాన [7]పతియాన నతిభయాన
కక్రియానల [8]దహ్యమాన క్రమగతి
యాన గజగజ వడఁకి శయాన తప్పి
యాననము గని తాల్మి నయాన నపుడు. 76

క. మనసు నిలుపఁ జాలక కడు
పునఁ బుట్టినదోసమునకుఁ బొగులుచు వేఁడం
జనుదేర [9]నానవెట్టితి
పని లే దిఁక వాని వ్రాఁతఫల మిటు లుండెన్. 77

క. అని చాల ఖిన్నురాలై
మనమునఁ [10]దెరవేయఁ బుత్త్రమమతాంబుధి ని
ల్చినచోట నిలువ నైఁపక
వనితామణి నగరు వెడలి వచ్చుచు నంతన్. 78

---

1. కడఁక యెఱిఁగి 2. యిఁకేమి 3. నే 4. వేమిం 5. ఁడీమాట
6. టింతయుం 7. పతియానకతి 8. ధామ్యానయక్రమగతి 9. ఆనఁబెట్టితి
10. తెలివయును; వెరవేది.

ఆ. భామలార రండు నాముద్దుతనయుండు
వేఁడి వేఁడి యనుచు వేఁడి వేఁడి
వేఁడి వేఁడినీరు వెడఁదకాటుకకంటి
కొలుకు[1]లండ మాటి కొలుకుచుండ. 79

చ. వల దని మీఱ లైన [2]నొకవాల్ దెలుపం గద రయ్య యాలి
మా, టలు విని యన్నుఁబట్టి నకటా తెగటార్తురె [3]యంచు నా
మె పెద్దలఁ గని పుత్త్రమోహమున దైన్య[4]పడెం గడు రాజు
[5]మొత్తఁగా, నల మొగసాలకు న్వ్రాలి యఁటన్న ది నిక్కము
గాఁగ నయ్యెడన్. 80

మ. తొలఁగం ద్రోయఁగ రాక మూఁక లయి వీథు ల్నిండియు
న్నమ్మల, క్కలుతన్నుఁగని [6]పైల పైల పడుచుం గన్నీళ్ళతో
వెంట రాఁ, జెలిక త్తెల్ మును [7]గల్ల మార్గము బయ ల్సే
యంగ రత్నాంగి గా, దిలిగారాబుఁ గుమారుఁ డున్నకడ
కేతెంచెన్ నితాంతవ్యథన్. 81

సీ. సుతుఁ డట్టివాఁడు గాఁ డతిపమాటల కేమి
యని తాళఁ డాయె రా జనెడి[8]వారు
నెవ్వరిమన మెవ్వఁ డెఱుఁగు నన్నెము పున్నె
మును దేవుఁడె యెఱుంగు ననెడివారు
[9]విభుఁడు ధర్మాధర్మవిధము కానక చేసె
హా యెంతయన్యాయ మనెడివారు

1. లందు 2. ఒకపాల్ 3. యందునే, మి 4. పడుం 5. గొట్టఁగా; మోదఁగా 6. పైనపైన 7. గల్లుమార్గము 8. వార, లెవ్వనిమననెవ్వ 9. అధిపుండు దాసత్యమై నను దెలిసిసే—సెనె; అధిపుఁడట్లైన సత్యముచేత దెలిసిసే—సెనె; నృపుఁడైననుప్రమాణికమున దెలిసిచే - సెనె.

స్వామి యయ్యో పగవా[1]నికే నిటువంటి
యాపద రావల దనెడువారుఁ

గీ. కపట మెఱుఁగవు గోలవు కదర యన్న
యెట్లు వచ్చెర నీకు నేఁ డిట్టిపాటు
లనుచు సారంగధరుఁ జూచి యమ్మలక్క
లపుడు [2]కన్నీళ్లు గలవారు నయిరి పురిని. 82

సీ. ఉపకారమే కాని యపకార [3]మెప్డుఁ ద
లంచఁ డయ్యో యెంతమంచివాఁడు
మనసు చూరత మటంచుఁ దను నే మనిన నవ్వుఁ
గాని కోప మొకింత లేనివాఁడు
మదిలోన నెవరి కెయ్యది యిష్ట మది [4]యట్ల
యలరించు నుచితజ్ఞుఁ డైనవాఁడు
భువిఁ గలఁడా యిఁకఁ బుట్టెడు పెరిఁగెడు
వారిలో మఱి యిటువంటివాఁడు

ఆ. పరమసాధు వనుచుఁ బలుమాఱు సారంగ
ధరునిగుణము లెల్లఁ దలఁచి తలఁచి
పౌరజనము [5]లెల్లఁ బసిబిడ్డ [6]లాదిగా
వగచి కస్తిపడనివారు లేరు. 83

గీ. జిత్తులకుఁ డెంకి యగునింత్ర జిత్తుచేత
నలయురగపాశబద్ధుఁ డై యాలయునట్టి

1. రికి నిటువంటి 2. కన్నీరుగలవారలయిరిపురిని 3. మెప్పుడు ద(మ)
లఁపఁడయో యెంతధర్మపరుఁడు 4. యట్టె; యెల్ల 5. లకట; లపుడు
6. యాదిగా.

రాము[1]తో డన మిగుల గారాముతోడఁ
బెంచినకుమారుఁ గాంచి [2]పెం పెంచి కనలి. 84

మ. అపు డమ్మానిని యెంత సేసితివె చిత్రాంగి యటంచున్
జొకా, రప్పుఁగేల్దమ్ముల నగ్ర కుంతల తటీ రాకా నిశాకాల
శ, శ్యప[3]మాస్యంబటు మోఁదికొంచు సుతుపై నుద్బాష్ప
యై వ్రాలె నం, దుపకంఠ [4]క్షితి బద్ధ తర్ణక లిలి తో ద్రిక్త
ధేను క్రియన్. 85

ఉ. రంగ దపార మోహ జలరాశి మునింగి రహిం దొరంగి ర
త్నాంగి యొకింత[5]సేపటికి హాసుకుమార కుమార నేఁడు చి
త్రాంగికి నప్పగించుకొంటకా నవమాసములున్ [6]భరించి వే
డ్కంగని నిన్నుఁగూరిమి గడల్కొన[7]గోమున నెత్తి పెంచుటల్.

సీ. బహుభూషణధురీణ బాహు[8]వల్లరులకా
కలుకుముప్పిరి[9]త్రాళ్ల విఱిచికట్లు
మృగమద శ్రీగంధ మిళితదేహమునకా
గాటంపుఁ [10]గెంధూళి కప్పడములు
శిబికావతంస రాజిత పదాబ్జములకా
యీడుపుతో ట్రుప్పా బెల్లిదములు
జాతి చంపక దామ వీతకేశములకా
యట్రిట్టుజీరాడు నచ్చికములు

1. డోయన 2. వీక్షించి 3. మాస్యంబున 4. స్థితబద్ధతర్ణకదిదృక్షో ద్రేక (త్పాత) 5. సేపునకు 6. భరించి 7. బొమ్మున 8. వల్లిక 9. త్రాటి 10. పెంధూళి.

గీ. నెండకన్నును [1]నీడక న్నెఱుఁగకున్న
పుట్టుభోగికి [2]నయ్యెఁబో యిట్టివెతలు
కడుపు దరి[3]కొనదా నిన్నుఁ గన్నయపుడె
యన్న యెటు లోర్తురా నినుఁ గన్నతండ్రి. 87

శా. నిన్నున్ సద్గుణవంతుఁడంచు నెపుడు [4]న్వేనోళ్ల మెత్తుఁగదా
యన్నా నేఁ డిది యేమి సేసితివి యేలా పుట్టె [5]నీమర్లు నీ
కిన్నాళ్ లే నిది చెల్లెఁబో జననిగాదే యల్లచిత్రాంగి దా
నన్నుం జూచినకంటెఁజూడ [6]వలదా నామాఱుగా నాయమన్.

ఆ. పరులమర్మ మెత్తి పలుకనివా రన్య
[7]భామినులకు నాసపడనివారుఁ
దలఁచి చూడ దేవతాసమాను లనంగ
వినవె నీతి యేల [8]వేదు రైతి. 89

క. పోలియుటకు నేమి యొందుఁ
గల దందుకు వగవ [9]మఱి జగన్మోహనకో
మలుఁడ వగునీకు నీవిధి
నలచతురాననుఁడు వ్రాయ నగునా యకటా. 90

క. నానావిభవము[10]లం దగ
నే నినుఁ జూతు నని యున్న ని ట్లాయె నయో
తా నొకటిఁ దలఁప దైవము
తా నొక్కటి దలఁచు ననుట తథ్యం బయ్యెన్. 91

1. వాన కన్నెఱుఁగ 2. నాయెఁబో 3. కొనదేపినిఁ(విన్న)గన్న 4. వేనోళ్ల. నెంతుఁ; నేనెంతుఁబెక్కుండ్రలో 5. నిమ్మర్లు; నీదూఱు 6. వలదే నామాఱు గన్ 7. భామలకును 8. వెఱ్ఱివైతి 9. మది 10. లొందఁగ [ఈ పద్యము కొన్ని ప్రతులలో 92-వ తర్వాత నున్నది.]

సీ. ఒకమంజువాణి పాయక మొగంబున [1]వ్రేల
నొంపొంది సురసేవఁ జొక్కువాఁడు
వాసిగాఁ బంకజాతాసనుం [2]డనునుడి
వడినాఁడు [3]రాజసప్రకృతివాఁడు
[4]పాలుమాలుచునుండఁ బసిబిడ్డల హరించి
దంష్ట్రికి [5]ద్రోహంబు దలఁచువాఁడు
దా సదాస త్త్వవ ర్తనుఁడు నేత వికారి
[7]తన మరాళగతి యేతఱిని విడఁడు

గీ. నలువ [8]నలువగలనుఁ జూడఁ దులువ [9]గాఁడె
యతని నన బనియేమి లోకాధిపత్య
[10]మిచ్చి యందఱ లోఁ దల యెత్తికొనెడు
నటులఁ జేసినయీశ్వరు ననుట [11]గాక. 92

మ. అని శోకించుచు నున్నతల్లిఁ గని యమ్మా నేను జిత్రాంగి న
ట్లనె నీమాఱుగనే [12]తలంపుచు మరు ల్వాటిల్లి యాయమ్మ న
న్నెనయఁగా గోరిన నియ్యకోక కడకే నేతెంచితిం గాని [13]పా
పని యేదోసము నే నెఱుంగను మనోవాక్కాయకర్మంబులన్.

ఉ. అమ్మరో పోలుపొం దెఱుఁగ [14]కమ్మనుజేశుఁడు నాలిమాట ని
క్కమ్మని కోయఁ బంచె సరగన్ సభవారు నుపేక్షసేసి నా

---

1. వ్రాల 2. డను పేరు 3. ఛాందసప్రకృతి 4. పాలుపాలనుచుండ 5. దోసంబు 6. సత్యవ ర్తనుఁడు 7. తన మాయలగతియే తనరినాఁడు 8. నలువగఁజూడఁగా 9. గాదె 10. మేచియిందఱ 11. గాదె 12. తలంతును మరుల్వాటిల్లు నాయమ్మ 13. పా 14. అమ్మనుజేశ్వరుఁడాలిమాట.

యమ్ము దలంప కిచ్చకమె యాఁడి దిఁ కేమనవచ్చుఁ గన్న మో
హమ్మున నీకుఁ బోదుగను కార్తిఁదలంకుచువచ్చి [1]తిరియ్యెడన్.

గీ. చెల్లఁబో నీకు సాధ్వీమతల్లి వైన
తల్లి [2]కీతల్లి వచ్చెఁగా దన్నుఁ గనుట
వల్ల నీ వల్లధారుణీవల్లభాజ్ఞ
మీాఱి యీరీతి వచ్చుట మేఁ రఁ టమ్మ. 95

చ. అడలకుమమ్మ నీవు కల నైనను రాజును దూఱకమ్మ యే
యెడల సపత్నితోఁ జెలిమి యించుక దప్పకుమమ్మ నాదుసం
గడిఁ [3]జరియించు [4]నాదుచెలికాండ్రను నావలెఁ [5]జూడవమ్మ యిం
పడరఁగ నన్నిఁక న్మఱవవమ్మ విచారము మాని మానినీ.

క. జననీ విచ్చేయుము నీ
వనుచుఁ సాష్టాంగవినతుఁ డై లేవనిచో
ననుఁ [7]గఱుదుల ప్రోవగుతన
యునుఁగరుదులబిడ్డఁ జూచి యవనతకర యై. 97

క. లేవోయి యన్న రేపటి
దీవన నేకొదువ లేక దీర్ఘాయుఁడ వై
దేవునికృప వర్ధిల్లుము
నీ వని దీవించి మిగుల నెగు లుప్పొంగన్. 98

ఉ. కందుఁ గదయ్య నీమువు కన్నులపండువు గాఁగ నంటినం
గందుఁ గదయ్య నీతనువు కౌతుక [6]మొప్పఁగ నీదుప్రాపు నేఁ
గందుఁ గదయ్య యంచు నినుఁ గన్నసపత్ని సహింపవందుఁ బో
కందుఁ గదయ్య యేల వినవైతివి నావచనంబు పుత్త్రకా.

---

1. తీయొదక; తీడకుఁ. 2. కీతల్లియొదవెఁగా 3. దిరుగాడు 4. వారి 5. జూడుమమ్మ 6. మొందుచు; మొందదు; మందుచు.

సీ. చంద్రోదయం బైన చందాన నీరాక
గన్నులు చల్లగాఁ [1]గాంతు నెపుడు
నినుఁ గొండగాఁ జూచుకొని యేవిచారంబు
లేక యుండుదు నాత్మ లేశ మైన
నిసుమంతదడ వైన నీవు రా కుండిన
నది యేమొ రాఁ డని యెదురుచూతుఁ
దెలియఁ [2]జూచినయెడ దృష్టి దాఁకునొ యని
వేడ్క [3]దీరఁగఁ జూడ వెఱతు నిన్ను

గీ. నెటువలెఁ [4]దరింతు నీరూప మెచటఁ గందు
నీ విఁక నను వత్తు వని యెందు నెదురుచూతు
మనసులో నిన్ను నేలాగు మఱవ [5]నేర్తు
నీవు లేనిది యొక బ్రతుకే కుమార. 100

క. తనయాత్మకు ప్రేఁగాయెనె
తనయా యిపు డెంత సేసె దైవ మయో నీ
తనయా యిఁక నెటులఁ దరిం
తనయాప్తిని నే నభాగ్య నగుజంత నయా. 101

సీ. జననవేళలు సూచి ఘనుఁ డౌ ననిరి గాని
వెలయ లేఁ డని నాఁడె దెలుప రైరి
కరము రేఖలు సూచి ఘనుఁ డౌ ననిరి గాని
ప్రబల లేఁ డని నాఁడె పలుక రైరి
గతిలక్షణము సూచి ఘనుఁ డౌ ననిరి గాని
[6]యీడేఱఁ డని నాఁడె యెంచ రైరి

1. గందు 2. జూచిననేడ 3. దప్పక 4. ధరింతు 5. వచ్చు 6. యెడరలే.

యనుపమాకృతిఁ జూచి ఘనుఁ డౌ ననిరి గాని
కడతేఱుఁ డని నాఁడె నుడువరైరి

గీ. కటకటా నమ్మఁ దగ దేడ [1]గ్రహబలంబు
లేడ సాముద్రికము లేక నేడ చిన్నె
లేడ ఘనగాత్ర [2]మహిమలు నేడ సుద్దు
లంచు రత్నాంగి సుతుఁ జూచి యలమటించు. 102

క. పలవించుఁ బల్లటించున్
బలపల కన్నీరు నించుఁ [3]బసివాఁ డంచున్
విలపించున్ [4]బోలు వెంచున్
దలవరులకు నప్పగించుఁ దల యటు వంచున్. 103

చ. కనుగొని మూర్ఛిలుం దెలియు గాసిలు నొందలయూఁచు
నేఁటితో, నిను [5]నెడఁబాసి పోవలసెనే యని యక్కునఁ
జేర్చుఁ బోదు నా, యను నటుఁ గొంతపోవు [6]నుసురంచు
వెసం జనుదెంచుఁ దోట్రుపా, టొనయు లతాంగి కన్నకడు
వేగతి నోరిచి యుండు నక్కటా. 104

క. ఇటువలెఁ బెక్కుదెఱంగుల
నట వనటఁ దూలంగి రాక యాఱటపడఁగాఁ
దటుకున [7]నిది రా జెఱిఁగిన
నటమట మగుఁ గార్య మనుచు నాళీజనముల్. 105

1. గ్రహబలంబు-నేడ 2. మహిమలవేడ 3. పసిపాపంచున్; పరితాపంబున్ 4. పలవించున్ 5. (బెడబాసి 6. నుసురన్ మరలన్. 7. ని (న) టు.

ఉ. చేడియ రమ్ము వెన్నెలయుఁ జీఁకటివంటివి సుమ్ము మేలునుఁ
గీడును గొంత కాలము సుఖించినవార కృశింతు రాత్రిమై
నాడిక లొందువార సుఖ మందుదు రోడలు బండ్ల వచ్చు బం
డ్లోడల వచ్చు నీకు నిటు లూరక చింతిల నేల మానినీ. 106

వ. అని యూఱడిలం బలుకుచు నిరుగడలఁ జేతులు వట్టి మిగులఁ [1]దెగువం దిగువం బడియున్న మగువఁ దిగువఁ బ్రౌఢసఖీవారంబు బలాత్కారంబున నెట్టకేలకుఁ [2]బట్టి నెడఁ బాసి గాసి యగునెగులునం దనుం గనుంగొని పురజనంబులు పుర పురం బొక్కుచుఁ బురస్కరింప నత్యంతఖిన్నత్వ [3]మంది మందిరంబునకుం జని [4]తనుజుని గుణబృందంబుల డెందంబునం [5]దలంచి నోరు గాయ యిడక యద్దేవి పరిదేవనంబు గావించు చుండె; [6]నంత నాక్షణంబున నగరరక్షకు లతీక్ష్ణనిశితకౌక్షే యక ప్రకాండ ప్రచండభుజాదండు లై దండధరకింకరు లన నుద్దండత గండు మెఱసి [7]రసామండలాధిపకుమారుం గొని పోయి, [8]నిజశితవిషాణ కృపాణ రణ శబ్దగుణవారణాహ్వాన [9]సంవిధానసూచక మస్తకోపరిన్యస్త ప్రత్యాకుంచిత [10]హస్త నిస్తులాదభ్రవిభ్రమ [11]ధురంధరసింధుర దిక్కూలంకషాహంకార ఘీంకార సంకులంబును, నక్షుద్ర మాధురీధురీణ

1. తిగువందిగువంబడియున్న మగువం దెగువ 2. బట్టితీసినఁ బట్టినెడఁ బాసి 3. మొంది 4. నందను 5. దలంచితలంచి. నోరుగాయవడఁగన;... గాయవేయక 6. నంతనగరరక్షకు లాక్షణంబనిశిత .. 7. కుమారమండలా ఖండలుం 8. నిజశితవిషాణరణ; యతియతీక్ష్ణ కృపాణరణ 9. వైఖరీ సూచక 10. హస్తప్రశస్తాదభ్ర 11. ధురంధరదిక్కూలంకషసింధుర ఘీంకార.

క్షౌద్ర[1]లిలిక్షా జిహ్వాచాపలాచ్ఛభల్ల ఖరనఖరభల్లముఖ విదళిత బహుళనాకుకుహరముహుర్ముహుర్బహిర్నిర్గతానర్గళ కుండలిమండలీగ్రసనవ్యసనసముల్లసద్వనమయూర కేకాకుల వ్యాకులంబును [2]ననేకోలూక త్రోటికోటిత్రుటితకోటర నిద్రాణ కరటకు లోడ్డయన గరుత్పుటల పటపటార్భటి కావిఘటిత నిద్రాతంద్రా విద్రావి కపి కంపిత శాఖిశాఖా సహస్ర పరిపతిత పరిణత ఫలరసప్రపూరపూరిత నానా లతాలవాలవలయంబును, [3]ప్రవృత్త సంవర్తసమయ సమున్నిద్ర *సముద్ర కలిలసలిల గాఢావగాహ దుర్విషహ సర్వంసహాసముద్ధరణచణ శాంబరీకిటి విడంబనాడంబర లంపటఘోరతర ఘోణాముఖనిఖాత క్ష్మాతలగర్భ నిర్భరబల స్తబ్ధరోమస్తోమాస్తోకనిర్ఘాతపాత స్ఫీతభీషణ ఘుర్ఘురనిర్ఘోషణా చంకంప్యమాన ద్రుమపరంపరా భయంకరంబును, [4]దుర్ధర్షతరామర్ష ప్రపంచిత చపేటికా నిహత బహుళ హరిణ గణ గళగళిత రుధిరధారార్ద్రి చరణవిన్యాసదీపిత నిజపద్ధతి నివేదిత [5]వ్యాఘ్రసమూహ దురవగాహంబును నై, సత్త్రంబు

1. లిలిక్షుజిహ్వాపల్లవాగ్రచాపలా 2. ఉలూకానీకచ్ఛేదితపాదపాగ్రనిద్రాణపరభృదంబాళిగరుత్పుటలపటపటార్భటీకాచలితోన్నిద్రశాఖామృగజాలకోలాహలంబును 3. అధోభువన జరఠనిజకుల పరివృఢ సాహాయ్యకర్మఠశంకాహఘోణముఖక్షుణ్ణక్షోణీతలోన్నమన్ముస్తాల స్తబ్ధరోమాస్తోకానోకహపరంపరాకంపమానఘుర్ఘురనిర్ఘోషభీషణంబును 4. కంఠలుంఠనప్రసరదశ్రుధారాపానపరితృప్త ద్వీపిగుప్త మృగకులవ్రాతపూతిగంధ్యాహూత వృకజంబుకనికరనాద మేదురంబును నై 5. ద్వీపిసమూహ.

* సముద్రసలిలగాఢావగాఢదుర్వగాహ సర్వంసహా.

గావున నఖిలద్విజాశ్రయం బై, వనంబు గావునఁ బుండరీక నిలయం బై, కాననంబు గావున సకలాగమరమణీయం బై, కుంజరహితస్థలంబు గాకుండియుఁ గుంజరహితస్థలం బై, [1]సుమనస్థానంబు గా కుండియు సుమనస్థానం బై, పల్లవాగమంబు గాకుండియుఁ బల్లవాగమ్యం బై, యొప్పువనకాంతారంబు [2]సొచ్చి, యచ్చట నకాలసంధ్యారాగకృదభ్రంకష [3]చిటాచిటార్భటీ నట చ్చటులదావపావకోత్కీలం బైన కుత్కీలంబునోలంబున [4]నిల్పి, తా మంతకు ముందుగ నృప సత్తముచేత మూఁడు త్తరువులుఁ గొన్నవా రగుటం జేసి యాసత్పురుషారాధ్యుని వధ్యశిలమీఁద నునిచి [5]యయ్యేడ.

సీ. హిమశైలజాజానియెదురుకట్లకుఁ బోని
యల యించువిలుకాని చెలువువానిఁ
గళలు మెచ్చుము గానికలువనెచ్చెలికాని
మురువుఁ [6]గి మ్మన నీనిమోమువానిఁ
గసటు లేనికడానిపసిఁడి నించుకయేని
సరకు సేయనిమేనిచాయువానిఁ

1. అధికపా. విద్రుమస్థానంబుకాకుండియు విద్రుమ స్థానంబై 2. ప్రవేశించి తన్మధ్యవిపినంబుననకాలసంధ్యారాగవ (కృ)దభ్రంకష; ప్రవేశించి తన్మధ్యవిపినంబుననకాండకాండవిత సంధ్యారాగమండితాభ్రమండలభ్రమాధ్య వశీక ముద్దండగండశైలోపకంఠ ప్రచండదావపావకోత్కీలంబున నిల్పి యందు ముందుగ 3. చిటచటులార్భటీ...;కూటఝాటతటదందహ్యమానదావపావకో త్కీలంబైన 4. నిలిచి యంతకుముందుగనృపసత్తమగణ్యమూఁడుత్తరములు 5. రయ్యేడ 6. గమ్మనని నెమ్మోము.

[1]గలికితురుమైన యాని [2]నలుఁగనివిరిఁ బోని
మొలక ప్రాయముఁ [3]బూని యలరువానిఁ

గీ. గరగరనివాని ముఖవిలోక [4]ప్రవర్ధ
మాన మోహాపమోరాశి మగ్న యువతి
జన హృదయ సంగ తాంగజ జ్వలన సామి
ధేని [5]యగువానిఁ జిఱుతుకతేనిఁ జూచి. 108

క. ఎటువలెఁ దునుమఁగ వచ్చున్
గటగట యీతలిరువంటి [6]కరపద మనుచున్
[7]జొటజొట కన్నీ రొలుకఁగఁ
గటకటపడి విన్నఁదనము గడలుకొనంగన్. 109

ఉ. ఉన్నతలారులం గని ప్రియోక్తుల నాతఁడు మీరు నాకు నే
నెన్నఁడు మీకు నెగ్గు ఘటియించుట లేదుగదా [8]నృపాలుఁడే
మిన్నక యాజ్ఞ [9]వెట్టుఁ డనె మీఱఁగ వచ్చునె [10]మీకు నేటికిన్
ఖిన్నత నొందఁ జేయఁ దగుకృత్యము సేయుఁ డటంచుఁ
బల్కినన్. 110

చ. తలఁపుము నీకు నిష్ట మగుదైవము నావుఁడు దల్లిదండ్రులన్
దలఁతు నటన్న నిర్దయతఁ [11]దామె తెగించిరి ధర్మదేవతన్
[12]దలఁచెదనంటివా [13]యతఁడె దండ్యునిఁగా నొనరించెఁదల్లి దం
డ్రులు నిఁక దైవముం దన కుదుప్రభుశేఖరుఁ డేతలంపఁగన్.

1. గరుకు 2. కలఁగని 3. వాని; వూని 4. నవిరాజమాన 5. యగునాకొదమ రాచతేని; యగువానిఁ జిఱుతరాతేని; యగు నాచిఱుతరాచవాని 6. కరపద్మంబుల్ 7. బొటబొట 8. నృపాలుఁడే 9. వెట్టుఁడన; వెట్టుమనె 10. మీరలేటికిఁ; మీకు నేటికి 11. దారె 12. దలఁతునంటివా 13. యనఘు.

చ. అని హృదయాళిఁ డాయన గయాళిఁ గాలుని సంహ
రించి మిం, చినఘనునిం గరంబు విలసిల్లఁగ దివ్యపదం బొ
సంగు వే, ల్పును బరమేశు శంకరుని లోకశరణ్యుని భక్త
వత్సలుం, బెనఁగొనుభక్తి హృత్కమలపీఠి దృఢంబుగ నిల్పి
యుండఁగన్. 112

గీ. [1]గత బహుళపక్షమునఁ గడా కరపదంబు
దలుఁగవలయును సారంగధరున [2]కరయ
[3]గతబహుళపక్షమున నలకరపదంబు
దలుగ వలసెను సారంగధరున కపుడు. 113

గీ. వాఁడికత్తుల నెత్తురు వఱద గాఁగ
హర మహాదేవ శివ యని యతఁడు వల్కఁ
దఱిగి తలవరు లావిపత్కరుఁడు గాని
రాసుతు విపత్కరుఁడుఁ గాఁగఁ జేసి రపుడు. 114

ఉ. లా వగు నట్టిదుర్దశయలంత సహింపఁగ లేక యశ్రుధా
రావళి గాఱ హా జనని హా జనకా యని [4]బెట్టు గాఁగ వా
పోవుచు జొత్తుపాప యనఁ బొల్పగు దేహము రక్తసిక్తమై
భూవరసూతి కీలెడలుబొమ్మవిధంబున వ్రాలె [5]భూస్థలిన్. 115

గీ. అతఁడు వడియెడుదురవస్థ కాత్మఁ బొగిలి
కొంతతడవు [6]నికుంజాలిపొంత వ్రాలి
తొంతతనుఁ డైన [7]యతనివృత్తాంత మెల్ల
నరసి పోదము గా [8]కని యట దొలంగి. 116

1. ఛర 2. కనియు 3. ధర 4. బిట్టు 5. ధారుణిక్ 6. నికుంజంబు పొంతకుఁజని 7. యితని 8. యని.

చ. తలవరు లేఁగ లేఁగపులితండము నెత్తుటిగొల్కునై హాళా
హాళిమెయి రాఁగ తాఁగ లయినట్టి[1]వృకంబులు [2]కోల్పొల్
రొదల్, చిలుకుచు నీఁగ నీఁగలును జీమలు దొంతర గాఁగఁ
బై పయిఁ, బిలపిల మూఁగ మూఁగనవలె బెగ్గిలి [3]పల్కుఁగ
లేక వేదనన్. 117

క. సొమ్మసిలి కొంత [4]తడవుకుఁ
గ్రమ్మఱఁ దెలివొంది [5]చూచి కం దెఱచి సమీ
పమ్మున నెవ్వరిఁ గానక
[6]నుమ్మలిక మెసంగ నసువు లూటాడంగన్. 118

చ. అలఁత సహింపరాదు తెగటార్తురు రం డిపు డెందుఁ బోతిరో[8]
తలవరులార మా రయిన దగ్గఱ వచ్చి వధించి పోవరే
యలమట కోప నోమృగములార యయో [7]దవకీలలార [8]నన్
బొలియఁగఁజేయరే వెతలఁబొందఁగ లేనని [9]కూయు వేమఱున్.

గీ. కుపితమానసుఁ డై వృథా కోయఁ బనిచె
నకట యిటువంటి[10] కుపిత యెం డైనఁ గలఁడె
కాలుచేఁ గోఁత పడలేక [11]కడకుఁ దొలఁగఁ
గాలు చే గోఁత పడఁ జేసెఁ గా లతాంగి. 120

సీ. దొరలచిత్తంబు లీకరణిఁ బాటిల్లుఁ గా
యని తండ్రియవివేకమునకు నడలుఁ

---

1. మెకంబులు 2. క్రేఁబొదల్; క్రొంబొదల్ 3. పల్కుట; పల్కులు 4. తడిసిన 5. తేచి 6. ఉమ్మలికలెసంగ; ఉమ్మలికంబునను 7. వనకీల 8. న 9. రోయు 10. కుఃఖు; కుఃకు 11. కడదొలఁగిన; కడ దొలంగ.

దరళలోచనల నేతటి నమ్మరాదు గా
యని [1]పినతల్లి మాయలకుఁ దలఁకు
నేమి చేసితి నేర మిటు సేయ దేవుని
కిని బాడి లేదు గా యని [2]గలంగుఁ
దొలిమేన నెవరి బాములను బెట్టితి[3]నొకో
యనుభవింపక పోనె యనుచు వగచు

గీ. సచివసుతుమాట నిజ [4]మాట సారెఁ బొగడుఁ
గొంతసే పేడ్చుఁ జింతించుఁ గొంత [5]ప్రొద్దు
శర్వ శంకర శశిధర శరణు నాకు
నీవె యనుచును నొడువు నొకింతతడవు. 121

గీ. ఇటువలె ననేక గతుల నారటము [6]నొంద
గగనభారతి వానిపైఁ గరుణ వొడమి
యడలకు కుమార నీ కిది గడవనేర
దె ట్లనినఁ బూర్వవృత్తాంత మెల్ల వినుము. 122

క. ధరమై మోహానబింబా
ధరమై రిపుభయదహాయ మదావళ వీరో
త్కరమై మహనీయరమా
కరమై కౌశాంబి యన నొకపురం బమరుఁ౯. 123

క. ఆనగర మేలురా జా
జ్ఞానయబలశాలి సత్యసంధుఁడు సుగుణాం
భోనిధి శ్రీహరిపదసే
వానందుఁడు ధవళచంద్రుఁ డనఁగాఁ బరఁగుఁ౯. 124

1. బడితల్లి 2. గరంగు 3. నొకొకొకుభ 4. మని 5. తడవు 6. పొంద

గీ. అతని [1]కేవ్రురు సతు లుందు రందులోన
భువనసుందరి యనియొడు[2]భోగసతికి
మేలువాఁడు ధరాతల మేలువాఁడు
మేదినీంద్రులలో నెల్ల మేలువాఁడు. 125

పంచచామరము.

అమాత్యు లిద్ద ఱుందు రా ధరాధినాథుచెంగటన్
సుమంతుఁడున్ జయంతుఁడున్ వసుంధరామరాగ్రణుల్
సమానశీలు రందులో [3]వలంతి యంచు రాజు ప
క్షమై సుమంతుమాట వించు గారవించు [4]నెంతయున్. 126

గీ. అందుల కసూయఁ [5]గొఱకొఱ మంచు మిగుల
దుష్ట కపటవిచారవంతుఁడు జయంతుఁ
డంతకోపముఁ [6]జెప్పుడు సుమంతుఁ డనుము
నంతకోపముతో నుండు నాత్మలోన. 127

క. [7]అట కొంతకాల మరిగిన
నట వాఁడు సుమంతునకు మహైశ్వర్యం బు
త్కటమై గడియ కుడుకునీ
రటువలె హెచ్చిరిలి రాఁగ నతిమత్సరుఁ డై. 128

గీ. భువనసుందరియింట నెప్పుడుఁ [8]జరించు
గుట్టుగలదాని మిక్కిలి గట్టివాయి
[9]దానిఁ గాకిని యనుదాని దాసి నొకతెఁ
దనకడకు బిల్వఁ [10]బంచి మంతనమునందు. 129

---

1. కేగురుగలరాండ్రు; కేడుగురాండ్రుందు 2. భోగవతికి 3. వలన్ జరించు 4. మిక్కిలిన్ 5. గఱకఱ 6. దవురాసుమంతుఁ డనుచు; దొపుడా సుమంతుఁ 7. అటు 8. వసించు 9. గాఁ గేళి 10. వంపి.

క. విలువల్ [1]దెలుపం గూడని
వలువల్ మణిభూషణములు వలసినధనముల్
చలువల్ దొలఁకుకదంబము
చెలు[2]వాలుకఁగ నొసఁగె సంతసిలి కఱ దనియన్. 130

గీ. ఒసఁగి [3]యయ్యుగ్రకలికరాబ్జయుగ మాత్మ
హస్తమునఁ బట్టి తాఁ దీసి కుస్తరించి
నీవలన నొక్కకార్యంబు గావలయును
జేసెదే యని మొగ మింత చేసికొనుచు. 131

క. మతిమంతుఁ డని సుమంతునిఁ
బతి మన్నన సేయు నన్నుఁ బలుచగఁ జూచున్
సతతంబు దాన గర్వా
న్వితుఁడై యున్నాఁడు వాఁడు [4]నేఁడు లతాంగీ. 132

క. వాని కపాయము సేయం
గా నైనయుపాయ మొకటి గల దది నీచేఁ
గాని మఱి యెవరిచేతం
గానేరదు పనులు దెలియఁగా రాదు సుమీ. 133

గీ. కికురువెట్టి సుమంతుబొదుకలు గొంచుఁ
బోయి యెవ్వరుఁ గనకుండ భువనసుంద
రీవరారోహమంచము క్రింద నుంచి
మామనములోనినెగు లార్పుమా మృగాక్షి. 134

1. దిరుపం 2. వందఁగ సతఁడు సంతసిలి 3. యంతట నాలేమహస్త
4. నీరజనేత్రా.

క. [1]అనిన నది యెంత గల ద
ట్లన సేసెవ నంచుఁ జని [2]యట యొకానొక [3]నాఁ
డోనవెట్టుకొని మెలంగఁగ
నను వైనసుమంతుపావ లది లాగించెన్. 135

క. ఆలాగునఁ గొనిపోయి నృ
పాలప్రియపాన్పుక్రిందఁ బాదుక లిడి యా
లూలామాలపు నాలి గ
యాళి తనుం గానిదానియటువలె నుండెన్. 136

వ. తదనంతరంబ. 137

సీ. [4]ఘుమ్మని వాసించు కమ్మపువ్వుల సరా
లొఱపుగా సిగఁ గొంత యొఱగఁ జుట్టి
కళలు దేఱెడునెమ్మొగమున సైకముగాఁగ
మంచికస్తూరినామంబు దీర్చి
కట్టాణితెలిపాలకాయముత్తెపుటొంట్లు
[5]చెలువీను వీనుల నలవరించి
పునుఁగు [6]జవ్వాది కప్పూరము గుబాళించు
కలపంబు మేన జొబ్బిల నలంది

గీ. మిసిమి[7]గెంటెముకాంతి వెల్విసవ వింత
వగబవంతిదుప్పటి వలెవాటు వైచి
చకచకల్ గలరత్నపాదుకలు [8]మెట్టి
ధవళచంద్రుండు మోహంబు [9]తరువు సేయ. 138

---

1. అనవుండు నింతగల; అనవ్రడుని చెంతగల 2. యటందానొక; యటనొకానొక 3. నాఁడును బెట్టుకొని 4. గమ్మని 5. చలువీన; చెలువుగా 6. జవాదికప్పురముఁ 7. గోణా(ణ)ముజిగి 8. తొడిగి 9. తరవు.

చ. పరమవినీతి నాతి వెలిపావడచేఁ దడియొత్తి యొత్తిపై
పొరనడిమీఁనెయుం దిగిచిపొంకముగాఁ గొన [1]గోటఁ ద్రుంచివే
మరు బొటవ్రేలఁ దీసి తగుమాత్రము సున్నము వెట్టిచుట్టియ
య్యొరుగడనొక్క యాకుమడుపిచ్చిన నందివిడెంబు సేయుచున్.

చ. కలరవ శారికా శుక పిక స్వర సుస్వర భాస్వరోక్తి సం
కుల మకళంక సంకుమద కుంకుమపంక కురంగనాభి గం
ధిల మఖిలస్థలస్థగిత దివ్యమణీగణ చాకచక్యమం
జులమును నైన యాభువనసుందరికేళిగృహంబు చేరఁగన్.

గీ. ఒకతె పావడ లందీయ నొకతె కుంచె
వైవ నొకతె లామజ్జకవ్యజన మూన
నొకతె కైదండ యొసఁగ నిట్లుభయపార్శ్వ
ములఁ బలుపు రూడిగము సేయఁ బోయె నపుడు. 141

ఆ. ధవళచంద్రకాంత నవ వేదినుండి యా
ధవళచంద్రకాంత తత్తళమున
ధవునిరాక గాంచి దమి లేచి కుముదబాం
ధవు నిరాకరించు నవ్వుమొగమున. 142

సీ. ఉన్మత్తపూవంటి యొఱపైన [2]కుచ్చెల
చెఱఁగు మట్టెలమీఁద జిందు ద్రొక్క
[3]మెల పైనవలరాజు మేడపై బంగారు
కుండలో యనఁ గుబ్బగుబ్బ [4]లమర
నెమ్మోము రేరాజుసమ్ముఖమ్మునఁ గ్రమ్మి
కమ్మపంజుల [5]మెఱుం గెమ్మె నెఱప

1. గోరఁజీల్చి 2. కుచ్చెళ్ల 3. మెఱపైన 4. లారయ 5. వెలుం.

భోగినీమణి గానఁ బొందుసేయఁగ వచ్చు
నీలాహి యన వేణి నీటుసూప

గీ. సైకతనితంబ [1]మొకవింత చలన మొంద
నలఁతి లేనడు మల్లల నాడుచుండ
నవని నిదిగాక యొయ్యార మద్దిర యని
యెంచ నట నాతి వచ్చె రాయంచనటన. 143

క. అటు లెదురుగ నేతెంచిన
కుటి[2]లాలకఁ గూర్మి యనలుఁ గొనలుం బొడన్
[3]జిటిపోటినవ్వులు గనుఁగవఁ
బొటమరిలం జూచి పలికెఁ బులకల్ దొలఁకన్. 144

క. నీదండకు రాకుండినఁ
బూదండల ప్రేయు నన్నుఁ బొడగని [4]నప్పుడో
వేదండ[5]గమన సుమనః
కోదండధరుం డదేమొకో దండ మనెన్. 145

క. అని సరసోక్తుల మక్కువ
గనిపింపఁగఁ [6]బలికి కలికికరపల్లవ మిం
పొనరంగఁ బట్టి [7]మెల్లన
తనుసంగమ సౌఖ్యవివశతను జని [8]చెంతన్. 146

సీ. [9]నికరంపుజిగి కెంపు నీలంపురా చెక్క
డపుసకినల పగడంపుఁగోళ్లు

---

1. మొకకొంత 2. లాత్మకఁగూర్మియనలఁ గొనలంబొడన్ 3. జిటికొని నవ్వ గనుంగవఁ 4. నేఁడో 5. యాన 6. (గలికి (బలికి 7. మెల్లనె 8. యంతన్ 9. నికరంపు...పురాల్: రవకెంపునీలంపురా కుందనపు.

[1]హాయలుగుజ్జరినేఁత హొంబట్టుఁబట్టెడ
 పఱపైనజాలీల పట్టుఁబఱపు
[2]పచ్చసూర్యపటంపు బటువుబిళ్లలు రంగు
 సొలపుచొకాటంపుఁ దలగడయును
[3]దఱుచైనహురుమంజి తళుకు ముత్తెములచ
 ప్పరమును జిగి దోమతెరయుఁ గల్గి

గీ. మంచి[4]వగఁ [5]జొక్కమైనట్టి మంచముపయిఁ
జలువ చెంగల్వ చేమంతి జాజివిరులు
పఱచి కడుఁ బొంకపఱిచిన పాన్పుమీఁద
రాజు పవళించి యున్నంత రాజవదన. 147

సీ. ఎప్పు డెప్పు డటంచు నెనయఁ గోరెడుకోర్కి
 మరలించె బోటులఁ దిరిగి చూచి
సరగఁ బైఁ బడఁ దీయ మరలుగద్దఱిచూపుఁ
 బదరకు మనియెఁ గంబమున [6]నొరగి
చిట్టాడుసిగ్గుతోఁ [7]జేపట్టఁ బెనఁగుడెం
 దము మట్టుపఱిచె నాననము వంచి

---

1. హాయిలు...బట్టెయుఁ బఱపైనయు(ఖు)రుతకాల్ పట్టుఁబఱపు 2. పచ్చసూర్యపుటంపు ..బిల్లలు జిగి సొంపు (సుళువు) చొకారంపుఁ 3. గొప్పహురుమంజితళుకుముత్యాల చప్పరమునుజరతా (రు) నీలంపు తెరయుఁ గల్గి; హురుమంజిముత్యాలతెరపైన మేలిచప్పరమును దగు దోమతెరయుఁ గల్గి 2. 3. పచ్చసూర్యపుటంపు పటువు బిల్లలు కరంగి సుళువు చొకారంపు తలగడలును, మురువొందుక్రొందళుకు ముత్యాల చప్పరమును జలతారు వెతయుఁ గల్గి 4. సవ 5. చొక్కమగుజిరి 6. నొదిగి 7. ఁజేపట్టి పెనఁగు.

తనుఁ బిల్వఁ దమి [1]హెచ్చినను జాగు సేసె గ్ర
క్కునఁ బోక కన్నుడఁ గట్టిపెట్టి

గీ. వలపు పతి నేఁప నటు నిటు నిలిచి [2]కాంత
కొంత [3]తరితీపుపైఁ జేరి కూరుచుండె
మగలు పైకొనునందాఁక మనసు గాన
నీయ రెంతటివగలవా రిందుముఖులు. 148

చ. సరసపునవ్వులన్ దనివి చాలని చుంబన గుంభనంబులన్
బరిపరిరీతులన్ మెఱయు బంధవిశేష గళారవంబులన్
సురత [4]మొనర్చి ముప్పిరుల సొంపునఁ దేలిరివార లయ్యెడన్
సరివల పైనకూటమికి సాటిఁక లేదు గదా తలంపఁగన్.

క. పెన్నురులఁ [5]జెమట మోఁద్పం
[6]గన్నులు వదలుకవుఁగిళ్లు గలవారలకున్
బన్నీరు గ్రోలుటయు నం
త న్నిద్దురవోవుటయు హితంబై యుండెన్. 150

చ. గమకపుగబ్బిగుబ్బ లెదఁ గాఁడ [7]నొకింతగ గౌఁగిలించి యిం
పమరఁగ నిద్రవోయి యపు డల్లన మేల్కని శయ్యనొర రైు
[8]ఘుమఘుమవాసనల్ గుబులు[9]కొఁదనపుక్కిటి[10]క ప్రపుబ్వెడెం
బుమియ మొగంబు వంచి సుగుణోత్తముఁ డప్పుడిగంబు
చెంగటన్. 151

---

1. హెచ్చియును జాగుసేసిన యనువున సారెఁ గన్నుడుగువెట్ట;... సేసె గ్రక్కునఁబోక కన్నంతఁ దడఁగు 2. కొంత 3. తరితీపుమై 4. మొనర్చు మంపిరులసొంపున 5. పెన్నురల చెమట; పెన్నెఱిచెమటర 6. గన్నుఁగవన్ వెడలునీళ్లు 7. నొకించుక 8. గుమగుమ 9. కొన్దన 10. లొనుపీడిలదం.

క. [1]కనకపు మిసమిస పావలు
కని కనలుచుఁ జూచి వింతగంటి మిదేమీ
వనితా తెల్పు మి వెవ్వరి
వని తా గద్దించి యడుగ [2]నరనిద్దురతోన్. 152

చ. భయపడి లేచి వే [3]యదిరిపాటునఁ గట్టియుఁ గట్టకున్న నీ
వియు నెలవంకచన్నొనల వేసియు వేయని పైఁటకొంగు
దోఁ, పియు నట దోఁపకున్న యలపెన్నెఱికొప్పును నై వి
తాకురా, లయి యవి చూచి యల్లలన యల్లల నాడుమ
నంబుతోడుతన్. 153

గీ. అప్పుడు [4]కన్నీరు గాఱ నోం డాడ వెఱచి
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి యున్న
నారమణివల్ల సంశయం [5]బెరుపడక
పడకయిలు వెల్లివచ్చి భూపాలుఁ [6]డప్పుడు. 154

క. మొకమజ్జన మై సంధ్యా
దికకృత్యము లాచరించి దివ్యవిభూషా
చకచకలు మేనఁ బర్వఁగఁ
దుకతుకతో నుల్ల మప్పుడు [7]తుకతుకనుడుకన్. 155

చ. కొలువున కేఁగి వేత్రధరకోటి నిజాయతదృష్టి వాఱుచో
బలసి తటాలునం బగిలి పాఱ బరాబరి [8]సేయుచున్న వా

1. మినమినమును, పావలుఁగని కనలున నిటవింత పాదుకలు రా నేలా; మిన మినమునున ప్పావలుఁ; గని కనలునవింత పాదుకలు రానేమి 2. వనటునిదురతోఁ 3. యదుదు, యుదరు 4. కన్నీళ్లగాల 5. బెఱుకపడక 6. డలుక 7. తొట్రుపడంగన్ 8. సేయుమన్నవారలు.

రలు దునెదారులుఁ దొరలు రాజులు మంత్రులు నిష్టబాం
ధవా, వళులు పురోహితు ల్వనులవార లనేకులు నిండి
యుండఁగన్. 156

వ. అప్పు డప్పాదుకలు దెప్పించి యంపఱముందఱం బెట్టించి
భూవరుం డివి యెవ్వరి వని యడిగిన వాక్రువ్వనేరక నివ్వె
ఱయు సంశయంబును హృదయంబుల [1]నతిశయం బయిన
నొకరొకరి మొకంబులు సూచుచు [2]సభాజనవిసరంబులు గుస
గుసలం బోవు[3]చున్న సమయంబున. 157

గీ. అపుడు చెవిదండఁ జేరి కే లడ్డగించి
మంతనంబునఁ జొ రాళికుంతలారి
కాలకేతుం డనెడు పేరు గలతలారి
వానివెత లారిపోవ భూవరున కనియె. 158

చ. తెలియఁగఁ జూచినాఁడ నివి దేవర సందియ మిందు కేమియు
న్వలదు సుమంతుపావ లనినన్ లయకాలునిలీలఁ [4]బేర్చి య
య్యలుక సభాస్థలిం గలుగునయ్యలు కంపితమానసాంగు లై
యలుక సుమంతుఁ జూచి యతఁ డన్ వికటభ్రుకుటీనిరీక్షుఁడై.

క. ఓపాపాత్మక లోనికి
రా పా ప్మని చన వొసంగి రాణువ యెల్లన్
నీపార్శ్వంబుగఁ జేసి మ
హాపరమాప్తునిఁగ నడప నాదట నిన్నున్. 160

1. నతిశయమ్మైన 2. సభాజనంబులు 3. చుండిన 4. బేర్చిన యయ్యలుక.

క. అసమాన రాజ్యవైభవ
లసమానునిఁ జేయుటకు ఫలం బిదె [1]యేమో
యిసుమంత యెఱుఁగ [2]వైనో
యి సుమంత కృతఘ్ను యర్హ్యమే నినుఁ జూడన్. 161

వ. అని కోపాటోపంబున నయ్యిలా[3]పతి కర్ణకలాపంబులుగాఁ గొన్ని దురాలాపంబులు వల్కిన నుల్కిపడి యొకనాఁడును మాఁడెత్తు[4]మాట వడనివాఁడు గావునఁ దనవల్లఁ గల్ల [5]లేకునికియు నిట్టి యపఖ్యాతి రాఁ దగునే యని [6]నిలువునకు నిలువున నే కరంగి దిగఁ[7]జెమట వెట్టి తల వంచుకొని. 162

క. అడలుచుఁ బెదవులు దడుపుచు
[8]గుడికొనుకన్నీరు [9]గ్రుక్కికొనుచున్ మదిలో
నుడువని నెంజిలి నేమియు
నుడువనియమ్మానధనుఁ గనుంగొని వేగన్. 163

గీ. ఘుటిక మ్రింగినసిద్ధునియటుల నుల్లి
దిన్న కోమటివలె నూర కున్నవాఁడు
తెంపువైమె వీని నెటుల [10]శాసింపవలయుఁ
దెలుపుఁ [11]డన శాస్త్రసరణి సుధీజనములు. 164

చ. ధ్రువముగ రాణివాసమున ద్రోహ మొనర్చినవాని కాజ్ఞ త
ద్భవనము ముట్టుకో ల్గొని విభావరిఁ గాళ్లను జేతులు న్మహా
టవిఁ దునిమింపఁ జెల్లు ననుట న్వాని యట్లనె సేయుఁ డంచు న
య్యవనిసురుం దలారులకు నప్పనసేసె నృపాలుఁ డయ్యెడన్.

---

1. యేమీ 2. వైతో 3. తలపతి 4. మాటంబడినవాఁడు గాఁడు 5. లేకుండియు 6. నిలువుకు నిలువుకు 7. జెమటలుఁవెట్టఁదల 8. గుదికొను 9. తుడిచి 10. (జేయింప 11. డీ యన శాస్త్రసంసరణిజనులు.

క. సెల విచ్చె నూతఁ ద్రోయఁగ
నలివేణిని జీవితేశుఁ డై మును ప్రేమం
బొలుపొందెఁ గాన దుది న
య్యెలనాఁగకు నతఁడె జీవితేశుం డయ్యెన్. 166

ఉ. పట్టుఁడు పాఱుఁ డంచు నరపాలునిభృత్యులు సందడించుచున్
గట్టిగ నాతనిన్ విఱిచి కట్టిరి తన్నిలయంబు ముట్టుకో
ల్పట్టిరి చుట్టుపట్లఁ బదిలంబుగఁ గావలి పెట్టి రాప్తులుం
[1]జుట్టము లాలుబిడ్డలును శోకపయోనిధిలో మునుంగఁగన్.

క. చేయఁ దగునె రా జటు ల
న్యాయము [2]ననుఁ గర్మసాక్షి నడుగ న్వలదా
బోయ యని రోసి కడకుం
బోయెనొ యన నంతఁ బ్రొద్దు పొటుకునఁ గ్రుంకెన్. 168

ఉ. [3]ఆతనిఁ గొంచుఁ బోయి తలయారులు ఘోరవనాంతరస్థలిన్
జేతులు కాళ్లు తున్కలుగఁ జేసిన నాయపరాధహీనుఁ డా
పాతకదూరుఁ డాపరమపావనుఁ డాసుకుమారదేహుఁ డు
ర్వీతలమేదురీభవదసృఙ్నవబాష్పజలప్రవాహుఁ డై. 169

గీ. హరి హరీ రామ రామ నారాయణా య
టంచు వేదనఁ బొరలుచు నకట [4]తనకు
నెవ్వఁ డీకపటోపాయ [5]మెంచి చేసె
నతని కీపాటులే వచ్చు ననుచుఁ బలికి. 1 0

1. చుట్టపురాండ్రు బిడ్డలును; చుట్టములాండ్రు బిడ్డలును 2. దనుఁగర్మ
3. ఆతఱి 4. తన్ను 5. మెంచఁజేసె.

క. అసురుసు రై [1]సను వై యవ
నిసురుం డటు [2]తనువుఁ దొరఁగ నేరమి లేకే
యుసురు మనక పోయెదు[3]వాఁ
డుసురు మనక పోవునే నృపోత్తమతనయా. 171

గీ. ఆసుమంతుండె రాజరా జై జనించె
నలజయంతుఁడె నీ వై తి [5]వలఘుచరిత
యెవ్వఁ డేకాలమున మించి [6]యొట్లు చేసె
నాతఁ డాకాలమున నట్ల యనుభవించు. 172

వ. కావునఁ బూర్వజన్మ [7]దుష్కర్మంబువలన నీ కీదురవస్థ వా
టిల్లెఁ గాని [8]నీవలన నీజన్మంబునం దోషం బీషన్మాత్రంబు లేదు
మీఁద [9]శుభంబు రాఁగల దని పలికి [10]యశరీరవాణి యరుగ
వెఱఁగుపడి రాకొమరుండు పై పైఁ బెరుఁగుసొరుగునక్షాధరం
[11]బడి పొరలి మొఱ లిడుచుండె నంతఁ దత్కథావృత్తాం
తం బంతయు [1] నికుంజాంతరంబుస నుండి యాకర్ణించి. 173

క. [13]వంతఁ దల యూఁచి యౌరా
యెంతటిమాయలది యింత యెడ సేసిన దా
[14]యింతియ కద రా జెఱుకయు
[15]నింతియ కద యని తలారు లెంతయుఁ [16]జింతన్. 174

1. వ్యసువై యవ; యపుడయ్యావ 2. లసువు 3. వా,రుసురు మనక పోదురే 4. డవీవై ని 5. వనఘుచరిత 6. యొట్లు 7. దుష్టకర్మంబు 8. నీవల్ల నిప్పుడు దోషం బేమాత్రంబు 9. నీకు శుభంబు 10. యయ్యశరీరధర్మదేవత 11. బొరలిపొరలిమొరలి 12. ప్రాంతనికుంజాం 13. అంత 14, 15. యింతేకద ..నింతేకద; యింతెకదా ..నింతెకదా 16. వంతన్.

క. కువలయనేత్రాత్మజుఁ డగు
కువలయనేత్రాత్మజుని యకుంఠితరుచిరా
వ్యవిభూషణములు గొని కఱ
గవలను నీ రొలుక. బురమునకుఁ జని రంతన్. 175

గీ. తనదు పేరిటిసారంగధరుని నిర్మ
లాత్ము దండింపఁ జెల్లునే యనుచుఁ గనలి
భువనజాతభయంకరస్ఫూర్తి వెడలె
నన [1]మెఱసె యెఱ్ఱవాటి రథాంగవైరి. 176

గీ. మేలు పిచ్చుకుంటుమీఁద భాగీరథి
వచ్చె ననఁగ నపుడు వానిపైని
[2]గగనభాగచ్చంద్ర నిగనిగ చంద్రికా
లహరి యుబ్బి జొబ్బిలంగ నిండె. 177

ఉ. ఆసమయంబునం దొకమహాత్ముఁడు సిద్ధుఁడు మత్స్యనాథుఁ
డన్, భాసురశీలుఁ డన్నగముపై నొకచో గుహాలోన
నుండి యా, రాసుతుదీర్ఘరోదనవిరావము వీనులఁ బడ్డఁ
గానలో, నీసరిప్రొద్దు వోవునెడ నెవ్వఁడొకో [3]విలపించు
చుండెడున్. 178

క. ఆరసి వర్తము గా కని
యారసికుఁడు [4]వశికులామరాగ్రణి దీనా
ధారామితకరుణామృత
ధారాధౌరేయవికసిత మనోంబుజుఁ డై. 179

---

1. మెఱసియెఱ్ఱవారె 2. గగనభాగతలము నిగనిగచంద్రికా; పాఠ నిగనిగనుచుప్రబ్బియుచంద్రికా 3. పలవించు 4. తాపసోత్తమాగ్రణి.

సీ. పెనఁచి కెంజడలు నెత్తిని దిండుగాఁ జుట్టి
సింగినాదముకొమ్ము చెంపఁ [1]బెట్టి
పంచవన్నెలయోగపట్టె పొందుగ వైచి
[2]పాలుపునిద్దపు మేన బూది పూసి
పొడల[3]యొడ్డాణంబు నడుమున బిగియించి
వెలిపట్టుగంత [4]పై నలవరించి
పెళపెళ మనెడుబెబ్బులితోలు [5]మొలఁ గట్టి
చికిలిలాతపుఁగోలఁ జేతఁ బట్టి
గీ. [6]యక్షమాల సువస్తులకక్షుపాల
చెవుల నెలకాలకామాక్షు లవటుసీమ
సన్నవిడిగాడరుద్రాక్షసరము లమర
గిలుకుఁబావలు దొడిగి కుత్కీలము డిగి. 180

ఉ. అల్లన నేఁగి వాఁడు తను వంతయు నెత్తుటఁ దోఁగి భూమిపైఁ
ద్రెళ్లి నెగుల్ [7]ఘుటిల్లఁ గను దేలఁగ వైచి తలంకఁ జూచి హా
చెల్లరె యెంతపాతకము సేయఁగఁ జేసిరొ యిట్లు చందమా
మల్లునిఁ [8]బోలునీతలిరుటందపుఁ జక్కనికోమలాంగునిన్.

మత్తకోకిల.

ఏటికిన్ మదిలోన సంశయ మింక నాతఁడె [9]తెల్పు నా
మాట విందమటంచు నోయి కుమార యెవ్వరివాఁడ వీ
పాటు రాఁ గత మేమి నీకు [10]నిబద్ధిగా నెవరండ్రు నిన్
దేటతెల్లమి గాఁగ నంతయుఁ దెల్పుమా యని యాదటన్.

---

1. జెక్క 2. పాలుపు(ప్రొద్దు)నిద్దపు మేనబూతిరాసి 3. యొడ్డాణాన 4. పై 5. మెడఁ 6. కక్షపాళి 7. ఘటిల్లి 8. వంటియాతలిరుటందపు; తీరుపొరుపొబగందపు 9. తెల్ప 10. స్వభావ మెవ్వ రటండ్రు.

క. తాపసనాథుఁడు పలికినఁ
దాప సనాథుఁ డగురాజతనయుఁడు ముంజే
మోపి మొగ మెత్తి నెమ్మన
మోపిక లే [1]కోహటిల్లి యుసు రసు రనుచుక్. 183

ఉ. ఆర్చెదొ తీర్చెదో [2]తెలుప నయ్యెడి దే మని యంతఁ దేరి హా
[3]యోర్పు మెఱుంగ కంటి సదయోత్తమనీవెవరయ్య నన్ను నీ
డేర్చఁ [4]దలంచి మానవుని శేవను వచ్చినశంకరుండవో
కూర్చినప్రాణబంధుఁడవొ కూరిమి రాఁగ త[5]మెయ్యెదియ్యెడన్.

సీ. వినవయ్య రాజరా జనురాజుతనయుండ
సారంగధరుఁ [6]డను పేరివాఁడ
నొకపావురమువెంట వెకలి నై సవతిత
ల్లింటికిఁ జన నామె యొంటి నుండి
[7]కామాంధురా లయి కలయఁ గోరిన నీవు
జనని వే సుతుఁడ [8]దోసం బటంచుఁ
[9]దలఁగి వచ్చినఁ దనతప్పు నాపయిఁ జూపి
భూపాలునకు నెగఁబోసి యీర్ష్య

ఆ. నాజ్ఞ వెట్టఁ జేసె [10]నలకన్నతండ్రియు
[11]వెరవు మాలి యిటుల వేగిరించెఁ
దాపసేంద్ర యింక దైవంబు నే మని
దూఱువాఁడ వట్టి దూఱు వాఁడ. 185

---

1. కోవటిల్లి యసురసుర్రైతాక్ 2. తెలియ 3. యోర్పుటెఱుంగ; యోర్పకెఱుంగ 4. దలంపుపుట్టిదయనెక్కొన 5. మేమి యియ్యెడక్ 6. డనజరుగు (డనఁబరఁగు) వాఁడ 7. కామార్తు 8. దోషం 9. దలఁగివచ్చినది తప్పుగానాపయి; తలఁగివచ్చినది తప్పునాపైఁజూపి 10. నట 11. వెరపు.

ఆ. మృగకులంబె కాని [1]మిట్టాడు మానిసి
[2]యెందు లేనియట్టి యీ యడవిని
నీసుధారసోక్తి నెఱయ [3]నీయెడ విని
చెవులు చల్ల [4]నయ్యె సిద్ధవర్య. 186

వ. నీవు [5]మహాపురుషుండ వని తోఁచె నీసమ్ముఖంబు గలుగుటం జేసి యింతతడవు మాటాడఁ గలిగెఁ [6]గర చరణంబులు దివియుచున్నవి మున్ను కరపదచ్ఛేదనం బొనరించిన వారినే కంఠలుంఠనం [7]బొనరింపుఁ డని [8]వేఁడుకొనైతి ఘారాళికీలాలంబులు గ్రోలఁ [9]బయిం బడుపిపీలికామక్షికాదికంబులఁ జోపఁ జేతులు లేవు గర్భశ్రీమంతుం డయినరాజకుమారునకుఁ జూవిరా యీపోఁడుములు చూచితే యని [10]మోళ్ళు సూపి తత్కరంబులు శిరంబునఁ జేర్చి యింక నొక్కటి [11]విన్నవించెదఁ జిత్తంబులోనఁ గోపంబు లేదు గదా యని దీనాలాపంబుల[12]. 187

గీ. అసదుగాఁ జూడ కీమాట [13]యఘము చెంద
దసదుగా నిన్ను వేఁడెద యతివరేణ్య
యలఘుట సహింపఁ [14]జాలను బొలియ నొక్క
మందు [15]గల్గిన దయసేయుమా రయమున. 188

---

1. మిట్టాడ 2. యెనరు 3. నియ్యెడ; నీయడ 4. నాయె 5. మహాయోగిపురుషుండ 6. గరంబు(ల)నరంబులు దివియుచున్నవి; మున్న 7. బునే యుండ (మ) ని; బును జేయ 8. వేడుకొన 9. ప్రెలఁప్రెల 10. మొండ్లు; మోండ్లు 11. విన్నవించెద మీచిత్తంబున 12. నిట్టనియె - అనియుం కలదు. 13. యనఘచరిత, యసదుగా మిమ్ము .. 14. జాలను బొలియుటనను; కూడదు పొలియుటను 15. గలిగిన.

తరల.

అనిన నయ్యకలంక మై యులరారుసీరుకొలంకునె
మ్మనము గల్గు మహానుభావుఁడు మాళవక్షితిపాలనం
దనునివేదనఁ జూచి హా గురునాథ యీశ సదాశివా
యనుచుఁ దామరపాకు[1]నీరుక్రియం దలంకి దయామతిన్. 189

క. వినవోయి రాజనందన
తను వేటికిఁ [2]దొఱఁగవలయుఁ దల్లడపడఁ గాఁ
జనునె పురాకృతకర్మం
బనుభవమునఁ గాక తీఱునా యెవ్వరికిన్. 190

గీ. మందు దయసేయు మంటి వే మందు [3]నకట
మందులకుఁ గాక యిటు సేయ మాకుఁ దగునె
యసదుగా నన్ను వేఁడెద నంటివి గద
యదియుఁ దప్పదు ప్రాణ మి [4] త్తడలవలదు. 191

క. మనపాలఁ గలఁడు శంకరుఁ
డనపాయోపాయుఁ డాశ్రితానేకాప
ద్వనపావకుఁ డా లోకా
వన[5]పాటవుఁ గొలువ లేనివస్తువు గలదే. 192

మ. అని యూరార్చి కుమారుఁ గొంచు జని వే యమ్మానవా
ధుండు[6]చ,ల్లనిచెంగల్వదొనం దనూరుధిరమెల్లం దోమి నీరా
ర్చి వా,ల్గనుదోయిం దడిఁ దోఁచి తేటజలముల్ గా దోయి
టం దెచ్చి ద,ప్పి నివారించి యలంత దేర్చి [7]యసువుల్ బెం
పొందఁగాఁ జేయుచున్. 193

---

1. నీళ్ల...దలంకె 2. దొరఁగ 3. నిన్ను 4. మింతడల వలదు 5. పాలక 6. నల్లని 7. యుసురుం; యతనిం.

చ. తనగుహాలోపల న్నిలిపి తా మును గ్రోలఁగఁ జిక్కినట్టిచి
క్కని[1]తరిపాలుదానపుడుకంఠము మోవఁగఁ ద్రావఁజేయ మేన్
బనుపడి నీట ముంచినను బాలను ముంచిన నీవె దిక్కు *నా
కని యుచితోక్తులంగడు బ్రియం బొనరించె నతండు[2]తేరుచున్.

గీ. అరయ భువనైకమహిమాఢ్యుఁ డైనయట్టి
మత్స్యనాథుండు రాజకుమారమణికిఁ
గరచరణపంకజోత్పత్తి గలుగఁజేయ
నొకయుపాయంబు †చింతించు చుండె నంత. 195

క. తెలతెలవాఱఁగ వచ్చెను
వెలవెలఁ బాఱె నెల [3]దొవలు విలవిలఁబడియెన్
బలపల నయ్యెం జుక్కలు
కలకల [4]నగె దిశలు పక్షికలకల మెసఁగెన్. 196

ఉ. కొందలు పాండురం బనఁగఁ గొందలు శోణ మనంగ నీటఁ బొ
[5]ల్పొందఁగఁ జేసి పాల్కడలి నంటినజిడ్డది తెల్పు గా [6]దిదే
సందియ మేల చూడుఁ డని చక్కఁగ నజ్జలశాయి కౌస్తుభం
బందలుఁ జూడ నెత్తెనన నంత నభోమణి దోఁచె [7]నెఱ్ఱఁగన్.

మ. అలరా జట్లు కుమారు దండనము సేయం బంచి శోకవ్యథన్
[8]నిల కావేఁగున నిద్ర లేక డలుచున్ నిద్రించి మేల్కన్న [9]ప్రా
ల్పలరం లేచి యలక్ష్యరూపముగఁగాల్యప్రక్రియల్ దీర్చిమో
సలఁ గొల్చె లై తల వంచి ఖిన్నుఁ డయి చాంచల్యంబుతో
నుండఁగన్. 198

1. తరిపాపు పాలతని; తరిపాలునయ్యాపుడు... జేసినన్ 2. నవ్వుచున్ * గా కని † చింతింపుచుండునంత 3. దొగలు 4. మాసె 5. ల్పొందఁగఁ జేసి పాల్కడలినొందినజిడ్డది; 6. దహో 7. రక్తిమన్ సేయఁగన్ 8. నెల తా లెంగను 9. ప్రా, ల్పలరంజాలనలక్ష్య; ప్రా, ల్పలకన్ లేచి యలక్ష్య.

క. తలవరులు వచ్చి ధరణీ
తలవరులు ప్రధానులును హితజనులుఁ దగువా
రలు [1]నింతటనంతటఁ జం
కలఁ జేతు లిడికొని యుండఁగా నృపుమ్రోలన్. 199

క. నిగని [2]గనిభూషణము లిడి
నెగులున నడ్డపడి యేడ్చి నేఁడు కుమారుఁ
సుగుణాఢ్యుం డని తెలియక
తెగి యూరక యాజ్ఞ పెట్టితిరి గద యంచున్. 200

క. ఆకాశవాణి సెప్పిన
యాకథయును నూఱడించి యనుటయుఁ దెలుపఁ
శోకము [3]హర్షము వెఱఁగును
[4]జీ కొనరింపంగ విభుఁడు చిత్తము కలఁగఁ. 201

ఉ. దిగ్గన లేచి [5]బంధుల సుధీమణులం దగువారిఁ దోడుకొం
చగ్గల మైనకోపమున నంతిపురంబున కేఁగి దీనికిం
[6]దగ్గదు తాల్మి సామవచనంబులఁ [7]గా దిఁక నిష్ఠురోక్తులఁ
బెగ్గిలఁ జేయఁ జెల్లు నని పిల్వఁగఁ [8]బంపి లతాంగి నయ్యెడన్.

గీ. ఓసి పాపాత్మురాల నీ వేసదారి
[9]గాయకపుఁజేత లెల్ల నాకాశవాణి
తెలుప విని వచ్చి తలవరుల్ కొలువులోనఁ
జెప్పినా రిప్పు డంద అచ్చెరువు నొంద. 203

---

1. నింతటంతటం 2. గన 3. వెఱఁగును హర్షము 4. జీకాకొనరింప నతఁడు చిత్తం బగలఁ 5. బంధువుల ధీమణులం 6. దగ్గట 7. బోదిఁక 8. బంచె 9. గాయకపుసుద్దు.

గీ. టక్కు టకటొంకు టొటొటు [1]తవణి వగలుఁ
గట్టి పెట్టింకఁ గలది కలట్టి దెలుపు
తెలుప కుండిన నీబుద్ధి కొలఁది చూడు
[2]మఱి యనుచు రాజు బెదరించి మాటలాడ. 204

క. [3]వంచాడించక తాలిమి
డించక బిగు వెడలి తల్లడించక మదిలో
నించుకరైనను డాఁ జలి
యించక యాగట్టువాయి [4]యి ట్లని పలికెన్. 205

చ. తెలిసితి హా యి [5]దంతయును దేవరపట్టపుదేవి[6]కై తవం
[7]బలసుతుబారి దప్పినను నాజ్ఞ యొనర్పఁగ లంచ మిచ్చి వే
పిలిచి తలార్ల చేత నపిపించిన దిట్టుల నీ[8]కువాళము
ద్దెలియక వెఱ్ఱిరాజ యిది లెస్స నిజం బని [9]నమ్మినావుగా. 206

సీ. ఎంత సేసినది నేఁ డిది [10]కన్న విన్న చో
ద్యము [11]గాదు మఱి దబ్బు దబ్బిన నిటు
వలె నుండవలె మెచ్చవలదె యిందులకు ర
త్నాంగిని జూచినయట్టి వార
లది నిజం బనవలెఁ గద యెన్ని గఱచిన
దాకాశవాణి యటంచు నొకటి
గల్పించినది [12]చూడు గానలో నఁట రాత్రి
యఁట వారితో మాట లాడిన దఁట

1. తవలు; తవళి 2. మని యపుడు 3. వంచోడించక; వంచాడిం చిక 4. యిట్లనె పలితోఁక్ 5. దంత 6. కౌతుకం 7. బలసుతుపాడిఁ 8. కువాడము 9. నమ్మినాఁడవే 10. విన్నఁగన్న 11. గాదొ 12. చూడఁ.

గీ. [1]కటకటా యెట్టివింత లాకాశవాణి
యాడఁ బలికిన దెటు పోయె నీడఁ బలుక
రాదె యిపు డని [2]పగ్గించి రాజకీర
వాణి పలికిన నాకాశవాణి పలికె. 207

గీ. ఇంత నేరక యుండిన నంతపనికిఁ
జొత్తువే [3]బల్మిఁ గొంగును జుట్టి పట్టి
యెనయు మని నీ వనంగ నాయన పెనంగ
నాఁ డెఱుంగనె యంగనా నంగనాచి. 208

చ. అని వినవోయి రాజ భువనైకమనోహరమూర్తి యైన నీ
తనయునిఁ జూచి మోహపరితాపమున న్నిలు పోపలేక యీ
[4]చెనఁటి పయిం బడం గదియఁ జెల్లునె తల్లివి గావె నాకు నీ
వనికడుఁ బాపభీతుఁడయియాయన తాఁ గడఁ ద్రోచిపోయినన్.

ఉ. కోపమునం గయాళి కొనగోళ్ళఁ గుచంబులు [5]తానె వ్రచ్చి
లోఁ, బాపనియూసు గాఁగ సుతుపై నటు నింద [6]ఘటింప
నీవు నా,పాపనిఁ బట్టి తెచ్చి కరపాదము కోయఁగఁ బంచి
యూరకే, పాపము గట్టుకొంటివి నృపాలక యెంతటిహాంత
వెంచఁగన్. 210

క. నీతో నిఁక భాషించినఁ
బాతక మని యంత గగనభారతి [7]నిలువన్
భూతలపతి శోకవనీ
వాతసుహృ[8]త్తూలికీభవన్మానసుఁ డై. 211

---

1. కలదెయిటువలె నెందు నాకాశవాణి 2. పచరించి 3. బల్మిమైఁ గొంగుజుట్టిపట్టి 4. చెనఁటియై తా పయిం గవియ 5. తాన 6. ఘుడింప; ఘుణింప 7. డాఁగన్ 8. తూలికా.

ఉ. హా తనయా వివేకరహితాత్ముఁడ నై నిను నిగ్రహించితిం
గా తెగి లోకనింద కొడిగట్టితిఁగా జగజంత యైనయీ
భీతమృగాక్షిమాట చెవిఁ బెట్టితిఁగా యతిఘోరపాతకం
బీతఱి నీతి మాలి రచియించితిఁగా యని సాశ్రునేత్రుఁ డై.

క. [1]బజగేడిమాటలు చెవినిడి
నిజ మని గురుభక్తినిరతు నిర్మలచరితున్
[2]సుజనుఁ గుమారుని లీలాం
గజునిం బోనాడుకొంటిఁ గద [3]నేఁ డనుచున్. 213

గీ. కుటిలచటులమలీమసక్రూరవర్త
నాలి దుర్గుణగణ[4]జీవనాలి నాలి
నతి [5]కపటపూతనాలిఁ జిన్నాలి నతఁడు
[6]కూపమున నూకఁ బనిచెను కోపమునను. 214

ఉ. ఆయెడ రాజునానతి మృగాక్షిని రజ్జునిబద్ధఁ జేసి య
న్యాయము రాకుమారు[7]సుజనాగ్రణిఁ బావనశీలు నుత్తమున్
మాయలు నన్ని మచ్చరముమైఁ దునిమించెను జూడ నున్న
ద, న్నా యిది మేఁకవన్నెపులి యంచుఁ దలారులు గొంచుఁ
బోవఁగన్. 215

వ. కుచ్చితురా లైనయచ్చపలలోచనం జూచి పౌరు లందఱు
గచ్చుకొని గ్రచ్చుపొదఁ [8]గదల్చినకై వడి విచ్చలవిడి నోరికి
వచ్చినట్టు [9]వెచ్చున కిచ్చువారును దానికి [10]నిటువలెఁ గావ

---

1. బజగడుగుదానిమాటలు; బజగేడీమాటలు సెవినిడి 2. సుజనులఁ గుమారు 3. నేననుచున్ 4. జీవనావిశాలి 5. కుతల 6. కూపమున నూకఁ బనిచెఁ బెన్గోపమునను; కోపముననూకఁబనిచెను కూపమునను; ...బ.గొ..కమున నను; కోపమున...పనిచె మఃల్గాపమునను 7. సుగుణాగ్రణి 8. గదలించిన 9. వెచ్చానికిచ్చు 10. పాటుగావ.

లయు నని [1]యెగ్గించువారును దీని [2]కివి పాటులా యని పండ్లు
గొఱుకువారును బాపజాతి[3]కానా కన్నులు దెఱవనిపాపని
పై నిరాపనిందలు గడియించి [4]యానిసువుగోడు పోసి
కొంటి వందుల నీ కేమి [5]గలిగెనే యనువారును నిర్నిమిత్త
ము త్తమ[6]పురుషునకుం జేసినదోషంబు తోడుతోడనె చూ
పకపోవునే యనువారును 'సాహసం షడ్గుణం చైవ' య
న్నది తప్పునే యనువారును నెంతకుఁ దెగించెఁ జూడు
మా [7]యాఁడుదాని నమ్మవచ్చునే యనువారు నై మఱి
యును. 216

క. ఒం డేమి [8]దోష మెఱుఁగక
యుండెడుసారంగధరుని నూరక పతితోఁ
గొండెంబు సెప్పి తోడిఁబడ
దండింపఁగఁ [9]బనిచె నెంత దయ లేని దయో. 217

చ. తెలియఁగఁజూచినట్లనె మదిఁ బుధు లారసి తప్పు నీపయిఁ
గల దని [10]పల్కుచోఁగుచయుగం[11]బటు బట్టబయల్గఁ జేసి[12]యా
యలికచ లేదు బంతి యనె నందఱెదెందము నిశ్చయంబు వెం
పొలయఁగఁ [13]గల్లతోడనిజమోపదుగా దలపోసి[14]చూచినన్.

చ. కని కర మేది బిడ్డని నకారణ మూరక యిప్పు డయ్యయో
కనికర మేది యాజ్ఞ యిడెఁగా [15]తన బుద్ధి కలా లసద్వివే

1. పగ్గించు; పంగించు 2. కిదిపాటే 3. కా కా—ఒకప్రతిలో లేదు 4. యీ శిశువు 5. లాభమా(మే)యనువారును 6. పురుషునిపై గల్పించిన 7. యాటదాని 8. దోస 9. బంచె 10. తెల్పుచో 11. బును 12. తోయలి; తొయ్యలి 13. గల్లతోడనిజమొప్పదుగా; గల్లతోనిజము నొప్ప దుగా 14. చూడఁగన్ 15. తనదైనసుధాలసద్వివే; తనదైనసుధీ కళావివే; తనబుద్ధికలావిలసద్వివే. (?)

కనికర మేది మున్ [1]వినుతగౌరవకీర్తి [2]వహించి యింక నిం
కనికఱ మేదినీవిభుఁడు గాంచెను నేఁ డని పొక్కి [3]రందఱున్.

గీ. చెలి యిపుడు ఘోరపాపంబు సేసి మీఁద
నరకకూపంబులోఁ బడఁ దలఁచునీకు
నురక కూపంబులోఁ [4]బడ నుఱుకు టరుదె
పాటు పడు మని [5]పఱచనిపాటు పఱచ. 220

క. జడ లల్లుచుఁ [6]బిన్నప్పుడె
పడఁతులు తను నూఁతఁ బడెదొ పాఁతఱఁ బడెదో
[7]నుడువు [8]మనుమాట నిజమై
పడె [9]నూతనె యార నూఱుబార లనంగన్. 221

చ. అటువలెనింతి నాజ్ఞ యిడి[10]యామనుజేశుఁడు మంగలంబునం
బెటిలినవేలగింజ[11]వలె మిక్కిలి పుత్త్రవియోగబాధ న
ట్టిటుపడి ధారుణీస్థలిపయిం బడి నందనురూపరేఖలుం
బటుగుణశీలముల్ దలఁచి పల్వగ[12]లం బలవించుచుండఁగన్.

వ. [13]అప్పుడన్వర్థనామవంతుఁడైన మతిమంతుం డతని కిట్లనియె.

క. చనునే యిటువలెఁ జింతి
ల్ల నృపాలక నింద రావలసి నా[14]పలుకుల్
విన వైతివి చే మించిన
పనులకు నీ వింకఁ గస్తిపడ[15]వచ్చునొకో. 224

---

1. విజిత 2. వహించునిందనిం 3. రెల్లరున్ 4. నిపు(ప్పు)డుఱుకు 5. పఱి(ఱ)చినపాటు పఱి(ఱ)చి 6. జిన్న 7. నొడువు 8. మనుటెల్ల; మని యనట 9. నూత్రనుసార; నూతన 10. యామ(యమ్మ)నుజేంద్రుఁడు 11. యన 12. లన్ విలపించె; లంబలవింపు 13. అప్పుణ్యవర్ధనమతి 14. మాటల్ 15. cకెల్లునొకో.

ఉ. మాను దురంతవేదనఁ గుమారిల నేల పసిండికొండవి
ల్కానివర ప్రసాదమునఁ గల్గినవానికి హాని [1]వచ్చునా
మానవనాథ యన్న మతిమంతుఁడ నీ వనుటెల్ల నిక్క మౌ
నౌ నిది లోకనిందితుఁడ నైతిని నీపలు కాచరింపమిన్. 225

క. [2]నెరయఁగ సాక్షిం గోరక
తెఱవనడక [3]తగుననుచు మది న్నమ్మి సుతుం
[4]బఱచనిపాటులు పఱచితి
[5]బఱచని యిది యెఱుఁగ లేక పదరితి నయయో. 226

ఉ. [6]ఇట్టుల నుండె నాయెఱుక యేమనువాఁడ మహేశుసత్కృపన్
నెట్టన వాఁడు ప్రాణముల నిల్చినఁ జా లిట దెచ్చి వెజ్జులం
బెట్టి గుణంబు చేసి మదిఁ బేరిన నెంజిలి దీఱ వాని [7]కే
బట్టము గట్టి కానలఁ దప మ్మొనరించెద [8]నంచు చయ్యనన్.

క. [9]అనుగు లయి హితజనంబులు
ననుఁగుంజుట్టములు రాఁగ నపుడు దలారుల్
వనసీమ తెరువు [10]చూపఁగఁ
జనియెన్ జననాయకుండు జాయాన్వితుఁ డై. 228

చ. చని మును దండనం బిడినచక్కిని వధ్యశిలాతలంబుదా
పునఁ బడియున్న కెంజిగురుఁబోల్వసివాడినకాళ్లఁ జేతులుం
గని నెగు లొంది పట్టినటుఁ గానక మూర్ఛిలి యంతఁ గొంతసే
పున కిసుమంత దెప్పిఱి విభుం డలపూఁబొదరిండ్లఁ జీరుచున్.

---

1. చెందునే 2. అరయఁగలసాక్షి; నెరయనరిసాక్షిఁ గోరనె 3. యందమని; తగుసెయని 4. పరుసని 5. పరుసని...యెఱుక...నకటా; నయ్యో 6. ఇట్టుగ 7. కిన్; నే 8. నయ్య 9. అనుచుఁ దనయాత్మజనములు 10. సూపఁగ.

సీ. అరసి చూతము పదం డాకానలో నున్న
  నరసి చూతము తెచ్చి యనుచు నేఁగుఁ
గాన రే యే మైనఁ గని మెగాల్ డనియెనో
  కానరే యని వేఁటకాండ్ర నడుగుఁ
బొదల నెవ్వగ నైన వెదకి కానఁగ లేక
  పొదల నెవ్వగ నేలఁ బొరలి [1]యడలుఁ
దనయుని కీపాటు నెనయఁ జేసితి నయో
  తన యుని కిఁక [2]నేల యనుచుఁ బొగులు
గీ. వనరు హా యను సుకుమార[3]వదనవిజిత
వనరుహా యను వెత సేయవలెనె యింత
దైవమా యనుఁ [4]దలఁచని తలఁపు లివిగొ
దైవమాయను దెలియంగఁ దరమె యనుచు. 230
సీ. దట్టంపువిరిమొల్లతావులతావుల
  నమరు లతాకుడుంగములగములఁ
జల్లనిసురపొన్నచాయలచాయల
  నరుదారుమాణిక్యదరులదరుల
వలిదేరు [5]పన్నీరువంకలవంకల
  గాలితేజీలనిల్కడలకడలఁ
గ్రొంజీఁకటులు గ్రమ్ము కోనలకోనల
  ఘనమైన యోగిపుంగవుల గవుల
గీ. నరసి పెదవులు దడుపుచు నరిగి యరిగి
దొరఁగునశ్రులు గన్నుఁదామరల మరలఁ

1. పొరలి 2. నేటికనుచునొరలు; నేటికనుచువగచు 3. వైరి 4. తలఁపని 5. పన్నీటి.

గుసుమబాణుని నగఁజాలుకొమరుకొమరు
విభుఁడు మదిలోనఁ బాయని వెతకు వెతకు. 231

వ. [1]ఇట్లు తద్ఘోర కాంతారంబునఁ బలుదెసలం [2]గొందఱ ననుచరు
లం జరుల సండుగొందుల నందంద నందనాన్వేషం బొన[3]రింప
నియమించి తానునుం జని వేగ మృగ విహగతరు గిరి ప్రముఖ
నిఖిలచరాచరంబులం జూచి యేచిన దైన్యంబున. 232

ఉ. మిక్కిలి సాదనం దగిన మేటి నెఱుంగరె మల్లులార [4]మే
లెక్కుడురూపువాని [5]నిపుడిచ్చటఁ గానరె మావులార పే
రక్కఱ నూని పెంపు గని నాతనిఁ జూడరె ధాత్రులార యిం
పెక్కిన కొమ్మలార కనరే [6]తమిమీఱు కుమారమన్మథున్.

గీ. [7]మీఱుకులము లేటిఁ జేపట్టి మీవిరోధి
యైన పులిఁ జెండి మైచర్మ మూనెఁ గాదె
యట్టిమేలైన నెఱేఁగి యా హరునిపేర
నెసగు సారంగధరుఁ జూపుఁ డేణులార. 234

శా. నాళీకారికి నొక్కజింక నొకయేణం బంజనా[8]కామికిం
గాళీకాంతునకొక్కలేడియిడి యింకం గూడునే[9]మూఁడుమూ
టాలుంబెట్టిన చెంగనాలు మము ముట్టన్ రాకుఁ డక్రీతి మీ
రేలా [10]పోయెద రేణులార నిలువుండీ మాసుతుం జూపుఁడీ.

క. తరులార చెంచుబిత్తరులార కానరే
[11]మాకుమారునిఁ బోలు మాకుమారు

1. ఇట్లుకాంతా; ఇట్లాఘోరకాంతా 2. గొందఱనుచరులంజఱుల 3. రించ 4. రే 5. నిటనిచ్చట; నిపుడిక్కడ 6. సుకుమారుఁగుమార 7. కులము లేటినిబట్టిమీకును; కులము లేటినిఁ జేపట్టిమీవిరోధి 8. భర్తకున్ 9. మూఁడువ్రాటాలుం 10. పొఱెద 11. 'మాకుమారుని' అచటను 'రాకుమారు' అను పాఠము నాల్గు పాదములలోను నున్నది.

హరులార పవమాన హరులార కానరే
　　　మాకుమారునిఁ బోలు మాకుమారుఁ
[1]జరులార లేటిమచ్చరులార కానరే
　　　మాకుమారునిఁ బోలు మాకుమారుఁ
[2]గరులార మానిశంకరులార కానరే
　　　మాకుమారునిఁ బోలు మాకుమారు

గీ. నదములార చలత్కోకనదములార
శుకములార ప్రఫుల్లకింశుకములార
[3]మాకు [4]మారు వచింపని మాకుమారు
గానరే యని వెదకి రక్కాననలోన. 236

సీ. కర్పూరవాసనల్ గలయంగఁ బొలయంగ
　　　సారంగధరుఁ డని చేరఁ బోవు
శ్రీగంధవాసన ల్చిక్కంగ నిక్కంగ
　　　సారంగధరుఁ డని చేరఁ బోవుఁ
గస్తూరివాసనల్ [5]గమ్మంగ గ్రమ్మంగ
　　　సారంగధరుఁ డని చేరఁ బోవు
జవ్వాదివాసన ల్జడియంగ సుడియంగ
　　　సారంగధరుఁ డని చేరఁ బోవుఁ

గీ. బోయి ఘనసార ఘనసారభూజ [6]మృదుప
[7]టీర మృగకుల సంకుల లెంకు లరసి

1. గరులారగబ్బి పెన్గిరులార 2. గవులార మానిపుంగవులార కానరే 3. మాకుమారునిఁ(బెంచెడు)బోలెడు మాకుమారు; మాకుమారునివంచించు మాకుమారు 4. మాఱు 5. జిమ్మంగ గ్రమ్మంగ; కమ్మంగఁ జిమ్మంగ 6. మృగప 7. టీరమృగకులసంకుల లెంకులగుట; టీరసంకుల లెంకులు దూరమగుట.

స్రుక్కి తద్గంధమహింతాంగు సుతుని నతఁడు
కానకడల విచారించి కాన కడల. 237

క. తలవరులుఁ నెలవరులుం
[1]బాలపరులుఁ వచ్చి యంత భూపాలునితోఁ
[2]మలలందుఁ నెలలందుఁ
శిలలందును నెల్ల నారసితి [3]మే మెందున్. 238

ఉ. కాన మటంచుఁ జెప్పినఁ గకాపికలైన మనంబుతో నర
ణ్యానిఁ గులాంగనాసహితుఁడై యట గ్రమ్మ[4]ఱవచ్చి కామినీ
సూన[5]శరోపమాన సుత శోణిత పంకిల భూమి నామహీ
జాని భుజా[6]నిరాహత విశాలశిలాచయుఁడై పడెఁ వడిన్.
వ. అప్పుడు. 240

క. అ క్కెండి యీ [7]రెలుం గై
చెక్కులు [8]సెమరించి నెఱులు చిక్కులు [9]గొని కా
ల్వ్రాక్కి వసివాడి యూర్పుల
వెక్కం గెమ్మోవి కమలి [10]వికలాంగియనున్. 241

క. పట్టాభిషిక్తుకడుపునఁ
బుట్టి [11]మహీరాజ్యసుఖముఁ బొందక కుడువం
గట్టం గల [12]ప్రాయమ్మునఁ
గట్టా నీ కడవిపాలు గావలసెఁ గదా. 242

1. బోరవరులుఁ; బోలవురులుఁ...యపుడు 2. మలలందుల సెల గొందుల, శిలసందుల 3. మేమందుఁ; మెచ్చోటఁ 4. ఱ 5. శరాయ మాన 6. నివాహత; నిరోహిత 7. రెలుఁగుబడి; రెలుంగున 8. సెమరింప 9. పడి 10. వికలాంగముతోఁ 11. మహీరాజ్యసుఖము, వొందక కుడువఁ,...వొందంగఁడువఁ 12. కాలంబున.

క. ఎట్టోర్తు నన్ను నీ వీ
కట్టిఁడి యగు దొడ్డరాజుకడుపున నేలా
పుట్టితివి పేదకడుపునఁ
బుట్టిన నొక కొంతకాలము సుఖింతువుగా. 243

ఆ. నిను వధించినట్టి వెనుక నయ్యశరీరి
పలుక కుండె నేమి పలికె నేమి
నీవు [1]చచ్చువెనుక నామృపాచిత్రాంగి
పొలియ కుండె నేమి పొలిసె నేమి. 244

సీ. [2]సంపెంగనూనెవాసనలఁ బెంపెక్కిన
యలకలా యివి కస్తూరితళుకు మొలక
చిట్టాడునాఁడు నాచిటికెనవ్రే [3]ల్వట్టు
చేతులా యివి ముద్దుఁజిన్నికూన
[4]ఘలుఘల్లు మని యందియలు మ్రోయ నడయాడు
నడుగులా యివి ప్రోదియనుఁగుఁ జూల
ప్రేమ నాచన్నిచ్చి పెంచిన నీమేని
నెత్తురా యిది పూపనెనరుపట్టి
గీ. యనుచు నట రాలి [5]యున్నట్టి యతనికురులు
కరచరణఖండరక్తపంకములు మమత
నెత్తి యక్కునఁ జెక్కున [6]నొత్తుకొనుచు
నిందుముఖి యేడ్చెఁ గోయిల లెల్లఁ [7]గదియ. 245

1. వ(చ)చ్చుటాయెనావితా (వృథా) 2. సంపెంగి 3. లందు, లంటు 4. ఘలుఘలు మను నందియలు 5. యుండెను 6. నొత్తి 7. గదల.

వ. *అంత మూర్ఛాక్రాంతుం డైన మహీకాంతుం డాకశాంత
తడవునకుం దెలిసి సంతాపంబున. 246

ఉ. ప్రేయసిమాట [1]యట్లు చెవిఁ బెట్టి వృథా కరపాదహీనునిం
జేయుట కాక [2]జీవ మెడసేయఁగ వచ్చితి నంచు దాఁగితో
నాయపరాధ మింకిట మనంబున [3]సైచియుఁ బల్కవోయి రా
వోయికుమారయొం[4]దడఁగితో యి[5]యటంచు చెలుగెత్తిచీరుచున్.

సీ. పరరాష్ట్రమున కైనఁ బాఱిపో బెదరించి
యిట్టట్లు గా[6]సి చేయింప నైతిఁ
ద ప్పొప్పు శోధించి తరువాతఁ [7]జంపెద
నంచు నేటికిఁ జెఱ నుంచ నైతి
[8]సుఖముల నందిచ్చు సుతుఁడు గల్గఁడు గాక
లలన లేయరు దని తలఁప నైతిఁ
బదరి కార్యము సేయుపరుషవర్తనుఁడు వి
పన్నుఁ డౌ నను నీతి యెన్న నైతిఁ

గీ. కూడు [9]చవి యని యింక తిన కూడు [10]నొక్కొ
తనువు త్యజియింతు ననుచు వింతనువు మీఱ
గుండు మెడఁ గట్టి భూభుజంగుండు నిండు
చెఱువులోఁ బడఁ బోఁగ నచ్చెరువు [11]గాఁగ. 248

చ. పలికె రయంబునం జదలుపల్కుల చిల్కలకొల్కి యంత హా
నిలు నిలు రాజ యిట్లు దగునే [12]తెగియింపఁ బురారిపట్టి నై

---

* కొన్ని ప్రతులలో లేదు 1. యిట్లు 2. జీవునికఁజేయఁగ 3. సైరించి పల్కవోయి; సైచియునింకఁబల్కవో 4. దణఁగి 5. కుమార యటంచు నేడ్చుచున్ 6. గాసిఁజేయింప; ఁజేసియొంచనైతి 7. చెప్పెద 8. సుఖముల నిం దంచు, సుఖకులిదండించు 9. నవనిలియన; నికతినఁ 10. నెట్టు 11. మీఱ 12. త్యజియింప.

యలరిన[1]మత్స్య నాథుఁ డనునట్టిమహాత్మునిదండ నీదుగా
దలిసుతుఁ డున్న [2]వాఁ డిపుడు దీమస మేది [3]తలంక నేటికిన్.

ఉ. మేరుగిరీంద్రచాపుని యమేయ[4]కృపారసపూర్ణదృష్టి నీ
కూరిమిపట్టిపైఁ గలదు కొంచెములోనవె కాయ[5]సిద్ధికిం
గారణ మున్న దాతనికిఁగా మదిఁ గుందకుఁ డీయనిత్యసం
సారమిదేమి బ్రాఁతి ధర శాశ్వతుఁడై మను నాతఁ డున్నతిన్.

క. [6]ఎక్కడిసుతు లెక్కడిసతు
లెక్కడితలిదండ్రు లెవరి [7]కెవ్వరు కొన్నా
ళ్లక్కఱపడి తిరుగాడుదు
రక్కట యిది యంత మాయ యని [8]యెఱుఁగవుగా. 251

క. మరు లింత దగునె నృపతికి
ధర పాలనసేయు కునికి ధర్మం బగునే
సరగునఁ దిరిగి పురంబున
కరుగుము చింతిలక మానవాధిపతిలకా. 252

ఆ. *అతఁడు కరపదద్వయమ్ములు వచ్చి నీ
కడకు వచ్చి చూడ గలఁడు మీఁద
నధిప నమ్ము దీని కనుమాన మేమియు
నింక వలదు వగల నింక వలదు. 253

క. నావుడుఁ దహతహ వీడ్కొని
దైవారిన[9]వేడ్క రాజధానికి [10]మగుడన్

1. మీననాథు 2. వాఁడుకడు 3. తలంప 4. కృపారసదృష్టిచాలనీ 5. శుద్ధికిం 6. ఎక్కడిసతు లెక్కడిసుతు 7. కెవరొకో కొన్నా 8. యెఱుఁగరుగా * చివురుఁగాలుఁ గేలుగవబోయివచ్చి యుం, పెసఁగుమీఁదనమ్మునీంద్రు కరుణ; అతఁడు కరపదద్వయమువచ్చి వేగనీ 9. మమతనొకవిధంబున 10. వేగన్.

[1]దేవియుఁ దానును నరిగి మ
హీవల్లభుఁ డచట రాజ్య మేలుచు నుండెన్. 254

వ. అంత [2]నచ్చట మత్స్యేంద్రుండు నరేంద్రనందను నొక్క మంచిమంచెపై నుంచి [3]నిచ్చలుఁ గృపాలుండై గోపాలుండు నిచ్చల మగుభక్తిని దెచ్చి యిచ్చుపాలు సగపాలు బాలుని పాలు గావించి [4]పోషించుచు నధ్యాత్మజ్ఞానోప[5]దేశం బొసంగం దలంచి [6]యత్యంత నిష్ఠాసనాసీనుం జేసి యోగాసన బంధవిశేషంబులు రేచకపూరకకుంభకంబుల విధంబులును రాజయోగ హఠయోగ లయయోగ మంత్రయోగ లంబికా[7]యోగంబులాదిగాఁగల యోగంబులవృత్తాంతంబు[8]లం దెలిపి యభ్యాసంబు సేయింపం గతిపయదినంబులకుం బనుపడి యోగానందుం డై యుండం జూచి సమీచీనయోగసమాధిగాఁ దెలిసి [9]కరచరణోదయసంపత్సంపాదనసమయం బిది యని యతం డూర్ధ్వదృష్టిం జక్కం [10]జూడకుండుటం బైకి నొకయఖండగండోపలం బెగయ వైచి [11]యిది తప్పక చూడుమా చూడకున్నం జూడాతలంబునం బడు ననినం దనదృష్టి మరల్పక చూచుచుండఁ గొంత కాలంబునకు. 255

చ. మొలక లొకింత గానఁబడి మోసులు మెల్లనె వెళ్ళి సోగ
లై, నెలకొని వ్రేళ్లు గోళ్ళను జనించి చోకారము లై మి

1. దేవేరియుఁదానరిగి 2. మత్స్యనాథుండు 3. యిచ్చనిచ్చలంబగు భక్తింగృపాలుండైన 4. పోషింపుచు 5. దేశంబుసేయం, దేశఁబున సమర్థుం జేయఁ 6. యత్యంత నిష్ఠనిష్ఠాసనాసీనుం 7. యోగంబుల నిష్ఠలాదిగా 8. లంశయుం జెలిపి యభ్యసనంబు 9. కరచరణాభ్యుదయ 10. జూడకుండఁ జూచి మీదికి నొక; చూడకుండఁబైనియొక 11. యది.

టారికెం, దలిరుకు *బొమ్మ [1]గట్టి యలతమ్ముల యొమ్మెలు
చూఱ వట్టి యిం, పలరఁగ వచ్చె వాని కిరవై తగ వింతగఁ
గాళ్ళు సేతులున్. 256

గీ. కాంచి యప్పుడు ప్రమోదించి మంచె [2]దించి
[3]నడవఁగా లేకయుండెడు నాతనికిని
దనకరము లిచ్చి హరుపట్టి యొనరఁబట్టి
యల్ల నడుగిడఁ జేసెఁ [4]బా టడఁగఁ జేసి. 257

సీ. జుట్టువ్రేళ్లను రెండుఁ బట్టించి నడి[5]పింపఁ
దలఁకుచు రా లేమి బలిమిఁ దిగుచుఁ
దనచేతినిడుదలాతపుఁగోల యందిచ్చి
మెల్ల మెల్లనె కొంత మెలఁగఁ జేయు
నవలంబ ముడిగి ర మ్మన నా ల్గడుగు లేఁగి
పడఁబోవ గ్రక్కునఁ బట్టి నిలుపుఁ
జను దెంచి బిసబిస దను నంటుకొ మ్మని
వచ్చిన నగుచు [6]నవ్వలికి నరుగు

గీ. నాఁడునాఁటికి నేరీతి నడవ నేర్పఁ
గొన్ని నాళ్లకు [7]నలవడి కొంత [8]దీటె
లెస్స లై [9]కరపదములు లీలఁ దనరఁ
బ్రేమ [10]ఁజౌరంగి యనియెడి పే రొసంగి. 258

ఉ. సద్గుణరాశి యై తనరుసాత్త్వికమౌళికి వత్సలత్వసం
పద్గరిమ న్సమస్తమణిమంత్రమహౌషధవస్తు లిచ్చి శుం

---

* సొంపునింపెసఁగితమ్ములతమ్ములమాడ్కిమీఱిపెం 1. బెట్టి 2. డించి 3. నడవఁగానోపలేకయుండెడు నతనికి 4. పాటగుటఁజేసి 5. పించి 6. నవ్వ, లనికరుగు 7. నడవడి 8. దేటి 9. కరపదంబులు, పాణిపదములీలమీఱ 10. సారంగి; సౌరంగి.

భద్గతి సిద్ధ[1]యోగికుల పట్టము గట్టి కృతార్థుఁ జేసినం
దద్గురునాథుమాట జవదాటక నిశ్చలభక్తియుక్తుఁడై. 259

గీ. కాయసిద్ధి వచస్సిద్ధి గలిగి యతఁడు
చెలుల [2]యాసలు క్షుత్పిపాసలును లేక
పట్టినది యెల్ల బంగారు గట్టు గాఁగ
మెట్టినది యెల్ల [4]నిధియునై మెలఁగుచుండె. 260

గీ. ఉండి యొకనాఁడు తమపాద లున్నకడకుఁ
బోయి రావలె [5]నని బుద్ధి పొడమి వేఁడు
కొనె [6]గురుని నేఁగదా వివేకులకు నెల్లఁ
దల్లిదండ్రు[7]లు మఱవఁ గాఁ దగనివారు. 261

గీ. గురునిపంపున సంతోషభరితుఁ డగుచుఁ
బాదుకలు మెట్టి తలిదండ్రిపజ్జఁ దలఁచె
దలఁచినప్పుడె పోయి ముంగలను నిలిచె
నిలిచినప్పుడె విస్మయాన్వితు లగుచు. 262

సీ. మానేరమి మనంబులో [8]నుంప కిటు వచ్చి
తక్కఱ[9]గలయట్టి యనుఁగుఁబట్టి
యాకాశవాణివాక్యంబుచే [10]బ్రతికినీ
కెదురుసూచితిమి సు మిన్నినాళ్ళు
మావంటిభాగ్యసంపన్ను[11]లెవ్వరు లేరు
గ్రమ్మఱ నినుఁ జూడఁ గలిగెఁ గాన

---

1. యోగ 2. కాంక్షలు 3. పావనముగ, భావముగల 4. నిధులునై
5. ననుబుద్ధిపొడమ; ననుప్రేమపొడమ; ననుప్రియమొదవి 6. గురుస్వామి
7. లెమఱవరాఁదగని 8. ననుంచకవచ్చి; ననుంపకిటు 9. గలట్టితాయనుఁగుఁ
బట్టి 10. బ్రదికి 11. లు లేరుగా.

[1]నీశ్వరాంశంబ యహా దీవు గాకుండిన
మనుజమాత్రున కింతమహిమ గలదె
గీ. యనుచు మొగములు దెలిసి దేహములు [2]పొంగి
పలుమఱును గౌఁగిలించుచుఁ బాణిపాద
తలము లలముచుఁ దలిదండ్రు [4]లలరి రపుడు
వారివేడుకలకు ఖిలి మేర గలదె. 263

ఉ. ఇక్కరణిక్ సుహృజ్జనము లెంతయుఁ గన్నులఁ గప్పుకొంచుఁ
బే, రక్కఱఁ బూజ సేయ నతఁ [5]డక్కడఁ గొన్నిదినంబు
లున్న నా, చక్కనియన్న యాధరణిచక్ర మశేషము నీవ
యేలు నీ, చక్క భుజించుచుండెదము సౌఖ్యముతో నని
తండ్రి పల్కినన్. 264

గీ. నాగుసుం డైన యల[6]మీననాథుతోడ
నిదిగో మావారిఁ జూచి వచ్చెద నటంచుఁ
బ్రార్థన [7]యొనర్చి వచ్చిన రాక గాని
రాజ్యభోగేచ్ఛ వచ్చిన రాక గాదు. 265

సీ. సర్వ సర్వంసహా నిర్వాహక ఖ్యాతి
కాయసిద్ధిఁ బొసంగఁ జేయఁ గలదె
[8]యంగనాదృఢ కుచాలింగనానందంబు
ప్రాయంబు తిరముగాఁ జేయఁ గలదె
గంధసింధుర ఘటా గంధర్వ భట [9]సేన
సిద్ధక్రియలు గల్గఁ జేయఁ గలదె

1. నీశ్వరాంశజుఁడవు నీవు; నీశ్వరాంశంబె 2. వొంగి 3. లింపుచు 4. లలమినపుడు 5. డండుల 6. మత్స్య 7. మొనర్చి 8. యంగనాకుచ దృఢాలింగన 9. సేవ.

దివ్యరత్నావళీ ద్రవ్యరాశి[1]సమృద్ధి
[2]జీవద్వయః ప్రాప్తిc జేయc గలదె

గీ. యిన్నియును [3]గల్గె గురుకృపాదృష్టివలన
యోగలీలాసుఖముకన్న నొక్కసుఖము
గలదె యని [4]జ్ఞాన మార్గంబు [5]దెలిపి వారి
ధన్యులుగc జేసి [6]చౌరంగి దయc జెలంగి. 266

గీ. వంశకరుc డైనసుతుc డుద్భవంబు నొందc
గలcడు మీ కొకc డని యనాగతముc దెల్పి
వచ్చి తడ వయ్యె [7]నింకc బోవలయు గురుని
[8]యొద్ద కని తల్లిదండ్రుల నుపచరించి. 267

ఉ. అచ్చటు వాసి యాశివపదాంబుజభక్తిధురంధరుండు మున్
వచ్చిన [9]యట్ల యేcగి గురునాథునకుం [10]బ్రణమిల్లి నిల్చినన్
వచ్చితె యన్న రాజ్యవిభవంబులు హస్తగతంబు లైనచో
హెచ్చు గదన్న నీకుc బ్రతియెవ్వరు జ్ఞానమహత్త్వసంపదన్.

చ. అని గణుతింప సద్గురుకులాగ్రణి [11]సేవలు చాలc జేసి దీ
వనలు వహించి పుణ్యు లగువారలకుం దనదివ్యమూర్తిc గుం
భినిc గనిపించుచున్ దనదుపేరు దలంచిన వారికిన్ యశో

---

1. సమష్టి 2. జీవద్వచఃప్రాప్తి; జీవద్వచఃపాళి; జవసత్త్వసంప్రాప్తి 3. దక్కె 4. యిట్లు జ్ఞానంబు 5. దెలియ 6. సౌరంగి, సారంగి 7. తిరుగ, సరగ 8. యొద్ది 9. త్రోవనేఁగి 10. బ్రణుతుల్ ఘటించినన్ 11. సేవను జాల.

ధనములు గల్గఁ జేయుచు సదా యతఁ [1]డుంపుఁ జిరాయు
ష్మన్నతిన్. 269

క. సారంగధరుచరిత మె
[2]వ్వారుం జదివినను విన్న వ్రాసిన సౌభా
గ్యారోగ్యపుత్త్రపౌత్త్ర
శ్రీరత్న[3]ధనాభివృద్ధిఁ జెలఁగు[4]దురు సుమీ. 270

క. కలహారంభణ కౌతూ
హల పులకిత భుజపరాక్రమార్జితనానా
జలదుర్గ వనీదుర్గ
స్థలదుర్గాహార్యదుర్గ సామ్రాజ్యనిధీ. 271

ఉ. క్ష్వేళగ[5]శైణలాంఛన విజిత్వర శుభ్రయశోవిశాల ధా
రాళగళన్మదద్విప విరాజిసభాభవనాంగణా ధనా
వేళగరిష్ఠదాన పదవీపరితోషిత కాశి గౌతమీ
చోళకవిద్విజస్తుతివచోలగ చోలగమానభంజనా. 272

భుజంగప్రయాతము.

అరాతిక్షమాభృద్భిదాంచత్కృపాణా
నరాధీశ్వరాకారనాళీకబాణా
స్థిరానందనా రామసేవాధురీణా
విరాజచ్చతుష్షష్టివిద్యాప్రవీణా. 273

1. డొందు 2. వారేఁ జదివి, వ్వారలు సదివి 3. జనాభివృద్ధి 4. రెపుడున్ 5. శైక.

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణ వరప్రసాదలబ్ధ ప్రసిద్ధవాగ్వైభవ చేమకూర లక్ష్మణామాత్యతనూభవ సదారాధిత బుధసమాజ వేంకటరాజప్రణీతం బైన సారంగధరచరిత్రం బనుమహాప్రబంధంబునందు [1]సర్వంబును దృతీయాశ్వాసము.

సా రం గ ధ ర చ రి త్ర ము

సంపూర్ణము.

1. సర్వంబును నేకాశ్వాసము.

చెన్నపురి : 'శ్రీ రామప్రెస్సున' ముద్రితము.—1959.

శ్రీ ర స్తు.

# సారంగధర చరిత్రము

## లఘుటిప్పణి

---

## ప్రథమాశ్వాసము

1. రాజనరేంద్రుఁడు - కర్త; రిపు...నరేంద్రుఁడు=శత్రువుల నెడి సర్పశ్రేష్ఠములకు విషవైద్యుఁడు; కళా...నరేంద్రుఁడు = కాంతి, ప్యార్యరేఖా, సుఖానుభూతులచే ఓడింపఁబడిన (క్రమముగా) చంద్రుఁడు. అర్జునుఁడు, ఇంద్రుఁడును కలవాఁడు; సుధాకరకులుండు=చంద్రవంశజుఁడు.

2. ఈ పద్యమున అర్థద్వయము కలదు. కర్త - రాజు = ప్రభువు, చంద్రుఁడును; నిజ...వ్రాతంబు=(రాజపక్షమున) తన మిత్రులయు, బ్రాహ్మణులయు, విద్వాంసులయు గుంపు (చంద్రపక్షమున) తన మిత్రులగు చకోరముల యొక్కయు, దేవతలయొక్కయు గుంపు; పగలు = (రా) విరోధములు, (చం) పగటిభాగము; పొద...నడచి = (రా) పొడగానఁబడకుండన్ = కానరాకుండ, నడచు = అణఁచివేయు, (చం) పొడగానఁబడకుండన్ = కానరాకుండ. నడచు = ప్రవర్తించు; ...అమృతమూర్తి ...రాజు రూపును ధరించెను, (చం) ఈతఁడమృతస్వరూపుఁడే; పాదములకును = (రా) అడుగులకును, (చం.) కిరణములకును: తమ తలలకు = (రా) దుర్గాధిపతుల తలలకు, లంకెపాటు = గట్టిసంబంధము; ...దుర్గాధిపతులు = (రా) దుర్గాధ్యక్షులు, (చం.) రుద్రులు; చల్లఁ...వర్తి = (రా) శాంతస్వభావము కల ధర్మమార్గవర్తి, (చం.) చల్లఁదనము కల యాకాశమార్గగామి, మా...యన్నతోఁ = (రా) మాతృబిస్సమానుఁడు, (చం) లక్ష్మీదేవికి అన్నయగువాఁడు; భీతి=భయము; అహిత

చక్రములు = (రా) శత్రువుల సమూహములు, (చం) విరోధులగు చక్రవాకములు; కువలయము = (రా) భూమి (చం.) కలువ, ఇంపు...తప్పక = (రా) ఇంపు, కలుగఁగా, ఆడితప్పక (ఆడినమాట తప్పక), (చం) ఇంపుకల్గఁగా, నాడి తప్పక క్షణకాలము తప్పక), భరతమర్యాద = (రా) (పరిపాలనమున) భరతచక్రవర్తిపద్ధతి, (చం). నక్షత్రములతోడి కలయుపద్ధతి; (భరతనాట్యశాస్త్రపద్ధతి వెలయఁగా తప్పక యాడి - అనుచమత్కృతియు స్ఫురించుచున్నది.)

4. ఇలరాయనికిన్=భూవిభునకు; కులసతి=ధర్మపత్ని: భోగ...కము= భోగపుఁగాంతలలో శ్రేష్ఠురాలు, అంబుజేందునిభాస్యల్ = పద్మముతోను, చంద్రునితోను సమానములగు ముఖములు కలవారు — దీనివలన వారిద్వరికిని పరస్పరవిరోధము వ్యక్తము.)

5. శక్తిత్రయము=ప్రభు, మంత్రోత్సాహశక్తులు మూఁడు; ధీతిలకంబులు = బుద్ధిచే అలంకారముగాఁ గలవారు; సుధీతిలకంబుల్ = పండితోత్తములు; మంత్రులనుట.

7. నీతిరహితంబు=ధర్మశూన్యము; ఈతిరహితమానటి.ుల = అతివృష్టి, అనావృష్టి.ఎలుకలు, చిలుకలు, మిడుతలు, ప్రత్యాసన్నులగు పాలకులు ననెడి బాధలు లేకుండునట్లు.

8. పుమపత్యదూరము = పురుషసంతతి లేనిది; ఆత్మజవ్యతిరిక్తము = పుత్త్రుఁడు లేనిది; సుకుమారుఁడు = ఉత్తమపుత్త్రుఁడు; మరాళము = హంస; వితానము = సమూహము; నేత్రపర్వంబు = కన్నుల పండువు; వనజము = పద్మము.

9. జిలుగుంబలుక్కులు = వచ్చియు రాని ముద్దుమాటలు; గొనబుం జెయ్యుల్ = ముద్దులొలుకుపనులు; ఏతన్మాత్రుఁడే? = సామాన్యుఁడా?

10. చెక్కిలి గీఁటి = చెక్కిలి గిల్లి; కలదా? = వన కున్నదా?

11. ప్రాప్తమగుటకున్ = లభించుటకు, కాశీవిశ్వపతి = కాశీక్షేత్రమందలి విశ్వనాథుఁడు.

12. ప్రమోదంబు = ప్రీతి, కుమారుఁడు=పుత్రుఁడు, కుమారస్వామి,

13. ముంగొంగుఁబసిఁడి = సులభసాధ్యుఁడు. (ముందరికొంగునఁ గట్టుకొన్న బంగారమువంటివాఁడు). చంద్రచూడుఁడు = శివుఁడు.

14. నెలపూఁదాలుపు=శివుఁడు. చీకిలిచూకిలిగాన్=కొక్కిరి బిక్కిరిగా; వెలఁది తెరల్ = సాలెపురుగుగూండ్లు. (తనలింగము పైభాగమున నల్లినగూండ్లం జూచి శివుఁ డొక సాలెపురుగునకు ముక్తి నిచ్చెనఁట).

15. నేర్చినయటుల=శక్తి ననుసరించి; గిరీశున్=శివుని. "కొండంతటి ...గలరే!" లోకోక్తి.

16. అన = ఒట్టు.

17. రాజశిఖామణి = శివుఁడు, రాజశ్రేష్ఠుఁడు. రాజీవ = కమలము;

18. ఘనదానములు = గొప్పదానములు.

20. మందాకినీధరునకున్=గంగాధరునకు; కృత్తివాసునకున్=చర్మము వస్త్రముగాఁ గలవానికి; అలఁదెన్ = పూసెను; భసితము = బూడిద; అనలేక్షణునకున్=అగ్నిని నేత్రముగాఁగలవానికి; పరంజ్యోతి స్వరూపునకున్=సర్వాధికమగు తేజము స్వరూపముగాఁ గలవానికి; విషాశనునకున్=హాలాహల మాహారముగాఁ గలవానికి; నారాళి = వక్రముకాని.

21. ఇచ్చటఁ గల 'రాజనరేంద్ర విభుఁడు' అనునెడఁ గల 'నరేంద్ర' శబ్దముచే విషవైద్య, భూతవైద్యులు శ్లేషమూలమున స్ఫురించుచున్నారు. మంత్రాభిషేకము = (రాజుపక్షమున) వేదమంత్రములతోడి యభిషేకము (విషవైద్య, భూతవైద్యుల పక్షమున) మంత్రించి నీళ్లుచల్లుట—విషంబు = నీరు, విషము, గారుడమణిహారము = (రా) గరుడపచ్చల పతకము (వి. భూ.) గారుడమంత్రముచే మంత్రించిన రత్నాలహారము; గంధంబు=(రా) చందనపు

బొట్టు; (వైద్యులు) మంత్రించి పెట్టిన గంధము; మూసినకన్ను తెఱవ లేదు = కన్నెత్తిచూడలేదు (రా) (వైద్య—) కన్ను విప్పిచూడలేదు. ధూపవిశేషము = (రా.) అగరుధూపము మున్నగునది; (వై.) భూతోచ్చాటనకు వేయుధూపము, భూతములు = (రా.) ప్రమథులు; (వై.) పిశాచములు. అమృతకిరుఁడు చల్లనిచేయికలవాఁడు (వై.), (రా.) చంద్రుఁడు; ఓషధీశుఁడు=చంద్రుఁడు, వైద్యుఁడును; పంచశరవైరి = శివుఁడు.

22. చక్కెర...పండేరములు = ఎక్కువ చక్కెరవేసి చేసిన భక్ష్యలుము; నటింపఁదొడంగెన్=ఆడసాగెను, వర్తింపఁదొడంగెను ఆడుటల్=మాటలాడుటలు, నటించుటలు; మేలములు = పరిహాసములు; గౌరి = పార్వతి.

23. అంగరంగవైభవములు = వివిధకైంకర్యములు.

24. నందనసంతానము=పుత్రసంతతి, సంతోషపఱచు కల్పవృక్షము.

25. ఇందలి 'రాజశిఖామణి' శబ్దముచే చంద్రశేఖరుఁడగు శివుఁడు, రాజశ్రేష్ఠుఁడును, గ్రహింపఁబడవలెను.

వరదానసంపద = (శివ ప.) వరరూపమైన దానసంపద, (రా) యోగ్యమైన దానసంపద; వామోత్తమాంగముల్ = శరీరముయొక్క ఎడమభాగము; శిరస్సు; కోప...రూఢిన్ = నిగ్రహానుగ్రహములందలి తదేకాసక్తియందు, చందమామమల్లుఁడు = మన్మథుఁడు. (శివుఁడు మదనునిఁ దొలుత నిగ్రహించి, పిదప ననుగ్రహించె ననుట.) ఖలశిక్ష = దుష్టశిక్షణము, కటి = మొల, కేల్ = చేయి; శార్దూలమృగములన్ = (క్రమముగ) పులిని, జింకను; (శివుఁడు దుష్ట మగు పులిని చంపి, దానితోలు ధరించి, సాధువైన జింకను హస్తమున ధరించె ననుట) పునుకగంగాళఁబు = గంగాళమువలె నున్న పెద్ద పునుక; నరసీరుహాసనుఁడు = బ్రహ్మ. (శివుఁడు బ్రహ్మ శిరస్సును ఖండించె ననుట.) బంధురాష్టవిభూతులు = విస్తారమైన అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము. వశిత్వము నను అష్టసిద్ధులు, (రా) గృహ, శయ్యా, వస్త్ర, ఆభరణ, స్త్రీ, పుష్ప, గంధ, తాంబూలము లను అష్టభోగములును. ప్రమదము = సంతోషము; మందహాసాననములతోడన్=చిఱునవ్వుతోడి యీశానాది ముఖములతో;

[ఇచట 'మందహాసాననములతోఁడ' కుదుర దనియు, 'మందహాసయానములతోఁడ' నని గ్రహించి 'చిఱునవ్వుతోను మెల్లని నడకతోను' అని యర్థము చెప్పవలె ననియు, లేనిచో శ్లేష కుదుర దనియు 'జితకాశి' టీకలోఁ జెప్పఁబడినది. 'మందహాసాననములతోఁడ వచ్చి, ధరణీతలేంద్రుని స్వప్నమందు' అనుటచే నిర్యోడ శ్లేష యనావశ్యకము.]

26. ఇట్టె = శీఘ్రముగా, ఈప్సితంబు = కోరిక.

27. హరిణాంకుఁడు = చంద్రుఁడు; మాకు పేరిడుము=మా కంకిత మొనర్పుము...మా పేరు పెట్టుము.

28. అను ..గ్నుఁడై = సంతోషాశ్చర్యములందు మునిఁగినవాఁడై.

29. ఎంతయు = మిక్కిలి; సల్లలి ..గులు = ప్రసన్నహృదయులు; స్వామి, హసాదు = ప్రభూ! మేలు, మేలు.

30. తనకున్=మీ కనుట; ఉన్నతిన్=గొప్పగా; పేరిడుము=నా పేరు పెట్టు మనుట. భవ....వాఢ్యత=నీ ప్రభావ, సంపదల సమృద్ధి. ['జితకాశిలో' నిచట 'తనకుఁ బేరిడుము = నా పేరు పెట్టుము' అని అర్థ మీయఁబడినది. 'తనది పేరు = తన సంబంధమైనట్టి నామము' అని యున్న పూర్వటీక ఎట్లు సరిగా లేదో, ఇదియు ఆ విధముగనే ఉన్నది.]

31. కనకాచలకార్ముకుఁడు = శివుఁడు.

32. చిట్టుములు = వాంతులు; అరుచి = ఏదియు రుచింపకుండుట; బడలికలు = అలసటలు; అలఁతికవును = సన్నని నడుము; అరు = నూఁగారు.

33. గర్భోక్తుల్ = నర్మగర్భములైన మాటలు, గర్భసంబంధమైన మాటలును.

34. పోరచికోరికల్ = సూడిదలమీఁది కోర్కులు, తనుగ్లాని=శరీరము వాడిపోవుట; మేచక కాంతి = నల్లని కాంతి; చూచుకములన్ = స్తనాగ్రములందు, కూర్కులు సందడించెన్ = నిద్ర లధికమయ్యెను; చుండించెన్=మందగించెను; మృదామోదము = మట్టివాసన.

35. నిర్భర .. తాంత = నిండు గర్భముయొక్క బరువుచే మిగుల అలసిపోయినది; కడచన్ = నిండఁగా.

36. చొక్కుల ... సెలసెన్ = పారవశ్యమున సోలి సుడిసెను; జొబ్బిల్లి = అధికమై; సుధా...వానలు = అమృతము ఆహారముగాఁ గల దేవతలవైన యింపైన పూలదండల వర్షములు; మొరసెన్ = ధ్వనించెను.

37. బిసబిస=చకచక. వెన్, నటింపఁగా=వెనుక భాగమున నాట్యము చేయఁగా; అలంతి నడుము = సన్నని నడుము; అసురుసురై = మిగుల శ్రమఁ జెంది; ముందు ముందుగా = మిక్కిలి త్వరగా ననుట. ఒసపరి బాగులాఁడి = మిక్కిలి యందకత్తె;

38. పట్టపుదేవుల్, కనిరి-అని గౌరవార్థమున బహువచనము, 'మొగ మింతయి, బుజాలు మూఁడయి' అనునవి ఆనందాతిశయమును దెల్పు జాతీయములు.

39. బడిబడిని = వెంటవెంటనే; స్తోమములకు = గుంపులకు;

40. సూతకదినములు = పురిటి దినములు.

41. అంగజవైరి = శివుఁడు; సారంగధరాహ్వయంబు = సారంగధరుఁ డనెడి పేరు; అనుంగుఁజూలికిన్ = ముద్దుకొమరునకు.

42. రాజసూనుండు = రాజకుమారుఁడు: అనుదినప్రవర్ధమానుఁడు = దినదినము వృద్ధిపొందుచున్నవాఁడు.

43. పాలడ = బిడ్డలకు పాలుపోయుటకుపయోగించు చిన్న గోకర్ణము.

కెంజిఱుచేతులు=ఎఱ్ఱనైన చిట్టిచేతులు; గట్టు...సామి=పార్వతీభర్తయగు శివుఁడు; జోతలు = నమస్కారములు.

44. ఉడిపి = పోఁగొట్టి. మారునిపెన్నుద్దిని = మన్మథున కీడైనవానిని.

45. లాలి = ఉయ్యాల; గంధో...స్థలిన్ = సువాసనతో సంతోష పెట్టఁబడిన తేటిగములు కలపూలతోడి చంద్రకాంతమణినిర్మిత మగు మేడ యందు. హారునియిల్లాలిన్ = పార్వతింగూర్చి; మేలిజవరాలిగములు = అంద కత్తెలగు యుఁవతుల గుంపులు; రాచూలి = రాజకుమారుఁడు.

46. పూాసెటి...కొమరున్ = పూవువలె అందమైన శరీరము కల రాజకుమారుని; పొత్తులలోపలన్ = మెత్తని గుడ్డలలో; కట్టువిల్కాని = శివునియొక్క; చొక్కుఁగన్ = పరవశమగునట్లు; జాళువాపస్కిఁడియుఁయ్యేల = మేలిమిబంగారపు టుయ్యేల; ఎలనాఁగలు=స్త్రీలు.

47. అమృతపుఁజాలు = అమృతప్రవాహము; జోకొట్టఁజాలు = నిదురపుచ్చఁజాలిన — అతిక్రమించిన యనుట. డోలాయమానముగన్ = ఉయ్యాలవలె నూఁగుచుండఁగా.

48. ఉగ్గడింపన్ = పలుకఁగా; ఎలనవ్వు = చిఱునవ్వు; దువాళింపన్ = వ్యాపింపఁగా; దోఁగియాడుచుండన్ = ప్రాకులాడుచుండఁగా; వింత లేక = క్రొత్తలేక — బెదరులేక; సరసకు = దగ్గఱకు; కనుమెఱంగి = మోసగించి.

49. ద, యింద = రా, (దీనిని) తీసికొనుము. ['ఇంద = ఇటురా' అనిజితకాశి:] రాగంబు = ప్రేమ; రావిరేక = ఒక నగ; తులకింపన్=మెఱయఁగా; అంకంబుపై = తొడపై. ఇందు చంద్ర వృత్తాంతము ధ్వనితము.

50. ఇనకరస్పర్శనంబు = సూర్యుని కిరణప్రదానము, రాజుయొక్క లాలనము; ఇంపుగాంచి = తేజమును పొంది, మెరుగెక్కి; సారంగధరుఁడు = చంద్రుఁడు, రాజకుమారుఁడు.

51. గారాసన్ = ప్రేమతో; ఏటఁన్ = సంవత్సరకాలమున; సరఁన్ = క్రమముగా; వరవిభూతిన్ = ఎక్కువ వైభవముతో.

52. కోడీకరించి = తెలిసికొని.

53. అవక్ర...పుంగవులు = ఋజువైన పరాక్రమ, కళాసారముల నెఱిఁగిన నేర్పరులు.

54. శ్రుతిమార్గములు = చెవులమార్గములు, వేదమార్గములు; తెలివి = జ్ఞానము, జాగరూకత; చూడ్కి = చూపు (కన్నులు), మనోదృష్టి. సాధు... సంగతి = ఉత్తమపురుషుల సమూహముయొక్క మైత్రి, ఉత్తమగజసమూహముఁబోలు నడకయుఁను. దాక్షాయణీనాథుఁడు = చంద్రుఁడు, శివుఁడును; ఇంచువిల్కానిన్ = మన్మథుని; అమర్త్యుండు = అమరుఁడు.

55. మాడెత్తుమాట = స్వల్పమైన మాట.

56. గురువాక్యముగాన్ = గురునియాజ్ఞవలె, గోరంతయుం = కొంచెమైనను.

57. వన...కౌస్తుభంబు = చంద్రవంశ మను పాలసముద్రమునఁ బ్రకాశించు కౌస్తుభమణి; నిజాన్వయంబు = తనవంశము; కోకాప్తవంశంబు = చక్రవాకముల కాప్తుఁడగు సూర్యునివంశము.

58. అలివేణి = తుమ్మెదవలె నల్లనైన జడ గలది.

59. తారావణి = చుక్కల గుంపు, ఒక కావ్యవిశేషము; నఖములు = గోళ్లు; ఉరోరుహములు = స్తనములు; మంజరులు = పూలగుత్తులు, కావ్య విశేషములు; ధవళములు = తెల్లనివి, రచనావిశేషములు; మంజువాణి = సారంగధరుని భార్య, మధురమైన వాక్కులు కలది.

61. వేటు = దెబ్బ; తునియలు = ముక్కలు; వజీర్లు = గుఱ్ఱపు రౌతులు. అరాతిధరణీరమణులు = శత్రురాజులు; అయ్యాజియ్యలువెట్టుచు = మనవులు చేయుచు; మనవి సనవులకున్ = విన్నవించుటలకు; మన్నెవారు = చిన్నరాజులు; ఒడ్డోలగంబు = నిండు సభ.

62. పులితోల్కాసెలు = పులిచర్మపుదట్టీలు; పిడెంబుల్ = బాకులు; కీలిపూఁదావళంబులు = పికిలిపిట్ట యీఁకల దండలు; బల్...యంబులు =

సింహము జూలుతోఁ జేసిన దండకడియములు; చెక్కు = చెరవిన; పీఁకలు = పీఁకెలను ఊఁదుసాధనములు. [చెక్కుపీఁకలు = చెరవిన యీఁకలును-' అని జితకాళి. పీఁకలు ఎంతమాత్రము ఈఁకలు కావు. చూ. 'బిసరుహాహితరేఖ పీఁకగాఁగ.' శ్రీ కాళహస్తి మాహాత్మ్యము ఆ ౪. ప. ౧౭౮] కెంజేగురు బొట్లు = ఎఱ్ఱని తిలకములు; జుంజుఱుసిగలు = చింపిరిజుట్టులు; గొరంపు మైపూఁతలున్ = తెల్లని గంధపుఁబూఁతలు, బలుతూపులు = గొప్ప బాణములు; వెడవిండ్లు = పెద్ద ధనువులు.

63. జల్లులు = చామరములు; భిల్లజనంబులు = అటవికులు.

64. విఁజపుఁగొండ = వింధ్యపర్వతము; బైసి = గౌరవము; అచ్చి కంబు = కొఱత.

65. లచ్చనదేవుఁడు = లక్ష్మణుఁడు; సిరామయ్య = శ్రీరాముఁడు; వాలెకంబులన్ = గొప్ప మృగములను.

66. అందలమందలలేక = హద్దు పద్దు లేక; ఇపుడు; అందునన్ = ఆయడవిలో; చెందామరకొలను = అందమైన తామరకొలను; తెందేపలు = తెప్పతెప్పలు - గుప్పగుప్పలు.

67. కోల్పులులు = పెద్దపులులు; మఁచపిల్లి = మత్తిల్లి; రొప్పి = శబ్దముచేసి; ఒరయఁజూచున్ = ఎదిరింపఁజూచును. కాఱుపుల్ = దట్టముగ పెరిగిన గడ్డి; ఆముకవిసి = మదించి; మన్బోఁతులు = మనుఁబిల్లి, కారు పోతులు = అడవి దున్నలు; కదుమఁజూచున్ = ఎదిరింపఁ జూచును. ఈతలాతలచేసి=తాఱుమాఱుచేసి; గబ్బిఎల్గులు = మదించిన భల్లూకములు; గిబ్బఁజూచున్ - చంపఁజూచును; చలంబు = పట్టుదల; తరతరంబై = వరుసపెట్టి.

68. జింకదాఁటులు=లేళ్లమందలు; తేజీలు=గుఱ్ఱములు. ఉప్పరము = ఆకాశము; నెలలేఁడి = చంద్రునిలోని లేఁడి.

69. కాఱెనుపపాలు = అడవిబఱ్ఱెలపాలు; నేవెల్లువలు = నేతి

ప్రవాహములు, క్రొవ్వు లనుట. మెకాల్=మృగములు; అందుఁ = ఆ వెమ్మ యందు; దొప్పునఁ = దబ్బున.

70. దబ్బు, దబ్బెదఁ=మాటచెప్పెదను; బల్లి...ములు=బలముగల పందులు; ఆఁదికోఁ = దుముకుటకు; రెమ్మి, దీసినఁ = ఒడిసి లాగినయెడల; వెళ్లఁబో = బయటకు వచ్చును గదా. చిమ్మనఁగ్రోవి = చిమ్మనగొట్టము.

71. శక్తివాయఁబులు = పార్వతీదేవివాహనములు; మందము = బ్రదుకుదము; మొగులు...యట్టులు = మేఘములలో దూఱినట్లు (ఇందు సింహములు చెప్పఁబడినవి) దికూ్కలములు = దిగంతములు రెక్కొందము = కుజింతము; అల, దరుల్ = ప్రసిద్ధముగు గట్లు; కోరాడుచుండుఁ = కుమ్ము చుండును. ఏనుఁగుల నిట గ్రహింపవలెను.) వేమఱు=చాలసార్లు; (ఇచట పందులను గ్రహింపవలెను.) చందురుఁ=చంద్రుని; మేతౌదమని=సుఖపడుద మని; ఉప్పరిమ=ఆకాశము; (ఇచట జింకలను గ్రహింపవలెను.) హరులు = సింహములు; కరులు= ఏనుఁగులు; కిరులు = పందులు; హరిణంబులు=జింకలు; పెద్దలు = తమజాతిలో పెద్దలు; అరుగునోళవు = వెళ్ళు రహస్యము— కిటుకు.

72. కలుపుదీసి = గడ్డి, చెత్తమొక్కలు తొలఁగించి; కమతీలు = సేద్యగాండ్రు; ఏకలములు = పందులు; కరి...రేక = ఏనుఁగుల కుంభస్థలము నందలి ముత్యాలజాడ; సంగాతకాండ్రు = మిత్రులు జింకవేఁటలఁ = జింక లనెడి గొఱ్ఱెలను; కాచి = మేపి; జంకించి = అదలించి; దొడ్డిఁదోల్ = దొడ్డికిఁ దోలుకొని వచ్చు; అంగళ్ళఁబెట్టుంచు = అంగళ్లయందుఁ బెట్టి యుంచు; వాడుకకోమట్లు = వాడుకగా నమ్ముకోమట్లు; వాటిలోఁ = వానిలో; తాటోటు = మోసము; అటమటింపకయుండఁ = కాఁజేయ కుండునట్లు; పై యద్దికముగఁ = పై కావలిగా; ఏవఁ = జాగరూకతతో; విశ్వాసులు = నమ్మిక కలవారు — సేవకులు; జాగిలంబులు = వేఁటకుక్కలు.

73. అల్ల...సొచ్చుట = ఆ శక్తిదేవత క్రింద దూరుట—శక్తి కి వాహన మగుట; మాడాక = మా పరాక్రమము; వాలు...పంది = పరా

క్రమము గల ఆదివరాహము; రాజు=చంద్రుఁడు, రాజు; దచ్చిమేటిఁగుల్ = ఎనిమిది గజములు; కడభూమి = దిక్కుల యంతము; కనుకలిగి = జాగరూకత కల్గి; మున్నె = ముందుగనె; కోలాహలము చేసి = అల్లకల్లోలము చేసి; చెకపిక లాడమా ? = కకపికలు చేయమా ? సుద్దులక్ = కథలను-మించి .. సేల ? = గతజలసేతుబంధన మేల ? యనుట.

74. కైవడి = చేతివాడి, రీతి; మా యావ, చేవ = మా మెలఁకువను, ధైర్యమును; కనఁబోయెదవు గదా ! చూడఁబోయెదవు గదా. దేవర = ప్రభువు, దైవము; వేఁట = వేఁటకయి.

75. మందహాసము, ఒలయక్ = చిఱునవ్వు కల్గఁగా; తమి = ఉత్సాహము; అయితపెట్టుఁడు = సిద్ధము చేయుఁడు; అచిరత్న = నూతనములైన; సింగఁడు, బూరఁడునై = చెంచులలో ఐశ్వర్యవంతులై పేరుపడిన 'సింగఁడు, బూరఁడు' వలె నున్నవారై — ఉప్పొంగినవారై.

76. పోవం జనక్ = పోవుటకుఁ దగునట్లు; వెసక్ = వేగముగా; జనవరులక్ = రాజులను; మనసరులక్ = మనస్వులైనవారిని.

77. మజ్జనంబాడి = స్నానమొనర్చి; డేగపదనుగక్ = వేవేగ - తేలికగా. ఆఖేట - గాఁగక్ = వేఁటయందు విహరించుటకుఁ దగినట్లుగా. తత్తఱంబునక్ = తొందరగా. బిత్తరముగక్ = సొగసుగా.

78. ఒంటుముత్తెములు = అంటుజోడులోని ముత్యాలు; ఒంటు కెంపులు = కూడియున్న కెంపులు; చికిలిసేయక్ = మెఱుఁగుపెట్టఁగా; ఒరగుపాగ = వంకపాగా; ముసుగువేయక్ = వ్యాపింపఁగా; తాళిచాకచక్య ప్రభక్ = పతకముయొక్క తళతళకాంతులు; వుస్తరింపక్ = ఉజ్జగింపఁగా; సూర్య...వాలు = మొకమల్ కల యొరతోడి కత్తి; ఓలగింపక్ = కొలువై యుండఁగా — ప్రకాశింపఁగా; చిక్కటారి = చిన్నకత్తి; సంకు = శంఖము తోమక్ = తోమి శుద్ధముగా నొనరింపఁగా; రాచిలుక ... రాతు = మన్మథుఁడు.

79. నగరు = రాజసౌధము; మన్నీలు = చిన్నరాజులు; వేత్రహస్తులు = ద్వారపాలకులు.

80. మురువు = సొగసు; మొగచుట్టు = అశ్వముఖభూషణము; సవరించి = కూర్చి; ఖలీనంబు = కళ్ళెము; పచ్చ...పల్లంబు = పచ్చమొగమల్ పట్టుజీను; బిరుదు తలాటంబు = బిరుదైన తురాయి; ఇరవుకొలిపి = ఉంచి; చికిలి...కుచ్చులు = మెఱయుచు నందమైన పికిలిపిట్టల కుచ్చులు; అపరంజి పక్కెర = బంగారు కవచము; అలవరించి = అలంకరించి; సమకట్టుజల్లులు = కవచమునకైన జాలరులు; ఇరువంక = రెండుప్రక్కలు; గొరక...పొదుల్ = బాణములయొక్కయు, కొమ్ము విండ్లయొక్కయు పొదులు; పంచకము = పిరుదు; పరిఢవిల్లన్ = ఒప్పుగా; మోడి = బింకము; శిరసెత్తరము = శిరస్సుయొక్క ఔన్నత్యము; మొయిలు = మేఘము; పాదరసంబువంటి = పాదరసమువలె చుఱుకుతనము కల; సాహిణి = గుఱ్ఱపువాడు.

81. ఉక్కడమైన = ఉన్నతమైన; తనువు = శరీరము; కక్కసము = మోటుతనము; ఏమి, లేక = కొంచెమైనను లేక; రవగాలు = ముందుకాళ్లొకమాఱును, వెనుకకాళ్లొకమాఱును ఎగురునట్లు నడచుట - ఆస్కందితము; జోదన = చౌకళించి దూకుట - ధౌరితకము; అడ్డవేడెము = పాముసడక - రేచితము; లఱక్క = మెల్లని నడక; దువాళి = సమవేగము గల నడక; జంగనడలు = కాలు చాచి నడచు నడక; వన్నె సోఁకన్ = (కాలి) అంకెము తగులునట్లుగా; వహ యనినన్ = అదలింపఁగా; జరీలునన్ = వేగముగా.

82. జోదగించి = జోదన యను గతివిశేషమునఁ బురికొలిపి; శంచుమించుగన్ = మిక్కిలి వేగముగా; ధరణి క్రక్కదలన్ = భూమి దద్దరిల్లునట్లుగా.

83. అసమ = సాటిలేని; కెంధూళి = ఎఱ్ఱని దుమ్ము; చక్రంబులు = చక్రవాకములు.

84. ఉరులు = ఉచ్చులు; సివంగుల బండ్లు = మచ్చికచేసిన సివంగులు పూన్చిన బండ్లు; జిగురుఁగండెలు = జిగురు పూసిన దారపు చుట్టలు; అలబలములు = కలకలములు.

85. సమాభోగము = వైశాల్యము; నిరోధి = అడ్డగించుచున్న; మేదుర = నిబిడమైన; రింఖా = గోరిజలవలని; భీషణ = భయంకరమైన; ఘననినద = గొప్ప ధ్వనిచే; సమాభీల = మిగుల భయంకర మైన, దిగంత బల = దిక్కుల చివఱివఱకును గల సేనలతో.

86. సర్వం...ఖని = సకలవిషయముల నెఱరయుచు; గొప్పదైన బుద్ధికి నిధి యగువాఁడు రాజు; కూలం...ఘనుండు - కూలంకష = గట్టనొరసి పాఱు; దానతోయఝర = దానజలప్రవాహమును; కృత్ = కల్గించునట్టి; కౌశల్య = నేర్పుచే; మేఘాయిత = మేఘమువలె చేయఁబడిన, అత్యసఘ = మిక్కిలి పవిత్రమైన; అస్తోక = తక్కువ కాని; యశోఘనుండు = కీర్తిచే గొప్పవాఁడు; రుంద్రా...గణ్యము:- రుంద్ర = విపులములును; అభ్రంకష = ఆకాశము నంటుచున్నవియును; అశేవపుష్ప = సమస్తములగు పూవులకును; నిధాన = నిధియైన - ఉనికిపట్టైన; అవనిజ = వృక్షములచే; అగ్రగణ్యము = తొలుత నెన్నఁదగినది - శ్రేష్ఠమైనది; విరా...రణ్యముక్ = ప్రకాశించుచున్న దండక యను నడవిని.

87. చొత్తేక్ = ప్రవేశింపఁగా; హరి...తతులు - హరి = సింహములచేతను; పుండరీక = పెద్దపులులచేతను; సపది = అప్పుడే; గ్రస్త = ఆక్రమింపఁబడి; ప్రతిత్యక్త = విడువఁబడిన; దంతినికాయ = ఏనుఁగుల గుంపులు; ఏణతతులు = జింకల గుంపులు (క్రమము). నిరాకు...ఖులై = కలఁతపాటులేక ఆనందముతోఁ గూడిన వర్తనముతో; వర్తిలక్ = సంచరించునట్లుగా; ఘన...కదంబంబులు - ఘన = గొప్పవైన; నిస్సాణ = ధణధణ శబ్దముచేయు చర్మవాద్యము; మృదంగ = మద్దెల; కాహళ = బాకా; హుడుక్కా = ఉడుక; భూరిభేరీ = పెద్దనగారా—అనువానియొక్క; నిగుంభన = కలయిక చేత; గంభీరవిజృంభణ = విస్తార మగు వ్యాప్తి కల;

ధ్వనికదంబంబులు = శబ్దముల మొత్తములు; వనిన్, పొల్చినన్ = ఆ యడవిలో వ్యాపింపఁగా; (ముందున కన్వయము.)

[ఇచట 'జిత్రకాళి'లో రెండవ పాదము చివరఁ గల 'వర్తిలన్' అను నది 'వర్తిలెన్' అని సమాపకక్రియగా మార్చఁబడినది; 'వర్తిలన్' అను క్రియకు అవతలి పద్యముతో అన్వయము లేదు కావున 'వర్తిలెన్' అని యుండుట యుచిత మని సవరించినాను" అని వ్యాఖ్యాత వ్రాయుట సరి కాదు; తర్వాతి పద్యముతో సమన్వయము కుదురుచున్నందున మా ర్పక్కఱ లేదు.]

88. సెలవిండులు = సెలసుబద్దల విండ్లు; వలకేలన్ = కుడిచేతితో; వలను...వలెన్? = మృగములను వలలలోని కేల త్రోలవలెను? మే మునికిన్ = మే మున్నందున. (ముందున కన్వయము)

89. ఏకలమ్ములు = అడవిపందులు; క్రమ్మి...చేసి = బాగుగా నలఁగఁ బొడిచి; పట్టి పొలార్తుము = కట్టి బాధింతుము.

90. ఆరభటుల్ = కోలాహలధ్వనులు; కెడపిరి = చంపిరి; సైరిభములన్ = అడవిదున్నలను; మద ...రభములన్ = మదించి గొప్పవైన ఏనుఁగులను.

91. జిగురు = పక్షులను పట్టుటకై పుల్లలు మున్నగువానికి రాచిన బందన, వెన్ తగిలి = వెంటనంటి; సింగాణి = ఆ పేరు గల కుక్క; చెండి వైచున్ = చంపివేయును; కడుఁదురీఁగ = కందురీఁగ; కస్తూరి = ఆ పేరు గల కుక్క; గావుపట్టున్ = చంపును; గబ్బి = ఒక కుక్క; తొట్రించి = తొట్రుపడఁ జేసి; తోడేలు = వృకము; గొర్లలోన్ = గొఱ్ఱెల మందలో - అనుట; సురగాలి = ఈ పేరుగల కుక్క; తగరువై ఖరిన్ = పొట్టేలువలె; తూఁటి = చొచ్చి; పీటవెట్టిన పందిన్ = మొండికెత్తి కదలక యున్న పందిని; పీచమడఁచున్ = చంపును; పోటు బంటుతనంబులు = (తమతమ కుక్కల) శూరత్వములు; గొలుసులు, ఉలిసి = మెడగొలుసులు సడలించి; మెకములమీఁదన్ = మృగములమీఁదికి; ఉసికొలిపిరి.

92. ఒడిసెల ..మునన్ = ఒడిసెలనుండి పోవు రాతివలెను; ఉర్వడిన్ = మిక్కిలి వేగముగా; సింగిణికోల = కొమ్ముబాణము; పాఱు కైవడిన్ = పోవు విధమునను; లగుడు=ఒక జాతి డేగ; అంకటన్ = ఆంకలిచే; సాళువంబు = ఒక డేగ; బిస్సనన్ = రివ్వున; తూఱెడు క్రియన్ = చొచ్చినట్లు; కిటిబృందము = పందిగుంపు; చిందఱచేసెను = అల్లకల్లోల పఱచెను; చెంచులు, అయ్యెడరునన్ = ఆ సమయమున; బాపురే, శుని ! = ఓ కుక్కా! మే లు మేలు; నరేశునిన్ = రాజును; మెచ్చంగఁ జేసితి = మెచ్చుకొనునట్లు చేసితివి. ఔను = బాగున్నది.

93. చికమక... జేసి = చిందఱవందఱ యగునట్లు చేసి; నలుదిక్కు-లన్ = నాల్గువైపులను; అర్భటిసేయుం = చుట్టుకొని యఱచుచున్న; సారమేయకములన్ = కుక్కలను; సెల్గి = చెలఁగి - విజృంభించి; కొట్టి; నుఱుమాడుచున్ = చెండాడుచు; పరాహము = పంది; చేవకలిమిన్ = బలసంపదచే; ఆ రొయికువాండ్ర + అదలింపులకున్ = బోయల బెదరింపులకు; ఏమి = ఏమాత్రమును; సడ్డసేయక = లక్ష్యముచేయక; తన యిచ్చగాన్ = తన యిష్టమువచ్చినట్లు; సరగునన్ = వేగముగా; విడి...యనన్ = కట్లు త్రెంపుకొనిన మదపుటేనుఁగో యను రీతిని; ఏఁగెన్.

94. ఏకలంపుగుంపులు = పందుల మూఁకలు.

95. రాజు, వడిన్ = వేగముగా; తేజిన్ = గుఱ్ఱమును; తోలి; ఉరవడిన్ = మిక్కిలి వేగముతో; డొంకెనపోటుగాన్ = వంకరయలుగుల యీటెతో పొడిచినట్లు; ఉరః స్థలిన్ = రొమ్మును; పిడికిటి గోరకన్ = తన పిడికిటియందలి బాణముతో; వేయన్ = కొట్టఁగా; పిడికిటి = ఆఁడుపంది; బిట్టు + ఎగసి = చెంగున పైకెగిరి; బిల్లబీటుగన్ = తలక్రిందుగా; పడియెన్.

96. నరపాలకుఁడు = రాజు, ఏసిన యాశుగంబు = ప్రయోగించిన బాణము; అనర్గళముగన్ = అడ్డు లేనట్లుగా; ఏఁగు, కేసరిని = పోవుచున్న సింహమును; కాఁడి=నాటుకొని; ఆవలన్ = ఆవిదప; తన . వాయువుఁన్ = 'ఆశుగము' అనెడి తన పేరు ధరించిన - వాయుఁవును; భోగిరాట్కులము =

పాముల గుంపు; క్రోలుట యెట్లు?=ఎట్లు క్రోలఁగలవో చూచెదఁగాక! అని, పగదీర్పఁగన్ = పగ సాధించుటకు; నాగలోకమునకున్ = పాతాళలోకము నకు; పోవుకై వడిన్ = పోవుచున్నవో యనునట్లు; రసాస్థలిన్ = భూమిని; తూఱఁబాఱెన్ = చొచ్చుకొని లోనికిఁ బోయెను. అలం. ఉత్ప్రేక్ష.

97. భూమి వరేణ్యుఁడు = రాజు; ఏయు శరముల్ = ప్రయోగించు బాణములు; గతి మోవన్ = బాణపుటెక్కువఱకును, నాటుటన్ = గుచ్చు కొనుటచేత; పై...రులు=పైకి ఉబికిన రక్తములు. అవి=ఆ పెద్దపులులు; పుండ రీకముల్ = (పులులును), తెల్లతామరలును; తాము = ఆ శరములు; శిలీముఖం బులు = (బాణములును), తుమ్మెదలును; అటుగావునన్ = అందువలన; రక్త...మముల్=ఎఱ్ఱని పూఁదేనెలను; ఆని=త్రాగి; కుత్తుకకున్ తోట్రిలన్ = గొంతుకకు అనఁగా; వెళ్లఁగ్రాసెనో=వెళ్లఁగ్రక్కెనో; అనన్; భాసిలెన్ = ఒప్పెను.

తా. రాజు ప్రయోగించిన బాణములు పులుల శరీరముల నాటుకొని గాయములు కాఁగా, అందుండి రక్తము బైటికుబికినది. పులులు పుండరీక ములును, బాణములు శిలీముఖములు నగుటచే - ఆ తుమ్మెద లా తామర పూవులలోని యెఱ్ఱని తేనెను త్రాగి, అది కుత్తుకవఱకును రాఁగా, ఇముడ్చు కొనలేక బయటికి వెడలఁగక్కుచున్న ట్లుండె నని తాత్పర్యము. అలం. ఉత్ప్రేక్ష.

98. అవనీపాల! = రాజా! నీపాలఁ బెట్టుకొనుము = నీవురగున నుంచుకొనుము; అను గతిన్=అనెడి విధమున; రాజమాళికిన్ = రాజశ్రేష్ఠు నకు; అది=శరణాగత రక్షణమును, దుష్టశిక్షణము ననుట.

[ఇచట 'రాజమాళి' పదముచే శివుని గ్రహింపవచ్చును. అతఁడు జింక తాలుపనియు, శార్దూల చర్మధారియు నని ప్రసిద్ధము.]

99. సమదగజంబుపైకి = మదపుటేనుఁగుపైకి; సామజవైరి = సింహము; నూటిపెట్టు = గుఱిచేయు; ఆ, గమకము=ఆ (రాజు) పూనికను; భూపతి ముఖంబునన్ = రాజునెదుట; వ్యాధులమూఁక = బోయల గుంపు;

అమిత భయాప్తిన్ = ఎక్కువ భయము కలుగుటచే; ఓసరిలెన్ = తప్పుకొనెను. ఔనన్నన్ = అది యుక్తమే! ఏనుఁగుపోవు వీథి=భయంకర మగు నడచుట; సింహము మెడగంట=సింహము మెడలో గంటకట్టఁ దగిలి యున్నది. ('ఏనుఁగు పోవువీథి, సింహము మెడగంట' యనునవి ఎదిరింపరాని వనుటకు లోకోక్తులు.)

[రాజు మృగములపై బాణములను ప్రయోగింపఁగానే, కిరాతులు పరుగునఁ బోయి, ఆ మృగముల శరీరములనుండి బాణములను తెచ్చుచుండుట పరిపాటి. కాని యిపుడు మార్గము ఏనుఁగులు పోవునదియగుటయు, సింహము మెడగంటగా నుండు బాణములను లేవలసి యుండుటయు తమకుఁ గష్టసాధ్యమగుటచేఁ గిరాతులు తప్పుకొనవలసి వచ్చిన దనుట.]

ఆ నెలవంక బాణమున్ = ఆ యర్ధచంద్ర బాణమును; ఎవ్వరు; ఒరయం గలరు ? = తాఁకఁగలరు?

రాజు మృగమును కొట్టిన వెంటనే ఆమృగము శరీరమున నాటుకొన్న బాణమును తెచ్చి ప్రభువున కొసఁగుట కిరాతుల పరిపాటి, కాని యిపుడు పోవలసినది ఏనుఁగులు పోవు మార్గమగుటను, బాణములు సింహములపైఁ బ్రయోగింపఁబడుటను - వ్యాధులకే పని యసాధ్యమయ్యె ననుట.

107. ఈ పద్యమున రాజుపక్షమునను, చంద్రునిపక్షమునను-రెండర్థములున్నవి.

(రాజు పక్షమున) రాజు=రాజ నరేంద్రుఁడు; కరచాతురీగతుల్, విలసిలన్ = హస్తలాఘవపు రీతులు వెలయఁగా; సైజగుణ విక్రమమున్ = (జనులు) తన వింటినారి గొప్పతనమును; కొనియాడన్ = పొగడఁగా; అయ్యెడన్ = అక్కడ; అలవు+ఎలయన్ = బలము వ్యక్తము కాఁగా; గజారుల వ్యూదంతరముల్ = సింహముల గుండెలను; నలినజ్జుచేసెన్=బాగుగా చిదుకఁగొట్టెను; సంధిలుతమిన్ = ఎక్కువ యుత్సాహముతో; బుష... తేజమున్ = ఎలుఁగుబంట్ల పరాక్రమమును; తూలిచెన్ = పోఁగొట్టెను; పుండరీకమండలిన్= పెద్దపులుల గుంపును; తెగటార్చెన్ = చంపెను; ఇర్లదటు, అడంచెన్ = ఇఱ్ఱుల-జింకల మదము నణఁచివేసెను. అహో=ఆశ్చర్యము.

(చంద్రుని పక్షమున) - రాజు = చంద్రుఁడు· కర...సిలన్ = తన కిరణముల వింతప్రసారములు ఒప్పఁగా; నైజ...యాడన్ =తనకు సహజమగు కాంతి విశేషవ్యాప్తిని (లోకులు, పొగడఁగా; అమ్మ్యేడన్ = అప్పుడు; అల...యంగన్ = సముద్రపుఁ గెరటములు పొంగఁగా; జార...నజ్జుచేసెన్ = జారుల మనస్సులకు భగ్నము చేసెను. (వారి స్వేచ్ఛాప్రవృత్తి కాటంకము కలిగించె ననుట.) సంధిలు తమిన్ = గమికొన్న రాత్రియందు; ఋక్ష...తేజమున్ = చుక్కల గుంపుయొక్క కాంతిని; తూలిచెన్ = అణఁచెను; పుండరీకమండలిన్ = తెల్లతామరల గుంపును; తెగటార్చెన్ = నశింపఁజేసెను. ఇర్ల+అదటు = చీఁకటుల మదమును; అడఁచెన్. అలం: శ్లేషము.

101. వాలు+అమ్ములన్ = వాఁడియైన బాణములందును; పెను+జాలమ్ములన్ (పెంజాలమ్ములన్) = పెద్దవలలయందును; తగిలిన; కిటిజాలమ్ములు= పందుల గుంపులు; (ఇచట 'జితకాశి'లో 'కిటిజాలమ్ముల' అని యున్నది.) ఇంద్రజాలమ్ము+అనఁగన్ = గారడియో అనునట్లు - విచిత్రముగా ననుట; వాలమ్ములన్ = పెద్దపులులను; దంష్ట్రా...ఎత్తి = కత్తులవంటి కోరలతో నెత్తి; సెలసి = చిమ్మివేసి, నరకి; దూఁటెన్ = పాఱిపోయెను.

102. ఆ వలన్, చించుక = చించుకొని; ఆవలన్, పోనీక = అవతలికి పోనీయక; చెంచులు = బోయలు; ఆవలన్ = పిదప; (యావలన్ = మెలఁకువతో - అని జితకాశి.) నుఱుమాడినన్ = వేఁటాడి చంపఁగా; విభుఁడు = రాజు; ఆవలను = ఆ నేర్పును.

103. శ్వస .. ఘోటి = వాయుదేవుని వాహనము-జింక; ఘోటి వలెన్ = గుఱ్ఱమువలె; తారసమయి = కూడమట్టి; ఒక్కఁడు = ఒక కిరాతుఁడు; అపరంజి ..రొత్తు = బంగారు పిడి ప్రకాశించు; వాలువాల్ = వాడికత్తిని; వెసన్ కొని = వేగముగా గ్రహించి; కొంకికొంకిన్ = వంకరగా నుండునట్టి కొంకిప్రదేశమును; తెగవ్రేసి = తెగనఱికి; బడిన్, పడి = వెంటఁబడి; లేటి . అంట = లేడి కుంటుచుఁ బోయినను మనుష్యుఁడు పరుగెత్తుటతో సమాన మనెడి మాట; నేఁడు, కానఁబడెన్; అనన్ = అనఁగా; కానన్, పడన్ = అడవిలో (ఆ జింక) పడిపోవునట్లు; చీలిచెన్.

104. భటుఁడు, ఒకఁడు = శూరుఁ డగు నొక వేఁటకాఁడు; బొట...పెట్టి = బొటనవ్రేలికి మోపుచేసి; పందిపోటునన్ = పందులను పొడుచు నీటెతో; ఫ్రూని, అదల్పన్ = ఫ్రూనికతో మందలింపఁగా; కిటి = ఒక పంది; దూటి = దుమికి; ముట్టెమొనన్ = (తన) మూతికొనతో; పడన్ = అటు, చిమ్మినన్ = పడిపోవునట్లు తూలించి, నెట్టఁగా; బొమ్మ నాటి = బొమ్మున గ్రుచ్చుకొని; ఆవల, వెళ్లెన్ = అవతలివైపునకు వెళ్లెను.

105. బొరియలు = కలుగులు; నెఱియలు = పగిలిన నేలలు; సెఱ = పరాక్రమము; శునకనికరము = కుక్కల గుంపు; పరియలుగాన్ = చీలిక లగునట్లుగా; మురియలుగాన్ = ముక్క లగునట్లుగా; ఉరి+అలుఁగా? అనన్ = ఉరికోలయా? అనఁగా: ఉడుము+ఊదురులన్ = ఉడుములను, ఎలుకలను; త్రుంచెన్ చీల్చివేసెను.

106. ఇందలి క్రియల కన్నిటికిని 'మరణించె' నని యర్థము గ్రాహ్యము. గజాళి 'పొక్కెన్' అనుచో 'దుఃఖించె' నని యర్థము. గజము లను చంపుట రాజధర్మము కాదు. మనుఁబిల్లు = ఋశ్యమృగములు; కిటుల్ = పందులు; వృకవ్రాతముల్ = తోడేళ్లగుంపులు; దుమాదూళిగన్ = ఒక్కుమ్మడిగా. ('దుమాధూళిగన్ = దుమ్ముదుమ్ముగా' అని జితకాళి.)

107. భూవరేణ్యుండు = రాజు; విహగము = పక్షి; ఝాటంబులన్ = గుంపులను; నిరాఘాటంబుగాన్ = అడ్డులేక; కీటడంచి = చంపి; ఆఖేటము = వేఁట; ఎల్లెడలన్ = అన్నిదిక్కులందును పెల్లుగాన్ = ఎక్కువగా; త్రెళ్లిన = చచ్చిన; ఇఱ్ఱి = మగ జింక; కొండగొఱియ = కొండగొఱ్ఱె; గురుపోతు = గవయము; తిను...లను = తినఁదగిన జంతువుల కళేబరములను; శకుంతబృందంబులన్ = పక్షుల సమూహములను; పొందుగాన్ = చక్కఁగా; ఒక్కకందువన్ = ఒకచోట; పుళిందులు = చెంచులు; సొగయన్ = సంతోషింపఁగా; మృగయా...గాన్ = వేఁటలలో రక్షించు కాట్రేఁడు మున్నగు దేవతలు సంతోషించునట్టుగా; కృత్యంబులు = పనులు; సమాంశంబులుగాన్ = సమభాగంబులుగా; దంతి ..రంబులు = ఏనుఁగు దంతములయొక్కయు, ముత్యములయొక్కయు గుంపులు; నికరంబులయిన = శ్రేష్ఠములయిన; కస్తూ...

ఋలు = ఋరదగా నుండు కస్తూరి, జవ్వాదులు; పొం౦బులు = దట్టమైనవి; వాలజాలంబులు = తోఁక (వెంట్రుక)ల గుంపులు; ఆదిగాఁగల = మొదలైన; పాక ... ఖండంబులు = వంటలో నేర్పరులగు వంటవారిచే వండఁబడిన మాంసఖండములు; అఖండంబుగాన్ = సమృద్ధిగా; నేదిష్ఠ...లంబులు = దగ్గఱనున్న రాజ్యములకు పాలకులైనవారి గుంపున్; ఎలమావులక్రీనీడలన్ = గున్నమామిడి మొక్కలక్రింది నీడలందు; పరిశ్రమంబు, పాయన్ = బడలిక తీఱగా; విశ్రమించి = సుఖముగనుండి; మహా ..దుర్యుఁడు = గొప్పదై, శ్రేష్ఠముగా నున్న గుఱ్ఱము కలవాఁడు - రాజు; వరూథినీసమన్వితుండై = సేనతోఁ గూడుకొన్నవాఁడై; (ఇచట మనుచరిత్రమందలి వరూథినీ వృత్తాంతము సూచితము.) కుఱంగటన్ = సమీపమున; ప్రొద్దులు = దినములు; అభిలాష= కోరిక; వసతియైన స్థలంబు = తగిన చోటు; ఆటవికులు = చెంచులు; ఘోర కాంతారంబు = భయంకరపు టడవి; చొచ్చి = ప్రవేశించి; కద్దు = కలదు; అనర్ఘోదకంబులన్ = మంచినీళ్ళతో; ఘనదీర్ఘిక = పెద్ద నడబావి.

108. కనుమాయన్, చని = కంటికిఁ గానరాకుండ పోయి; సీతన్ చెనకు = సీతను పొడిచిన; కాకాసురకను = కాకాసురుని కంటిని; మాయ .. చోటు = పోవునట్లుగా చేసిన ప్రదేశము; (రాముఁడు కాకాసురుని కన్ను దర్భతో పొడిచిన విషయ మిచట సూచితము). తల...దగున్ = హద్దు మీఱిన ప్రేమ కలిగిన; రాపాడికొనినచోటు=బాధించి కోసినచోటు; సపరివేషంబైన = గుడితోఁగూడిన; గుడివాసి = చుట్టును గీత గీచి; కుహనా... శాటున్ = మాయలేడియైన రక్కసుని - మారీచుని; గహనాధి దేవతకున్ = వనదేవతకు; అనురక్తిన్ = ప్రీతితో; విభుండు = రాజు; ధర్మసాధువులు = మిగుల ధర్మాత్ములు; విష్ణుమూర్తులు=విష్ణుని యవతారములు; అరణ్యానిన్ = గొప్ప యడవిని; చనంగన్ = వెళ్లఁగా.

109. అరిదియగు, వనులు = అపూర్వములైన వృక్షవాటికలును; సరసులు = సరస్సులును; అనఁగి పెనఁగి = కలసిమెలసి - దగ్గఱగా నుండి; ఎనసి = ఒప్పి: శాఖోపశాఖలై = పరంపరాభివృద్ధిపొంది; ఇంపుమీఱి = అందముగా నుండి; తామరతంపరై = బలిసి; పరిఢవిల్లి=ప్రకాశించి; వాస... గుచున్ = సువాసనలకు స్థానములగుచు; కననయ్యెన్ = కానవచ్చెను. (ఇందు

వనులు శాఖోపశాఖలు కల్గియున్న వనియు, సరస్సులు తామరతంపరలై యున్న వనియుఁ క్రమముగ విశేషార్థములను గ్రహింపనగును.)

అర్థాంతరము:- అరిది = అహా! యౌవ...నులు = ఎలప్రాయమున నున్న స్త్రీపురుషులు; అనఁగి పెనఁగి = కూడిమాడి; ఎనసి = కలసి-సుఖించి; శాఖోపశాఖలై = పెక్కు తెగలుగా నేర్పడి; తామరతంపరై = కుటుంబాభివృద్ధి పొంది; పరిఢవిల్లి=ఒప్పి; వాసనాపదములగుచుఁ = అతిథులకు నిలువఁదగిన గొప్పస్థానములుగా నుండి, కననయ్యెఁ.

[జితకాశిలో 'వాసనాపదములు = పరిమళస్థానములు, నివాసస్థానములు' అను పూర్వటీక సంగతము కాదని తెల్పఁబడి 'వాసనపదము' లనియే గ్రహింపఁబడి 'నివాసస్థాన' మను అర్థమే అర్థద్వయమునను గ్రహింపఁబడినది. కాని తర్వాతి పద్యము 'ఆ తావు లపుడు గంధవ, తీతలనాథుండు-' అని యుండుటచే 'పరిమళము' అను నర్థము కూడ గ్రాహ్యమని తెలియుచున్నది.]

110. తావులు = చోట్లు, పరిమళములు; గంధవతీతల నాథుఁడు= రాజు, గంధముగల భూమికి భర్త; సన్నుతించుచుఁ = కొనియాడుచు; బల సంఘాతము = సేనాసమూహము; దిగుము = బసచేయవలసినది.

111. మరు...వంబు = మన్మథుని వాహనములగు చిలుకల ధ్వని; అమరు=ఒప్పుచున్న; మావులు = మామిడిచెట్లు; తావి...చెట్లు = పరిమళముతోడి నూతనపుష్పములు కల చెట్లు; క్రేవఁ, తనరఁ = దగ్గఱనుండఁగా; ప్రామానికపు . బులు=మేలు కాంతి గల విలువైన రత్నముల మెట్లు; పరిఢవిల్లఁ = వెలయఁగా; కన ..దంబులఁ = ప్రకాశించు తామరలయందు, ఎట్టికలువలయందును; చరించు = తిరుగుచున్న; రాయంచ...రవములు = హంసలయొక్కయు చక్రవాకములయొక్కయు అఱుపులు; ఆ, కౌశరుచిఁ = ప్రసిద్ధమగు తెల్లపూవులకాంతిని; కేరు=నవ్వుచున్న; అకాశ...కాశమై = ఆకాశగంగతో సమానమై; వారి=నీరు; మొలకతెమ్మెరకూనలు=మందమలయమారుతములు; పొలయఁ = వ్యాపించఁగా; దిగ్గియఁ = బావిని; దిగ్గి=దిగి; అగణిత విభవముల్=సాటిలేని సంపదలు, హర్షంబుతోడఁ = సంతోషముతో.

112. అవనీవిభుండు = రాజు; అత్యంత ..రంగుండై = మిక్కిలి సంతోషించిన మనస్సు కలవాఁడై.

113. లీలా సారంగధరుండు = విలాసమున మన్మథుఁడైనవాఁడు; సాధు ..చారుఁడు=ఉత్తములచే పొగడఁబడిన న్యాయప్రవర్తన కలవాఁడు; ధర్మమర్మవిచారుఁడు = ధర్మరహస్యముల నెఱిఁగినవాఁడు; సమ్మదలీలన్ = ఉత్సాహముతో.

114. చీరి = పిలిచి; ఉద్దవడిన్ = త్వరగా; భృత్యులు = సేవకులు; బడిబడిన్ = వేవేగ; పాఱుతెంచి=పరుగిడి వచ్చి; పులుఁగులను = పక్షులను.

115. జిలు...ములు=సన్నని కస్తూరి తిలకములు; ఓరసాగలున్ = వంకతలపాగాలును; వలిపెపు ..వాటులు=సన్నని శాలువతోడి అందమైన వల్లెవాటులు; గుజ్జురూపరులు=పొట్టి ఆకారము కలవారు; పారువంపుఁబుటికల్ = పావురముల పంజరములను.

116. పార్వములన్ = పావురములను.

117. ముంగలన్ = ముందు భాగమున; ఆవి...బునన్ = పుట్టిన యుత్సాహముతో; ఆ, రాజ...థుఁడు = మన్మథునివంటి ఆ రాజపుత్రుఁడు; మాధుర్య...నంబు = మిక్కిలి మధురములై క్రొత్తలైన శబ్దముల రచన; హాళిన్ = సంతోషముతో; మనవుల్ = విన్నపములను.

118. పారా...త్నంబు = గొప్ప పావురము; జగబిరుదు = గొప్ప పేరు; మాత్సర్యమునన్ = ఈసుతో.

119. క్రేవ=ప్రక్క; ఒంటిన్, పావురమున్=ఒంటరి పావురమును; బెదరు...యంతన్ = భయమును కలిగింపఁగా ననుట.

120. పేరెములు వాఱుచున్ = పరుగులెత్తుచు-ఎగురుచు; సమీ...లాడెడు = వాయువుయొక్క వేగము నెకసక్కెము లాడునట్టి; మహార యముతోన్ = గొప్ప వేగముతో; అయ్యారె!=ఆహా! గరుదారవముచేన్ = ఱెక్కల గొప్పధ్వనిచే; చదలు, బూరటిలన్ = ఆకాశము నిండఁగా; మా కొలమువారిన్ = మాజాతి పక్షులను; అనూరునిపయిం దిరిగి=అనూరుని

మీఁదుగా (మిక్కిలి యెత్తుగా ననుట) ఎగిరి; చొకారమయి = అందమై; అన్నలు ..మునన్ = బ్రహ్మవాహనమైన హంసవలె.

121. అభ్రిమాతంగంబు = ఐరావతము; పుండరీకంబు = తెల్లతామర పువ్వు; హరిణిధుల్ = బ్రహ్మ. విష్ణులు; వెఱగందన్ = ఆశ్చర్యపడునట్లు; అంబ...వాఁకన్ = శివునితలపైఁ గల ఆకాశగంగలో; తేలాడు, నెల=తేలి యాడుచున్న చంద్రుఁడు; మిన్నేటిదరులందున్ = ఆకాశగంగ యొడ్డు లందు; మేతలాడుచునున్న = మేయుఁచు, తిరుగులాడుచున్న; ఉదుటు... గొదమ=అందమైన రాజహంసపోతము; నభో...జల్లి=సూర్యుని రథముపైఁ గల చామరము; పక్కి=పక్షి; పెట్ట=ఆఁడు పావురము; గమ...గొనుచున్ = గమనించి చూచుచు.

122. దవ్వు=దూరము; వలిపచేల=సన్ననివస్త్రము; ఈక్షించి=చూచి; పాగలు=తలపాగలు;

123. పొనపొన = అల్లదిగో! పొంతఁ=దగ్గఱగా; దిగువాటునన్ = క్రింది వైపుగా.

124. కించి...మునన్ = కొంచెము పరిహాసముగా; ననుచుమదిన్ = వికసించు హృదయముతో.

125. వెలుపించి = వెడలుపుగాఁజేసి; సురటింబలెన్ = (తిరుగుడు) విసనకఱ్ఱవలె; నిబ్బరంబునన్ = ధీరత్వముతో.

126 సౌధ.. ఖండము-సౌధ = మేడలమీఁది; కేతన = జెండాల యొక్క; పటాంచల = గుడ్డచివరలవలని; వాత=గాలిచే; ధూత=ఎగురఁగొట్టఁ బడి; నిర్గత=బయలు వెడలి క్రిందికి వచ్చుచున్న; గాంగడిండీర ఖండము = గంగానది యందలి నురుగుతునుక; సిత.. లతాంతము-సితమాని=నారదునిచే, పూర్వ=మునుపు; అవసిత = తెలుపఁబడిన; భూ=భూమిని; పునర్దిదృక్షా = తిరిగి చూడవలె నను కోరికచే; ఆగత=వచ్చిన; ఇంద్రాగ, లతాంతము = పారి జాతపు పువ్వము; నవ...మౌక్తికంబు - నవహార = క్రొత్తహారము యొక్క; సంఘట్టన = రాపిడిచేత; స్రస్త=జారినదై; పతయాళు = పడుటకు సిద్ధముగా నున్న; గగనలక్ష్మీమౌక్తికంబు = ఆకాశలక్ష్మి యొక్క ముత్యము; మధ్యం...

శంఖము - మధ్యందిన = మధ్యాహ్నమందలి; అనంతమణి = సూర్యునిచే; లూన = ఛేదింపఁబడిన; మందేహ = మందేహ రాక్షసునిచే, సంత్యక్త = విడువఁబడిన; బిరుదాంక శంఖము=బిరుదచిహ్నమైన శంఖము.

పంక...పారావతంబు - పంకరుహ సంభవకళత్ర = బ్రహ్మకు వాహనమైన సరస్వతీదేవికి; పత్ర = వాహనమైన హంస; పుత్ర=కుమారుఁడగు నారదుఁడు; సురకులధురీణ = ఇంద్రునియొక్క; కంఖాణ = గుఱ్ఱమైన ఉచ్చైశ్శ్రవము; కరి=ఏనుఁగైన ఐరావతము; కృపాణ = ఆయుధమైన వజ్రము; (అనువానియొక్క) రమ్యధావళ్యజైత్ర=అందమైన తెల్లఁదనమును జయించునట్టి - తెల్లనైన; పారావతంబు=పావురము.చుక్క...తోఁపక్ = తెగి పడుచున్న చుక్కపోలిక నుండఁగా.

127. క్రీడ, సలుపుచుక్=ఆటలాడుచు; మొలక ..చిలుకల్=లేఁబ్రాయపుకులుకులు ఒలుకఁగా; పట్టి=పట్టుకొని; అటు=పావురము వైపు.

128. పెంటిగాక్ = ఆఁడు పావురముగా. కైలాటపుంబుల్గు = మాయలమారి పక్షి; గ్రక్కునక్ = వేగముగా; మిన్నందిన = ఆకాశము నంటుచున్న - మిక్కిలి యెత్తైన; చక్కందేలి = చక్కఁగా పచ్చి: పెక్ బాళిక్ = (ఆఁడు పావురము మీఁది గొప్పప్రేమచే) రత్నాంగి నందనుక్ = సారంగధరుని; కారింపఁగక్ = బాధించుటకు; తమిక్=వేగమున.

129. కేలఁకులక్ = తన ప్రక్క; పలకేలను, బట్టి=కుడిచేతితోఁ బట్టుకొని; నిఱు ..కఁగక్ = ఎక్కువప్రేమ యుట్టిపడఁగా.

130. నాచేతక్, తగులుక్ = నాచేతిలోఁ జిక్కుకొనుట - లొంగు నసుట.

131. బంగారానక్ = బంగారమునకు; గుబాళించు = పరిమళించు; లేఁజెంగల్వక్ = లేఁతయెఱ్ఱగలువ పూవునకు; తావిఁ ట్టినటులక్ = పరిమళమును గూర్చినట్లు; చిన్నారి=ఇంపైన; సుధారసంబు=అమృతము; వధూటికామణి = అందకత్తెయగు చిత్రాంగి; మణి ..రముల్ = మణిమయములగు అలంకారములను; సింగారించెక్.

133. ఇందు శ్లేషమూలమున విరోధాభాసములు [illegible] కర్ణ...వంబు=కర్ణుని గొప్పతనము; తాటం...కల్గి = కుండలముల మీఁది యాసక్తి కలిగియు; రహిఁగట్టితగెన్ = వాసిగాంచి వెలసెను ..(కర్ణుఁడు జయప్రదములు, అమృతమయము లగు తన కుండలములపై ఆశవీడి యింద్రునకు దానముచేసెను. కర్ణునకు వానిపై ఆశ యున్న దని యిందు చెప్పఁబడుట విరోధము.) చెవుల యొక్క గొప్పతనము కమ్మలను ధరించుటచేత అతిశయించె నని ఆభాసము.

వజ్ర ..తనరి=వజ్రాయుధపు కాంతిచే ఒప్పి; కాంచి=చూచి; అచలా ... నితంబము = కొండయొక్క విశాలమగు నడుముప్రదేశము; అతిశయిల్లి చెలంగెన్ =మిక్కిలి ప్రకాశించెను. వజ్రాయుధమున పర్వతసానువు ప్రకాశించె ననుట విరోధము. అచలా...తంబము = కొండవలె విశాలమగు పిరుదు భాగము, కాంచి ..కలనన్ = మొలనూలియందలి వజ్రములకాంతిచే, తనరి, చెలఁగె నని యాభాసము. ప్రణు.. నీవిన్ =కొనియాడఁదగు మూలధనముతో; పరిఢవిల్లి =ఒప్పియును; కవును పేదఱికము = నడుము దారిద్ర్యము; పాయక యొప్పెన్ = విడువకుండెను. కావలసినంత ధనముండియు దారిద్ర్యము విడువ లే దనుట విరోధము. నీవిన్, పరిఢవిల్లి = పోకముడిచేత ఒప్పి; కవును = నడుము; పేదఱికము పాయక=(బలిసి వికారముగా నుండక) సన్నఁదనమును విడువక యుండె నని ఆభాసము.

అరుణ కరంబులు = సూర్యుని కిరణములు; ఘన...పెనఁగి = మేఘములతోను, జలబిందువులతోను గలసిమెలసి యుండియు - వర్షముకురియుచు- మేఘావృతుఁడయి యున్నను; మిన్నంది, అలరారెన్ = ఆకాశమును ముట్టి ప్రకాశించెను. మేఘావృతమై వర్షము కురియుచున్నపుడు సూర్యుఁడు ప్రకాశించె ననుట విరోధము. ఎఱ్ఱని హస్తములు మేలైన కంకణములచే ప్రకాశించె నని యాభాసము.

అభినుతింపఁ దరమె? = కొనియాడఁదగమా? వాసన...బొమ్మ = పరిమళముతోఁ గూడిన బంగారపు బొమ్మ; కలికి రూపు=స్త్రీరూపము; మురువు = అందము.

134. అలి...మయస్ఫురన్మిక్కిలి చిత్రములైన చిత్తరువుల యొక్క సొబగు పొందిక కలదై; నయమైన = మృదువైన; చిలుక...రమునన్ = ముద్దు ముచ్చటలచేత; అగారమునన్ = భవనమునందు.

135. ఉడిగపుటొయ్యారులు = పనికత్తెలగు అందకత్తెలు; వెయ్యాయిలు=వేయి+అయిలు - వేయిన్నాలుగురు; చెలువము=అందము; గయ్యాళి = ధూర్తురాలు - చిత్రాంగి; చిలుక ..వలెన్ = చిలుకవాహన మెక్కి విహరించు మన్మథుని సొగసులాఁడి యగు భార్యవలె - రతీదేవివలె.

136. సరసాగ్రేసర ! = సరసులలో శ్రేష్ఠుఁడగు వాఁడా! వాసర...లక్ష్యా!=సూర్యుని పుత్త్రుఁడగు కర్ణునివలె దాతయైనవాఁడా! పురం...ధురా! = ఇంద్రునిమించిన భోగము కలవాఁడా! భరత...కోవిదా! - భరతశాస్త్ర = నాట్యశాస్త్రమునందలి; ప్రౌఢమార్గ = నేర్పుతోడి మార్గమున; ఏకలాస్య = ప్రధానమైన లాస్యము యొక్క; రసాస్వాద = రసము నాస్వాదించుట యందు; కోవిదా ! = విద్వాంసుఁడా ! శ్రవణ...గల్లభా ! - శ్రవణభూషా= కర్ణభూషణములందలి; దివ్యరత్న = విలువైన మణులయొక్క! త్విషా = కాంతులచేత; తరణి శ్రీకర=సూర్యుని శోభను కూర్చుచున్న; గల్లభా! = చెక్కిళ్ల కాంతి కలవాఁడా !

137. తరుణీ మన్మథ ! = యువతులకు మదనుఁడైన వాఁడా ! ఆశ్రిత...భరణ ! = ఆశ్రితులను రక్షించుట యను గుణమే అభరణముగా కలవాఁడా ! శౌర్య...ధుర ! = పరాక్రమముచే అనేక రాజ్యముల భారమును వహించినవాఁడా ! సత్యాదిమచక్రేశ్వర ! = సత్యమున హరిశ్చంద్రుఁడా !

138. అఖిలా సురేజ్య ! = సమస్తములగు ఆగమములచేతను శాస్త్రములచేతను తిరస్కరింపఁబడిన బృహస్పతి కలవాఁడా! తులా... తులాభ !=హద్దు మీఱినట్లుగా విద్వాంసులచే పొందఁబడిన ఇంద్ర విభవము కలవాఁడా ! శుభోద...చణా ! = శుభహేతువైన రత్న, తులాపురుషాదికములగు దానములందు సమర్థుఁడైన వాఁడా !

# సారంగధరచరిత్రము

## ద్వితీయాశ్వాసము



1. శ్రీజాన ..యోజ! = శ్రీరాముని పూజచే నొప్పు హృదయ పద్మము కలవాఁడా! పోషి...గ్రాజ! = పోషింపఁబడిన సమస్త దిక్కులు రాజులు (దిక్పతులును) కలవాఁడా! సక...కృష్ణ! = సమస్తయాచకులయెడ అవ్యాజమగు దయ కలవాఁడా!

3. జననాథసుతుల్ = రాజకుమారులు; కారాకూర మయి=చిందర వందరయై.

4. బెంగలు ఇడంగన్=కేకలు వేయఁగా; గెంటి=చెదరి; చిత్రాం... సీమన్ = చిత్రాంగి యొక్క విచిత్రమైన మణులు తాపిన భవనద్వార దేశమున; బాపురే! = ఆహా! ఏభంగులన్ = ఏవిధములను.

5. తామసము = ఆలస్యము; దీమగమునన్ = ఉపాయమున; ('దిమాకుచేత' నని జితకాశి.) దూరదర్శి = దూరపుటాలోచన కలవాఁడు.

6. వెగ్గలింపక = తిరస్కరింపక; ఓజ = పద్ధతి.

7. చెలి=యువతి - చిత్రాంగి; ప్రాయపుబిత్తరి = వయస్సులో నున్న పొగసులాఁడి; రూప ..థుండవు = ఆకారపుతీరున మన్మథుని మించిన వాఁడవు. భామిని = స్త్రీ;

8. సట=మోసము; వావులు = బంధుత్వపువరుసలు; నహి=లేవు. అభ్రచ్ఛాయల్ = మబ్బులనీడలు - అస్థిరములు; బాస=ప్రతిన.

9. ఓజచెడి=నీతి మాలి; ఉవిదలు = యువతులు.

11. అరుదే! = ఆశ్చర్యమా! మరునంబకంబులు = మన్మథుని బాణములు. (అరవిందము - అశోకము-చూతము - నవమల్లిక - నీలోత్పలము - అను

నవి.) ఆద్యంతములు = పూర్వోత్తరములు. [మన్మథబాణములలో ఆద్యంతలను తైన కమలము, కలువయు కన్నులతోఁ బోలియుండును గదా! యని చమత్కారము.] జవరాండ్ర యొడాటములందుఁ = యువతుల విషయమున.

12. ఏకాంతమైయున్న = ఒంటరిగనున్న - ఇతరులు లేనియెడనున్న.

13. తపసులు = మునులు; మనము=మనము, మనస్సు. కలికి=స్త్రీ,

14. తత్తఱపాటు = తొందరపాటు మీఁదిచేటు=తర్వాతి యాపద; కఱటితనంబునఁ = మూర్ఖత్వమున, పదరి=తొందరపడి, ఘనులు=గొప్పవారు.

15. చపలమృగాక్షి=చలించుచున్న జింకచూపులవంటి చూపులు గలది-చిత్రాంగి. పొసంగక=సాధ్యపడక. కల్లరిన్=అపరాధముచేసినవానినిగా. ('కల్లరిన్, చేయున్ = అసత్యమాడినవానినిగాఁ జేయును' అని శ్రీకాళ.)

16. కుఱ్ఱాయలు = తలపాగలు; ఏవగనైనఁ = ఏవిధముననైనను; తాదృక్కులరవములు = అట్టి పావురములు; అడ్డగాల్వేయంగఁ = అడ్డు మాటలు చెప్పఁగా.

17. భూపాలకుమారుఁడు = రాజకుమారుఁడు; వలవని పాపము = లేనిపోని పాపము. పదివేల్వచ్చెఁ = పదివేల ధనము వచ్చినంత సంతోషమైనది; (వ్యాజస్తుతి)

18. అరమర = భేదము - అభ్యంతరము; అహరహంబును = ప్రతి దినమును. మంచామేలమునఁ = చనవుచేత. ప్రధానికుమార! = మంత్రి పుత్రా! పాతకపుసుద్దులు = పాపపు మాటలు.

19. సుద్దులు = మాటలు. రోజులు = వర్తనలు. విమల... కీర్తిఁ = సత్ప్రవర్తన గల యాచుంవలికి. హృదయాంబుజాతము = హృదయ పద్మము.

20. ఆదేవి = రత్నాంగి. ఈచేడె = చిత్రాంగి. గారవిలికల్లుఁ = ప్రియజనయిత్రులు.

21. స్వామికిఁ = రాజుతో. వెగటుగఁ = రోతపుట్టునట్లు.

22. పాతకంబు = గొప్పపాపము. కసారిలఁజేయన్ = కోపముతోఁ గూడునట్లు చేయఁగా. నోంచున్ = నొప్పించుచు.

23. కడచిపోన్ = అతిక్రమించి పోఁగా. అకేఁడు = సుబుద్ధి.

24. ఎంత లే = ఏమి లెక్క? తీసు = నీపై కసూయ. నిలువ రాకుము = నన్ను అడ్డగింపకుము. అలుగనేల? = కోపింపనేల?

25. మనుజకనయు! = రాజకుమారా; వారకాంతలు = వేశ్యలు.

26. లోకాపవాదము = లోకనింద. మరుఁడు = మన్మథుఁడు.

27. నరేంద్రుఁడు = రాజు, విష వైద్యుఁడు. రాకే = రాకుండఁగనే. బాగా? = మేలుగాదు. పలుమొన సోఁకన్ = దంతక్షతము కల్గఁగా, కాటు పడఁగా. భోగంబు = సుఖము పడఁగ. మెదుపవె! = నలిపి వేయదా? భోగిని = భోగకాంత, ఆడుపాము. ఇచట శ్లేష.

28. ఉగ్రశాసనుండు = కఠిన మగు నాజ్ఞ కలవాఁడు. నిగ్రహింపఁగన్ = విరోధింపఁగా - ఎదురుతిరుగఁగా. తాళెదను = సహింతును.

29. మేరన్ = ధర్మమున్.

30. సమ్ముఖమునకుఁజేర = ఎదుట నిలిచి. ఆటకుతోన్ = జంకుతో.

31. కొదువ = లోపము. తెలుపకున్నన్ = చెప్పకపోయినను. సర్వజ్ఞుల్ = అన్నియు నెఱిఁగినవారు.

32. నగి = నవ్వి. మన... కల్ల = మనస్సునకుఁ దెలియని యసత్యము. సివమున్ = దేవతావేశమును. (సివమెత్తినవాఁడు తన శరీరమును జాగ్రతగాఁ జూచుకొనుచుండు ననుట) తార్కాణము = సాక్షి.

33. చలము = సాహసము, కొల = పాపము. కట్టి... యున్నే? = అనుభవించునట్లు చేయకపోవునా?

34. వాకిటి పెద్దలు = కావలివారిలో పెద్దలు, కొదుకుచున్ = జంకుచు; మందటిలన్, పల్కి = సందేహము పోవునట్లు జబాబిచ్చి.

35. అపుడు. జగ...ధరుఁడు - లోకమును మోహింపఁ జేయఁ జక్కని. యాకారముచే జయింపఁబడిన నలకూబర, చంద్రులు కలవాఁడు; రాజ...ధరుఁడు = రాజరాజునకు పుత్త్రుఁడైన సారంగధరుఁడు; సిగ... తావికిన్ = తలలోని పూలదండల సువాసనకు; తేంట్ల ఝుంకృతి = తుమ్మెదల ఝుంకారము; మాగధ స్తవముగాఁగన్ = స్తుతిపాఠకుల పొగడిక కాఁగా; కడిఁది...రవళి = వీరులగు రాజకుమారులకు జేత యనుభావమును సూచించు కాలియందెయొక్క ధ్వని; కంచుకి...గాఁగన్ =అంతఃపురసేవకులయొక్క మాటలధ్వని కాఁగా.

తల...ప్రభలు = తలచుట్టు వ్యాపించుచున్నట్లున్న (విశాలములైన) కన్నుల తళతళకాంతులు; ఇరు వంక=రెండు వైపులను; దేహచ్ఛాయ = దేహ కాంతి, తలఁగఁ ద్రోయఁగరాని = తప్పింపరాని, బలము=సిబ్బంది; రాజ శంభునన్ = శివిత్రో, కక్ష్యాంతరములు = వాజారములు, కడచి=దాఁటి.

36. కాంచి = చూచి, ఉత్పలాక్షి = కలువలవంటి కన్నులు కల యువతి.

37. కంతుఁడు = మన్మథుఁడు, రజనికాంతుఁడు = చంద్రుఁడు, విస్మయా...తోడన్ = ఆశ్చర్యముతోఁ గూడిన మనస్సుతో: తటకాపడి = రిచ్చపడి, కుమారశేఖరున్ = యువకశ్రేష్ఠుని, చూచెన్.

38. ఉరు...డెందము = గొప్ప స్తనములు గల యా చిత్రాంగి మనస్సు, తియ్యని...విఁటచే = తియ్యని చెఱకు విల్లుతోనే, విర...గొని = తురతుర పోవు తుమ్మెదలు నారిగా గ్రహించి, పెన్నెఱి...చేతన్ = పెద్ద జుట్టులోనున్న గొజ్జఁగిపూవు అను బాణముచేతనే, పొంచి=దాఁగి; కంటికి... వాఁడు = కంటికి కానరానివాఁడు; అతనుఁడు=మన్మథుఁడు. ఏసి = కొట్టి; సురసురస్రుక్కన్=మిక్కిలి సోలి బాధపడి దుఃఖించుచున్నట్లుగా; అర్చెఁబో = గట్టిగా నఱచెను కదా !

39. తమి = మోహము; మణి...డిగ్గి = రత్నాల పీఠమునుండి దిగి; హర్షమగ్న యై = ఆనందమున మునిఁగినదై.

40. సారంగనయన = జింకచూపులవంటి చూపులు కలది చిత్రాంగి; మనసు+ఆరంగను = కోరిక తీరునట్లు; సారంగధరుఁడు = రాజరాజుకుమారుఁడు, జింకను ధరించిన శివుఁడు; కలంగున్ = కలఁతపడును.

41. మారుఁడు = మన్మథుఁడు; పరి... తీరు=కమలములయొక్కయు, కలువలయొక్కయు విధమును (అందమును). ఏపుమాపున్=గర్వము నణఁచి వేయును. రేపుమాపు = ఉదయ సాయంకాలములందు (పగలు కమలములను, రాత్రి కలువలను తిరస్కరించు ననుట.)

42. కోటేరు పెట్టినరీతిన్ = తలక్రిందుగాఁ గట్టఁబడిన నాగలివలె, సంపె... తెగడన్ = సంపెగపూవు రీతిని అతిక్రమింపఁగా; లచ్చియన్న = చంద్రుఁడు; తమ్ములు = పద్మములు; వాదులుపెట్టి = లోపము లారోపించి; (పరస్పరవిరోధములు కల్పించియు) నగుమోము = నవ్వుముఖము; కళల సీసన్ = కాంతులు వెదచల్లుచుండఁగా; కండెముల్ తిగి = కండలు తిరిగి; బల్గొండలు = పెద్దకొండలు; కమ్మితీసిన లీలన్ = కమ్మెచ్చునఁదీసిన బంగారు తీఁగవలె; కనుపట్టు = కన్పించు; సెమ్మేని మిసమిసల్ = చక్కని శరీరము యొక్క తళతళకాంతులు; మిఱుమిట్లుగొలుపన్ = కన్నులు చెదరునట్లు చేయఁగా అడుగులబెడంగు=అడుగులు పెట్టి నడచు నందము; ఆనగొలుపన్= ఆజ్ఞాపింపఁగా; అమ్మక్క !=ఆహా! ఒకటన్ = ఏ విషయమునందును; ఒచ్చెమ్ము లేక=లోపములేక; నిలువు=శరీరము; నీరున... నాఁడు=నీరుపోసి పెంచినట్లు ఒప్పినాఁడు;

43. తీరయి = సొగసైనదై; మల్చి = తరిమెనఁబట్టి; బలుదల్పున్ = విశాలమైన కవాటమును;

44. జగతీశ్వర ! = దైవమా ! చిత్తరువందున్ = చిత్రములో; భాగ్యము = అదృష్టము; ఒచ్చెము = లోపము; కూర్మి = ప్రేమ.

45. ఎవ్విధమునన్ = ఏరీతిని; పువ్విలుఁదొర = మన్మథుఁడు; తూపుమొన = బాణముయొక్క అలుగు; తీడఁగన్ = పదును పెట్టఁగా.

46. వలపు = మోహము; దువాళి సేయన్ = పరుగులెత్తఁగా; పికవాణి = కోకిల కంఠమువంటి కంఠముకలది; పసోధరంపు మెఱుఁగుల్ =

స్తనముల కాంతులు; అంబ...తనమున్ = బాణముల గొప్పవాఁడిమియును; పిసాళి...లతోన్ = వలపు ప్రకటించు నిడుదలై, నిర్మలములైన చూపులతో; తమకంబుతోడుతన్ = మోహముతో.

47. రూకంతగాని, లేదు = రూకవంటి చిన్నినాణెమంతైనను లేదు, మైమెచ్చుజిగికిన్ = శరీరపు గొప్పకాంతికి; బంగారు = బంగారము; ఏక్రైవడి, సమంబు ? = ఏరీతిని సమానమగును ? - కాదనుట. (బంగారుతో రూకలు చేయఁబడుట సూచితము.) యూవర క్తిమ = లాక్షారాగము; మించు = అతిశయించు; మోవిరుచికిన్ = అధరకాంతికి; ఏరీతిఁ బ్రతివచ్చు ? = ఏరీతిని సరిపోవును ? (మోవికి యావర క్తిమ కలిగించుటయు నిట సూచితము.)

ఇసుమంతగాని లేదు = మిక్కిలి స్వల్పము; ఎనవచ్చున్ = సాటియగును ? సైకతంబు = ఇసుకతిన్నె; విశాలజఘనమునకున్ = వెడల్పగు పిరుదుప్రదేశమునకు; (పులినములతోఁ బిరుదులకు పోలిక ప్రసిద్ధము. దిబ్బ లిసుకమయములే కాన - ఇసుమంతగానే యున్నదని చమత్కృతి) కంటికో... లేదు = కంటికిఁ గఁబడునంతమాత్రమే యున్నదనుట. (కాటుక కంటిలోఁ బడునదే యని చమత్కృతి) కప్పు ..లకున్=నల్లనై సోగలైన వెండ్రుకలకు; ఈడు = సాటి. అఖిలాంగశృంగారము = సమస్తావయవముల చక్కఁదనము; ఆభినుతించుగతిన్ = కొనియాడు విధమున; తులాకోటిమణికోటి = అందెలలోని రత్నసమూహములయొక్కయు; కాంచిదామ కింకిణీగణ = మొలనూలియందలి చిఱుగంటలయొక్కయు; కంకణ = చేతి వలయములయొక్కయు; ఆకీర్ణకలకలారవములు = ఒండొంటితోఁ గలిసి, ఎక్కువైన గలగలశబ్దములు; కులుకన్ = అందముగ నుండఁగా; ఒయ్యారము = హొయలు.

బంగారు మన్నగునవి మైచాయ మున్నగువానితోఁ బోలుచున్నను - ఆ పోలికలు సరికా వని వ్యతిరేకాలంకారము.

48. ఇంద్రనందనున్ = అర్జునుని; ఊర్వ...కచ = గొప్పదై, నల్లనైన మేఘమువంటి జుట్టుకల చిత్రాంగి, పాకశాసని: యొఱపు = జయంతుని చక్కఁదనము; నెరపు = ప్రకటించుచున్న; చేరనరుగు దేరక్ = సమీపమునకు రాఁగా.

49. మంజీరకలకలంబు = అందెలచప్పుడు; అంచగమి = హంసల సమూహము; శకున...పని = అపశకునమైన పని.

50. తను...గనుము = కన్నతలిదండ్రు లామడ దూరమున నున్నను - ఎదురేఁగి గౌరవింపవలెను.

51. సైఁచి = ఓర్చి; మనుచున్ = మన్నించును.

52. వసుధేశుఁడు = రాజు; అసమాంబకుండవు = మన్మథుఁడవు, సవతికొమరుఁడవు.

53. సుశీల = మంచిస్వభావము కలది; గయ్యాళిజంత = జడుపులేని ధూర్తురాలు; ముంగలిగన్ = ముందుగా; ధూర్తలక్షణము=దుష్టులస్వభావము.

54. గంబూర గులికి = కర్పూరమువేసి; బింబోష్ఠి = దొండపండు వంటి పెదవి కలది — చిత్రాంగి; పాదాబ్జంబులు = పాదపద్మములు;

55. జనవరసూనుఁడు = రాజకుమారుఁడు; నెలంత=యువతి; నాకు మారుఁడవె = నాకు మన్మథుఁడవే - అర్థాంతరము. (సాధారణార్థము— నాపుత్రుఁడవే.)

56. బలుమానికములు = గొప్పరత్నములు; జాళువా...యపైన్= మేలిమిబంగారపు పీఠముపై;

57. తలిరుఁగెమ్మోవి = చిగురువలె నెఱ్ఱనై యున్న పెదవి; మొలక లెత్తన్ = అంకురింపఁగా; కెలనన్ = ప్రక్కను; కలికి...కొమ్మ = ఒయ్యారపు కన్నెపడుచైన ఆ యువతి—చిత్రాంగి;

58. చెలువు = అందము; పీసరవోని మోహామునన్ = వెలితిలేని వలపులో; వీనులవిందుగన్ = చెవుల కింపుగా; నవ్య...కాండ = క్రొత్త సౌందర్యము గల మన్మథుఁడా! కొడగంటిని = చూచితిని.

59. మోహనాంగులు = అందగాండ్రు; సదనంబు = భవనము; రంజిలెన్ = శోభించినది.

60. తుందుడుకు = విచారము; కామినీ హల్లకబాణ = ప్రేమించు

యువతులపాలిటి మన్మథుఁడా ; నిధానము = నిధి; ఏటికి నంగలార్పఁగన్ = విచారింప నేల ?

61. దూఱుకొనుచుందున్ = నిందించుచుందును; అనయము = ఎల్లప్పుడును; నెనరు = ప్రేమ.

62. అపరంజిమేడ = బంగారుమేడ; అగోచరంబు = వివరింపరానిది; ఊరు...యందము = హురుమంజిదేశపు ముత్యాల జాలరులు కూర్చిన సొగసైన గవాక్షముల చక్కఁదనము; చాయల...చందము = ప్రకాశముగల కెంపులు చెక్కిన పైమేడలయందము; చలువల్...సరాగము = చల్లఁదనము నిచ్చుచుండు చంద్రకాంతపుటరుగులయందము; కుడ్యభాగముల్ = గోడల భాగములు.

(ఇచట మేడలు, తోరణగండ్లు, ఓవరులు, కుడ్యములు - అను వానిని వివక్షచేయని పక్షమున చిత్రాంగియందము సూచిత మగుచున్నది. త్రివళులు, దంతములు, అధరము, చెక్కిళులు, మున్నగువానియందము స్ఫురించుచున్నది.)

63. అందుల్ = పైమేడయందు; చనుమానముతోడన్ = చనవుతో ——(కుచసంభావనతో - అని ధ్వని.)

64. వెడనగవు = ఇష్టములేమిని సూచించు నవ్వు; ప్రాణపదము = ప్రాణముతో సమానము; పైన్ = ఆకాశమునకు; కడుల్, పాదవు=మిక్కిలి ఎత్తుగా నసుట.

65. రవియణురశ్మికిన్ = సూర్యుని సన్నని కిరణమునకును; చొరఁగరాని = ప్రవేశింపరాని; సరోరుహలోచన = అమ్మా ! (ఈ పదము స్త్రీమాత్రవాచకము.)

66. పట్టియాసలన్ = అడియాసలతో; గాయకపుజంత = టక్కరియైన ధూర్తురాలు.

68. పాయని = విడువని; పిట్టరేఁపుచేన్ = పావురపుఁబ్రేరణచే. ప్రోడచేడియల్ = ప్రౌఢలైన చెలికత్తెలు.

69. తత్తఱింపఁదొడఁగిరి = కలఁతపడఁజొచ్చిరి; సూటిగాదు = సరి కాదు; పాటికాదు = న్యాయముకాదు; కటికి...కటికిన్=కఠినమైన మనస్సు గల సైకతశ్రోణి యగు చిత్రాంగికి; పగవారము = విరోధులము.

70. అటుగనుకన్=అందువలన; ఇయ్యకొని=అంగీకరించి; లియ్యమై=అనుకూలముగ నుండి.

71. నిశ్రేణి...కాంతులన్ = సోపానములందలి కెంపుల కాంతులను; చర ..దన్నన్ = పాదపద్మముల యొక్క యెఱ్ఱని కాంతి తలదన్నఁగా— (అతిశయింపఁగా ననుట.)—చిత్రాంగి కెంపులు తాపిన మేడమె ట్లెక్కిన దనియుఁ, ఆమె పాదముల కాంతులు కెంపుల కాంతుల నతిశయించి యున్న వనియు నభిప్రాయము;

జాత ..స్ఫూర్తిన్ = బంగారు తలుపులవలనఁ గల్గిన కాంతిని; అంగ వల్లీ ..ద్యోయన్ = శరీరకాంతి తిరస్కరింపఁగా: — చిత్రాంగి తలుపులను త్రోసి లోనఁ బ్రవేశించె ననియు, ఆమెదేహ కాంతులు బంగారపు కాంతిని మించె ననియు భావము.

జాల...ద్యుతిక్ = కిటికీలకుఁగల ముత్యముల యొక్కయు, వజ్రముల యొక్కయు జాలరుల కాంతులను; కనుదోయిజిగి = కన్నుల ధవళకాంతి; ఓరగంటఁ జూడక్ = తిరస్కరింపఁగా—(కన్నుల కాంతి ముత్యముల కాంతితో సరిపోలుచున్న దనియు, చిత్రాంగి కిటికీలగుండా చూచె ననియు భావము.) అ స్తంభ ..తోదక్ = తళతళమను నీల స్తంభముల కాంతితో; నెఱి ...డాలు = సోగసైన కొప్పుయొక్క నల్లనికాంతి; (చిత్రాంగి నీలమణి స్తంభములకడ నిలిచిన దనియు నభిప్రాయము.)

చవికెలు = చావిళ్లు; చప్పరములు=పందిళ్లు; ఎచ్చరించుచుక్=ఎఱుక పఱచుచు; చిత్రాంగి పాదములు ఎఱ్ఱగా నున్న వనియు, శరీరము బంగారువలె నున్న దనియు, కన్నులు ధవళకాంతుల నీనుచున్న వనియు కురులు మిక్కిలి నల్లని వనియు భావము.

72. చంద్ర...కాంతి = చలువరాళ్ల తిన్నెలయొక్క గొప్ప కాంతి;

ఇంద్ర...దీప్తి=ఇంద్రనీలములు తాపిన స్తంభములయొక్క ఎక్కువకాంతి; అరుదు = ఆశ్చర్యము.

73. నాయకమైన = మేలైన; అంధకారాయితమై = చీకటివలె నున్నదై; మగరాలు = పుష్యరాగములు; మువ్వేలుంగులకుఁ = ఎఱుపు, నలుపు, తెలుపులకు; కందువ = స్థానము.

74. పరిమళపేటులు = సువాసనద్రవ్యములు గల పెట్టెలు; అర... చిల్కలు = మద్దుపలుక్కుల చిలుకలు; చప్పరమంచములు = పందిరిమంచములు; ఇంచు...సరములు = కమ్మనిసువాసనల పూలమాలలు;

75. రతులమేలుకట = రతులయందలి ఆత్యాశ; చవుసీతి బంధములు = ఎనుబదినాల్గు రతిబంధములు; నాకపురి = స్వర్గపురి; గణికామణి= వేశ్య;

76. ఓ వయో...రామ = వయస్సు, శృంగారచేష్టలు, లేజో విశేషములు అనువానిచే మనోహరుఁడా! జలజాంబక = పద్మములఁబోలు కన్నులు కలవాఁడా! (మఱియు వయో...జాంబక! = వయోహావకళలచే మనోహరుఁడ వగు మన్మథుఁడా!) మహిన్ = భూమిలో; నెఱజాణవు = తెలివైనవాఁడవు—నేర్పరివి; ఈ విటు = ఈవు+ఇటు; ఈ విటుఁడ్; (ఈ విటుఁడ్ = విటుఁడైన యీ శ్రీకృష్ణుని; చూచితే? నెఱజాణ+అవుర్ = (ఇతఁడు) చాల నేర్పరి యగునుగదా! వల్లవీ...యుంతుండై =గోపికలయెడ కొంటెతనములందు ఎడతెగని ఆసక్తితోఁ గూడినవాఁడై, గోపికల స్తనముల యెడ ఇష్టము ఎడతెగని యనురాగము కలవాఁడై; నెయ్యపుటాలమందలోన్ = ప్రియమైన ఆవులమందలో, వ్రేపల్లెలో. అగ్గలికన్ = ఉత్సాహమున; ఆవగలు, ఎల్లన్ = ఆవులయొక్కయు, ఆఁబోతులయొక్కయు చేష్టలను; అరసి = చూచి; కైకొనియున్కిన్ = ఆ ప్రవర్తనలను (తాను) గ్రహించి మెలఁగుటను—(శ్రీకృష్ణుఁడు వృషభముగను గోపికలు గోవులుగను క్రీడించుట వ్యక్తము.) కేళివినోదవైఖరుల్ = రతిసంబంధములగు చిత్రవిచిత్రవర్తనములను; లెస్సచూచితె = బాగుగా గమనించితివా?

77. ఊరువూనన్ = ఊరువు ఊనన్ = తొడను పట్టుకొనఁగా— ఊరు పూనన్ = గ్రామము నాక్రమింపఁగా; జంకెన చూపెన్ = బెదరింపు

చూపుతోఁ జూచెను, చూచితో = అటు చూచితివా? (వాఁడు) మఱి = తిరిగి; కటిసీమకున్ = కటిప్రదేశమునకు, గ్రామముపొలిమేరకు; వెనఁగెడున్ = వెనగులాడుచున్నాఁడు; 'గ్రామో...సీమా' = గ్రామమే లేదు; పొలిమేర యెక్కడ?'

[ఇందు 'కటిసీమ'లోని - 'సీమ' యను ఏకదేశము గ్రహించి, లోకోక్తి సమర్థింపఁబడినది.]

78. వినివినములు చేసికొనన్ = విని విననట్లు ఉపేక్షతో నుండఁగా ననుట.

79. అల్లన = మెల్లఁగా; గాధిరాజసుతుఁడు = విశ్వామిత్రుఁడు; ఆర్తిలిన్ = ప్రీతితో; ముద్దొనర్పన్ = ముద్దుపెట్టుకొనఁగా; అనఁ దనుకించుట = పట్టుకొన తొందరపడుట; అల్లనగాధిరాజసుతుఁడు = ఆహిమవంతుని పుత్రుఁడు మైనాకుఁడు; ముద్దొనర్పన్ = ముద్దుచేయఁగా - ప్రేమింపఁగా; బాల్యము = పసితనపుఁ జేష్ట;

80. (చిత్రాంగిమాట) పలునొక్కుల్ = దంతక్షతములు; నిగుడఁగ్ = వ్యాపింపఁగా; కళల్ వెలయఁగాక్ = కళాస్థానములు కరఁగఁగా; సముత్కలికల్ =శృంగారచేష్టలు; (వేఱొక చిత్రమును చూపి, సారంగధరుఁడు) తనిరుఁ బోఁడిరో! = అమ్మా; వారు+అతివినోదప్రాప్తిక్; జెట్లు = మల్లురు; [ఈ జెట్లుపక్షమున - పలునొక్కుల్ = బోఁమకఅచుటలు; కళల్ = వ్యాయామకళలు; ఉత్కలికల్ = విజయోత్కంఠలు; పెనంగి = పెనఁగులాడి:—అని యర్థము.]

81. (చిత్రాంగిమాట -)నిక్కంగన్ చూడు = నిక్కి బాగుగ గను నింపుము. చిత్రము = చిత్రపటము, విచిత్రము! నెమ్మని = నిండుమనస్సు; వేడుకన్, ఓలలాడున్ = ఆనందమున మునిఁగి తేలును; అమ్మక్క! = అహా! అల...కనుపింపఁగన్ = రహస్యావయవము వెల్లడికాఁగా; పొన్న !=అదిగో! కొమ్మ=యువతి; (ఇచట కర్త యువకుఁడు.)

(సారంగ -) 'అవులే మగువా= ఔనులేవమ్మా! చిత్రము = చిత్రపటము; నీ...యుంన్ = నీ విపుడు చెప్పిన పద్ధతి యంతయును; కృష్ణలీలగద!

= శ్రీకృష్ణుని లీలయేగదా! (ఇయ్యెడ - ఓలలాడు...గుట్టు = జలక్రీడ లాడు యువతుల వరాంగము; పొన్న...గున్కి = పొన్నచెట్టుకొమ్మపైఁ గూర్చుండి వినోదించుచుండుట; (వారి చీరల నపహరించుకొని పోయి)' అని గ్రాహ్యము.)

82. విఱిచి = పదములను విభజించి; మనసు . విఱుగక = మనస్సు కొంచెమైనను మాఱక - చెడుమార్గమునుండి మాఱక; కడఁకన్ = పూనికతో.

83. పసనికదంబము = ఎఱుపు మెఱిసిన పసుపువన్నెగలది, సువాసన ద్రవ్యములతోఁగూడినదియు అగుచందనము; మంజుల . బము = మనోజ్ఞము లగు వస్త్రముల సమూహము; అనర్ఘ...విసరంబులు = వెలకట్టరాని రత్నాల నగల సమూహములు; విరి ..బులు = పరిమళించు పూల మాలికలు; తెగిచి = తీసి; పలపు = మోహము (పరిమళము అని అర్థాం.) వెలిఁ సరంగన్ = బయలు పడఁగా (గుబాళింపఁగా అని అర్థాం.)

84. నెఱజాణ = మిక్కిలి నేర్పరి; తలకొనఁజేయుము = తలలో ముడుచుకొనుము; (పూనుకొనఁజేయుము మనుట—సుఖానుభవమున కని శేషము.) చెయి పట్టుము = చేయిచాచుము (చేకొనుమని యర్థాంతరము.) వాలాయము=తప్పక; ఎదఁజేర్చుము = వక్షమునఁ బూసికొనుము. (కౌఁగిలింపుము - అని అర్థాంతరము.) కో=కొమ్ము-గ్రహింపుము; కో అని యూర్పెక్ =(సంతోషమున) కేక వేసెను.

85. కొమ్మంచున్=కొమ్ము (తీసికొనుము) + అంచున్, కొమ్మ (యువతి) + అంచున్' అని యర్థద్వయము. సగపాలు = సగముభాగము; నించి=నింపి; పీడెంబు = తాంబూలము; మెయి=శరీరము; భోగంబు = సుఖము, (ఈమెయిన్ = ఈ నా శరీరమున; భోగంబున్ = రతిసుఖమును; పూనుము - అని అర్థాంతరము.) ఆ జాఁగ = ఆగయ్యాళి; ఒసఁగన్ = పీడ్యము మున్నగువాని నిచ్చుటకు; రాఁగ = రాఁగా.

86. అవి, చేసంటె = ఆ వస్తువులను చేతితోఁదాఁకి; చెవంటెక్, చూచి=దురాత్మురాలైన యా చిత్రాంగిని చూచి; ఇట్లు అక్ =ఇట్లనును-ఇట్లనె

వనుట; కావలయువేళన్ = అవసరమైనప్పుడు; కొంపోదున్ = తీసికొని పోవుదును. నాదు డాఁపురముగాన్ = నేను దాఁచి యుంచినట్లుగా;

87. ప్రియము = ప్రీతి; కడలుకొనన్ = వ్యాపింపఁగా; ధ్వని చతురోక్తులచేన్ = వ్యంగ్యార్థములతోఁగూడిన చమత్కారపు మాటలచేతను; ఆయనమది = ఆ సారంగధరుని మనస్సును; కొలుప లేక = ఒప్పింపలేక; వ్యాకులమతి యై = కలఁతపడిన మనస్సు కలదై.

88. తరలాక్షి = చలించు కన్నులుకల చిత్రాంగి; డెందమునన్ = మనస్సులో; అరటము ఒందుచున్ = తత్తఱపాటు పొందుచు; రాతికిన్... డెందము = సారంగధరుని హృదయము రాతితో సమానమైనది-కఠినమైనది. తాన్ = తాను; దాతికిన్ = దగ్గఱకు; తాలిమి = ఓరిమి - సహించుట; చెల్లునే = సాధ్యముకాదు. మారుఁడు = మన్మథుఁడు; ఘాతకుఁడు = క్రూరుఁడు; సముఖంబునన్ = ఎదుట. 'సముఖాన రాయబారమా ?' అనునది లోకోక్తి.

89. లజ్జ = సిగ్గు; ఏకాంతంబుగాన్ = రహస్యముగా - ఒంటరిగా; మత్తేభ... మిని = మదపుటేనుఁగువలె గంభీరమైన నడకగలది - చిత్రాంగి; అత్యంత... తిని = మిగుల అడ్డులేని గొప్పసాహసమున; బల్మిన్ = బలాత్కారముగా [ఇచట - మత్తేభగంభీరగామిని - అని చెప్పఁబడుటచే తదనుగుణముగ 'నిరంకుశోద్ధతిని' అనియుఁ గూర్పఁబడినది.]

90. ఏటిగొడవ = ఎక్కుడి లేనిపోని పీడ; తడవాయెను = ఆలస్యమైనది;

91. ఇన్నాళ్లకు సెలవుగాఁగన్ = ఇంతకాలమున కనుట. నవమదనా! = నవమన్మథుఁడా !

92. సుకుమారా != కోమలశైనవాఁడా ! రాసుతా != రాకొమరుఁడా! అతిమోహంబునన్ = మిక్కిలియనురాగముతో; మించుతల్లిని = మెఱుపునకు తల్లి వంటిదానిని - మెఱుపునతిక్రమించిన యందకత్తెను; నీకాసించియున్నాను = నిన్ను కోరియున్నాను; నన్ = నన్ను; ఆ+రతిసౌఖ్యోన్నతి = ఆ గొప్ప సురతసుఖమును; చెందఁగోరి = పొందునట్లు చేయఁగోరి; (నీకున్, ఆసించి

యున్నాను-అని సమన్వయము) ఆత్మజాకృతి = మన్మథుని యొక్క ఆకారమువంటి యాకారము కలవాఁడా! సన్మతి = మంచి మనస్సు కలవాఁడా! సారంగధరుండవు + అయ్యుఁ = (జింకను ధరించు) చంద్రుఁడ వయ్యును - చంద్రుని వంటి అందగాఁడవైన ననుట. ఏణీకిశోరాక్షిన్, ననున్ = (ఆఁడు లేడి పిల్ల కన్నులవలె) సొగసైన కన్నులు గల నన్ను: బాధింపఁగాఁజెల్లునే?= బాధించుట న్యాయముకా దనుట.

[సారంగ సంబంధ బంధుత్వము మూలముననైన కాపాడుట ధర్మమని భావము] నావుడున్ = అని పలుకఁగా.

93. అతిమోహంబునన్ = ఎక్కువ ప్రేమచే - వాత్సల్యముచే ననుట. మించు=అతిశయించిన: తల్లిని; అనారతసౌఖ్యోన్నతిన్ = ఎడతెగని గొప్ప సుఖమును; సుకుమారా! = మంచికొడుకా! రా=రమ్ము; సుతా!= పుత్రుఁడా! ఆత్మజాకృతిన్ = కుమారుని యాకారమున - పుత్రుని విధమున ననుట. అంటివి = అని పల్కితివి; ధరిత్రిన్ =భూమిపై; సత్యవాణీ సరస్వతి = (తా నన్నృత మాడినను తన) మాట నిజమే పల్కును; అన్, వాక్యము= అను లోకోక్తి;

94. పోన్ = పో నుంకింపఁగా; కుచ్చెల = గాగరా; జవ్వాడన్ = అల్లలనాడఁగా; లోన్ = మనస్సులో; తాల్మి = ధైర్యము; ఊడనిబాడన్= పరుసతెత్తిఁగా - నశింపఁగా; గట్టివాయింతి = గయ్యాళి చిత్రాంగి; కాంక్షన్= కోరికతో.

95. ఇందు చిత్రాంగీ సారంగధరుల సంభాషణ కూర్పఁబడినది - సారం. - 'అంటకుమీ, లతాంగి నను;' చిత్రాం. - అంటిన నేమి? మనోహరాంగ! అంటుపడంగలే దనుచున్ = (పరపురుషస్పర్శచే మైలపడ లేదనుచు) నిన్ను అంటెదన్ = నిన్ను ముట్టి ప్రమాణము చేసెదను.)

సారం. - 'అటంటగాదు-(నే నట్లనలేదు.) నన్నంటఁగఁజెల్లునే జనకు నంటిన పిమ్మట? చిత్రాం. - 'ఐన, నేఁడు, నీయంటునన్, అంటుగామిన్ (నీకల యికను పొందనియెడల ననుట.) ఎటుల, అంటును (నిలుచును), గొంటక (పోక) మేనన్, ప్రాణముల్?

96. మేలు=మంచిని; ఆఱడి... మేలా ?=వ్యర్థపుచ్చుట మంచిదా? చలము, ఏలా? = మొండి పట్టుదల ఎందుకు? మే+లావు+అరఁగ = దేహబలము తగ్గిన వెనుక; సద్రూపకము ఏలా ? = చక్కఁదనముతో ప్రయోజనమేమి ? వరియింపుము = పొందుము.

97. చెవు... కేలఁ=చేతులతో చెవులు మూసికొని; కడకుఁ బోవఁడు = దూరముగా పోఁగా; వనిత...క్వణనము = పొగడఁదగిన మణులగుంపుచే ప్రకాశించు కంకణముల ధ్వని; ఒలయఁగ = ఒప్పఁగా; పట్టుదుప్పటి = అతని పట్టు ఉత్తరీయము.

98. చలపట్టి = మొండితనము చేసి; కట్టిఁడి = క్రూరుఁడు; కట్టి+ఇడి-కట్టిడి = కట్టియుంచి; ఒప్పించి = ఒప్పగించి.

99. మేను = నీశరీరము: చూపు ..వాయఁగ = నాకన్నుల ముగ్ధత్వమును పోఁగొట్టినది; అది మెచ్చి = దానిని పొగడి; గ్రుచ్చి...వలదా! = (కృతజ్ఞతను తెల్పుచు, నిన్ను) నేను బిగియారఁ గౌఁగిలించుకోవద్దా? కోరు = నీనోరు; తీయవాతెఱ = కమ్మని నా యధరము; నిగుడించుఁ= వ్యాపింపఁజేసెను - (నిగుడించెఁ = గుబాళించెను - అని జితకాశి.) ఉల్లంబుఁ కరంచెఁ = మనస్సును కరఁగించెను; దానికి నీవి = దానికిఁ+ఈవి =దానికి బహుమానము (దానికిఁ+నీవి =ధనము, పోఁకముడి) వేగిరమ్మూని = తొందరపాటు విడిచి - తొందరపడి వెళ్లిపోక. కలరవమ్ములఁ = పావురములను; అణకించు = పరిహసించునట్టి; కలరవమ్మున్ = నాకంఠధ్వనిని; నాదున్ = శబ్దమును; చంట...మానక = నా కుచమువయి నీ ఱొమ్ము మోపక; చంట తగునె = పోవుట తగదు.

100. ఊనిన = వహించిన; పెందిమ్మునఁ - పెను+దిమ్మునన్ = పెద్ద మనస్సంకటముతో; సొమ్మసిల్లి = మూర్ఛపోయి; వే తేఱి = వేగముగా తేఱుకొని; ఆ.. మ్ములు = మంత్రికుమారుఁడైన సుబుద్ధియొక్క మాటలు; విన్నంబోయి = వెలవెలపాటు పొంది; రాచూలి = రాజకుమారుఁడు; జాలిగఁ =దీనముగా.

101. పులుకుపులుకునఁ జూచి = బెదరు చూపులతోఁ జూచి; పెనుప నోపు = పెంచఁదగిన; చెల్లఁబో ! = అయ్యో !

102. ఎదిరి...గక = ఎదుటివారి మనస్సును చక్కఁగా గ్రహింపక; వలవంత = వలపుబాధ, నిర్బంధము; కోవిదులు = విద్వాంసులు.

103. వామాక్షి ! = అమ్మా ! ఘటిల్లెను ? = కలిగెను ? తెగువ = సాహసము. కొల = పాపము; లఘుత్వంబుగన్ = తేలికగా.

104. తనుతల్లి=మాతల్లి; పురం...తల్లి = స్త్రీసమూహమునను త్తము రాలు; తనుఁబూఁడను = కుమారుఁడను; రమణీయేతరగుణంబు = చెడ్డగుణము.

105. తలఁపు = (చెడ్డ) అభిప్రాయమును; ఉజ్జగింపు = విడువుము. మదనారి = శివుఁడు. తర్జని = చూపుడువ్రేలు. (బెదరించుట సూచితము.)

106. నీలాలక = నల్లని ముంగురులు కలది-చిత్రాంగి; ఇట్లు అన్ = ఇట్లనెను - ఔనౌమేలు అనన్=కొనియాడుచున్నదని; సతీసూనుగ్రామణివి= పతివ్రతాపుత్రులలో నుత్తముఁడవు; విభుభోగస్త్రీని = రాజుగారి వలపుకత్తెను.

107. భావ...చోన్ = మన్మథుని బాధ కగ్గమైనపుడు; నాకన్ను లాన = నా కన్నులతోడు.

108. తక్కునుడువులు = మిగిలిన మాటలు. లివురు = యత్నించు చున్న.

109. భోగపతిన్ = ఉంపుడుకత్తెను; వంగ...సొడ్డు = వంశమంత టికిని వెలి. వేర్పడితిని = వేరైతిని; వివిక్రియన్...మందు? = వివిధముగా వానిని చెడిపోవు మని చెప్పెదువు ?

110 కఱ్ఱకఱిలిపలుకులు = వెలితిమాటలు; పదరం దగునే?=వాదు లాడుట, తొందరపాటు న్యాయమా !

111. కాయములు = శరీరములు; కొమరు ..ములు = పడుచుఁ దనపు సొంపముతోడి వయస్సులు; అస్థిరంబులు = శాశ్వతములు కానివి. అకృత్యము = చెడ్డపని; చేటు = అపద.

112. ఇసుమంత = కొంచెము; పుష్పకోదండధరుని = మన్మథుని యొక్క; దండధరుని = యమునియొక్క; శిక్షించువానియొక్క.

113. ఖరభాను ప్రియసూనుఁడు=యముఁడు; అత్యాసక్తి=మిక్కిలి ప్రేమ; కావరమునన్ = గర్వమున; త్రుళ్లెద వేల ?=ఎందుకు మిడిసిపడెదవు? విధిఁ దరింపన్ = విధిని తప్పించుకొనుటకు.

114. అవ్వి...శాక్షి = విశాలములై చలించుచున్న కన్నులు గల ఆ చిత్రాంగి; కటా...చిన = క్రేగంటియందు మొలకరించిన; కినుకన్=కోపమును; బటాబయలు సేయక = వెల్లడిపఱుపక; అనంగు .. తూపున్ =మన్మథుని మామ యగు చంద్రునికాంతి యను సానపై; చికిలిచేసిన; కరవాఁడితూపున్ = మిక్కిలి వాఁడియైన బాణమును; కిసరించిన = మించిన యనుట. ఓరమిటారి చూపునన్ = సొగసైన వాలుచూపుతో.

115. మటుమాయపుమాట = మిక్కిలి మాయదారిమాటలు. దున్నపయాళికానిన్ = యముని. దుద్దువెట్టి = మోసగించి. ఈ వగల్ = ఈ నేర్పులు - తమాషాలు.

116. కోల = దండము; రడ్డి = రెడ్డి. (భర్త కోపకాఁడనియు, యముఁడు దండించు ననియు లోకమున నింద కలుగు ననియు, పిదప విచారణ జరుగు ననియు బెదిరింపనేల ? అని భావము.)

117. కల్ల = తప్పు. తగవు = ధర్మము; కొల = పాపము; వావి = వరుస; కొమ్మలు = స్త్రీలు.

118. తాలిమి = ఓర్పు; ఏకతమునన్ = ఏకాంత (మంచి) సమయమున; మొనసి = పూని; తగవులు = నీతులు; సుగుణివి = గుణవంతుఁడవు-బుద్ధిమంతుఁడవు.

119. రతి = రతీదేవి; మరునకున్ వలవదురా? = మన్మథుని కామింపలేదా? యక్షవరసూనుఁడు =నలకూబరుఁడు; దురాశలు = అడియాసలు; జాలివార్తలు = విచారకరపుమాటలు.

128. ముక్కంటి = శివుఁడు, గారాబుఁగూఁతునే = సరస్వతినే

పరమేష్ఠి = బ్రహ్మ; జంభారి = ఇంద్రుఁడు. గురువియిల్లాలు = తార; ఉడు రాజు = చంద్రుఁడు. ఓజలు = బుద్ధులు.

121. వెడమాటలు = విపరీతపుపల్కులు; ఎట్లువర్తిలినన్ = వివిధముగాఁ బ్రవర్తించినను; లెస్స+అవున్ = వారికి చెల్లు ననుట. ఒడ్లకున్ = ఇతరులకు; ఎన్ను = పేర్కొను.

122. పతిమతి, రాన్ = భర్తమనస్సు నచ్చునట్లు; మననేరవు = వర్తింపనేరవు - తిరుగలేవు; సుగతి = ఉత్తమగతి; తగవు = ధర్మము.

123. తాల్మి = ధైర్యము; నెఱివిఱిగి = ఉత్సాహము చెడి. కలి = తరవాణినీళ్లు. ఉట్లకడన్ = పెరుగు ఉంచు ఉట్లవైపు; అనున్=ఇట్లుపలుకును.

124. ఉసురుమన్నన్ = దుఃఖించిన, కొఱగాదు = మేలుకాదు.

125. కెంపు = ఎఱుపు, కోపము. కలికి ..కన్నులపైన్ = అందమై ప్రకాశించుచు, నిడుదలై, నిర్మలములగు కన్నులమీఁద ఇడనేల ? = ఉంచనేల? - కోపము కలిగింపనేల ? కెంజివురుపైన్ = ఎఱ్ఱని చిగురువంటి పెదవిపయి; ఇడరా = ఉంచుము - (దంతక్షతము సూచితము.) నాయెదన్ = నా మనస్సులో; గోళ్లు = గోడులు - దుఃఖములు; బలు...పయి = గొప్ప నిబ్బరము గల్గి, ఆశ్చర్యమై, ఉబ్బుచున్న స్తనములపై; గోళ్లు = గోరులు; కోపతాపముల్ = నా కోపమును, తాపమును; రేఁపకు = హెచ్చింపకుము.

126. వేదు+అనన్ మించు = ఏదుపందియో యన్నట్లు అతిశయించిన; కంతునిన్ = మన్మథుని; సాదని = మంచివాఁడని; తనదు సాదనన్ = తన విలువిద్య నేర్పుచు; గాడ్పున్ = గాలిని; కాదు = చల్లనిగాలి; అనలాకృతిన్ = అగ్నివిధమున. బోద+అనవచ్చునా ? = చిన్నది - (ఏమియు నెఱుఁగనిది) అని చెప్పరాదు. అనయంబు పేర్లుచున్ = ఎల్లపుడు మాటలాడుచు - న్యాయవిరుద్ధముఁగ పల్కుచు, కడకుఁబోదు = దూరముగా వెళ్లిపోదు.

127. ఇందు సీసపాదములు నాల్గింటికిని ఎత్తుగీతి తొలి పాదముకాని 'మధుఁడు' మున్నగువారు వరుసగా కర్తలు.

మధుఁడు = వసంతుఁడు; వేఁడి తావులఁ జల్లి=(విరహులకు తాపమును గూర్చు) వేఁడి పరిమళములను వ్యాపింపఁజేసి; వేచుఁగాని = బాధించును కాని; లతకూన యని = కన్నెపడుచు గదా యని; మతిన్ = మనస్సులో; తగుల్ = స్నేహమును; తలంపఁడుగదా! (లతకూన- లేఁదీగయెడ వసంతుఁడు ప్రేమగల్గియుండుట సహజము.)

సారంగరథుఁడు = గాలి; (జింక వాహనముగాఁ గలవాఁడు) చుఱుకు సోఁకులన్ = వేఁడి తాఁకులతో; మీఁద; సుడియుఁగాని = పడును గాని; జలజగంధి యటంచున్ = ఉత్తమవనిత గదా యని; సంభ్రమింపఁడు గదా = (ఎత్తుకొని) తిరుగుటలేదు. (వాయువు జలజగంధము గల దానిని మోసికొని తిరుగుట స్వభావము.)

మన్మథుఁడు, చిరుగు ..గాని = చిగురాకు కత్తిని విసరి బాధించును గాని; చిలుకలకొలికి = చిలుకలయొక్క వలె సొగసైన కనుగొలుకులు గలది- అందకత్తె. చెలిమిన్ = ప్రేమతో; పైకొనఁడుగా = కవియఁడు గదా! (చిలుక టెక్కెము గల మన్మథుఁడు. చిలుకలకొలికిని ప్రేమించి కలియుట సహజము.)

విధుఁడు = చంద్రుఁడు: ఉడుకు...గాని = వేఁడి వెన్నెలలు కాయుటకుఁ బ్రారంభించును గాని; కలువకంటి = కలువలవంటి కన్నులు గల కాంత- (చిత్రాంగి) అటంచున్; అలరఁజేయఁడు = సంతోషింపఁజేయఁడు. (కలువ చెలి యైన చంద్రుఁడు కలువకంటిని సంతోషపెట్టుట సహజము.)

వసులపాఁతఱలై = వసులపాఁతఱ యను పండెప్పపుంజువంటివారై; మసలనీరు = మెదలనీయరు. ఎఱుఁగవైతి = తెలిసికోలేకుంటివి. అలం. క్రమము.

128. సదాగతి = వాయువు; త్రిమ్మరి = తిరుగువాఁడు; అనంగుఁడు = మన్మథుఁడు; మెఱేయఁడు = మెఱటువాఁడు; మడియఁడు = చావఁడు; జైవాతృకుండు = చంద్రుఁడు; చెడుగులు = చెడ్డవారు.

129. రారాపు...చేసెదు? = ఎందు కిట్లు బాధింతువు? రారా =

రమ్ము; నను = నన్ను; చలువ... మేడన్ = చల్లని చంద్రకాంతశిలాభవనమున; రారా యని = రా ర మ్మని; తలిరా... కేళిన్ = మన్మథకేళిని (చిగురాకు కత్తిగాఁ గల వీరుని కేళిని) పిలరా = పిలుకొనుచుంరా.

130. పరిరంభంబు = కౌఁగిలి; ఆలకింపర! = వినరా! దైన్య... పడన్ = జాలి అతిశయింపఁగా; వలవంతన్ = వలపు బాధచే; కొల్కులం జిల్కు = కనుగొలుకులనుండి కారి; పాండర...ధార = తెల్లని చెక్కిళ్ళపయి జారిన కన్నీటిధార.

131. ఇందు సారంగధరునికి యాచకునినుండి తప్పించుకొను లోభితో సరియగు గుణములు వర్ణితములు. మనుజ...రుఁడు=రాజకుమారుఁడు - సారంగధరుఁడు.

132. ఈచెలిఁబట్టిన = ఈయువతిని పట్టుకొని యున్న; వలరాచ... భూతంబున్ = మన్మథుఁడ నెడి గొప్ప దయ్యమును; నెట్టుకొని = పూని-ప్రయత్నించి, వీడఁజేయఁగన్ = విడిపించుటకు.

133. తాన్ = తాను; నవీనకళానిధియై = క్రొత్తశృంగారకళలకు నిధియై - (కళలకు నిధియై యని చంద్రపక్షము.) నెగడినయట్టి = ఒప్పినట్టి; సారంగధరుఁడు, అయ్యెన్ - (జింకను ధరించినవాఁ డని చంద్రునిపక్షము.) అపుడు; గురుభామ = తండ్రి వలపుకత్తె (బృహస్పతి భార్య యని చంద్ర పక్షము.) చిత్రాంగి, (అందమైన దేహముకల తార యని చంద్రపక్షము.) అలమి...పట్టినన్ = పైకొని, బలాత్కారముగా పట్టుకొన్నను; పైకోక విడిచి = తన యుత్తరీయమును విడిచి,పైకొనక విడిచి యనియు నర్థాంతరము; చనియెన్. అబ్బురంబు ! = ఆశ్చర్యము. అలం. విరోధాభాసము.

134. దట్టిచల్లడంబుతోన్ = లంగోటాతో; లోఁగాక = వశము కాక. కోక = చీర.

135. లేఁగ = లేఁగదూడ; పులివాతఁ దడఁబడి = పులినోటినుండి తప్పి; ఆతఁడు లోఁగామిని = సారంగధరుఁడు లొంగకపోవుటచే; కామిని = చిత్రాంగి; లోన్ = మనస్సులో; కినుకన్ = కోపముతో; వంతన్ = విచారముతో.

136. సుగుణివి = యోగ్యుఁడవు; రసికముద్ర = రసికుని లక్షణము; చెలినేఁచుటె = యువతిని బాధించుటయే; నేర్పు = నేర్పా ? నీ అంగము = నీ నైజము, నీ శరీరము.

137. ఆరోపింతును...నీపై = తప్పంతయు నాదే యని, నీ దోష ము లే దని ఒప్పుకొందును.

138. కడచి = అతిక్రమించి - నామాట కా దని; మించఁగ నాడక్ = ఎక్కువగా మాటలాడను; అంగమచ్చంబు = గుర్తు.

139. రిచ్చలక్ = వితాకుచేత: భూరమణసుతుఁడు = రాజ కుమారుఁడు.

140. మదన...వ్యథచేక్=మన్మథుని వాఁడియైన బాణములగుం వ నెడి కలువదెబ్బలవలని బాధచే. తల్లడవడి = తహతహపొంది.

141. ఆడు = పల్కుచున్న; లోఁగి = లొంగి; త్రెళ్లి = మర ణించి; యమబాధానీకముక్ = యమబాధలమొత్తమును.

142. తెగువ = సాహసము; సంధిల్లఁజేతను = కలిగించుటకు, ఇయ్యకొని యుండక్ = సమ్మతింపఁగా - అటమీఁదక్ = ఆపైని. ఈశ్వ రాజ్ఞ = భగవదిచ్ఛ.

143. కావక = మన్నింపక. అహా !=అయ్యో! వినాశ...బుద్ధిః = చెడిపోవుకాలమునకు చెడ్డబుద్ధి పుట్టును; బయల్పడక్ = వివరముగా. నీవిధిక్ = నీ పూర్వకర్మము, ఆడుమీ అనఁగక్ = ఇట్లు పల్కుమని ప్రోత్సహింపఁగా. ఈ విధిక్ = ఈ విధముగా.

144. ధారుణి = భూమి. కొల = పాపము; తోడుతోడనే = వెంటనే.

145. దొరలక్ = సామంతులను. భృత్యులక్=సేవకులను; అందో అను=అందఱిని, తుందుడుకు = కలఁతపాటు. సందడింపక్=ఎక్కువ కాఁగా.

146. వెకలినై = తెలివిమాలినవాఁడ నై. వఱదఁ బో నిమ్మని =

పోయినఁ బోనిమ్మని, పొడమ నేల ? = పుట్ట నేల ? దాఁపురమాయె = దాఁప రించినది - సంభవించినది.

147. మాయక్ = మోసముచే. ఆ యమబాధలకు = ఆమె (చిత్రాంగి) పెట్టు బాధలను. మాయక్ = మాసిపోఁగా - మరణింపఁగా. ఆ, యమ బాధలను = ఆ యమునియొక్క బాధలను - (పాపాచరణమునకై యతఁడు పెట్టు బాధలను.)

148. ప్రమోదింతుక్ = సంతోషించును. కుందుక్ = దుఃఖించును. మిన్ను = ఆకాశము.

149. కోక చేపడినది=తన ఉత్తరీయము లభించినది. కట్టుపాటి = కలఁత యేర్పడి, ఎద = హృదయము చీర చిక్కినయది = చూలు నిలిచినది. బిడ్డకట్టులు = ప్రసవవేదన.

150. వేఁగి = తపించి. హస్తగతమైన = చేతికిఁ జిక్కిన. పోనాడుకొన్న కరణిక్ = పోఁగొట్టుకొన్న విధమున. సరణి = మార్గము - విధము. సిద్ధము = నిశ్చయము.

151. ప్రాపించుక్ = కలుగును. మైల = మురికిగుడ్డ, తలసూపఁ మానెక్ = తల చూప వీలుకాకపోయెను. అగాధఘనకూపమునక్ = లోతైన నరకకూపమునందు, వ్రచ్చి = చీరుకొని నిజ...ములు = తన నొసల నెడి పలకమీఁద అక్షరములు, విన్ననై = వెలవెలపోయి. సొటసొటలు పోవుక్ = చిడిముడిపాటు పొందుచుండెను.

152. రక్తి = ప్రేమ. అనక్తి = ఇష్టము. సూక్తి = మాట, ముక్తా ..హార = ముత్యాలహారమువలె ఇంపైన చిత్రాంగి. ముక్తాహార = ఆహారము విడిచినది.

153. అటవక్ = అడవిలో. సరసిచెంత = కొలనియొద్ద. బిసాగ్రంబు = తామరతూటి చివఱిభాగము. సరసి = సరిచేసి. కోకిప్రేమ = ఆఁడు చక్రవాకపు పలపును. దుండీయెడక్ = ప్రియసియెడల.

154. అవ్విలాసపాంచాలుఁడు = విలాసమున పాంచాల జాతి

పురుషుఁడగు ఆ రాజు. (పాంచాలుఁడు శృంగారపురుషులలో నుత్తముఁడు) కేలు . దలిరు = చేతివలె అందమైన చిగురు. కేశమదాళులు = జుట్టువలె నున్న మదించిన తుమ్మెదలు. కనుందెలిదమ్ములు = కన్నులవంటి పద్మములు. జాల...దేటయుఁ గా = జాలువారు నవ్వువంటి ప్రసన్నభావమును. భుజాబిసముల్ = బాహువులవంటి తామరతూండ్లు; పద్మినిఁ = తామరలతను - (ఇచట చిత్రాంగి పద్మినీజాతి స్త్రీ యని వ్యక్తము.)

155. ముంగలఁ = ముందుభాగమున. దళమగు = దట్టమైన, తమ్మి...సెకల్ = తామరకొలని సువాసన సెగలు, కదియంగఁ = వ్యాపింపఁగా. సూరెలఁ = ప్రక్కల, మలయసమీరము = మలయమారుతము. వెనుకమర్లున = వెనుకభాగమున. కళవళమంది = కలఁతపడి. కంతునిమంది = మన్మథుని సేన.

156. రయమునఁ = వేగముగా.

157. ఆందోళించుచుఁ = ఉయ్యెల లూఁగినట్లు కలఁతపడుచు.

158. రాజిత...గనన్ = ప్రకాశించుచున్న విలాసకళావిశేషమున జయింపఁబడిన దేవస్త్రీలును, మానవస్త్రీలును కలదానిని; విరాళిం గ్రాఁగెఁ=విరహమునఁ దపించెను.

159. ఈపద్యమున సూర్యాస్తమయముతోఁబాటు కార్తవీర్యార్జునునిపతనము శ్లేషింపఁబడినది.

ఆటు = పిదప; పరా...పాదుఁడు = శత్రురాజుల తలలపైఁ గూర్పఁబడిన పాదములు కలవాఁడు; చక్రేశ్వరుఁడు = భూచక్రప్రభువు; సహస్రకరుఁడు = కార్తవీర్యార్జునుఁడు; రాము . ఖాగ్ని = పరశురామునిబాణాగ్ని; తేజఃస్ఫురణ = తన తేజః ప్రకాశమును; హరింపఁ = అపహరింపఁగా: వ్రాలె నన్ = పడెనో యనునట్లుగా;—పరా...పాదుఁడు = పడమటికొండశిఖరముపై నుంచఁబడిన కిరణములు కలవాఁడు; చక్రేశ్వరుండు=చక్రవాకములకు ప్రభువు; సహస్రకరుఁడు = సూర్యుఁడు; రామ...గ్ని = మనోహరములగు జ్వాలలు కల అగ్ని; తేజఃస్ఫురణ హరింపఁ=తన తేజః ప్రకాశమును గ్రహింపఁగా—(సూర్యుఁడు తన తేజస్సు నగ్నియం దుంచి యస్త

మించు నని ప్రసిద్ధి.) చరమాంబురాశిలోనన్ = పడమటి సముద్రమునను; వ్రాలెన్ = మునిఁగెను.

160. (ఇందు సూర్యాస్తమయ వర్ణనముతోఁబాటు ఒక ప్రభుని యుద్ధవృత్తాంతమును వ్యక్తమగుచున్నది.)

ఇనుఁడు = సూర్యుఁడు, ఒక రాజు; మందేహులతోడన్ = (సూ.) మందేహు లను రాక్షసులతో, (రా.) నీచులతో; పోరి; అంతన్ = పిదప; పీగి – ఓడిపోయి; తన్ చేరన్ = తన్నాశ్రయింపఁగా; అ స్త... మణి=(సూ.) పడమటికొండ, (రా.) అస్తుఁడను గొప్పరాజు; మిత్త్ర ప్రేమన్ = (సూ.) సూర్యునియెడ ప్రేమతో, (రా.) మిత్రునియెడఁగల ప్రేమతో; రక్తప్రవాహముగాన్ = నెత్తురు వరదలై పాఱునట్లు; పోర ననంగన్=పోరెనో యనఁగా; అల దైత్యశ్రేణి = (సూ.) ఆరాక్షసులగుంపు, (రా.) ఆ క్రూరులగుంపు; చిక్కి = పట్టుపడి; కాన్పింపకుండన్; మొగుల్ = మేఘములు; మాయలు పన్నె నాన్ = మాయలు పన్నెనో యనునట్లు; సంధ్యారాగమున్ = సంజకెంజాయయును; ధ్వాంతమున్ = చీఁకటియును; తనరెన్ = ఒప్పెను.

161. ఆత్మపత్నీహరణంబు = తన భార్యను అపహరించుట; దేవగురుండు = బృహస్పతి; హరిణాంకుఁడు = చంద్రుఁడు; తారకముల్ = చుక్కలు; నెరసెన్ = నిండెను.

162. రాజు = చంద్రుఁడు, ఒక రాజు; నల్లమూఁకలపైన్=చీఁకట్ల గుంపుపయి; వెలిగుడారంబు = తెల్లనిడేరా; చాందిమ = తెలుపు; ప్రాచిన్ = తూర్పుదిక్కున; కువలయదళంబులం దెల్లన్ = కలువరేకులన్నింటను, భూమండలములోని సేనలన్నింటను; కూచియయ్యెన్ = వికాసము కల్గెను, దండయాత్రాయత్న మయ్యెను.

163. తొలి.. గని=తూర్పుకొండయందలి సెలయేళ్ల కావల నున్న చంద్రకిరణములను చూచి; (చేతులను చాచి అని అర్థాంతరము) కలువలు = కలువపూలు, (కలువ లనెడి నామము కల నాయికలు.) కిలకిల నవ్వెన్ = వికసించెను. (కిలకిల నవ్వి రని అర్థాం.) ఏటూవలి గిలిగింతలు = ఏటిదూవలి యొద్దువారి రీవలియొద్దువారికి పెట్టు గిలిగింతలు; అటంట = అనిసామెతగా

వనుట; వానికిఁ = కలువలకు; సరిదాఁకెఁ = యథార్థమయ్యెను. (అసంభవ
మని తెల్పు సామెత యిచట అయథార్థముగాక, యథార్థమే అయ్యె నని
భావము.)

164. తమివిటుఁడు = (రాత్రిభర్త) చంద్రుఁడు; (విటుఁడు అర్థాం.) ఒయ్యన = మెల్లఁగా; కరములు = కిరణములు, (చేతులు, అర్థాం.) చాచి; ఇరులనెఱుల్ = చీఁకట్ల విజృంభణమును; (చీఁకట్లవంటి కురులను, అర్థాం.) తీర్చి = నశింపఁజేసి; (దిద్ది-అర్థాం.) తెలివి...కూర్చి = తెల్లని కాంతిని - వెన్నెలను కల్గించి; (తెలివిని చక్కఁగా సమరించి, అర్థాం.) కడు...కావించి = నయనమువంటి చకోరపక్షులను మిక్కిలి ప్రేమించి; చకోరములవంటి కన్నులను ముద్దుపెట్టుకొని - అర్థాం.) చను..నారి = (తన్నుఁ జూచి భయపడి) పోవు చక్రవాకములను దుఃఖములు పొందునట్లు ఆక్రమించి - చక్రవాకములను బాధించి యనుట; (జక్కవలవంటి చన్నులపై నఖములు దిగఁబడునట్లు అంటి - అర్థాం.) కళలు రంజిల్లంగన్ = కాంతులు వెలయఁగా; (కళాస్థానములు ద్రవించునట్లు - అర్థాం.) తొలునాఁడు = ముందటిరోజు; (తొలిరోజు అర్థాం.) తనుగూడి = తూర్పుదిక్కును చేరి; (తనతో సంగమించి - అర్థాం.) ఇటు...నిలుతున్; నీకడలన్ = నీదిక్కున; నేఁటికిఁ జాలు = ఈ దినమునకుఁ జాలును; (నీ కడల నేఁటికి? = నీవు బెదరుట యేల? చాలున్ = ఊరకుండుము - అని అర్థాం.) అని, ఏఁగుటకు జేసి=చెప్పిపోయినందున; అవ్విధమునన్; తామరల...వచ్చి - తామరలనిక్కు = తామరల గర్వము; పమ్ముకన్ = వ్యర్థమగునట్లును;- కమలములు ముకుళించునట్లును; తన...యిల్లఁగన్ = తనకు ప్రియములగు కలువలు సంతోషించునట్లును; (తా = తాను; మఱల; నిక్కువముగన్ = నిజముగా; తనకున్; ముదములు = సంతోషములు; అతిశయిల్లఁగన్—అని అర్థాం.) వే, వచ్చి; లేఁగొమరు ...నట్టు = లేఁతవయసుసుందరి మొగమున తిలకము తీర్చినట్లు; తూర్పుదిక్కు = తూర్పుదిక్కున; నిల్చెన్=ఉదయించెను; (తూర్పు...బునను = తూర్పుదిక్కునను లేఁ బ్రాయపుజవరాలి యింటి ముంగల; బొట్టుపెట్టినట్టు = నిష్కర్షగా—చెప్పిన విధముననే—వచ్చి నిల్చె నని అర్థాం.)

165. రిక్కలు ఎగయంగన్ = చుక్కలు దయింపఁగా; ఉదయ .. మునన్ = తూర్పుకొండచివఱ; తెలివిన్, పొదలు = తెల్లనికాంతితోఁ బ్రకాశించు; మృగాంకమండలమున్ = చంద్రబింబమును; చూచి; పచ్చని వింటిబోయ = పచ్చవిల్కాఁడు - మన్మథుఁడు, వేగ, విల్లు, ఎత్తి=పట్టుకొని; విరహిజాలములను = విరహులగుంపును; వేఁటాడఁదలఁచెన్ - విరహులకు బాధ కల్గింపసాగెననుట.

166. అల్ల = అ; హల్లక...తల్లజుండు = కలువలకు హితుఁ డగు చంద్రుని వంశజుఁడైన రాజశ్రేష్ఠుఁడు—రాజనరేంద్రుఁడు. అయల్ల . మాన సుండు = విరహాగ్నిచే మిక్కిలి దహింపఁబడుచున్న మనస్సు కలవాఁడు; నిబిడ . . . నంబునన్ = దట్టముగా మకరందముగల పూవులయొక్కయు, చిగుళ్ల యొక్కయు, గుంపులచే చల్లనైన గున్నమామిడులగుంపులలోని పందిరియందు; నిశాంత...తరంబునన్ = చంద్రకాంతమణివేదికపై మిక్కిలి మనోజ్ఞమైన పూలపాన్పునందు; ఏకాంతంబునన్ = ఒంటిపాటున; చిత్రాంగీ . . . త్నుండై= చిత్రాంగిని చూచుటయందలి కోరికచే మిక్కిలి మేల్కొనుటచే వాఁడి (ఎఱ్ఱ నైన) కన్నులు కలవాఁడై; ఉపరి . పాలికలు = పైభాగమునందలి పూల గుంపునుండి జారిపడుచున్న ఎడతెగని పూఁదేనెబొట్టులయొక్కయు పుప్పొడి యొక్కయు సమూహములు; చందనచర్చలుగాన్ = గంధపుమైపూతలు కాఁగా; మరుత్ . . . వ్రజంబులు = గాలిచే మిక్కిలి కదిలింపఁబడుచున్న దగ్గఱి యేడాకుల యరఁటి చెట్లయొక్క ఆకుల మొత్తములు; వ్యజనంబులు గాన్ = వీవనలు కాఁగా; తన్నివాసంబు = అ యున్నచోటు, అయత్న శిశిరకృత్యంబులు ప్రయత్నములేని శిశిరోపచారములు; ఘటియించుచుండగన్ = కూర్చుచుండఁగా; పరితాపంబు = విరహబాధ; అగ్గలంబై = అధికమై.

167. మధుమాసంబు = చైత్రము. (మద్యము పుట్టు కాలము) శుక...ననమే = చిలుకలు, కోయిలలు, తుమ్మెదలు మున్నగు మన్మథుని సేనలతోఁగూడిన యడవియే; (తిరుగుఁబోతులు; చాటుననుండి తప్పుడు కూఁతలు కూయువారు; త్రాగుఁబోతులు మున్నగువా రని అర్థాంతరము స్ఫురిం చుచున్నది - మన్మథుని సేన యిట్టివారితో నిండిన దని వ్యక్తము.) విధుఁడు=

చంద్రుఁడు, విరహి, వేఁగుట = తాపము పొందుట, అరుదే = ఆశ్చర్యము కాదు.

168. వెట్టగన్ = వేఁడిగా; పథికుండు = బాటసారి; అనంగుఁడు= మన్మథుఁడు.

169. మరుఁడు = మన్మథుఁడు; వెనుకొని = వెంటఁదగిలి; వెంద్రుక పట్టెడు తూపులు = మిక్కిలి పదనుగల బాణములు;—(వెంద్రుకల పై ధరింపఁబడు పుష్పబాణము లనియు అర్థము) విర్చి = విరి తీసికొని; అలయించు= మిడికించునట్టి; (బోరునన్ = వేగముగా; అల = ప్రసిద్ధమైన; ఇంచువిల్లు= చెఱకువిల్లు; కొని = గ్రహించి-అని అర్థాంతరము.) త్రొక్కని .. తేజిపైన్ = ఎవ్వరును అడుగుపెట్టని స్థలములందును పోవుగుఱ్ఱముపై; (ఆకాశముపై పోవు చిలుకవాహనముపై - అని అర్థాం.) పసుపడన్=వాటముగా; నీళ్ల... లీలన్ = అవలీలగా; తియ్యనిపదనైన = ఏమాత్రము తరుగని మంచి పదను గల కత్తిని; (నీటిమీఁద చరించు విలాసముతో నుండి, మధురమైన మకరంద పుందడిచే చల్లనైన పద్మదళమును - అని అర్థాం.) పఱపి = వ్యాపింపఁజేసి; నృపాలుడెందమున్ = రాజేమనస్సును, ఇట్టట్టుచేసెన్ = కలతపెట్టెను - (ఒక వీరుఁ డెదిరించి బాధించినట్లుగా మన్మథుఁడు బాధించె నని ధ్వనితము.)

170. తత్తఱిల్లి=కొందలపడి; ఓట్టాడిన గుట్టునన్=చలించిన మర్మముతో, తెట్టగిలంబడి = నీరసించి; చుట్టుముట్టినట్టి = తన్ను చుట్టుకొన్న; మరుశరాళి తేజీలన్ = మన్మథుని భీకరములగు గుఱ్ఱములను - చిలుకలను; శిశిర . సూనులను = చంద్రుఁడు, తుమ్మెదలు, మలయమారుతము, మన్మథుఁడు - అనువారిని; ఉద్దేశించి = గురించి; వసుధేశుండు = రాజు; సుప్రలాప = మంచిమాటల తోను; విప్రలాపంబులన్ = దుఃఖవచనములతోను;

171. ఇందలి వర్ణన విశేషములనుబట్టి చిత్రాంగిముఖము చంద్రుని వంటి దని, ఆమె మాటలు చిలుకపలుకులవంటి వని, ఆమెకేశములు తుమ్మెదల బారువంటి వని, కన్నులు చకోరములవంటి వని వ్యక్తము.

172. ఆ తమంబు = ఆ రాహువు; తన .. చేయుందు = తనయొక్క 'తమము' అనెడు పేరు పెట్టుకొన్న చీఁకట్లను చెదరఁగొట్టుదు వని; నిను...

జూచుఁగా=నిన్ను పట్టుకొనుటకుఁ జూచుచుండును గదా! రాజ!=ఓచంద్రా! నీయొక్క 'రాజు' అనే పేరు కలవాఁడను; గోత్రపతివి = మా వంశకర్తవు; మారుతోఁగూడి = మన్మథునితోఁ గలసి; కలఁచ నేల? = బాధింప నేల?

173. నీ గోత్రజున్ = నీవంశమునఁ బుట్టినవానిని; ఏఁచ నేల? = బాధింప నేల? అబ్జ! = చంద్రా! (అబ్జుఁడు = చంద్రుఁడు అబ్జము = తామర పువ్వు;) పగల్ = విరోధములు; (పగల్ మీఱక్ = పగ లతిక్రమింపఁగా సాయంకాలమున అనియు నర్థాం) దిమ్ము ఎసయం జేసెదవు=బాధింతువు; ఔనవున్ = ఇది సరియే. కువల...రాజునకున్ = కలువలపై నభిమానములు కల చంద్రునకు; (భూమిపై ఆశలు గల రాజులకు నని అర్థాం.) తమ్ములమీఁదన్ = కమలములపై; (సోదరులపై నని అర్థాం.)

174. మృగాంక! = చంద్రా! గాము = గ్రహము; ఓషధీశుండవు= ఓషధులకు ప్రభువవు.

175. సకలము = సమస్తము; సుధాకరుఁడు = అమృతకిరణుఁడు - చంద్రుఁడు; కాలకూటసహజన్మి = కాలకూటవిషమునకుఁ దోఁబుట్టినవాఁడు; ఓ సితమయూఖ! = తెల్లనికిరణములు కల చంద్రుఁడా! నిన్, తెలియంగఁ గోరి = నీతత్త్వ మెఱుఁగఁ గోరి; జల...వచ్చెన్—(రాహువున కనుట) దిగ మ్రింగనేని = మ్రింగివేసినచో; మనికి గాంచునే?=బ్రతికియుండునా!— చచ్చు ననుట.

176. కమలవైరి! = చంద్రా! మలయ...కుల్ = పిల్లవాయువులు; మందులు = మెల్లనివారు; ఔషధము లని అర్థాం. అమృతకరుఁడవు=అమృత హస్తుఁడవగు (మంచి) వైద్యుఁడవు; అంగజవ్యాధులను=విరహతాపములను, శరీరమునఁ బుట్టురోగములను; మాన్పకన్ = పోఁగొట్టక: కరంబు = మిక్కిలి; పెంపు...గునె? = వృద్ధిచేయవచ్చునా?

177. సుధాకరా! = చంద్రా! సురల్ = దేవతలు; పలుమఱు; పచ్చ...వ్రాలుచున్ = చల్లని మరకతశిలలమీఁద పడి, పొర్లాడుచు; పారి ...ములన్ = పారిజాతములయొక్కయు, అశోకముల యొక్కయు, లవలీలతల యొక్కయుం బొదలయందు; సోలుచున్ =పరవశు లగుచు; విన్నదిన్ =విన్ +

నదిన్ - ఆకాశగంగయందు; నెలకొని = ఉండి; భుజింపఁగాన్ = భుజించుట చేత; అయిన కాఁకకుఁగాకసుమీ = కలిగిన తాపమునకు తాళలేకయే కదా.

178. కఱకంఠుఁడు = శివుఁడు; నీకళన్ = నీలో పదాఱవవంతును; వెడలఁగ్రాయఁగ నేటికి ? = వెళ్లఁగ్రక్క నేల? (శివుఁడు గరళము మ్రింగి, చంద్ర కళను, గంగను దాల్చి, శరీరములో సగము భార్య కొసఁగియుండుట ప్రసిద్ధము.)

179 మధువ్రతమా ! తుమ్మెదా ! ఏఁచన్ = బాధింపఁగా; విరాళింబడు = విరహావస్థలో నున్న; నారుతము = ఆర్తధ్వనిని - నామొఱను; ఆలింపవు = వినవు; చారు...తమా = మనోజ్ఞమగు పరిమళముతోఁ గూడిన దానా ! చిఱుతమారుతమా = పిల్లవాయువా !

180. జోహారు = నమస్కారము. సమీర...లార ! = మలయ మారుత చంద్రులారా ! మంటమారి = బాధించువాఁడు (ఎదుటి వచ్చ యోర్వలేని వాఁడు); శంబరారి = మన్మథుఁడు. గోహారు సేయ నేల ? = బాధింప నేల ? ఇఁక , కాఁకలు రేఁచినన్ = నాకు తాపము హెచ్చింపఁ జేసినచో; భుజం...మాన = శివునిపాదముపై నొట్టేసరి. (భుజంగహార విశేషణమున శివుని యాభరణము లగు పాములు గాలి నాహరించు ననియు, సర్పరూపి యగు రాహువు చంద్రుని మ్రింగు ననియు ధ్వనితము.)

181. విమలాత్ముఁడున్ = పవిత్ర స్వభావుఁడును; మధు...భేది = మధు వను రాక్షసునిగొప్పబలమును నశింపఁజేసినవాఁడు; లోకావనుఁడు = లోకరక్షకుఁడు—విష్ణువు; పట్టి = కుమారుఁడు; మధు . లందున్ కూడి = వసంత, చంద్ర, వాయువులలోఁ జేరి—వారితోఁ గూడి యనుట. లోకావళిన్ = లోకులగుంపులను; ఏఁచ నేల? = బాధింప నేల ? విరహార్తులు = విరహముచే బాధపడువారు; హాళాహళి = ఆర్భాటము; హాలాహాలి ముందఱన్ = శివునియెదుటను.

182. మన్మథుని నిందించు నీ పద్యమున ఆతని మేనమామ యగు చంద్రుని చెడ్డగుణములు— మేనమామ పోలిక ననుసరించి వచ్చిన వని చెప్పఁబడినది. ఆ గుణములు శ్లేషమూలమున సమర్థింపఁబడినవి. కావున నీసపాద

ములు నాలుగింటను నింద, మన్మథపరమగు నర్థము, చంద్రపరమగు నర్థము— మూఁడును కూర్పఁబడినవి.

(1) (నింద) కర...కలనక్ = చేతియందలి కత్తియొక్క (మండలాగ్ర మనఁగా కత్తి) కలిమిచేక్—కత్తిని ధరించి యనుట. భాస్వద్ద్విజావళిక్ = ప్రకాశించు బ్రాహ్మణుల గుంపును; పాఱఁదోలిన = పరుగిడునట్లు వెంటఁ దఱిమిన; తులువవు = నీచుఁడవు;

(మన్మథప.) కర...కలనక్ = చేతియందలి (చిగురుటాకు) కత్తి కలిమిచే—చిగురా కను ఆయుధమును ధరించి యనుట. భాస్వద్ద్విజావళిక్ = ప్రకాశించు పక్షుల (చిలుకల) గుంపును—చిలుకవాహనముల ననుట. పాఱఁదోలిన = పరుగిడువట్లు ప్రోత్సహించిన; తులువవు.

(చం. ప.) కరమండల+అగ్రికకలనక్ = కిరణసమూహముల మొనల పోటులచే; (కరము నందలి కత్తులతో ననియుఁ జెప్ప నగును) భాస్వ...ళిక్ = సూర్యుని పక్షులగు చక్రవాకముల గుంపును. (చక్రవాకములకు పగలు సంయోగము, రాత్రి వియోగము. కావున నవి సూర్యుఁ డభిమానించు పక్షులు) పాఱఁదోలిన = తఱిమిన; తులువవు.

(2) (నింద) నెమ్మిక్ = ప్రేమతో; మేటిగురునికిక్ =గొప్పవాఁడైన తండ్రికి; ఎగ్గు, ఒపరించు కుమతివి = అపకార మొనర్చు చెడ్డవాఁడవు.

(మ. ప.) నెమ్మిక్ = నెమిలిపై; ఎక్కుఁడు గాఁగక్ = వాహనముగా; నమ్మి...మేటి = నమ్మిన గొప్పవాఁ డగు కుమారస్వామియొక్క; గురునికిక్ = శివునకు; ఎగ్గొనగించు కుమతివి.

(చం. ప.) నెమ్మిక్ = వాత్సల్యముతో; గురునికిక్ = బృహస్పతికి - (అతని భార్య నపహరించి యనుట.)

(3) (నింద) మిత్త్రుఁడు = ఆప్తుఁడు; ధామంబు = ఇల్లు; (మ. ప.) మిత్త్రుఁడు పడినంతక్ = సూర్యుఁ డస్తమింపఁగా, ధామంబుక్ = ఇంటిని - ఇల్లాండ్రను - యువతులను; (సూర్యాస్తమయము కాఁగా యువతు లలంకరించుకొని సవిలాసముగా నుండు రనుట.) (చం. ప) మిత్త్రుఁడు పడినంతక్ =

సూర్యుఁ డ స్తమింపఁగ నే; ధామంబున్ =అతని తేజస్సును; (సూర్యుఁ డున్నంత సేపు చాటున నుండి. అతఁ డ స్తమింపఁగ నే—అతని తేజస్సు నపహరించి చంద్రుఁడు వెల్గు ననుట.)

(4) (నింద) తమ్ములన్ = సోదరులను; పాద...రించి = కాళ్లతోఁ దన్ని; అలమి = ఆక్రమించి; ఇంటఁ గనిపించు=ఇంటిని నాక్రమించు; ఖలుఁడవు. (మ. ప.)తమ్ములు + అన్ = తామరపువ్వు లనెడి; మిగులన్, బాదు + అమ్ములన్ = బాదునట్టి (కొట్టునట్టి) బాణములతో; కారించి = బాధించి, ఆలమి=ఆక్రమించి; ఇంట...డవు = ఇంటిలోఁ బ్రవేశించి యువతీయువకు లను బాధించు నీచుఁడవు. (చం. ప.) తమ్ములన్=పద్మములను; పాదములన్= కిరణములతో; కారించి=బాధించి (పద్మములకును, చంద్రునకును విరోధము.) అల మింటన్=ఆ యాకాశము పై; కనిపించు ఖలుఁడవు.

కటకట! అయ్యో! వియోగిలోకంబు = విరహుల గుంపు; కటకట పడన్ = బాధనొందఁగా; అనలశరములన్ = అగ్నివంటి బాణములచే; - (ననల శరములన్ = పూలబాణములచే ననియు అర్థము.) మాకుమార! = లక్ష్మీకుమారుఁడ వైన మన్మథుఁడా!

183. విన్=వినుము; విరహార్తుల పైన్ = వియోగముచే బాధపడు వారి పైని; ఖరవృత్తిన్ =కఠిన పద్ధతిని; చూపఁదగ నే?= చూపుట న్యాయమా?— కా దనుట. అల్కన్ = కోపముతో; మరంద...ములు = మకరందముతోఁ గూడి, పింజెలు గల పూవుటమ్ములు, చెఱకువిండ్లు; పూని=వహించి; అనంగ! = మన్మథుఁడా! - (శరీరము లేనివాఁడా!) శరీరము=మా దేహము; ఖల మౌ నని=చిల్లులు పడి చెడిపోవు నని; కానక=గ్రహింపక; ఇటు... చేసెదు ?= ఇట్లేల కొట్టి బాధింతువు? అయో! = అయ్యో! శరీర...టన్నది = శరీరమే ముఖ్య మగు ధర్మసాధన మనెడి మాట; (నీ వనంగుఁడవు; కాన ఇతరుల నా శ్రయింపవలసిన వాఁడవు; అట్టినీ వితరుల శరీరములనే నశింపఁ జేసిన - నీకే ఆధారము లేకుండ పోవు నని భావము.)

184. (ఈ పద్యమున మన్మథునికిని తురుష్కునికిని అభేదము చెప్పఁ బడుచున్నది.) చిడిముడి పాటునన్ = కోపపు తొందరలో; చెఱకు సింగిణిఁ

బూని = (మన్మ. పక్ష.) చెఱకువింటిని ధరించి, (తురు. పక్ష.) చెఱ పెట్టుటకై - స్వాధీనము చేసికొనుటకై విల్లు ధరించి; మధుప్రియశ్వము, ఏర్పడన్ = (మన్మ. పక్ష.) వసంతర్తువుతోడి మైత్రి కలుగఁగా; (తురు. ప.) మద్యప్రీతి కల్గఁగా; వడి లావు లున్న హరిపైని = (మన్మ. పక్ష.) వడిన్ లావు లున్న = రెక్కలున్న; గుఱ్ఱము పయి-చిలుకవాహనముపై; (తురు. ప.) వేగమును బలముసు గల గుఱ్ఱముపైని; చివుక్కన నెక్కి=తటాలున నెక్కి; ఉక్కునన్ = బలముతో; తమిన్ = ప్రీతితో, చంద్రున్, చూచి, (సందుఁ జూచి యను పాఠమున సమయము చిక్కించుకొని యని యర్థము. అది చంద్రుఁ జూచి యను నర్థమునను సరిపడును.) ఇదెగో=ఇదిగో; వధ .. పూఁడు = చంపునట్టి పూనిక అని చంద్ర. పక్షము. ఇదె! గోవధమాచరించు; పూఁపు=పూనిక యని తురుష్కపక్షమునను అర్థము. అడరఁగన్ = కలుగఁగా; వెడలెదు = బయలుదేరెదవు. (తురుష్కులు బక్రీదు దినమున చంద్రుని దర్శించి, గోవధ చేయుట పరిపాటి, అది యిందు ధ్వనితము) (ఈ కారణమున) మనోభవా= మన్మథుఁడా ! నీవు; పాంథులకున్ = దారిపోవు వారికి (తు. ప.) విరహులకు (చం. ప.) కచ్చి తురకాదువు = (చం. ప.) కఠినుఁడ వౌదువు; (తు. ప.) దయలేని కఱకు తురకౌదువు.

185. విశ్వంభరరాజంభారి = భూదేవేంద్రుఁడు - రాజు; ఉపాలంభంబు, ఒనరించి=నిందించి; వనరాశిమధ్యంబునన్ = అడవినడుమ; (సముద్రమధ్యమున అని మందరపక్షమున.) మరున్ని...తుండై = (రాజుపక్షమున) చల్లగాలిచేతను, చంద్రకిరణములచేతను భ్రమింపఁజేయఁబడినవాఁడై; (మందరపక్షమున) దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు హస్తములచే త్రిప్పఁబడినవాఁడై; అతను .. తుండై = (రాజుపక్షమున) మన్మథునియొక్క వాఁడి బాణములగుంపుచే క్షోభపెట్టఁబడినవాఁడై; (లోభిపక్షమున, విస్తారమైన దుష్టయాచకులగుంపుచే కలఁత పెట్టఁబడినవాఁడై; మధు .. పాళియై=(రా. ప.) మద్యముచే స్వాధీనముచేసి కొనఁబడిన మంచిదైన మనస్సు కలవాఁడై; (కొలనుపక్షమున) తుమ్మెదలచే ప్రకాశించు పుష్పసమూహము కలవాఁడై; విరాళిన్ = విరహముచే; తూలి=స్వాధీనము తప్పి.

186. (ఈ పద్యమున అర్థాంతర మగు రాజవృత్తాంతము కూర్పఁబడినది.) ఇనుఁడు=సూర్యుఁడు, ఒక ప్రభువు; ఉద . గొని = ఉదయ పర్వతమును సహాయము చేసికొని, ఉదయగిరి యను ప్రదేశమును ఆసరా చేసికొని; సంజను మట్టడింపఁగాన్ = ప్రాతస్సంధ్యను ఆక్రమించుటకై, సంజ యను స్థలముపై దాడివెడలుటకై; ఇపుడె; పనిచి=అరుణుని నియోగించి, తగినవారిని నియమించి; రయంబుతోడన్=వేగముగా; అస...లేర్చి=జేసి (సప్త) సంఖ్యగల వేగవంతములగు గుఱ్ఱముల నేర్పఱచుకొని, సాటిలేని వేగము గల గుఱ్ఱములను కూర్చుకొని; తాన్ = సూర్యుఁడు, ప్రభువు; దాడిన్, ఒనరిచెన్; ఓటమిన్=అపజయము కారణమున - బయటన్, ఉండక; పొమ్ము-దూరముగాఁ బొమ్ము; అని, వేగుఁ...గతిన్ = సమాచారమును (చంద్రునకు) తెల్పుటకు వచ్చిన విధమున; వేగుఁజుక్క; పొడిచెన్=ఉదయించెను; రాజును=చంద్రుఁడు, పరరాజును; పశ్చిమాద్రికిన్ చనెన్ = (చం. ప.) క్రుంకెను. (రా. ప.) పడమటికొండ చాటునకుఁ బోయెను.

187. (ఈ పద్యమునందు చంద్రాస్తమయము మారీచుఁడు సముద్రముఁ బడుటగా వర్ణితము) ఇనుఁడు, అర్కన్, రాముఁడు = సూర్యుఁ డనెడు రాముఁడు; ప్రేమన్ = ప్రీతితో; సార...జొచ్చి = (రాముని పక్షమున) ఉత్తమమగు సవనము (యాగము)ను నెఱవేర్పఁ బూనుకొని, (సూర్యపక్షమున) సారసముల (కమలముల) సమూహమును వికసింపఁజేయఁబూనుకొని; మించిన= అతిశయించిన; సంధ్యా...ధారలు = (రామ. ప.) సంధ్యాకాంతి వంటి కాంతిగల రక్తధారలు. (ఆకాశమునుండి మారీచుఁడు కురియు రక్తధారలనుట.) (సూ. ప ) ప్రాతఃసంధ్యాకాంతివంటి యెఱ్ఱని కాంతులు; ప్రవర్షింపంగన్ = కురియఁగా; (తూర్పుదిక్కున ఎఱ్ఱని కాంతులు వెలయఁగా ననుట.) సమయన్ = ఆరక్తధారలు నశించుటకు; వాయవ్యాస్త్రము = వాయుదేవతాకమైన బాణము; కరంబు అనువందన్=చక్కఁగా; వింటన్ = వింటియందు; నిగిడించుచోన్ = సంధించి, కొట్టఁగా; ఉద్వృత్తిన్ = గొప్పగా (వేగముగా) వెన్కొనన్ = వెంబడింపఁగా; (దానికి) మారీచ...కుండు = ఒకపుడు మృగరూపము దాల్చిన మారీచుఁ డనెడి రాక్షసుఁడు; అంబురాశిన్=సముద్రమున;

పడెన్-(అని రామపక్షము.) వింటన్ = ఆకాశమున; కరంబు = కిరణములు (జాత్యేకవచనము) అను వందన్ = బాగుగా; నిగిడించుచోన్ = వ్యాపింపఁ జేయఁగా; సమయ...స్త్రము = సమయమనెడి వాయవ్యాస్త్రము; ఉద్వృత్తిన్=తీవ్రముగా; వెన్నొ(వ్వ)నన్ = వెంబడింపఁగా; మారీచనిశాచరుండు, అనన్ = మారీచరాక్షసుఁడో యనునట్లుగా (ఉత్ప్రేక్షాలంకారము) మృగాంకుఁడు=చంద్రుఁడు; అంబురాశిన్, పడెన్ -(అని చంద్రాస్తమయ పక్షము.) (ప్రాతస్సమయమున సూర్యోదయ, చంద్రాస్తమయము లిట వర్ణింపఁబడినవి.)

188.' (ఇందు చంద్రాస్తమయమునకును అరాజకదేశమునకును అభేదము వర్ణింపఁబడినది.) ద్విజకులమ్ముల కూఁతలు = పక్షుల కలకలధ్వనులు (చంద్రాస్తమయ ప.) బ్రాహ్మణుల మొరలు (అరాజకదేశ ప.) దెసలన్ = అన్ని దిక్కులందును; ఎసఁగెన్ = వృద్ధి పొందెను. సద్గణతేజముల్=నక్షత్రముల కాంతులు (చంద్రా. ప.) సత్పురుషుల ప్రభావములు (దేశపక్ష.) ఇంకెన్ = తగ్గెను; పంకజాతము=కమలము (చంద్రా. ప.) పాపముల గుంపు (దేశపక్ష.) విజృంభించెన్=అతిశయించెను; కువలయంబు=కలువ (చంద్రా. ప.), భూమి (దే.); పడెన్; అరాజకంబు ఐనయెడలన్ = చంద్రుఁడు లేనియెడల (చంద్రా.ప.) రాజు లేని యెడల (దేశ.) అట్టులు, అగుఁగా=అట్లే యగును కదా!

189. ఇందు సూర్యుఁడు-ఇనుఁడు, మిత్రుఁడు, విభావసుఁడు - అను శబ్దముల మూలమున ప్రభువుగను, హితుఁడుగను, అగ్నిగను రూపింపఁబడు చున్నాఁడు.) కొలఁదిగన్ = తగురీతిగా; చక్ర...గలయట్టి—చక్రకైరవద ళంబులన్; జలంబలవడఁగూర్పన్, చకోరసరోజదళంబులన్, జలంబలవడ విప్పన్ - గలయట్టి-అని సమన్వయము. చక్రదళంబులన్ = చక్రవాకముల గుంపును - చక్రవాకముల జంటలను; జలంబలవడన్ = ప్రేమరస ముదయించు నట్లు; కూర్పన్ = (విడివడి యున్నవానిని జతకూర్చుటకును. (చక్రవాకములకు రాత్రి వియోగము, పగలు సంయోగము నని ప్రసిద్ధి.) కైరవదళంబులన్= కలువరేకులను; చలంబు అలవడన్ = మచ్చర మేర్పడఁగా; కూర్పన్ = ముడుచుకొనఁజేయుటకును; చలంబు = మచ్చరము; అలవడన్, చకోరదళంబు

లన్ = చకోరదంపతులను; విప్పన్ = విడఁదీయఁగను; జలంబలవడన్ = ప్రేమరస ముదయించునట్లుగా; సరోజదళంబులన్ = తామరపూవు రేకులను; విప్పన్ = వికసింపఁజేయఁగను; కలయట్టి = సమర్థుఁడైన-యనుట. (సూర్యునికిని చకోరక్షైరవములకును విరోధము; చక్రసరోజముల కాతనితో మైత్రి.) ఇనుండు=సూర్యుఁడు; (ఇనుఁ డనఁగా ప్రభువు. కావుననే 'దళము' లనఁగా - సేనలను కూర్చుకొనుటకును, పరసేనలను చెదరఁగొట్టుటకును సమర్థుఁ డని వ్యక్తము.)

అల, చందమామకున్, అర్మిలిన్ = ప్రీతితో; కరము=కిరణము; ఇచ్చి (శుక్ల పక్షమున); పుచ్చుకొను=(కృష్ణపక్షమున) మఱలఁ దీసికొను; మిత్రుఁడు= సూర్యుఁడు. (సూర్యుఁడు శుక్ల పక్షమున అభివృద్ధికరముగా తన కిరణముల నిచ్చి, కృష్ణపక్షమున మఱలఁ దీసికొను నని ప్రసిద్ధి.) (మిత్రుఁడు కావుననే యిచ్చి, పుచ్చుకొనుచుండువాఁ డని వ్యంగ్యము.)

చీఁకటికానన్ = అడవివంటి దట్టమైన చీఁకటిని; నీఱుగా నలఁచు = రూపు లేకుండ నశింపఁజేయు; విభావసుండు = సూర్యుఁడు; (విభావసుఁ డన నగ్నియును కావుననే, కానన్=అడవిన్; నీఱుగాన్ = బూడిద యగునట్లుగా-ధ్వంసము చేయు నని వ్యంగ్యము.) (అట్టి) పతంగుఁడు = సూర్యుఁడు; ప్రాఙ్ముఖంబునన్ = తూర్పు దిక్కున; కనసయ్యెన్ = కానఁబడెను.

190. కాలోచితకృత్యంబులు = కాల్యకృత్యములను; నిర్వర్తించి = నెఱవేర్చి; చమూ...తుఁడై = సేనల సముదాయముతో -కూడుకొన్నవాఁడై; నరపాల పురుహూతుండు = రాజేంద్రుఁడు; నగరు = సౌధము

191. శృంగారములు = విలాసములు, కురుఁజులపైన్ = ఆఁట మంచెలమీఁద; గొండ్లి = నృత్యము; పణ్యాంగణములందున్ = అంగడివీధులలో; కందుగాన్ = గుంపుగాఁజేరి; పుణ్యాంగనల్ = ముత్తయిదువలు; ముత్యాలసేస = ముత్యాల అక్షతలు; అవరోధకామినుల్ = అంతఃపుర కాంతలు; సోరణగండ్లన్ = గవాక్షములనుండి; వందిమాగధులు = స్తోత్ర పాఠకులు; హృద్యభాషణములన్ = మనోహరములగు మాటలచేతను; గడల ఫౌఁజుల రొదలు = గడలు ధరించిన సేనల కలకలములు; ఇరుగడలన్ =

రెండుప్రక్కలను; దొరలన్ = ప్రభువులను; మన్ననల్ గోరలన్ = మర్యాదలు కల్గఁగా; అనిచి = పంపివైచి; పడి నిగుడన్ = వేగ మతిశయింపఁగా; తేజిన్ = గుఱ్ఱమును; అరిగెలెత్తన్ = బిరుదుచిహ్నములగు ధ్వజములను పట్టఁగా; మహీభర్త = రాజు.

192. కొలువుసింగారము = రాజచిహ్నములతోడి అలంకారమును; ఎడలించి = తీసివైచి; ఉడిగంపుఁగుంభస్తనులన్ = సేవకురాండ్రను; జలకంబున్, పట్టుఁడు = స్నానము చేయింపుఁడు. (జలకముపట్టువారు కావుననే ఆ యువతుల 'కుంభస్తనులు'గా చెప్పుట చమత్కారము.)

193. నీలకుంతల = నల్లని కురులు కలది. అటకలి = కుంకుడుకాయపులుసు, సీకాయపొడి మున్నగు జిడ్డును పోఁగొట్టు ద్రవ్యము. జలకమార్చెన్ = స్నానము చేయించెను; పుత్తడిబొమ్మ యైన యువతి; చెలువౌ చలువలు = అందమైన వస్త్రములు; విరులు = పూవులు; సికతాయతనితంబ = ఇసుకతిన్నెలవంటి పిరుదులు గల యువతి; విధూపమాస్య = చంద్రునిబోలు ముఖముకలది; తొడవులు = నగలు.

194. శిరసుమజ్జనము = తలంటి స్నానము; ఆరోగిణము = భోజనము; మెట్టి = తొడిగి.

195. తెలనాకు = తమలపాకు; బాగాలు = వక్కలు: బాగాలు = బాగు+ఆలు = ప్రియసతి—చిత్రాంగి యనుట.

196. తొంటిచందానన్ = వెనుకటి విధమున; మెలఁగు = తిరుగుచున్న; అలబలము = సందడి; పొలకువ = జాడ; విన్ననై = చిన్నబోయి;

197. తాన్ = చిత్రాంగి; ఎపుడున్ = నే నింటకు వచ్చినపుడెల్లను; వాలిక మెఱుఁగుంజూపు = వెడల్పై అందమైన చూపును; నివాళిగన్, ఒసరించి = హారతిగాఁజేసి; ఆలింగనమున్, చేయును = కౌఁగిలించుకొనును; ఏమో! = ఏ కారణమో! అలిన్, కనము = భార్యను (చిత్రాంగిని) కానము:— చిత్రాంగి కానరా కున్నది.)

198. అరుదెంచి = వచ్చి; అరుదు+ఎంచి = తీరును గనుఁగొని; మదిన్ = మనస్సులో; విభ్రాంతుఁడై = విభ్రాంతిపొందినవాఁడై; తహతహ

తోఁ = త్తఱపాటుతో; దరియంగ నరిగి = ఆమెసమీపమునకుఁ బోయి; శాతోదరియంగంబు = చిత్రాంగిశరీరము; దయ దయివాఱన్ = దయ అతి శయింపఁగా.

199. లతాంగి! = తీఁగవంటి మేను గల చిత్రాంగీ! హంసతూలికా తల్పము, అనల్పమే? = తక్కువైనదా?...సరికాదా? కడఁద్రోచి = దానిని త్రోసిపుచ్చి—కాదని; వెలఁగఱవుసేయు = వెలలేనివైన: కౌశేయములు = విలువైన పట్టుచీరలు; ఊన మగు మైల = వెలతక్కువైన మఁఆికివస్త్రము; ఊన నేల? = ధరింప నేల?

200. కుతుకంబునన్ = వేడుకతో; మయిన్ = శరీరమున; లేప మొనర్పవు = పూసికొనవు; ఒఱపుగాన్ = అందముగా;

201. ఎలనాగ = యువతి; ఉద్ది = సాటి; నంటు = స్నేహము;

202. పోటుటీఁగ = మగఝూఁగ; పొలయుంగన్ = ప్రవేశింపఁగా; ఆనఁజేసి = ఆజ్ఞవలన; ఎగ్గు = హాని—అపరాధము; అలక = కోపము, భయము.

203. మంతురుల్ = మంత్రులు; బాంధవ...సాళి = బంధువులనెడి రాజహంసల గుంపు:—బంధువులగు రాజులనెడు హంసలగుంపు; అడుగు... లొత్తున్ = నీ కెక్కువ సేవచేయును; పూజ్యులగువారు నడచు చుండునపుడు వారి యడుగుల క్రింద వస్త్రములు పఱచుట సంప్రదాయము—కావుననే 'అడుగులకు మడుగులొత్తుట' అనుటయే యుచితము.) అండజవరయాన = హంసనడకలవంటి నడకలు కలది; బెగడి = బెదరి; (అండజము—పక్షి (గరుడుఁడు); కావున పాము బెగడుట యుక్తము.) కమలపాణి = పద్మముల వంటి హస్తములు కలది; (కమలపాణి లక్ష్మి. కావుననే బ్రహ్మకును సమీపింప శక్యము కా దని చమత్కృతి) నీవనకున్నన్ = కొదువ లేదని నీవు నోరార చెప్పకున్నను;

204. తెలియన్ = తెలిసికొనుటకు-పరీక్షించుటకు; అలిగితో?=కోపించితివా? -ఇది ప్రణయకలహమా? యనుట. అలరున్ విల్తుండు = మన్మథుఁడు.

205. డగ్గఱి = సమీపించి; (పాముసకును, నూఁగారునకును పోలిక; పామునుబట్టి ప్రమాణము చేయవచ్చు ననుట. ఇట్లే తక్కిన పాదములందును పోలికలను ప్రమాణములను గ్రహించునది.) ద్విజరాజు = చంద్రుఁడు; (ముఖమునకు పోలిక.), ఉత్తమబ్రాహ్మణుఁడు; హరి = సింహము (కౌనునకీడు), విష్ణువు; తమ్ములు = పద్మములు (కన్నులకుఁబోలిక), కనిష్ఠసోదరులు; (చిన్నవారిని దాఁటి ప్రమాణము చేయుట కలదు.) అప్రతి=సాటిలేనిది; ధర్మము = విల్లు (కనుబొమలకు సాటి), ధర్మకార్యము: ఇచ్చకము = ముఖప్రీతికై ఆడిన మాట. వలరాజు = మన్మథుఁడు.

206. కడుఁదియ్యనౌ = మిక్కిలి మధురమైన: నీదువాతెఱకును = పెదవికి; ఉప్పు . లప్పులు = ఆవిరి పోకుండ ఉడికించి చేసిన చక్కెర మిఠాయిలు:—(ఉప్పగా నుండునవి యని యర్థాంతరము) ఈడే?=సమానమా? చేఁదువగగల=చేఁదుటయనెడి శ్రమతోఁగూడిన (చేదైనయని యర్థాంతరము) అమృతంపుఁజెలమ = అమృతపు ఊట గల గుంట; ఎనయో? = సాటియా? పుల్లనుండెడి = పుడకను ఆధారముగాఁ జేసికొని యున్న (పుల్లగానున్న అని యర్థాంతరము.)

207. (ఇందు పెదవికిని దొండపండునకును పోలిక) అతిసమ్మోహమొనర్చుటన్ =(పెదవి ప.) ఎక్కువ కామమును కలిగించుటలోను (దొండపండు ప.) ఎక్కువ మూఢత్వము (మాంద్యము) ను కల్గించుట లోను; అతి ...నలరించుటన్ =(పెదవి ప.) మిక్కిలి మాధుర్యము చిలుకునట్లుగా సంతోషపెట్టుటలోను; (దొండపండు ప.) మిక్కిలి మాధుర్యముచే చిలుకను సంతోషపెట్టుటలోను; ఓలతకూన! = లతాంగివైన ఓ చిత్రాంగీ! నీదు మోవికిన్= నీ పెదవికి, ప్రతి = సాటి; బింబమె కాక = దొండపండే కాని; ప్రతిబింబము = దానింబోలు వేఱొక వస్తువు; ఇలన్, లేదు.

208. దివ్యామృతంబు=దేవతలదైన యమృతము. (మోవి యమృత సమాన మనుట.) దుర్గాధిపత్యంబు = దుర్గములు స్వాధీనమగుట. (కుచములు దుర్గములవలె ఎత్తైన వనుట.) భూలోక...నలుల ప్రపంచమంతయును నేలినంతటి

యానంద మనుట. (కటిప్రదేశము భూమండలమువలె విశాలమనుట.) నీవి = పోకముడి (నిధి యని యర్థాంతరము - పోకముడి నిధివంటి దనుట.)

209. కుటిలాలక! = ఉంగరములు తిరిగిన ముంగురులు కలదానా! నీగుబ్బలు = నీకుచములు; బటువులయి = గుండ్రనివై; మొగానికెనయుచున్ = ముఖమునకుఁ దాఁకుచున్నట్టున్నవి; (చెండ్లను పట్టి యాడుటయు, స్తనములను పట్టి యానందించుటయుఁ స్వభావము.)

210. మదవతీమణి! = వనితారత్నమా! - చిత్రాంగీ! నీవట్రువ... పొలిండ్లు = గుండ్రనై, తళుకు లీనుచు పొంకములై, ఇఱుకుగా (మధ్య నెడము లేక) అందములై యున్న స్తనములు; రాలతో...గదమె = (ఇది జాతీయము) రాళ్లవలె కఠినముగా నున్న వనుట.

211. నీ రేజ పత్రేక్షణా! = తామరపూవు రేకులవంటి కన్నులు కలదానా!

212. ఒసపరి...ల్బంతీ! = అందకత్తెల సమూహములో మేటి యైనదానా!

214. అగ్గజగామినియలుక = ఆ చిత్రాంగి కోపమును; అర్పన్ = పోఁగొట్టుటకు; తరము = సాధ్యము.

215. నతిన్ = నమస్కారమును; కైకొని = గ్రహించి; అనతి = ఆజ్ఞ; చిత్తం బూనిన కపటము = మనస్సులో నిర్ణయించుకొన్న పెద్ద యాలోచన, నెఱపం బూనిన దైన్యము = నెఱవేర్పఁదలఁచిన దైన్యము, బూమెలు= మోసములు.

216. ఒడలు = శరీరము; నసివాళ్లువాడన్ = మిక్కిలి వాఁడి పోఁగా; పెడయూర్పు నిగిడ్చి = పెద్ద నిట్టూర్పు పుచ్చి; మెల్లనె = మెల్లఁగానే; కరాంబుజము ఊఁది లేచి = చేతి నానుకొని లేచి; బడిబడి = మాటి మాటికి; బుడిబుడి యేడుపులు = కల్ల బొల్లియేడుపులు; ఎసంగన్ = ఒప్పఁగా.

217. నిబ్బరికము వీడియును = దయమాలి—న నొంటరిగ విడిచి యనుట. నీవర . పోవన్ = నీవడవికి వేటకుఁ బోఁగా; ప్రొద్దు గడపలేక= కాలము గడపలేక.

218. సూరెలన్ = ప్రక్కభాగములందు; ముది...గారన్ = ముదురు వెన్నెల చక్కఁదనము వెల్లివిరియుచుండఁగా; పాము...మెఱుఁగుల్ = పాము కన్నులఁబోలు మిలమిల కాంతులు; పారువము = పావురము, వెఱఁగు పడి = ఆశ్చర్యపడి.

219. రింగుల వల్లెవాటు = కుచ్చిళ్లు పెట్టిన ఉత్తరీయము; మృగనాభి నించి = కస్తూరి పూసికొని; నేమము దొఱంగు నుదిన్=నీతిమాలిన యాలోచనతో; కొంకు మీఱన్ = భయ మెక్కుడు కాఁగా; తొలంగి = తప్పుకొని; వీన్ కడకు రాన్=నేను బయటికి రాఁగా; రాగనిమగ్న చిత్తుఁడై = మోహమున మునిఁగిన మనస్సు కలవాఁడై.

220. నలువ = బ్రహ్మ; చొక్కపుఁగొప్పు = అందమైన కొప్పు.

221. వయః..యత్తుఁడు = యౌవనపు పొంకమున గర్వించిన వాఁడు; చిత్తజ...చిత్తుఁడు = కామవికారము అడ్డరాని మనస్సుకలవాఁడు; మరులుననుజేరి = వలపుతో సమీపించి, చీరి = పిలిచి; మత్తుఁడు = మదించినవాఁడు; మాన...వృత్తుఁడు = గౌరవము నీతి లేని ప్రవర్తన కలవాఁడు.

222. వనిత ! = యువతీ ! ఘనముగన్ = గొప్పగా - పెద్దవిగా; లావణ్యము = తళుకు - ఉప్పన; వానిపులుసు = ఆ గజనిమ్మపండ్ల పుల్లఁదనము, గర్వము; విఱుఁగున్ = నశించును. (ఉప్పు తగిలినచో పులుపు విఱిగిపోవుట స్వభావము.)

223. తలతలమను = తళతళప్రకాశించు నట్టి; తలతలమనునట్టి = తొలఁగిపొమ్మనునట్టి - తిరస్కరించునట్టి; రదనతతి = దంతములవరుస.

224. కలికితనము = మనోజ్ఞత; బిబ్బోకశ్రీకిన్ = శృంగారవిలాస సంపదకు; నాళీకముఖి ! = పద్మముఖి !

225. నెమ్మేను = చక్కని నీదేహము; గంధవహము = కమ్మని పరిమళము కలది. (మలయ మారుతము - అని అర్థాంతరము) కళానిధి = కళలకు నిలయము. (చంద్రుఁ డని అర్థాం.) నడుము = మధ్యము. అనంగకలితము = అవయవములు లేనిది - శూన్యము. మిక్కిలి సన్నని దని అర్థాం.)

కెమ్మోవి = ఎఱ్ఱని పెదవి. మధువు = తేనె. (మధురమైన దని అర్థాం.) ఎటులోర్తుక్ = ఎట్లోర్వఁగలను ? కామోద్దీపకము లగు మలయమారుత, చంద్ర వసంతాదు లొక్కుమ్మడి బాధింపఁగా సహించుట కష్ట మని భావము.

226. ఘనము=గొప్పది (మేఘ మని అర్థాం. మేఘముతో కొప్పు నకు సామ్యము.) కొండ = గొప్పది. (పర్వత మని అర్థాం. దానితో స్తనము లకు సామ్యము.) గగనము గొప్పది (ఆకాశ మని అర్థాం. దానితో నడుమునకుఁ బోలిక.) బంగారు=అపురూపము, (స్వర్ణ మని అర్థాం. బంగారుతో శరీరమునకుఁ బోలిక.) కొనఁగోర నివురుట - మున్నగు క్రియలు క్రమముగ నాల్గుపాదము లందలి యవయవములయెడ సహజములు.

227. కేలు = చేయి. నెగులు = మనోవ్యథ. మిట్టి = మిడిసిపడి. చెనంటి = దుష్టుఁడు.

228. శుద్ధాంతము = అంతఃపురము.

229. నఖములు=గోళ్లు. వ్రచ్చెక్=చీల్చెను. ముంజేతి... మేల? = ప్రత్యక్షముగఁ గానవచ్చుదాని కింకొక సాక్ష్య మేల ?

230. ఆఖండల ..బోలి = ఇంద్రుని చేతిలోని వజ్రాయుధపు నాదరచే చీల్పఁబడిన కొండల కావరణ (ఆచ్ఛాదన) మైన మబ్బును పోలిన .

231. కుమ్మెలువోయిన = దెబ్బలు తగిలి పగుళ్లువాఱిన; బంగరు... యెమ్మెక్ = బంగారు బొంగరముల తీరును; కడకుఁ బొమ్మను = తిరస్కరించు నట్టి. రేఖా...టమ్ముక్ =గోటిగీరతో కూడియున్న కడవలవంటి స్తనభాగమును. దిటమ్మునను = ధైర్యముతో, చూపి. డగ్గుత్తికతోక్ = గద్గదస్వరముతో.

232. ఇంతకుక్ = ఈ పాటికి, కీర్తిరాఁగక్ = ఉత్తమురా లనెడి పేరు కలుగునట్లు. త్యజియించెదక్ = విడిచెదను. అ దెంత ? = ప్రాణము తీసి కా దనుట.

233. కులాంగన = భార్య; రమించు = విహరించునట్టి; మించు మేడకుక్ = గొప్ప భవనమునకు, గొడవ = బాధ.

234. అస్నృతోదరి = కృశోదరి; అబద్ధాలపుట్ట; బెడిదంపు ..పిడెంబు = భయంకరముగ మెఱయుచున్న బాకు; ఒరవెళ్లన్=ఒరనుండి వెడలునట్లుగా; జరీన = తటాలున.

235. ఔౕన్ = అవును, ఇది సానిశ్చయ మనుట; తల = తలము. తొలఁగిపొమ్ము. ఔౕన్ = చాలును; తలవంపు = అవమానము; ఎచ్చోఁదల పెట్టక = ఎక్కడను తల చూపుటకు వీలు కానట్లుగా; ఆయెన్ = అయ్యెను; ఇచ్చోన్ = ఈసమయమున; తల పెట్టక = ఆలోచింపక - విచారింపక. చూతువు = నే నేమి చేయుదునో(గొంతు కోసికొందునో లేకో చూచెదవు గాక !)

236. మఱి = ఇఁక; బాములక్ = అపమానములకు; దుస్సి = లాగి; ఆయితము = ప్రయత్నము; ఉరియ = చేసురియ; ఆసాహసికురాలి చేతి చుర కత్తి; అనురక్తిన్ = ప్రేమతో; అనుక్.

237. సూనుఁడు = కుమారుఁడు; మోహము = ప్రేమ; అణుమాత్ర మధ్య = సన్నని నడుము కలదానా! వెత = విచారము.

238. బరవసంబుగాక్=నమ్మకముగా; మేరడించిన = హద్దుమీఱిన; మాటవాసి = పలుకుబడి; బద్ధగలవారు = వేత్రహస్తులు - బెత్తాలవారు; సంకోచించి = సందేహించి; విన్నకన్నసరణి = వినినపద్ధతి, చూచిన పద్ధతి. చెయ్యులు = చేష్టలు; కర్జంబు = కార్యము - చేయఁదగినది; విస్మయంబు = ఆశ్చర్యము; బహి...రతిబునన్ = బయలులో వ్రాయఁబడిన చిత్తరువులరీతిని; హాఁయనక హాఁరాయనక = ఇదిమంచి, ఇది చెడ్డ యనక; (సభ్యు లే యాధారము లేక ఉన్నవా రగుటచే బహిర్లిఖిత చిత్రాకారంబున నున్నవా రని చెప్పఁబడినది.)

239. పాతకంబు = మహాపాపము; నోరనుడువరాదకా=నోటితో పలుకరాదు; సరేకదా—

240. అలఘుప్రాభవ ! = గొప్ప దొరతనము కలవాఁడా ! ఈ కొలను = ఈ పాపముచే; సత్కుల...కుతారకున్ = ఉత్తమవంశ మను నదవికి

గండ్రగొడ్డలి యగువానిని; పఁజన్ = ఇఁకమీఁద; జబ్బుదాఁకున్ = బలహీనము లగుచు - ప్రజలు వానిని గౌరవింప రనుట.

242. తొడగిన = సక్తుఁడయిన; గొబ్బునన్ = వెంటనే; సంకోచము = సందేహము.

243. ఘనమనస్తాపము=గొప్పమనోవేదన; బయలుసేయంగఁదగదు = బయటికిఁ దెల్పరాదు; అను = అనునట్టి; నయము = నీతి; కలదు.

244. జవ్వనులు = యువతులు; మనోగతుల్ = అభిప్రాయములు. ఎంతటివారుకావలెన్ = మిక్కిలి ప్రతిభావంతు లయి యుండవలె ననుట.

245. ఇడుట = ఉంచుకొనుట; వెలిసనుట=బైటికి చెప్పుట. కపటంబు = మోసమే - అసత్యమే. అనృతోదరి = కౌను లేనిది - సన్నని నడుము కలది అసత్యములు కుక్షిలో కలది - అబద్ధాలపుట్ట.

246. అనిశక్రౌర్యము = ఎడతెగని క్రూరత్వము - (చూపులందు చురుకుఁదనము, ఉల్లమున క్రూరత్వము.) చూపులనె కాదు = చూపులందు మాత్రమే కాదు; కాఠిన్యము = (పాలిండ్లవిషయమున) గట్టితనము, (ఉల్లమున) దయలేకుండుట; చాపలము = (కన్నులయెడ) చంచలస్వభావము (ఉల్లమునెడ) నిలుకడలేమి; కౌటిల్యము = (ముంగురులపక్షమున) వంగియుండుట, (ఉల్లమువిషయమున) కుటిలస్వభావము; పేటాడుచునుండున్ = తాండవించుచుండును.

247. ఒసపరి = అందగాఁడు; తను పెక్కును = ద్రవించు ననుట. లజ్జాపదము = మర్మావయవము.

248. అలయుంగ్మలి = యువతి యగు నా చిత్రాంగి; నిలుపోవక = తమకముపట్టలేక; లోనుగామిన్ = లొంగకపోవుటచే; సెగలూని=కోపించి; ఘాలియింపఁగన్ = చంపించుటకు; కొండేనకున్ = కొండెమునకు - చాడీకి; ధర్మ... నేటికిన్ = ధర్మరాజులవంటి మీరుమాత్రము వానిని నమ్మ రని నా నమ్మక మనుట.

249. తెల్పిరదే = చెప్పఁగానే; నిజంబ కా = అది సత్యమే యని; దబ్బరసూ = అసత్యమేసుఁడీ!

250. చరవ = పాత్రము - కుండ.

251. ఏతస్మాత్తుఁడె? = సామాన్యుఁడు కాఁ డనుట. చేతో... జాతుఁడు = శివునికృపవలనం గలిగినవాఁడు; సుగుణాన్వితుఁడు = మంచి గుణములతో కూడినవాఁడు.

252. తొడిఁబడి = తొందరపడి; తునిమి తేని = సంహరించి నట్టియిన; కానలకున్ = అడవులకు; అడలుదువు = దుఃఖింతువు.

253. ఒరసి = నొక్కి; నుడువులకున్=మాటలను; ఉట్టూఁతలూఁగు= ఆందోళన మొందుచున్న.

254. అవుఁ గా దనఁగా = ఇది అవును-ఇది కాదు అని పల్కఁగా; అటమట మో = అసత్య మో.

255. నీళ్ల లోపలిముల్లు = తెలియ రానిది.

257. ఎన్నినప్రకారముననే = చెప్పిన విధముగనే; అన్నులు = స్త్రీలు. చప...త్తలు= మెఱుపులవలెనే మిక్కిలి చలించు స్వభావముకలవారు.

259. తనకల్ల = తానొనర్చిన అసత్యకల్పనము; మనము ఎల్లను = మనోగతాభిప్రాయమునంతను.

260. ఎడకన్ = ఎక్కడనైనను; చెల్లున్ = సరియగును! బెగడు = బెదరిపోవు; అఱడి = రట్టు; వింట = వినుట; నానుడి = లోకోక్తి.

261. నయవిదుఁడవు = నీతికోవిదుఁడవు; మదిరాక్షులు = స్త్రీలు; వేగిరంబు = తొందరపాటు; వెరవరికన్ = నేర్పరినిమాడ; పదరకుమీ= తొందరపడకుము; పదింబదిగన్ = నిదానముగా.

262. జనపతి = రాజు, అనిపి = పంపి.

263. నడిసన్న పెద్దవారలన్ = పేరుపొందిన తగుమనుష్యులను; కడఁకన్ = యత్నముతో; నుడువులవలననె = మాటలవల్లనే; పెట్టిపంపినన్ = పంపఁగా.

264. పఱచువారలు = చెడ్డవారు; సిబ్బితికాఁడు=సిగ్గుపడువాఁడు; బహుభాషి = అధికప్రసంగి; కినిసి = కోపించి; నొచ్చిననోటఁ బలుకఁడు =

పరుషవాక్యములాడఁడు! మేరమానిసి = మర్యాదకలవాఁడు; సాదు = మంచి వాఁడు; గోల = అమాయకుఁడు; దయ్యము = దైవము.

265. నొచ్చుచునుచున్ = బాధపడుచు; పనులజోకన్ = నగిషీ పనియొక్క అందమువలన; సొగసూను = అందమైన; అరాజసూనునగరికిన్ = సారంగధరుని సౌధమునకు; అవసరములవారు = పరిచారకులు.

266. మితపరిజనయుతుఁడు=తగుపాటి సేవకులతోఁ గూడినవాఁడు; ప్రసన్నాననుఁడై = ప్రేమతో వికసించిన ముఖముకలవాఁడై.

267. జనవల్లభుఁడు = రాజు. తగుల్ గలఁగువారలకై = ఆప్తమిత్రులకై; మనవుల్ ఘటింపఁగాన్ = విన్నపములు చేయఁగా; వెల్లదమ్ములన్ = తెల్లదమ్ములన్ = తెల్లతామరలను.

268. భూరమణుండు = రాజు; ఇనుమిక్కిలి = రెండింతలెక్కువ. అనురక్తిమైన్ = ప్రీతితో; ఏకతంబునన్ = రహస్యముగా.

269. వెఱచి = భయపడి; వెఱపక = భయములేక.

270. ఎదవడి = భయపడి; ఆదవదయై = చెదరిపోయి కల్లడపాటు = కలఁతపాటు; ఒదవఁగన్ = కలుగఁగా.

271. అవనీతలేశుఁడు = రాజు; అల్ల, వనీతలమునకున్=ఆ యడవికి; అంగజాలలు = కావలివాండ్రు; చలము = పట్టుదల; మొక్కలము = సాహసము; రాణివాసము = అంతఃపురము; తమకున్ = రాజుగారికి; అడలుచున్ = ఏడ్చుచు.

272. చెల్లరె = అయ్యో! పూఁపెనె? = మోపినదా? ఇట్టిరోఁత = ఇట్టి అసహ్యపుమాటఁ; వీనులను = చెవులను; ఇందుకున్ = ఇట్టిమాటకు.

273. మఱు .. చేసినన్ = కప్పిపుచ్చి చెప్పఁగా; ఆగ్రహింపందగునే? = కోపింపవచ్చునా?

274. అనుంగుఁదండ్రి = ప్రేమించుతండ్రి; పోనె? = పోవునా? = కాకుండునా? ఎరిన్ = ఎవ్వరిని; కల్లరిని = అసత్యవాదిని.

275. పొరపొచ్చెము లేక = అరమర లేక; ఏపట్లన్ = ఎప్పుడును.

276. కొండొకవిచారము = వే ఱగు నాలోచన; ఎఱుఁగమికిన్ = ఎఱుఁగ ననుటకు; మదనారి = శివుఁడు;

277. బొంకు = అసత్యము; రాజానుమతంబు = రాజు ంగీకరించినది-రాజు చెప్పినది. చందమే = విధమే.

278. శంకాతంకములు = సందేహమును, అభ్యంతరమును; మహీమండలవిభునితోడన్ = రాజుతో.

279. మండలపతి = రాజు; దండన=శిక్ష; ఉద్దండము= ఉగ్రమశిక్ష.

280. అన్నిటన్ = అన్నివిషయములందును; నడిపన్నవారు = పేరు పొందినవారు; నన్నున్; నడి నన్నవానిగాన్ = అపకీర్తి పోయినవానినిగా:-నిర్దోషిగా; ఒనర్చుటకున్ = చేయుటకు; తెలుపవలదొకో ?= తెలుపరాదా?-తెలుప వలె ననుట. దైవసన్నిధానమునన్ = దేవునియెదుట; పెట్టి = నిలిపి; నిజముసేయించి = ప్రమాణము చేయించి; పిదపన్=ఆ తర్వాతనే; మన్నింపు మనుఁడు=(తప్పు లేదని రూఢియైనచో) నన్ను క్షమింపవలె నని ప్రార్థింపుఁడు.

281. తారకా...గనుకన్ = దృష్టాంతపఱచినమీఁదట, ఆజ్ఞకున్= దండనకు.

282. కలది .. తెలుపు = ఉన్నది యున్నట్లు తెలుపుము: నీపైదే నేరము=నీదే తప్పు; జాణిఁగినఁ గాదు = జ ఱిగినఁ దప్పిపోదు; అని, ఆమెన్= చిత్రాంగిని; తెలుపన్ = యథార్థమును తెల్పుటకు; గట్టిగన్ = ఒత్తిడి చేసి; అడుగు మనుఁడు.

283 జగదీశ్వరుఘటనంబు = దైవసంకల్పము. ఇటు లనుఁడు = ఈవిధముగాఁ బల్కుఁడు అనిపెన్ = పంపెను.

284. దాక్షి...మూర్తి ! ఆశ్రితపక్షపాతమునకు గనియైన శరీరము కలవాఁడా ! షోడశ...దక్షా ! = పదునాఱు మహాదానములు మున్నగు పుణ్య కార్యములయెడ దిట్టయైనవాఁడా ! ఆశ్రిత...వీక్షా !=ఆశ్రితులను. దీనులను రక్షించుట యనెడు విద్యయొక్క భారమును వహించుటతోడి దయాదృష్టి కలవాఁడా ! శాశ్వతకీర్తి !=స్థిర మగు కీర్తి కలవాఁడా ! వైభవ...ధృతా ! =

ఐశ్వర్యసంపదతోఁ గూడిన చోళరాజ్యపుసింహాసనమునకు ప్రభువగువాఁడా! దుర్దను...కౌక్షేయకా! = లొంగని రాజుల కిరీటములను భేదించుటయందు దడ్డులేని కత్తి కలవాఁడా!

285. యాచనకవినుత! = యాచకులచే కొనియాడఁబడినవాఁడా! వనితా...రాంగ! = స్త్రీలకుఁ దనివితీరని అందమైన దేహము కలవాఁడా! శృంగార. హృదయా - శృంగారకళాసూచన = శృంగారకళను సూచింపఁ జేయుట; క్రమకవిత్వ = మధురకవిత్వమును చెప్పుటయందలి; ఆలోచన = యోచనలో; కందళిత = అంకురించిన; హర్ష = సంతోషముండు; లోలుప హృదయా! = ఆసక్తిగొన్న మనస్సుకలవాఁడా!

286. దుగ్ధ...కీర్తి! = పాలసముద్రమువలె ప్రకాశించు కీర్తి కలవాఁడా!; సుధా. వర్తీ! = దేవతలకు ప్రభువగు నింద్రునివలె ఎక్కువైన భోగము కలవాఁడా! దయా...నిస్స్వతా! = దయగలదృష్టిచే పోఁగొట్టఁబడిన అందఱు బ్రాహ్మణులయొక్క దరిద్రత కలవాఁడా! స్నిగ్ధ...సారస్వతా! = మనోహరమై సారముగల సహజమగు సాహిత్యవిద్య కలవాఁడా!

శ్రీ రస్తు

# సారంగధర చరిత్రము

## తృతీయాశ్వాసము



1. శ్రీధుర్యశౌర్య!=సంపదతో నొప్పు పరాక్రమము కలవాఁడా! ధైర్య...ర్ధన్య! = ధైర్యమున మేరుపర్వతమువంటివాఁడా! అదిగర్భేశ్వర! = ఆగర్భశ్రీమంతుఁడా! వితరణ...సుత! = దానమున కర్ణుఁడైనవాఁడా!

2. అని...రుండై = నివారింపరాని—(గొప్ప) ధైర్యము కలవాఁడై.

3. నతులై = నమస్కరించినవారై; అతులై కవినీతరీతి = సాటిలేని గొప్ప వినయపద్ధతి; ధారుణీశలాధిప శేఖర!=రాజా! తెలిసి=గ్రహించి. అనేక భంగులన్ = పెక్కు విధముల.

4. ఔ, ధన్యుఁడు = ఉత్తముఁడగును. శోధన చేసినఁగాని = ప్రమాణము మున్నగువానిచే తగిన పరీక్ష చేసినందప్పు: యశోధన! = కీర్తియే ధనముగాఁగల రాజా!

5. తాన = (చిత్రాంగి) తనంతటతానే; అతఁడు = సారంగధరుఁడు.

6. నాతి = చిత్రాంగి సెజ్జ = పడకనుండి; డిగ్గన డిగ్గి = తటాలున దిగి; జాళువాపసిండికంబము = కుందనపు బంగారపు స్తంభము; మఱుగు చాడ్పునన్ = ఏమియు తెలియఁగనిదానివలె; ముసుంగు దార్చుచున్ = మేలిముసుగు సరిచేసికొనుచు.

7. కడమిాటుచున్ = పోవునట్లు చిమ్ముచు.

8. వనజాతేక్షణ! = పద్మములవంటి కన్నులు కలదానా! కేళి...జఁఖునన్ = ఆఁటపావురముల శాపమున; అంపినన్ = పమ్ము పంపఁగా.

9. తద్వృత్తాంతంబు = ఆ సమాచారము. (సమ్మోదు)

10. నందనుండు = కుమారుఁడు.

11. ఇనుఁడు = ప్రభువు; అంగారకుని చందమునన్ = అగ్ని విధమున. గట్టిగన్ = స్పష్టముగా. దూఱన్ = నిందింపఁగా.

12. తండ్రిమనంబు = మాతండ్రిగారి మనస్సును; ఎడచేసెనే ! = నాపై క్రోధము కల్గునట్లు చేసినదా ? నిరాపనిందలు = లేనిపోని తప్పులను; గడించన్ = కూర్పఁగా; దోసముసుమ్ము = తప్పుసుమీ! తెల్పు నిక్కంబుగన్ = యథార్థమును తెల్పుము.

13. కలకంఠి = మధురమైన కంఠధ్వని కలది - చిత్రాంగి; అలుకన్= కోపముతో; చిట్టుడుకుంగనునీరు = కొంచెము వెచ్చనైన కన్నీళ్లు; సోనయై = వానయై; రచ్చలఁబెట్టి = వీధిలోని కీడ్చి; ఏల, అగడుచేసెదు ? = ఎందులకు అల్లరిపాలుచేసెదవు? వనధిగభీర!=సముద్రమువలె లోఁతైన (హృదయముగల) వాఁడా !

14. తెగింపన్ = గొంతు కోసికొనుటకు సాహసింపఁగా; బల్మిన్ పట్టెదు = బలాత్కారముగా పట్టుకొని అడ్డగించితివి; నాకున్; నగుఁబాటు= నవ్వులపాటు—అవమానము; చేయుం బూనితి = ఇపుడు చేయ సిద్ధపడితివి.

15. కండోయి చల్లఁగాన్ = నీ రెండుకన్నులను చల్లనగునట్లుగా - ఆనందించునట్లుగా; కండోయి = చూడఁగలవు, లెస్సగాన్ = బాగుగా; చిటాడంగన్ = చలింపఁగా.

16. ఊఁచకయూఁచక = తణుకు బెణుకులేక - వెనుకముందు లాలోచింపక; గొబ్బునను = తటాలున.

17. త్రపారహితయై = సిగ్గులేనిదై, కుచరేఖలు = కుచములపై నఖక్షతములు; కొండల = తల; జంత = గయ్యాళి; అతనిచేల=అతనివస్త్రము.

18. కతకుఁగాళ్లు = కథకు కాళ్లు; "కతకు కాళ్లు, ముంతకుఁ జెవులు" లోకోక్తి; అసంబద్ధపు ప్రశ్న లేల అడిగెద వని భావము. అభిమానము = పౌరుషము = ఆత్మగౌరవము.

19. మాయాపటము = మాయవస్త్రము; సంశయంబు ఎడలన్ = సందేహము లేకునట్లు; నయవిదులన్ = న్యాయ మెఱిఁగిన పెద్దలను.

20. మాతృరిరంసాయుతుఁడు=తల్లితోఁ గ్రీడింపఁ గోరిక కలవాఁడు; దండనము = శిక్ష; పరిపూర్ణంబు = అవధి; విపశ్చిజ్జాతములంగూర్చి = పండితుల గుంపును; జననాథునితోన్ = రాజుతో.

21. విజ్ఞానేశ్వరము, చూచి = విజ్ఞానేశ్వర మను ధర్మశాస్త్రమును చూచి; అజ్ఞుని = మూర్ఖుని - చెడ్డవానిని: వనిన్ = అడవిలో; కరచరణంబు= కాలుసేతులు; ఆజ్ఞ చేయుస ర్థంబు = నఱకుట యుక్తము; అనుచున్, విద్వజ్జనులు, విజ్ఞాపనం బొనర్చిరి=విన్నవించిరి.

22. నిర్దయవృత్తిన్ = దయ లేకుండునట్లుగా; మహీనేత = రాజు; ఆజ్ఞసేయుఁడు = నఱకుఁడు.

23. పట్టిన్ = కుమారుని; కట్టడసేసి = ఆజ్ఞాపించి; ఇనుఁడు=రాజు సూర్యుఁడు; వార్ధి = సముద్రము.

24. ప్రామినుకు...భరణిరైన = వేదము లనెడి మాణిక్యములతో నిండిన బరణిరైన; తరణి = సూర్యుఁడు; శరనిధిన్ మునుఁగఁగాన్ = పడమటి సముద్రమున అస్తమింపఁగా; నారాయణుండు = విష్ణువు—నీరు నివాసముగాఁ గలవాఁడు; సరగన్ = వేగముగా; లెగిచి = లాగి; వసుతతిన్ = కిరణముల సమూహమును; పైన్ వేయఁబోల్ = ఒడ్డుపై వేసి యుండవచ్చును. (వేదోద్ధారకుఁ డగు నారాయణుఁడు అతనిని బైటవేసియుండవచ్చును.) కాక = అట్లు కానియెడల; అది = ఆ కిరణసమూహము, కృపీటజాతాప్తిన్ = నీటఁబుట్టిన అగ్నియొక్క సంబంధమును; కాంచ నేల? = ఎందుకు పొందవలెను ? (నీట మునిఁగి బయటఁబడుటవల్లనే నీటిలోఁ బుట్టిన వానితో-అగ్నితో సంబంధ మనుట.)

(అర్థాంతరము—ప్రా...రైన = శ్రేష్ఠములగు బంగారు నాణెములను, కెంపులను నిలయరైన; తరణి = ఓడ; శరనిధిన్ = సముద్రమునందు; మునుఁగఁగాన్ = మునిఁగిపోఁగా; నారాయణుండు = నీటిలోనే

యుండు మాలిమి కాఁడు; సరగన్ తిగిచి = లాగి; వసుతతిన్ = రత్నసమూహమును, పైన్ వేయఁబోలేఁ = వేసెనుకాఁబోలును; కాక = అట్లు కాని యెడల; అది=రత్నములగుంపు; కృపీ . నేమి=నీటియందు జన్మను పొందుటను; కాంచ నేమి ? = ఎందుకు పొందవలెను? (సముద్రమున రత్నములు పుట్టుట ప్రసిద్ధము. కావుననే సముద్రము రత్నాకరమైనది.)

వేదము లనెడి బంగారునాణెములు, కెంపులు నిండిన-సూర్యుఁ డనెడి యోడ పడమటి సముద్రమునందు మునుఁగఁగా, విష్ణు వనెడు నావికుఁడు వెంటనే ఆనోడలోని వస్తువుల నొడ్డున వేసి యుండవలెను. లేనిచో అవి కృపీటజము లనెడి పేరు పొందియుండవని భావము.

25. రవి ..భవుండు = సూర్యుఁ డనెడి వాయుపుత్రుఁడు—హనుమంతుఁడు; గగనపయోధిన్ = ఆకాశ మనెడి సముద్రమును; దాఁటి; రేయి అన్ = రాత్రి యనెడి; జగతి...మునన్ = సీతయొక్క సమీపమున; రభసంబునన్ = సంతోషముతో; నిల్చి, సోయగమునన్ = సొగసుగా; రామచంద్రుఁడు = రాముఁడనెడి చంద్రుఁడు; వచ్చున్; అని అపరాంబుధిలంకన్= పడమటి సముద్ర మనెడి లంకను; చొచ్చి = ప్రవేశించి; పెల్లుగన్ = అతిశయముగా; దరికొల్పు = రగుల్కొలిపిన; అగ్నిశిఖలో యనన్ = అగ్ని జ్వాలలో యనునట్లుగా; సాంధ్యరాగముల్ =సాయంకాలపుటెఱ్ఱని కాంతులు సంధిలెన్ = కలిగెను. అలం. రూపకము, ఉత్ప్రేక్ష.

26. వేలాకృశాంగి = కాల మనెడి యువతి; లోకములకంటన్ = జనుల కన్నులందు; అలమన్ = పూయుటకు; మిహిరకరరసము = సూర్యకిరణము లనెడి పసరును; ఊనిన=వహించిన—పట్టించిన; మిన్ను...కవియన్ = ఆకాశ మనెడి పెంకునకు తగులునట్లుగా; సాంధ్య...కలిక=సంధ్యాకాలపు కాంతి యనెడి దీపము; ఇడఁగన్ = పెట్టఁగా; పడిన కాటుక యనన్ =ఏర్పడిన కాటుక యన్నట్లు; తమఃపటలి, నెఱసెన్ = చీఁకటిగుంపు వ్యాపించెను. అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

27. చవుదంతి = ఐరావతము; వియన్నదిలోన్ = ఆకాశగంగలో; అవగాహ మొనర్చి = మునిఁగి; చల్లు...ధులో నాన్ = మీఁదికి చిమ్మిన

తుంపురులో యన్నట్లు, దివి = ఆకాశమున; చుక్కలు, తోఁచఁగన్ = కానరాఁగా - రాత్రి కాఁగా; తలారుల్ = తలవరులు; దివియలవారికిన్ = దివిటీలవారిని; కొని = తీసికొని; తెగువన్ = సాహసముతో. అలం. ఉత్ప్రేక్ష.

28. రాగిదేరడు = కారెక్కిన; చొకారపు = అందమైన; నీలిచల్లడంబులడంబు = నీలిదట్టీల కాంతి; మొగాల్ జేవురించన్ = మొగము లెఱ్ఱవాఱఁగా; మృత్యుదంష్ట్రలనఁగన్ = మృత్యుదేవతయొక్క కోరలో యనునట్లు; లోవంకకత్తులు = లోవంపుగల కత్తులు; అలుకుమానిసుల గుండెలు = బెదరుచుండు జనుల గుండెలు; మ్రోఁతగుదెలు = ధ్వని చేయుచుండు దుడ్డుకఱ్ఱలు; వేఁటాడుచుండన్ = కదలుచుండఁగా ననుట. కూఁతవెట్టి = కేక వేసి; బడిబడిన్ = వేవేగ; పాఱుతెంచి = పరుగిడి; దివ్య...మానమై = గొప్ప రత్నముల గుంపుచే ప్రకాశించుచున్నదయి.

29. క్రందుకొను సందడిన్ = అధిక మగుచున్న కోలాహలమున; కొందలమంది = కలఁతపడి. ఉబ్బారి = ఆ యుపద్రవము; తట్టింబడిన = వలలోఁ బడిపోయిన; పులుగువిధంబునన్ = పక్షివలె; ఇట్టట్టువడి = ఆకులపాటు చెంది; తరలిపోఁగూడక = తప్పించుకొని పోవుటకు సాధ్యము కాక; ఆరటించుచున్ = ఆరాటము పొందుచు; ఆత్మగతంబునన్ = తనలో.

30. ఈర్ష్యన్ = ఈసుతో; రేఁచి = రేఁగునట్లు చేసి; వినను పో = నీవు చెప్పితివే కానిమ్ము; సదసద్వివేకగుణమున్ = యుక్తాయుక్తవివేచనమును; పోకార్చి = నశింపఁజేసి; మందుల్ = మందమైన బుద్ధికలవారు.

31. ఎటకేన్ = ఎక్కడికయినను. ప్రాప్తి = అనుభవింపవలసినది.

32. కెరలిపడి = ఎగిరిపడి; కఱకంఠుఁడు = శివుఁడు.

33. నిర్విచారుఁడు = విచారములేనివాఁడు; అనుపమానగభీరుండు = సాటిలేని గాంభీర్యము కలవాఁడు; అన...కారుండు = కళంకములేని చక్కఁదనము కలవాఁడు; అనిమిషగిరిధీరుఁడు = మేరుపర్వతముఁబోలు ధైర్యము కలవాఁడు.

34. తొడిబడఁదెగి = తటాలున సాహసించి; గాసిబెట్టక = బాధింపక; అడియాసన్ = వట్టియాశతో; కాచుక = కాచుకొని; మోసాల నున్నన్

=నగరిముంగిట నుండినచో; మోసాలు = మోసములు; ముంచిన భీతిన్ = ఎక్కువైన భయముతో.

35. క్రిక్కిఱిసి = కూడుకొని; (దురదురన—వేగమునందలి యనుకరణము) చొచ్చి = ప్రవేశించి; చెక్కుచెమర్పక = భయాదులచే చలింపక;

36. కానకున్ = అడవికి; బుద్ధి యేమి? = ఆజ్ఞయేమో సెలవిండు. రాజాన = రాజునాజ్ఞ, ఆడినన్ = పలుకఁగా.

37. కొల్చినవారిన్ = సేవకులను; రాయిడిచేసి = మిగుల బాధించి; కర్కశపురజ్జువులన్ = మోటుగా నున్న త్రాళ్లచే;

38. చింౘెను = చెదరిపడెను; మును=మునుపు; సింగారము చిందుచున్నాఁడు = సౌందర్యమొలుకుచున్నాఁడు. సిద్ధము కాఁగన్ = స్పష్టమగునట్లు.

39. గొట్టుసేయుచున్ = బాధించుచు; కాఁపుండిరి = తలారులు కాఁపుగా నుండిరి.

40. అదురుగడ గాఁగన్ = తటాలున; అవ్విధంబంత=ఆసమాచారమంతయును; బెగడి = భయపడి.

41. తలవీడన్ = జుట్టువిడిపోఁగా; పాఱి = పరుగిడి; నిలువుకునిలువున నె = నిలిచియున్న పాటుగానే.

42. బోటులెల్లన్ = చెలికత్తెలందఱును; కస్తిపడకమ్మ = దుఃఖింపకుమమ్మా! ఎత్తి = లేవనెత్తి; కుస్తరింపన్ = ఊఱడింపఁగా.

43. అటుదెలిసి =ఆవిధముగాఁ దెలిసికొని. సకియలు = చెలికత్తెలు; తన్ గప్పుకొని = తన్ను చుట్టుకొని.

44. వక్షోజ... బెగయఁగా = ఱొమ్ముపై ఎగిరిపడఁగా; త్రోపాడన్ = ఒండొంటి నొరసికొనుచుండఁగా. వేనలి = జడ; మొగ్గవాలన్ = మొగ్గవాలిన ట్లుండఁగా; అడుగుల్ చండింపన్ =పాదములు తడఁబడఁగా; నేత్రాంబుజంబులు = పద్మములవంటి కన్నులు; కన్నీటన్ వసంతమాడన్ = కన్నీళ్లను క్రుమ్మరించుచుండఁగా. పూఁబోఁడి = రత్నాంగి; ఖేదంబునన్ = దుఃఖముతో; అరిగెన్ = వెళ్లెను.

45. అరవిరిపొన్నుపయిన్ = సగము వికసించిన పూవుల పొన్న పయి; ఒక యంతరువునన్ = ఒక మరుగు ప్రదేశమునందు.

46. అనఘచారిత్ర = ఉత్తమస్వభావముకలది; కెరలని = కోపింపని; గేస్తురాలు = గృహిణి. నోరెత్తి పలికెన్ = బిగ్గఱగా అఱచి మాటలాడెను - కోపోద్రేకమున పల్కె నసుట... తాళనిచ్చునే? = ఓర్వనిచ్చునా ?

47. భోగకామినుల్ = భోగస్త్రీలు; కులపాలికలకన్నన్ = కులస్త్రీల కంటెను; మేరగాన్ = మర్యాదగా; సవతిపట్లను = సవతులయెడలను, సవతుల బిడ్డలయెడలను; ఏపట్లన్ = ఎట్టి సమయములందును; ఈసు సవరింపక = అసూయపడక, నెనరుతోన్ = ప్రీతితో; బుధ...విరాజి = విద్వాంసులచే కొనియాడఁబడిన ఉత్తమగుణములచేఁ బ్రకాశించువాఁడును; సన్మార్గవర్తనన్ = మంచిమార్గమునఁ బ్రవర్తించుటచే;

[బుధ...విరాజి = దేవతలచేఁ గొనియాడఁబడిన త్యాగగుణముచే ప్రకాశించువాఁడును; సన్మార్గవర్తనన్ = ఆకాశమార్గమునఁ దిరుగుటచే; సారంగధరునిమీఁదన్ = చంద్రునిపై; —ఒకటికిఁ బదాఱు —— కళలు, అని ధ్వనిక్రమము ]

48. పడుచుఁద నానన్ = యౌవన కారణమున; పట్టి = నాపుత్త్రుఁడు, అగడములు = అకృత్యములు; అంగమునన్ = దేహమున; సవరించి=కూర్చి; తొడిఁబడన్ పోయి = తొందరగాఁబోయి; తెగించి = సాహసించి; ఆజ్ఞ సేయుమని = నశిక్షించు మని; ఎంతకు నెత్తుకొంటివే! = ఎంత ఘోరమునకుఁ బూనుకొంటివే !

49. లెస్స యున్నన్ =బాగుగా నున్నచో; బేరజపుల్ విచారముల్ = కుచ్ఛితపుతలఁపులు; కలవి లేనివి కొన్ని=ఉన్నవికొన్ని, లేనివికొన్ని; ఘటించి= కూర్చి - కల్పించి.

50. కఱకుఁదనంబుతోడన్ = కాఠిన్యముతో; పసికందు = పసిబిడ్డ; కలుకుకుమనదే! = నొప్పిపొందదా? గొడ్డురాలికిన్ = బిడ్డలులేనిదానికి.

51. పెనుపఁగనోపిన = పెంచుటకుఁదగిన; కనికరము = దయ· కని = చూచి - వానిపైఁ గన్నువేసి; నిరాపనింద = లేనిపోనినింద.

52. కటికిమనంబుతోఁ = కఠినమైన మనస్సుతో; చెవులె...రాజులకున్ = రాజులు తాము వినిన మాటలనే నమ్మెదరు; కాని స్వయముగా విచారించి కార్యముల నాచరింపరు.

53. ఏసడిసన్న మానిసివో=ఎంత పేరుపొందిన దానవో! (అధిక్షేపణ) ఏమి...పట్టు=కష్టము, సుఖము-ఏమియు నెఱుఁగనిదానవు (నింద) మటు... కాన = మాయలమారి నంగనాచీ! మూసినముత్తెమై = అమాయకుఁడై;

54. బిగువు = బింకము - తనపట్టు; జనితామర్షమునన్ = కలిగిన క్రోధమున - ఎక్కువ కోపమున; జంకెన = బెదరింపు.

55. కేరి = చెలరేఁగి; నిక్కుచున్ = పైకిలేచుచు; సాదు=సాధువు; గాదిలిసుతుచేఁతన్ = ముద్దుబిడ్డఁడు చేసిన పనియెడ; చక్కటులు దిద్దెదవు= తప్పు లే దని తీర్పులు చెప్పెదవు; నంగనాచివే=అమాయకురాలవే!—(పైకి అమాయకురాలుగాఁ గానవచ్చుచు, లోలోన గొంతులుకోయుదాన వనుట.)

56. వేదులు = గడబిడమాటలు; అదరవేయఁగన్ = బెదరగొట్టుటకు; అంబేదలు = నోరులేనివారు; వాదుకు వచ్చెదేల ? = తగవులాటకు వచ్చెద వేల ? సాదుపిసాళి = అమాయకపు కొంటెవాఁడు.

57. ఎంతకు లేవు = ఎంతకైనను తగుదువు — ఎంతపనికైనను చేయఁగలదానవు; నిజంబె = ఇది యథార్థమే—యుక్తమే; సుద్దులే = మంచి మాటలే; ప్రతిష్ఠింతురు = ప్రకటింతురు; పాపములు; ఎంచరేకదా!=చెప్పనే చెప్పరుకదా !

58. వితాదిసంతులు = వ్యర్థమైన మాటలు; అడ్డపాప = అడ్డాలలో నున్న బిడ్డఁడు - పసిపాప; వ్రేళ్ల...వారలు = వ్రేళ్ళసందులనుండి జాఱిపడు వారు; బెదరి లొంగిపోవువారు - బుద్ధిహీనులు.

59. నెంజిలి = విచారము; బలిమిన్ = బలాత్కారమున.

60. చిలుకలకొలికి = రత్నాంగి; ఆర్తరవంబునన్ = దుఃఖముతోడి కంఠధ్వనితో— ఏడ్చుచు ననుట.

61. అమ్మచెల్ల - ఆశ్చర్యార్థకము. చెప్పెడి...వలదా? = చెప్పెడి వారు చెప్పినఁ జెప్పవచ్చునుగాని వినినంతమాత్రమున నమ్మక, ఆలోచింప వలదా ?

62. మతకరి= మోసముచేయునది; తునుమఁదగునె?=నఱకవచ్చునా? ఇ దేవోరక్షనమ్ము = ఇదెట్టి ప్రభుత్వము— ఇ దెక్కడి ధర్మము ?

63. దండింపఁగన్ = శిక్షించుటకు; ఇచ్చువారిన్ = అప్పగించు వారిని—భోగకామినులకు సుతులను బలిపెట్టువారిని; కామాతురుల్ = కామాంధులు; పరవశాత్ముల్ = శరీరములు తెలియనివారు.

64. చూడఁజాలక = ఓర్వలేక; కుటిలాలక=వంకరలైన ముంగురులు కలది—చిత్రాంగి; గుణంబులె? = గుణములు లేవు; అయ్యొక్కనిన్ = లేక లేక కలిగిన యా ఒక్క బిడ్డను; తెగింపఁ జెల్లునే? = చంపింపవచ్చునా ?

65. ధరణీపతులు = రాజులు; పరికింపక = ఆలోచింపక; అసేగద= అనియేకదా; రాజ్యాన్తే నరకం ధ్రువమ్ = రాజులకు రాజ్యము పోయినపిదప నరకము నిశ్చయము.

66. జంతమాటలు = గయ్యాళిమాటలు; (ఊంకులాడిమాటలు) కానక కన్నపట్టిన్ = లేకలేక కన్న కొడుకును; ఒకరేన్ = ఒక్కరైనను; కడ తేరినట్టివారలు = బాగుపడినవారు.

67. మచ్చరమేల? = మాత్సర్యమేల? నెంజిలిన్ = దుఃఖముతో; ఎమ్ములు-చిల్లులువోవన్ = ఎమ్ములు చిల్లులు పడునట్లుగా— బాగుగా నాటు కొనునట్లు; ఆడినన్ = పలుకఁగా.

68. ద్వేషంబు = విరోధము; మల్లడిగొనన్ = పెనఁగొనఁగా— అతిశయింపఁగా! నిలుపక = మనస్సులో నుండక; రాగము = ప్రేమ, ఎఱుపు; ఆనని...వసించెన్ = కోప మతిశయించె ననుట. అనుకంపమహిమ = దయ యొక్క గొప్పతనము; కంపించుటయొక్క అతిశయము. కటములను = చెక్కిళ్ళను; చేరెన్. సాధువులకున్ = ఉత్తములకు; దుర్జనసంగతి = చెడ్డ వారితోడి పొత్తు; చనునె ? = తగ దనుట. (మనస్సున నుండవలసిన రాగాను

శంపలు దుష్టములకు ద్వేష, క్రోధములతోఁ గలిసి యుండ నేఱక స్థలాంతరము లకుఁ బోయిన వని భావము.)

69. ఇందులకున్ = ఈ పనికి; బెళుకు = బెదరు; వహించుకొని = మీఁద వేసికొని— బాధ్యత తీసికొని; ఎఱుఁగఁ డందమె? = ఏమియుఁ దెలి యనివాఁ డని చెప్పఁగలమా ?

70. ఒకనాఁడున్ = ఎప్పుడును; అమరుగడన్ = అదిరిపాటున; నిజాంశుకంబు = తన (అతని) వస్త్రము; తగులొటకున్ = అచట చిక్కు కొనుటకు.

71. జనపతి = రాజు; నెనరునన్ = ప్రేమచే.

72. అస్పదమీక = అవకాశ మీయక. ఇటుఁగూడ = ఈ విధ ముగాఁ గూడ; సబ్బిణి = అమాయకురాలు; వెదుళ్ళ...గదా!=ఇది లోకోక్తి, వెదుళ్లపందిరి నడుమనడుమ సందులేక చిక్కగా నుండును; అట్లే రాజులు వివాదమున కెడము (అవకాశము) లేనట్లు పొంకముగాఁ బల్కుదురు.

73. చీవసంబు, ఎడలఁగన్ = మర్యాద నశింపఁగా; రాచసిరికూట ములు = రాజ్యసంపదలతోడి సంబంధములు; నవ .. లాంగునిన్ = క్రొత్త విలాసములచేత మనోహరము, సుకుమారము నగు శరీరము కలవానిని— సారంగధరుని.

74. మోహాంబుకతనన్ = ప్రేమమువలన; చేరఁజనుదెంచు కదలు= దగ్గఱగా వచ్చు ప్రయత్నమును.

75. నామీఁదాన = నాపై ఒట్టు; మో మోట = మొగమోటమి.

76. గజయాన = ఏనుఁగునడకవంటి నడక గలది - రత్నాంగి; పతి యానన్ = భర్తశపథమువలన; అతి . గతి—అతిభయానకక్రియా=మిగుల క్రూరమైన దండనక్రియ యనెడు; అనల = అగ్నిచేత; దహ్యమానక్రమగతి = దహింపఁబడుచున్న విధము; అనన్ = తన్నాక్రమింపఁగా; శయ్యాన... ననము = పరుండియున్న ఆభర్తయొక్క ముఖమును; తాల్మిన్=ఓర్పుతోను; వినయానన్ = వినయముతోను.

77. కడుపున... మునకుఁ = తనకట్టి యున్నతనుఁడు కొడుకుగాఁ బుట్టిన తప్పునకు (స్వనింద); పొగులుచుఁ =దుఃఖించుచు; వేఁడఁ... వెట్టితి = ప్రార్థించుటకు రాఁగా ఒట్టుపెట్టితివి; పని లేదు = ఇఁక విచారింప నక్కఱ లేదు.

78. ఖిన్నురాలై =దుఃఖించిన దయి; పుత్రమమతాంబుధి = పుత్త్రుని యెడ ప్రేమ యనెడి సముద్రము; తెరవేయఁ =పొంగిపొరలఁగా; సైఁపక= ఓర్వక.

79. వేఁడీ = ఏఁడీ ! వేఁడి = ప్రార్థించి; మాటికిఁ = మాటిమాటికి; ఒలుకుచుండఁ = కారుచుండఁగా.

80. ఒకవాల్ = ఒకసారి.

81. పైలపైలపడుచుఁ = మీఁదమీఁదకు వచ్చుచు; మునుకల్గఁ = ముందు రాఁగా; నితాంతవ్యథఁ = ఎడతెగని దుఃఖముతో.

82. అన్నెముపున్నెము = మంచిచెడ్డలు; పగవానికేఁ = శత్త్రువున కైనను; గోలవు = అమాయకుఁడవు.

83. ఉచితజ్ఞుఁడు = యుక్తాయుక్తము లెఱిఁగినవాఁడు; కస్తిపడని వారు = దుఃఖింపనివారు.

84. జిత్తులఁ = మాయలకు; టెంకి = స్థానము; ఉరగపాశ బద్ధుఁడై = నాగపాశముచే బంధింపఁబడినవాఁడై; రాముతోడనఁ = రాముని జతయో యన్నట్లు; గారాముతోడఁ = ప్రేమతో; పెంపు+ఎంచి = గొప్పతనమును తలఁచుకొని; కనలి = కోపించి.

85. చొకారపుఁగేల్దమ్ములఁ = అందమైన హస్తపద్మములతో; అగ్ర ...స్యంబు = ముంగురుల చోటఁబడి పున్నమరాత్రికి చంద్రునివంటిదైన ముఖము; మోఁదికొంచుఁ = మొత్తుకొనుచు; ఉద్బాష్పయై = ఉప్పొంగు చున్న కన్నీరు కలదై; ఉపకంఠ...క్రియఁ = సమీపప్రదేశమునఁ గట్టి వేయఁబడిన దూడను సాకు కోరికతో మీఁదికి వచ్చు ఆవురీతిని. అలం. ఉపమ.

86. రంగ...రాశిన్ = ప్రకాశించుచు అవధిలేని దగు పుత్రమోహ మను సముద్రమునందు: రహిం దొరంగి = సొంపుచెడి; భరించి = మోసి; ఈరిమి = ప్రేమ; కడల్కొనన్ = అధికముకాఁగా; గోమునన్ = గారాబముతో.

87. బాహువల్లరులకా = తీఁగలవంటి చేతులకా; మృగ...దేహము నకా = కస్తూరి శ్రీ చందనములు పూసికొను శరీరమునకా; గాటంపుఁగెంధూళి = దట్టమైన యెఱ్ఱనిధూళి; శిబికా ..ములకా = గొప్పవైన పల్లకీలందు ప్రకాశించు పాదములకా; జాతి...ములకా = జాజి సంపంగి పూవుల మాలికలతోఁ గూడియుండు జుట్టునకా; అచ్ఛికములు = అగచాట్లు; పుట్టుభోగికిన్ = పుట్టుక మొదలు సుఖము లనుభవించుచున్న వానికి. వెతలు = బాధలు.

88. ఈమర్లు = ఈమరులు - ఈమోహము; ఇన్నాళ్ = ఇన్ని దినములును; చెల్లఁబో = అయ్యో!

89. మర్మము = గుట్టు; వేదుఱైతి = తెలివిమాలినవాఁడవైతివి.

90. పొలియుటకున్ = మరణించుటకు; ఈవిధిన్ = ఈరీతిగా - ఇంత క్రూరముగా.

91. నానా ..దగన్ = సమస్తసంపదలు పొందునట్లుగా.

92. ఒకమంజువాణి = మాటకారియైన యొక యువతి; పాయక = విడువక; మొగంబున వ్రేలన్ = ఎట్టయెదుట కానవచ్చుచుండఁగా; సుర .. వాఁడు = మద్యపానమునఁ బరవశుఁడగువాఁడు ... (అర్థాం.) ఒక మంజువాణి = సరస్వతీ; మొగంబున వ్రేలన్ = నోటియందుండఁగా; (సరస్వతి వాగ్రూపిణి యనుట) సుర .. వాఁడు = దేవతలు చేయు సేవలచే పరవశుఁ డగువాఁడు.

వాసిగాన్ = ప్రసిద్ధిగా; పంకజాతాసనుండు = పాపసమూహమునకు నివాసము; అను ..నాఁడు = అను మాట—నింద పొందినవాఁడు; రాజ... వాఁడు = దురభిమానము స్వభావముగాఁ గలవాఁడు; (అర్థాం.) పంక...

నుఁడు = కమలము ఆసనముగాఁ గలవాఁడు; నుడిపడినాఁడు = పేరుపొందిన వాఁడు; రాజ...నాఁడు = రజోగుణము (శివి) ప్రకృతిగాఁ గలవాఁడు.

పాలుమాలుచు నుండఁగ = అనారోగ్యమున నుండఁగా; పసిబిడ్డలఁ; హరించి = చంపి; (అర్థాం.) పాలు మాలుచు నుండఁగ = పాలులేక అల్లాడు చుండఁగా; పసిఁ = దూడలను; బిడ్డలను = గోపబాలురను; హరించి = దొంగిలించి; తండ్రికిఁ = తండ్రియైన విష్ణువునకు — కృష్ణునకు; (బ్రహ్మ గోవత్సములను, గోపబాలురను హరించె నని భాగవతకథ.)

దాస...నుఁడు = దాసులకు దాసుఁడుగా నుండు ప్రవృత్తికలవాఁడు; చేతఁ = పనియందు; వికారితనము = వక్రత; ఆరాళగతి = వంకరనడత; వితతిని విడఁడు = (తన వంకరనడత నెప్పుడును విడువఁడు;)

(అర్థాం.) దాస...నుఁడు = భక్తులకుఁ దాసు దాసునినలె ఆధీనుఁడై యుండువాఁడు:—భక్తపరాధీనుఁడు; చేత = సృష్టి; వికారి = వెక్కురకము లైనది; తన...గతి = తాను హంసనెక్కి తిరుగుట, వితతిని విడఁడు;

నలువగలఁ జూడఁగ = నాల్గువిధముల విచారింపఁగా—(అన్నిరీతుల విచారింపఁగా.) నలువ = బ్రహ్మ; తులువ = పిచుఁడు; లోకాధిపత్యము, ఇచ్చి = లోకముల అధికార మొసఁగి; తల...జేసిన = గౌరవముతో నుండు నట్లు చేసిన; ఈశ్వరుఁ = శివుని; అనుటగాక = అనవలెనుగాని: (శివుఁడు బ్రహ్మయొక్క తల నొకదానిని త్రుంచె ననియు ధ్వనితము; అతఁ డన్నితలలను నఱికినచో మావంటివారి కిట్టి కష్టములు లేకుండెడిఁగదా ! అని భావము )

93. మరుల్ వాటిల్లి = ప్రేమకలిగి; ఎనయన్ = కూడుటను; ఇయ్యకొనక = అంగీకరింపక; పావని! = పవిత్రురాలా! మనో . బులన్ = త్రికరణ శుద్ధిగా.

94. పోలు...గక = మంచిచెడ్డలను తెలిసికొనక; అమ్మనుజేశుఁడు = ఆ రాజు-తండ్రి యనుట. ఆలిమాట = ప్రియురాలిమాట (నాలిమాట-ఆమె కపటవాక్య మనియు నర్థాంతరము) నాయమ్ము = న్యాయము; ఇచ్చకమె యాడిరి = ముఖప్రీతివాక్యములే పల్కిరి; కన్న మోహమ్మునన్ = కనిన ప్రీతి వలన.

95. ఈశ్రల్లు = ఈకష్టములు; తన్నున్ = నన్ను; మేరటమ్మ ! = న్యాయము కా దనుట.

96. అడలకుమమ్మ ! = విచారింపకుము; సపత్నితోన్ = సవతితో - చిత్రాంగితో; నాదుసంగడిన్ = నాతో కలసిమెలసి;

97. కఱుదులప్రోవు = సుగుణాలకుప్ప; అనుఁగు + అరుదులబిడ్డన్ = ప్రియమైన అబ్బురపుకుమారుని; అవనతకరరయై = (దీవించుటకు) వంచిన చేయికలదై.

98. అన్న !=నాయనా ! రేఁపటిదీవనన్ = రేపు ఫలించు దీవనచే; సొగులు = విచారము.

99. నీమురువు = నీయందము; అంటినన్ కందుఁగదయ్య = కంది పోవునుగదా ! నీతనువు = నీ శరీరము; కొతుకము ఒప్పఁగన్=కోరికతీరఁగా; నీదుప్రాపున్ = నీరక్షణను; కందుఁగదయ్య = పొందునుగదా ! నినుఁగన్నన్ = నిన్ను చూడఁగా; సపత్ని = నా సవతి చిత్రాంగి; అందుఁ బోకు = అక్క డికి వెళ్లకుము; అందుఁ గదయ్య = అని నీతో చెప్పుచుందునుగదా !

100. చందానన్ = చందమున - విధమున; రాక = వచ్చుట; కొండగాన్ = గొప్పగా; ఇసుమంతతడవు = మిక్కిలి కొంచెపుటాలస్యము; తాఁకునో = తగులునో యేమో ! తరింతున్ = దాటుదును?——ఈదుఃఖము నెట్లు తరింపఁగలను ?

101. తన...గాయెనె ? = దైవము మనస్సునకు నీవు బరువైతివా ? అయో ! = అయ్యో!; నీతనయా ! = నీతికి నిధియగువాఁడా ! అనయాప్తిని = అవినీతి - అన్యాయము ప్రాప్తించుటను. జంతను = దురాత్మురాలను; అయా ! = అయ్యా !

102. జననవేళలు = జన్మకాలపుగడియలు; ఘనుఁడు=గొప్పవాఁడు; కరమురేఖలు = హస్తరేఖలు; గతిలక్షణము = నడకతీరు; అనుపమాకృతి = సాటిలేని యాకారము; (గీతములోని గ్రహబలము, సాముద్రికము, చిన్నెలు, గాత్రమహిమలు సీసపద్యము నాల్గు పాదములతోను క్రమముగ నన్వయించును ) సుద్దులు = మంచిమాటలు; అలమటించున్ = దుఃఖించును.

103. పలవించున్ = పలవరింతమాటలాడును; పల్లటించున్ = తల్లడిల్లును; పొలుపు = చక్కఁదనమును; ఎంచున్ = తలఁచుకొనును;

104. గాసిలున్ = దుఃఖించును; కొదల = శిరస్సును; అక్కునన్ = ఱొమ్మున; తొట్రుపాటెనయున్ = తొట్రుపడును.

105. వనటన్ = దుఃఖముచేత; తొలంగి = తప్పికొని; రాక = మళ్ళక; తటుకున = తటాలున; అటమటము+అగున్ = మోసము కలుగును ఆళీజనముల్ = రత్నాంగి చెలికత్తెలు.

106. సుఖించినవార = సుఖములు పొందినవారే; ఆర్తిమైన్ =; దుఃఖముతో; కృశింతురు; అడికలొందువార = నిందలను పొందినవారే.

107. తిగువన్ = రావలె నని పట్టి లాగఁగా ప్రౌఢ...రంబునన్ = నేర్పుకల చెలికత్తెలబలవంతముమీఁద; పట్టిన్ = కుమారుని; ఎడఁబాసి = విడిచి; గాసి...లునన్ = బాధ కలిగించు మనోవేదనచే పురస్కరింపన్ = ఊరడించుచు ముందు నడువఁగా; నందను = కుమారునియొక్క; నోరఁగాయ యిడక = నోరు మూతపడకుండఁగా; ఆద్దేవి = రత్నాంగి; పరి . చుండెన్ = వాపోవుచుండెను.

నగరరక్షకులు = తలారులు; అతీక్ష్ణ...దండులై = మిక్కిలి వాఁడియైన గొప్పకత్తులచే భయంకరములైన - దండములవంటి భుజములు కలవారై - విచ్చుకత్తులు ధరించినవారై; దండ...లనన్ = యమునిభటులో యను నట్లు; ఉద్దండతన్ = భయంకరప్రవృత్తితో; గండుమెఱసి = అతిశయించి; రసా...కుమారున్ = రాజకుమారుని—సారంగధరుని;

నిజ...లంబును—నిజ = తనయొక్క; శితవిషాణకృపాణ = వాఁడియైన కొమ్ములనెడి కత్తులతోడి; రణ=యుద్ధమునకు; శబ్దగుణవారణ = ఆకాశ గజమును—ఐరావతమును; ఆహ్వానసంవిధాన = పిలుచు పద్ధతిని; సూచక = తెలుపుచు; మస్తకోపరిన్యస్త = తలపై నుంచఁబడినట్టియు; ప్రత్యాకుంచిత = వంచఁబడినట్టియు; హస్త = తొండములయొక్క; నిస్తులాదభ్రవిభ్రమ = సాటిలేని గొప్ప సంచలనముయొక్క; ధురంధర = భారము వహించిన;— (తొండములను క్రిందికి మీఁదికి ఆడించుచున్న) సింధుర = ఏనుఁగులయొక్క

దిక్కూలంకష = దిగంతములవఱకు వ్యాపించిన; అహం...లంబును = గర్వముతోడి ఘీంకారములతో నిండినదియును;

అక్షుద్ర...వ్యాకులంబును— అక్షుద్ర=తక్కువకాని; మాధురీధురీణ =మాధుర్యముతో నిండిన; క్షౌద్ర లిలిక్షా = తేనెను నాకవలె నను కోరికచే; జిహ్వాచాపల = నోరూరుచున్న; అచ్ఛభల్ల = ఎలుఁగుబంట్లయొక్క; ఖరనఖర భల్లముఖ = వాఁడియైన గోళ్ళనెడి బల్లెముల మొనలచే; విదళితబహునాకు తుహార = త్రవ్వఁబడిన పెక్కు పుట్టలకన్నములనుండి; ముహు...ర్గత = మాటిమాటికి బయటికి వచ్చిన; అనర్గళ = అడ్డులేని; కుండలి మండలీ = పాముల సమూహమును; గ్రసన = తినుటయందలి; వ్యసన = ఆసక్తిచే; సము ల్లసత్ = ఎక్కువ ఉత్సహించుచున్న; వన...కుల = అడవినెమిళ్ళ కేకల మొత్తముచే; వ్యాకులంబును = కలగుండు పడినదియును;

అనేకో...యంబును—అనే...కోటి=పెక్కు గృధ్రగూబలముక్కు కొనలచేత; త్రుటిత = చీల్పఁబడిన; కోటరనిద్రాణ=చెట్టుతొఱ్ఱలలో నిద్రించు చున్న; కరటకుల = కాకి గుంపులయొక్క; ఉడ్డయన = ఎగురుటయందలి; గరు...టికా = రెక్కల సమూహముయొక్క పటపట శబ్దముల సందడిచేత; విఘటిత = చెడఁగొట్టఁబడిన; నిద్రా = నిద్రవలని; తంద్రా విద్రావి = కునికి పాటుతో పరువెత్తుచున్న; కపి = కోఁతులచే; కంపిత = కదల్పఁబడిన; శాఖి శాఖాసహస్ర = వేలకొలఁదియైన చెట్టుకొమ్మలనుండి; పరిపతిత = పడిన - రాలిన; పరిణతఫలరసప్రపూర = పండిన పండ్లరసప్రవాహముచే, పూరిత = నింపఁబడిన; నానా...యంబును = పెక్కుజాతుల తీఁగలపొదులు కలదియును;

ప్రవృత్త - రంబును...ప్రవృత్త = జరిగిపోయిన; సంవర్తసమయ = ప్రళయకాలమందు; సమున్నిద్రసముద్ర = ఉప్పొంగిన సముద్రమందలి; కలిల సలిల = చొరరాని నీటి యందు; గాధావగాహా = అడుగంట మునుఁగి నదియు; దుర్వివహా = ఓర్వరానిదియు నైన—మిక్కిలి బరువెక్కిన; సర్వం ..చణ = భూమిని పైకెత్తుటయందు సమర్థమైన; శాంబరీకిటి=మాయావరాహమును- వరాహావతారమూర్తిని; విడం...లంపట = అనుకరించు ప్రయత్నమున

నాసక్తములై; ఘోరతరఘోణాముఖ = భయంకరమైనముట్టెతో; నిఖాత = త్రవ్వఁబడిన, క్ష్మాతలగర్భ = భూగర్భముకలవియు; నిర్భరబల = గొప్పబలము కలవియుం నగు: స్తబ్ధరోమస్తోమ = అడవిపందులసమూహముయొక్క; అస్తోక ...భీషణ = పెద్ద పిడుగుపాటువలె మిక్కిలి భయంకరమైన; ఘుర్ఘుర... మాన = గురగురశబ్దముచే మిక్కిలి కదలింపఁబడుచున్న; ద్రుమ...బును = చెట్లగుంపుచే భయమును కల్గించునదియును.

దుర్ధ...హంబునునైన—దుర్ధర...నిహత = భరింపరాని కోపముచే విస్తరింపఁజేయఁబడిన పంజాలచేకొట్టి చంపఁబడిన; బహుళ...రార్ద్ర = ఎక్కువగా నున్న జింకలగుంపులకంఠములనుండి కాఱిన రక్తధారలచే తడిసిన; చరణ విన్యాస = పాదములనుంచుటచే; దీపిత = ప్రకాశించుచున్న; నిజ ...బునునై = తమజాడలచే తెలుపఁబడిన పెద్దపులుల గుంపులచేఁ బ్రకాశింప రానిదియునయి; సత్త్రంబు = అడవి, (అర్థాం. అన్నముపెట్టు గృహము.) అఖిలద్విజాశ్రయంబై = సమస్త పక్షులకు నిలయమై (అర్థాం. బ్రాహ్మణు లందఱికి ఆశ్రయమై) వనంబు = అడవి (అర్థాం. నీరు) పుండరీకనిలయంబై = పెద్దపులులకు నివాసమై (అర్థాం. తెల్లతామరలకు నిలయమై.) కాననంబు= అడవి (అర్థాం. బ్రహ్మయొక్క ముఖము) సకలా...యంబై = సమస్త (ఆగమ) వృక్షములచేతను అందగించునదై (అర్థాం. అన్ని వేదములచేతను ప్రకాశించునదై) కుంజరహితస్థలంబు = పొదలు లేని చోటు, ఏనుఁగుల కను కూలమైన చోటు; సుమనః స్థానంబు = దేవతలకు నివాసము, పూవులకును చోటు: పల్లవాగమ్యంబు = చిగుళ్ళకు పొందరానిది, (పత్+లవ = పల్లవ) పాదలేశముచేతను - ఎత్తియెత్తి అడుగులు పెట్టినను ప్రవేశింపరానిదై కాంతారంబు = అడవి; అకాల...ల్కలంబు - అకాలసంధ్యారాగకృత్ = కాలముకాని కాలమున సంజకెంజాయను కలిగించునదియు; అభ్రంకష=ఆకా శము నొరయుచున్నదియు; చిటచిటార్భటీనటత్=చిటపటశబ్దముతో తాండ వించుచున్నదియు నగు; చటుల..ల్కలంబు = తీవ్ర మగు కాఱుచిచ్చు యొక్క యెగయుచున్న జ్వాలలు కలది; కుల్కలంబునోలంబునన్=పర్వతము

యొక్క-మఱుఁగున; మూఁడు త్తరువులు = ముమ్మాటికిని-నిశ్చయముగా ఆజ్ఞలు; సత్పురుషారాధ్యునిన్ = సత్పురుషులకు పూజనీయుని-ఉత్తముని-సారంగధరుని.

108. హిమ...కట్టకున్ = పార్వతీభర్త యగు శివుని యెదుటికి; ఇంచు...వానిన్ = మన్మథునియొక్క చక్కఁదనమువంటి చక్కఁదనము కల వానిని; వెచ్చముకాని = ఖర్చుకాని - తగ్గని; కలువ సెచ్చెలికాని = చంద్రుని యొక్క; కిమ్మనసీని = పోల్చుటకు వీలుకాని యనుట. కసటు ..పసిండిన్ = కలితీలేని మేలిమిబంగారమును; నలుఁగనివిరిన్ = నలిగిపోని పూవును; గరగరని వానిన్ = పరిశుద్ధమైనవానిని; ముఖ...ధేని - ముఖవిలోక = ముఖమును చూచుటచేత; ప్రవర్ధమాన = వృద్ధిని పొందుచున్న; మోహాపయోరాశి = వలపుసంద్రమునందు; నిమగ్న = మునిఁగిన; యువతిజన = స్త్రీలయొక్క; హృదయసంగత = హృదయము నాపరించిన. అంగజజ్వలన = మన్మథాగ్నికి; సామిధేని = జ్వలింపఁజేయు మంత్రము; చిఱుతుకఁజేసిన్ = చిన్నరాజును - సారంగధరుని.

·109. తలిరు = చిగురు; కరపదము = కాలుసేతులను; కటకటపడి= దుఃఖపడి.

110. ఎగ్గు = ఆపద; మిన్నక=ఊరక - ఆలోచింపక; ఆజ్ఞ పెట్టుఁడు= నఱికివేయుఁడు, అనెన్; మీకున్ ..నొందన్ = మీరు విచారింప నక్కఱ లేదు. కృత్యము = పని.

111. ధర్మదేవతన్ = యముని; అనఘున్ = పాపములేని నన్ను; ఉడుప్రభుశేఖరుఁడే = శివుఁడే.

112. హృదయాళుఁడు = మంచిమనస్సుకలవాఁడు; ఆయన = సారంగధరుఁడు; కాలుసిన్ = యముని; (మార్కండేయుని రక్షణార్థము మృత్యువును శిక్షించుటచే నిప్పుడు నట్లు చేయఁగలవాఁడని ధ్వనితము.) కరంబు = మిక్కిలి; వికసిల్లఁగన్ = ప్రకాశించునట్లుగా; దివ్యపదంబు = మోక్షము; (కరంబు, దివ్యపదంబు, విలసిల్లఁగన్=కాలుసేతులు వచ్చునట్లుగా- అని ధ్వనితము)

113. గత బహుళపక్షమునఁగదా = పొందిన (ప్రవర్తనుగూర్చి) ఎక్కువ పక్షములు - (అభిప్రాయభేదములు) ఉన్నప్పుడుగదా! కరపదంబు = కాలుసేతులు; (సారంగధరునకున్ = చంద్రునకు; బహుళపక్షమునఁగదా = కృష్ణపక్షమునఁగదా; తఱుఁగవలయును = తగ్గిపోవలెను ! అని అర్థాం.) గత బహుళపక్షమునన్ = పోయిన బహుళపక్షమునసే—అతఁడు నిర్దోషి యను చెడ నభిప్రాయభేదము లేకున్నపుడును; (గత...మునను = బహుళపక్షము - కృష్ణపక్షము గతెంచినను.)

114. విపక్కారుఁడు = ఎవరికిని ఎట్టి యాపదను చేయువాఁడు, పోయిన (నఱుకఁబడిన) కాలుసేతులు కలవాఁడు.

115. లావగు...యలంత = ఎక్కువగుచున్న కష్టదశవలని బాధను. సహింపఁగ లేక = ఓర్వలేక; అశ్రుధారావళి = కన్నీళ్లప్రవాహము; బెట్టు గాఁగన్ = ఎక్కువగా; వాపోవుచున్ = ఏడ్చుచు; జొత్తుపావ = నెత్తురుకందు; కీలెడలుబొమ్మ = మర తప్పిపోయిన బొమ్మ.

116. పొగిలి = దుఃఖించి; నికుం...వ్రాలి = పొదరిండ్ల సమీపమున దాఁగియుండి; తాంతతనుఁడు = సోలిపోయిన శరీరము కలవాఁడు; అరసి = చూచి; అట తొలంగి = తా మున్నచోటినుండి తొలఁగిపోయి.

117. లేఁగపులితండము = పులిపిల్లలగుంపు; నెత్తుటిగాలుకై = నెత్తుటివాసనను బట్టి; హళాహళిమెయిన్ = వేగముగా; రాఁగన్ =రాఁగా; ఱాఁగ...బులు = గయ్యాళులగు తోడేళ్లు; కోల్పులుల్ = పెద్దపులులు, రొదల్ చిలుకుచున్ = భయంకరముగా ధ్వనిచేయుచు; ఈఁగన్ = తనవద్దకు రాఁగా; బెగ్గిలి = భయపడి.

118. కొంతతడవుకున్ = కొంతసేపటికి; తెలివొంది=స్పృహవచ్చి; ఉమ్మలికము ఎసంగన్ = దుఃఖమెక్కువ కాఁగా; అసువులు ఊటాడంగన్ ప్రాణములు కొట్టుకొనఁగా.

119. అలఁత = బాధ; తెగటార్తురు = చంపివేయుదురుగాని; దవ కీలలార! = కారుచిచ్చు మంటలారా! పొలియఁగఁజేయరే=చంపివేయుఁడు; కూయున్ = అఱచును.

120. కుపితమానసుఁడై = మిక్కిలి కోపించినవాఁడై; వృథా = నిష్కారణముగా; కు పిత = చెడ్డతండ్రి, (కోపముకలవాఁ డనియు స్ఫురణ) కాలుచేక్ = యమునిచేత; కోఁత = బాధ: - (నరకబాధకు జంకి యనుట) కడకుఁ దోలఁగక్ = నేను (చిత్రాంగినుండి) తప్పించుకొని రాఁగా; లతాంగి = చిత్రాంగి; కాలు... జేసెఁగా = కాలుసేతులు నఱకఁబడునట్లు చేసెను.

121. దొరలు = ప్రభువులు; తరళలోచనలు = స్త్రీలు; బాములను బెట్టితినొకో = కష్టములపాలు చేసితినో.

122. అరటము = పరితాపము; గగనభారతి = ఆకాశవాణి; ఆడలకు = విచారింపకుము; కడవనేరదు = తప్పించుకొనరాదు.

123. ధరమైక్ = భూకాంతదేహమున; మోహన ... రమై = ఇంపైన దొండపండునుబోలు అధరమువంటిదై; రిపు...త్కరమై = శత్రువులకు భయమును గొల్పు గుఱ్ఱములయొక్కయు, ఏనుఁగులయొక్కయు, వీరుల యొక్కయు సమూహము కలదై; మహా...కరమై = విస్తారమైన సంపదకు నిలయమై; కౌశాంబి = (ఒక పట్టణము) అమరుక్.

124. ఆజ్ఞా...శాలి = దండన శక్తి, న్యాయసంపత్తి, భుజబలము కలవాఁడు.

125. ఏవురు, సతులు = అయిదుగురుభార్యలు; భోగసతి = భోగకాంత: - పట్టపుదేవికంటె వేఱైన భార్య; మేలు వాఁడు = ఇష్టపడువాఁడు- ఆమెపై ఎక్కువ ప్రేమ కలవాఁడు.

126. వసుంధరామరాగ్రణుల్ = బ్రాహ్మణశ్రేష్ఠులు; వలంతి = నేర్పరి; పక్షమై = అభిమానముకలవాఁడై; వించుక్ = వినుచు; గారవించుక్ = గౌరవించును.

127. కొఱకొఱమంచుక్ = విరోధించుచు. దుష్ట...వంతుఁడు = చెడ్డదియు, మోసముతోఁగూడినదియు నగు నాలోచన కలవాఁడు; అంతకోపముఁడు = యమునివంటివాఁడు; తునుము...ముతోక్ = నఱికివేయవలె నన్నంత కోపముతో; ఉండును.

128. అట = తరువాత; అరిగినన్ = జరుగఁగా. ఉట = అక్కడ; ఉత్కటమ్మై = అత్యధికమై; ఉడుకునీరటువలెన్ = ఉడుకునీరు పొంగిన విధముగా; హెచ్చిరిలి = అభివృద్ధిపొంది.

129 గుట్టుగలదానిన్ = జాగ్రత కలదానిని! గట్టివాయి గలదానిన్ = నోటిగండ్రతనము గలదానిని; సంతనమునందున్ = ఏకాంతమునందు.

130. చలువల్...బము = మిక్కిలి చల్లనైన మైపూఁత; కన్ దని యన్ = కన్నులు తృప్తిపడునట్లుగా.

131. అయ్యు . యుగ్మము = ఆమెయొక్క రెండు చేతులు; తు స్తరించి=పొంగిపోవునట్లు చేసి; ఇంత చేసికొనుచున్ = పెద్దదిగా చేయుచు.

132. మతిమంతుఁడు, అని = బుద్ధికలవాఁ డని; పతి = రాజు; గర్వాన్వితుఁడై = గర్వించినవాఁడై.

133. పరులు = పైవారు.

134. కికురువెట్టి = మోసముచేసి; భువన...క్రిందన్ = ఉత్తము రాలైన భువనసుందరీదేవియొక్క మంచముక్రింద; నెగులు = విచారము; ఆర్పుమా = పోఁగొట్టుమా.

135. ఒనవెట్టుకొని = పొంచియుండి; లాగించెన్ = తీసికొని పోయెను.

136. నృపాలప్రియ = రాజుభార్య; లూలా...గయాళి=మాయల మారియు;కుచ్చితురాలు నగు నా ధూర్తురాలు; తనుం...పలెన్ = తన కేమి యును తెలియనట్లుగా.

138. కమ్మపువ్వుల = పరిమళించు పూవులయొక్క; సరాలు = మాలికలు; సైకముగాఁగన్ = సన్నముగా; చెలువీను = అందము గులుకు చున్న; కలపంబు = సొగసైన జమిలివస్త్రములకాంతి; వెళ్వసరన్=బయటికి చిమ్మఁగా; వింత...దుప్పటి = క్రొత్తతీరున నున్న వ్రాఁతపనిగల దుశ్వాలువ; తరువుసేయన్ = తొందరపెట్టఁగా.

139. నాతి = యువతి; కొన = అనుకొన - గోటఁద్రుంచి=గోరితో త్రుంచివేసి; విడెంబుసేయుచున్ = తాంబూలము సేవించుచు.

140. కలరవ...కులము = పావురములు, గోరలు, చిలుకలు, కోకి లలు - అనువీని కంఠధ్వను లనెడి సంగీతధ్వనులచేతను, కమ్మని పలుకులచేతను నిండినది; అకలంక . గంధిలము=కసటులేని జవాజి. కుంకుమము, కస్తూరి అను వానిచే సువాసన కలది; అఖిల...మంజులము = అన్నిచోట్లను తాపిన గొప్ప రత్నముల గుంపుయొక్క తళతళలచే అందమైనది; కేళిగృహంబు = పడు కటిల్లు.

141. కుంచె వైవన్=చామరము వేయఁగా; లామజ్జకవ్యజనము = వట్టివేళ్ల విసనకఱ్ఱ; ఊడిగము సేయన్ = సేవింపఁగా.

142. ధవళ...నుండి = తెల్లనైన చంద్రకాంతమణుల క్రొత్త తిన్నెనుండి; ఆ...కాంత=ఆ ధవళచంద్రుని భార్య; ధవునిరాక = భర్తవచ్చు టను; కుముదబాంధవుక్ = చంద్రుని; నిరాకరించు = అతిశయించు.

143. ఒఱపైన = అందమైన; మెలపైన=అందమైన; నెమ్మోము... మునక్ = ముఖచంద్రుని యెదుట; కమ్మ...మెఱుంగు = కమ్మలందలి దుద్దుల కాంతి; ఎమ్మె=విలాసము; భోగినీమణి = రాజుగారి భోగకాంతలలో ఉత్తము రాలు, ఉత్తమురాలైన ఆఁడుపాము.

144. కుటిలాలకక్ = వంకరముంగురులు గలదానిని - యువతిని; కూర్మి=ప్రేమ; అసలు...బొఱక్ = మిక్కిలి విస్తరింపఁగా; పొటమరిలక్ = మొలకలెత్తఁగా;

145. నీదండకుక్ = నీవద్దకు; వేదండగమన ! = గజగామినీ! సుమనః...ధరుండు = పూవుటమ్ములు దాల్చిన మన్మథుఁడు;

146. కలికి కరపల్లవము = తనభార్యయొక్క చిగురువంటి హస్తము; మెల్లన=మెల్లఁగా; తను ..తను = శరీరముల కలయికలచేఁ గలిగిన సౌఖ్యము వలని పరవశత్వముచేత; (మెల్లక్ = మెల్లఁగా; అతను...తను = మన్మథ సంబంధ మగు సంభోగసౌఖ్యమునందలి పరవశత్వము చేత నని విశేషార్థము.)

147. చెక్కడంపు సకినల = మణులు పొదిగి తయారుచేసిన పిట్టలు గల; గుజ్జరినేఁత = గుజరాతుదేశపు టల్లికగల; హొంబట్టుపట్టెడ = బంగారు

జలతారుగల పట్టునవారు; పచ్చ...బిళ్లలు = పచ్చని మొకమలు పట్టుతో కుట్టిన గుండ్రనిదిండ్లు; చప్పరము = పందిరి; పొంకపఱచిన = చక్కఁగా తయారుచేసిన;

148. ఎసయఁ గోరెడు = కలియుటకు ఉబలాటపడు బోటులక్ = చెలికత్తెలను; సరఁగన్ = తటాలున; పైఁబడన్ = భర్తపైఁబడఁగా - ప్రసరింపఁగా; తీయన్=(తాను) మళ్లింపఁగా; మర...చూపు=మఱల నాతనిపైకే పోవు గరువంపుదృష్టిని; పదరకుము; అనియెన్ = తొందరపడకుము - అని హెచ్చరించెను. చిట్టాడు = దోబూచులాడునట్టి; చేపట్ట...దమున్=నాథుని చేయి పట్టుకొనుటకు ఉబలాటపడుచున్న మనస్సును; ఆననము వంచి=ముఖము వంచి; మట్టుపఱిచెన్ = నిలిపెను; తమి=ప్రేమ హెచ్చినను = అధికమైనను; కన్నడన్ = ఉపేక్షాభావమున; తరితీపుపైన్ = బలవంతముమీఁద; వగలవారు = చమత్కారము కలవారు.

149. గళారవంబులు=రతికూజితములు; సరివలపు=అన్యోన్య ప్రేమ.

150. పెన్నెరులన్ = కురులయందు; పన్నీరు = చల్లని నీరు.

151. పడిగంబు = తాంబూలము ఉమ్మివేయు పాత్ర-పీకుదాను;

152. కనలుచున్ = కోపించుచు; అరనిద్దురతోన్ = కలఁతనిద్దురతో.

153. వితాకురాలు = నిశ్చేష్ట పొందినది.

154. ఒండాడన్ = వేఱే(ఒక)మాట చెప్పుటకు - ఏమి చెప్పుటకును; వెళ్ళివచ్చి = వెడలి వచ్చి;

155. మొకమజ్జనమై = ముఖము కడుగుకొని; చకచకలు = కాంతులు; పర్వఁగన్ = వ్యాపింపఁగా; తుకతుకతోన్ = కోపముతో.

156. వేత్రధరకోటి = బెత్తాలవారి గుంపు; నిజాయతదృష్టి = తన నిశితమైన చూపు; బలసి=చుట్టుకొని; పగిలిపాఱన్ = చెల్లాచెదరు కాఁగా; బరా...రలు = హెచ్చరికలు చెప్పుచున్నవారు;

157. వాక్రువ్వనేఱక = చెప్పలేక; నివ్వెఱ=ఎక్కువైన భయము; విసరంబులు = గుంపులు;

158. మఁతసంబునన్ = ఏకాంతమునందు; చౌరా...లారి=దొంగల కును, స్త్రీలకును విరోధి - చౌర్యమును, జారత్వమును కనిపెట్టువాఁ డనుట. అరిపోవన్ = నశింపఁగా - నశించునట్లు.

159. లయకాలుని లీలన్ = ప్రళయ కాలమునందలి శివునిరీతిని; పేర్చి = విజృంభించి; కంపిత మాన సాంగులై = వణఁకుచున్న దేహములు, మనస్సు కలవారై; అలుకన్ = భయపడఁగా; అన్=అనును-అనెను.

160. రాణువ = పరివారము; నీ పార్శ్వంబుగఁ జేసి = నీపక్షమున నుంచి.

161. లసమానునిన్ = ప్రకాశించువానిని - గొప్పవానిని;

162. ఇలాపతి = రాజు; కర్ణ...ఖలుగాన్ = చెవులకు ములుకు లుగా; దురాలాపంబులు = నిందావాక్యములు.

164. అడలుచున్ = భయపడుచు; గుడికొను = గిఱ్ఱున తిరుగు చున్న - క్రముకొని వచ్చుచున్న; క్రుక్కుకొనుచున్ = అణఁచుకొనుచు; ఉడువని సెంజిలిన్ = తగ్గని మనోవ్యథచేత; నుడువని = పలుకని — చెప్పని యట్టి;

164. తెంపుమైన్ = సాహసముతో; సుధీజనములు=విద్వాంసులు.

165. ధ్రువముగన్ = నిశ్చయముగా; రాణివాసమునన్ = అంతః పురమున; తద్భవనము = వానియిల్లు; ముట్టుకొల్గొని = ముట్టడించి; విభా వరిన్ = రాత్రియందు.

166. అలివేణి = స్త్రీ - (రాజుభార్య) జీవితేశుఁడు = భర్త, యముఁడును; మును = తొలుత;

167. సందడించుచున్ = తొందరపడుచు; శోకపయోనిధిలోన్ = దుఃఖసముద్రమునందు.

168. వనుఁ గర్మసాక్షిన్ = కర్మలకు సాక్షియైన వన్ను-సూర్యుని; బోయ = కిరాతుఁడు (రా జనుట), రోసి = ఏవగించి.

7

169. కొంచుంబోయి = తీసికొనిపోయి; తలయారులు= తలారులు; తునకలుగఁ = ముక్కలుగా: అపరాధహీనుఁడు = తప్పు లేనివాఁడు; ఉర్వీ ..వాహుఁడై = భూమిపై దట్టముగా నేర్పడు రక్తముయొక్కయు, కన్నీటియొక్కయు ప్రవాహము కలవాఁడై.

170. వేదన = బాధ.

171. అసురుసురై = మిక్కిలి శ్రమచెంది; ససువై = బలహీనుఁడై; అవనిసురుండు = బ్రాహ్మణుఁడు; నేరమి = తప్పు; ఉసురు మసక = ప్రాణము నిలుఁవక; ఉసురుమనక పోవునే = వేదనపడకుండునా !

172. మించి = అతిశయించి.

173. దుష్కర్మంబు = పాపకార్యము; ఈషన్మాత్రంబు = కొంచె మైనను; అశరీరవాణి = ఆకాశవాణి; సొరుగునన్ = మూర్ఛచేత.

174. మాయలది = మాయలాఁడి; ఎఱుక = జ్ఞానము; ఇంతియ = ఆఁడుది, ఇంతే.

175. కువలయనేత్రాత్మజుఁడు = స్త్రీలకు మన్మథుఁడు, రాజ కుమారుఁడు; అకుం•••ములు = గొప్పకాంతులు కల నగలు;

177. తనదు పేరిటి = సారంగధరుఁ డనెడి తన పేరుగల; కనలి = కోపించి; భువన...స్ఫూర్తిన్ = లోకసమూహమునకు భయము కలుగు నట్లుగా, నీటియందు పుట్టిన కమలములకు భయము కలుగునట్లుగా; రథాంగ వైరి = చంద్రుఁడు; ఎఱ్ఱవాఱెన్ - ఉదయసమయమున చంద్రుఁ డెఱ్ఱగా నుండుట ప్రసిద్ధము;

177. పిచ్చుకుంటుమీఁదన్ = కుఁటివానిపై; భాగీరథి=గంగానది; గగన...లహరి = ఆకాశమున నిగనిగ మెఱయుచున్న చంద్రుని వెన్నెల ప్రవాహము; ఉబ్బి = పొంగి; జొబ్బిలంగన్, నిండెన్ = పూర్తిగా వ్యాపించెను.

178. భాసురశీలుఁడు = ఉత్తమస్వభావము కలవాఁడు; అన్నగము పైన్ = ఆ కొండమీఁద; దీర్ఘారోదనవిరావము = పెద్దయేడుపు ధ్వని; ఈసరి...నెడన్ = ఈ అర్ధరాత్రియం దనుట.

179. పళికులాగ్రణి = తాపసులలో శ్రేష్ఠుఁడు; దీనా ..బుజుఁడై; దీనాధార = దిక్కులేనివారి కాధారమైనట్టియు; అమిత= విస్తారమైనట్టియు. కరుణామృత = దయ అనే అమృతముయొక్క ధారాధారేయ = గొప్ప ధారచే; వికసిత = వికసించిన; మనోంబుజుఁడై = హృదయపద్మము కల వాఁడై.

180. కెంజడలు = ఎఱ్ఱని జడలు, దిండుగాఁ జుట్టి = గుండ్రని దిండువలె చుట్టి; సింగినాదము కొమ్ము = ఊఁదుట కుపయోగించు నొక కొమ్ము వాద్యము. పంచ...పట్టె = అయిదు రంగుల పట్టునాడా—యోగులు ధరించునట్టిది; నిద్దపుమేనన్ = నున్నైన శరీరమున; పొడలయొడ్డాణంబు = పులితోలుపటకా; వెలిపట్టుగంత = తెల్లపట్టు బొంత; పైన్ = మీఁద; చికిలి లాతపుఁగోల = నున్నగా తీర్చిన యోగదండము; కక్షపాల= యోగుల సంచి, మూలికలు మున్నగువానితోఁ గూడిన సంచి;—భుజమున వ్రేలుచున్న సంచి; నెల...త్తులు = నెలరాల పోగులు; అవటుసీమన్ = పెడతలను; (అక్కడి మండి మెడలో ననుట.) సన్న.. సరములు = సన్నని గౌడదేశపు రుద్రాక్షల తావళములు; కుత్కీలము = కొండ.

181. తోఁగి = మునిఁగి; వేగుల్ ఘటిల్లన్ = బాధ కలుగఁగా; పాతకము = పాపకార్యము; చంద...బోలు = మన్మథునివంటి.

182. పాటు = కష్టము; కతము = కారణము; నిబద్ధిగాన్ = యథార్థముగా.

183. తాపసనాథుఁడు = మునిశ్రేష్ఠుఁడు; తాప సనాథుఁడు = తాపముతోఁ గూడుకొని యున్నవాఁడు; ఓవాటిల్లి = అలసిపోయి; ఉసురసు రనుచున్ = పరితాపము పొందుచు.

184. ఆర్చెదో = (నాసంతాపము) చల్లార్చెదవో; తీర్చెదో = (కష్టము) తొలఁగింతువో; ఓర్పుము = సహింపుము - క్షమింపుము; మానవుని తీవను = మనుష్యుని రూపమున; రాఁ గత మెయ్యది? = వచ్చుటకుఁ గారణ మేమి?

185. తలఁగి = తొలఁగి; ఎగఁబోసి = ఉన్నవి లేనివి చెప్పి; వెఱపు మాలి = న్యాయము తప్పి; దూఱువాఁడన్ = నిందింతును; వట్టిదూఱువాఁడన్ = నిష్కారణముగ నింద పడినవాఁడను.

186. మిట్టాడు = తిరుగుచున్న; సుధారసోక్తి = అమృతమువంటి మాట; ఈయెడన్ = ఈ సమయమున - (నీయెడకా = నీనుండి.)

187. కరచరణంబులు = కాలుసేతులు; తివియుచున్నవి = లాగు కొనిపోవుచున్నవి. కంతలుంతనంబు = గొంతుక నఱకుట; కీలాలంబులు = రక్తములు; చోపన్ = పోఁద్రోలుటకు; పోదుములు = అవస్థలు; మోళ్లు = మొండెములు.

188. అసదుగాఁ జూడకు = తప్పుగా భావింపకుము; అఘము = పాపము; అసదుగాన్ = దీనముగా; అలమట = బాధ; పాలియన్ = మరణించుటకు.

189. నీరు ..నము = నీరుగల కొలనివలె నిర్మలమైన మనస్సు; తలంకి = తొట్రుపడి.

190. తను...వలయున్? = శరీరము సెందుకు విడువవలెను? పురాకృతకర్మము = పూర్వజన్మకర్మము.

191. మందులు = మూఢులు; అసదుగాన్ = దీనముగా; ప్రాణము, ఇత్తు+అడలక వలదు = భయపడవద్దు.

192. అన...పాయుఁడు = వ్యర్థముకాని ఉపాయము కలవాఁడు; ఆశ్రి...పావకుఁడు=ఆశ్రయించినవారి అనేకము లగు ఆపద లనెడి వనము లకు కార్చిచ్చయినవాఁడు; లోకావనపాటవున్ = లోకరక్షణమున నేర్పుకల వానిని - శివుని; లేనివస్తువు = లభింపరానిది;

193. తనూరుధిరము = శరీరముపై నున్న రక్తము; తోమి = రుద్ది; నీరార్చి = స్నానమాడించి; తడిఁదోఁచి = తడిని బయటకు పోవునట్లు చేసి - అద్ది; ఉసురు = ప్రాణము.

194. క్రొలఁగఁ జిక్కినట్టి = త్రాఁగఁగా మిగిలిన; తరిపాలు=మీఁగడ పాలు; కంతము మోవఁగన్ = కుత్తుకబంటిగా; పనుపడి = స్వస్థపడి.

195. భువ . ధ్యుఁడు=జగత్ప్రసిద్ధ మగు గొప్పమహిమ కలవాఁడు; మత్స్యనాథుండు = మీననాథుఁడు. కర...త్పత్తి = పద్మములవంటి కాలు చేతులు కలుగుట; (భువన వనఁగా-నీరు - అయ్యెడ మహిమకలవాఁ డగుటనే పంకజోత్పత్తి సాధ్య మగుట ధ్వనితము.)

196. నెల = చంద్రుఁడు; తొవలు = కలువలు; విలవిలపడియెన్ = విలవిలపోయెను; పలపలనయ్యెన్ = పలుచనయ్యెను; దిశలు = దిక్కులు.

197. పాండురంబు = తెల్లనిది; శోణము = ఎఱ్ఱనిది; పాల్కడలిన్ = పాలసముద్రమునందు; అబ్జలశాయి = ఆ జలమున పరున్న విష్ణువు; నభోమణి = సూర్యుఁడు.

198. అలరాజు = ఆ రాజమహేంద్రుఁడు; నిలక = నిలువలేక; ఆ వేఁగునన్ = ఆ దుఃఖభారమున, అలక్ష్యరూపముగన్ = శ్రద్ధలేనట్లుగా; కాల్యప్రక్రియల్ = ఉదయము జరుపవలసిన విధులు, చాంచల్యంబుతోన్ = అస్థిరభావముతో.

199. తలవరులు = తలారులు; ధరణీ...వరులు = రాజులు; నృపు మోలన్ = రాజు నెదుట.

200. నెగులు = దుఃఖము; ఊరక = నిష్కారణముగా.

201. ఊఱడించి = ఓదార్చి; అనుటయుంక్ = పలుకుటయు; వెఱఁగు = ఆశ్చర్యము; కలఁగక్ = కలఁతపడఁగా.

202. అగ్గలమైన = ఎక్కువైన; తాల్మి = ధైర్యము - దీమసము; సామవచనంబులక్ = మంచి మాటలతో;

203. వేస ..కేఁతలు=మాయలమారికుచ్చితపుఁబనులు. అచ్చెరువు నొందక్ = ఆశ్చర్యపడఁగా.

204. టక్కు...వగలు = టక్కరితనపు చేష్టలు; కలదికలట్టె = ఉన్న దున్నట్లే. నీబుద్ధికొలఁది = నీబుద్ధికి తగినదే-తగిన శిక్షయే యనుట.

205. వంచాడించక = బెదరక; డించక = తగ్గనీయక. గట్టు వాయి= ధూర్తురాలు.

206. దేవర...వంబు = రత్నాంగి చేసిన మోసము; బారి=ఆపద; కువాళములు = కపట కృత్యములు.

207. కన్న...గాదు = (ఇది) కని, విని వింత కాదు; దబ్బు దిబ్బరన్ = అసత్యము పలికినను; కఱచినది = నేర్చినది; అడన్ = అక్కడ; ఈడన్ = ఇక్కడ; పగ్గించి = ప్రజ్ఞ వెల్లడించి; రాజకీరవాణి = రాచిలుక పలుకులు పలికిన చిత్రాంగి;

208. నేరక = తెలియక; బల్మి = బలాత్కారము; నంగనాచి = తెలిసియును తెలియనట్లు నటించునది.

209. భువ...మూర్తి = లోకైకసుందరుఁడు; చెనఁటి = నీచురాలు; కడద్రోచి = తప్పించుకొని;

210. ప్రచ్చి = చీల్చి-గీరి; లోన్ = మనస్సులో; పాపని=విడువని బాలుని; హంతవు=హింసించు వాఁడవు.

211. పాతకము=మహాపాపము; గగనభారతి = ఆకాశవాణి; నిలువక = ఆఁగిపోఁగా, భూతలపతి = రాజు; శోక...నసుఁడై = దుఃఖము నెడి కార్చిచ్చునకు మిత్రమైన వాయువునకు దూదియగుచున్న (=ఎగిరి పోవు చున్న) మనస్సు కలవాఁడై.

212. నిగ్రహించితిన్ = చంపితిని, నీతిమాలి = న్యాయములేక; సాశ్రునేత్రుఁడై = కన్నీళ్లతోఁ గూడిన కన్నులు కలవాఁడై.

213. బజారిడిమాటలు = అకతాయిమాటలు (చిత్రాంగి మాటలు); లీలాంగజునిన్ = విలాసమున మన్మథునివంటి వానిని; పోనాడు కొంటిఁగద!= పోఁగొట్టు కొంటిని గదా!

214. కుటిల...నాలిన్ = వక్రములు, తీవ్రములు, మలినములు, క్రూరములు నగు నడతల సమూహము కలదానిని: దుర్గుణ...నాలిన్ = దుర్గుణముల గుంపునకు జీవనాడి అయినదానిని; నాలిన్ = కుత్సితురాలను;

అతి...నాలిక్ = మిక్కిలి కపటము గల పూతనకుఁ జెలికత్తెయైన దానిని - (పూతనతో సమానురాలిని); చిన్నాలిక్ = చిన్నభార్యను - చిత్రాంగిని; నూకక్ = త్రోయుటకు.

215. రజ్జు...జేసి = త్రాళ్ళతో బిగించి కట్టి; మచ్చరముమైక్ = అసూయతో;

216. గచ్చుకొని = చుట్టుకొని; వెచ్చునకు, ఇచ్చువారు = ఖర్చున కిచ్చువారు - తిట్టువారు; ఎగ్గించు వారు = నిందించువారు; పాటులా? = శిక్షలా యనుట (చాల పనుట.) నిరాప...యించి=లేనిపోని నిందలు కల్పించి; సాహ...చైవ=ఆఁడు వారికి సాహస మాఱురెట్లు; తప్పనే?=అసత్యమగునా?

217. ఒండు = ఒక్కటి; తొడిబడక్ = బాధపడఁగా.

218. లేదు బంతి = అసత్యము; డెందము = మనస్సు- ఓపదుగా = తులతూఁగదు కదా!

219. కని, కరము, ఏది = కని గోముగా పెంచి; కనికరము, ఏది= దయమాలి; కలానికరము = న్యాయశాస్త్రాది విజ్ఞానముతోఁ గూడిన వివేకము యొక్క నికరము (సారము); మున్ = పూర్వము; వినుత...వహించి = కొనియాడఁదగిన గౌరవమున పేరుపొంది; ఇంకన్; ఇంకని = మాసిపోని; కఱ = మఱక - కళంకము. పొక్కిరి = దుఃఖించిరి.

220. ఉరక = ఊరక; పఱచ...పఱచన్ = పడరాని కష్టము పాలు చేయఁగా.

221. నూఱు...వంగన్ = నూఱు బారలలోఁ తున్నదా యనఁదగిన; నూతనె = నూతిలోనే; (నూతఁ...నుడువుము - లోకోక్తి)

222. మనుజేశుఁడు = రాజు. పల్వగలన్ = పెక్కువిధములుగా.

223. అన్వర్థనామవంతుఁడు = తగిన పేరు కలవాఁడు.

224. చేమించిన = చేయి దాఁటిపోయిన - జరిగిపోయిన. క స్తి... నొకో! = దుఃఖింపవచ్చునా?

225. కుమారిల నేల ? = క్రుంగిపోవనేల ? పసిండి ...మునన్ = శివుని యనుగ్రహమువలన; నీ...పమిన్ = నీవు చెప్పినట్లు చేయకపోవుట వలన.

226. నెరయంగన్ = చాలినంతగా; తెలుపనడక = చిత్రాంగి ప్రవర్తనము; పలుచనిపాటులు = పెట్టరాని కష్టములు; ఇవి, పలుచు+అని= (చిత్రాంగి) చెడ్డదని; పదరితిన్ = తొందరపడితిని.

227. నెట్టనన్ = యథార్థముగా; వెజ్జులన్ = వైద్యులను; గుణంబు చేసి = నయముచేసి.

228. అనుగులయి = అనుసరించినవారై; తెరువు = మార్గము; జాయాన్వితుఁడై = భార్యతోఁ గూడుకొన్నవాఁడై.

229. దండనంబిడిన చక్కి = శిక్షించిన చోటు; వసివాడిన = మిక్కిలి చిక్కియున్న; తెప్పిఱి = తేఱుకొని.

230. అరసి = వెతకి. కాపాడి; కానలోన్ = అడవిలో; రేయి = రాత్రి; మెగాల్ = మృగములు; ఎవ్వగన్ = ఏవిధమునను; నెవ్వగ = ఎక్కువ విచారము; పొదలన్ = అతిశయింపఁగా; తనయునికిన్ = కుమారునికి, తనయొక్క ఉనికి; పొగులున్ = దుఃఖించును; వనరున్ = దీనముగా పలవించును. వదన...రుహా! = ముఖముచే జయింపఁబడిన పద్మము కలవాఁడా! దైవమా, అనున్, దైవమాయను = దేవునిమాయను.

231. మొల్ల...తావులన్=మొల్లపూవుల సువాసనలు గల చోట్లను; లతా...గములన్ = తీఁగపొదరిండ్ల గుంపులందును; సుర...చాయలన్ = సురపొన్నచెట్ల నీడల జాడలందును; మాణిక్య...దరులన్ = మాణిక్యముల గుహాలయొడ్డులందును; పన్నీరు...వంకన్ = చల్లని నీటివాగుల ప్రాంతములందును; గాలి . కడలన్ = లేళ్లు నిలుచు స్థలములందును; కోనలకోనలన్ = అడవులమూలలందును; గవులన్ = గుహలందును; అరసి = వెదకి; తొరఁగు నశ్రులు = కారుచున్న కన్నీళ్లు; పసుచు...కొమరున్ = మన్మథుని అతిశయించిన చక్కఁదనము కల కుమారుని; విభుఁడు = రాజు; వెతకుక్ = దుఃఖము నకై - దుఃఖనివారణార్థ మనుట; వెతకున్ = వెదకును.

232. కాంతారంబు = అడవి; చరులన్ = కొండదరులయందును.

233. సాదు = సాధువు-మంచివాఁడు; మల్లులార ! = మల్లెలారా! (అర్థాం. సాదు = గరిడీలు సాధనచేసినవాఁడు - అనం దగినమేటికిన్, మల్లులార !=వస్తాదులారా !); మేలెక్కుడు రూపుదానికిన్ = మేలైన రూపసంపద కలవానిని (అర్థాం. - మంచి స్వారిచేయుఁ నేర్పుకలవానిని) మావులార ! = మామిడిచెట్లులారా ! (అర్థాం. - గుఱ్ఱములారా !) పేరక్కుఱనూని=మిక్కిలి యక్కుఱగలిగి; పెంపుగనినాతనికిన్ = పెరిగియున్నవానిని (అర్థాం. - మీచే పెంపఁబడినవానిని.) ధాత్రులార ! = ఉసిరికలారా ! (అర్థాం. - పెంపుడు తల్లులారా !) కొమ్మలార ! = చెట్టుకొమ్మలారా! (అర్థాం. - యువతులారా!) తమి మీఱు = ఉత్సాహ మతిశయించునట్టి (అర్థాం. - మీరు, తమికిన్ = వలపుతో.)

234. లేటికిన్ = జింకను; ఖండి = చంపి - (వ్యాఘ్రా)సురుని చంపి అని అర్థాంతరము.) హరుని పేరన్ = శివునియొక్క 'సారంగధర' నామముతో; ఎసఁగు = ఒప్పుచున్న. ఏణులార ! = జింకలారా !

235. నాళీకారికిన్ = కమలవిరోధియగు చంద్రునికి; ఒక్కజింక (మృగాంకుఁ డనుట ) ఏణాంబు = జింక; అంజనాకామికిన్=వాయుదేవునకు. (వాయువు మృగవాహనుఁడు ) కాళీకాంతునకున్ = శివునకు; ఒక్కలేడి (శివుఁడు సారంగధరుఁడు) ఇంకం గూడునే ? = ఇంకను జింక నిమ్మని యడుగ వచ్చునా ? మూఁడు ...రాకుఁడు ? అని లోకోక్తి.) [ఇది - పరుగెత్తి పోవుచున్న జింకలను జూచి రాజు పల్కినమాట.]

236. తరులార! = చెట్టులారా! చెంచు...లార!=చెంచు స్త్రీలారా! మాతమారునిన్ = మన్మథుని; హరులార! = సింహములారా! పవ...లార!= గాలిమేపరులగు సర్పములారా! (లేదా - జింకలారా !) చరులార! = కొండలోయలారా! లేటి...లార ! = పులులారా ! కరులార! = ఏనుఁగులారా ! మానిశంకరులార! = మునీశ్వరులారా! నదములార! = పడమటగాఁ బాఱు ప్రవాహములారా! చల...లార !=కదలుచున్న ఎఱ్ఱకలువలార! శుకములార !

= చిలుకలారా ! ప్రఫుల్ల...లార! = బాగుగా పూచిన మోదుగులారా ! మారు వచింపని = ఎదురు పలుకని;

237. కల...యంగన్=అంతటను వ్యాపింపఁగా; శ్రీగంధవాసనల్ = చందనపు పరిమళములు; చిక్కంగన్ = దట్టముగా; నిక్కంగన్ = వ్యాపింపఁగా; క్రమ్మంగన్ = వ్యాపింపఁగా; జడియంగన్ = జడివాన కురిసినట్లు; సుడియంగన్ = చుట్టిచుట్టి విసరఁగా; ఘన...టెంకులు-ఘనసార = మిక్కిలి సారమైన; ఘనసారభూజ = కర్పూర వృక్షములయొక్కయు; మృదుపటీర = కోమలములగు చందనవృక్షములయొక్కయు; మృగకుల=కస్తూరి మృగముల గుంపుయొక్కయు; సంకుల = పునుఁగుపిల్లులయొక్కయు; టెంకులు = నివాసములు. (సీసపాదములు నాల్గింటికిని క్రమాన్వయము.) అరసి=వెదకి, స్రుక్కి=అలసిపోయి; తద్గం...తాంగున్ = ఆయాపరిమళములతోఁ గూడిన శరీరము కలవానిని, కానకడలన్ = అడవిప్రదేశములందు; విచారించి=పరిశోధించి-వెదకి; కానక=చూడలేక; అడలన్ = దుఃఖింపఁగా.

238. తలవరులన్ = తలారులును; నెలవరులున్ = స్థలజ్ఞులును; ఖొలపరులన్ = ఖొలముల త్రోవ జాడ లెఱిఁగినవారును; మలలందులన్ = కొండలందును; నెలగొందులన్ = లోయల యిరుకుతావులందును; శిలసందులన్ = రాళ్ళసందులలోను; అరసితిమి = చూచితిమి.

239. కకావికలైన = చెల్లాచెదరైన; అరణ్యానిన్ = ఆ మహారణ్యమున; క్రమ్మఱివచ్చి = మఱల కాలుసేతులు కనఁబడినయెడకు వచ్చి; కామినీ...భూమిన్ = కామినులకు మన్మథునివంటివాఁడైన కుమారునియొక్క రక్తముచేత ఖురదగా నున్న స్థలమున; మహీజాని=రాజు; భుజా...చయుఁడై = తన భుజములచే కొట్టఁబడిన పెద్ద బండలగుంపు కలవాఁడై - బండలకు కొట్టుకొనునట్లుగా.

241. అక్కు+ఎండి = రొమ్మెండిపోయి; ఈరెలుంగై=హీనస్వరము కలదయి; నెఱులు=తలవెండ్రుకలు; కాల్పొక్కి=కాళ్లు బొబ్బలెక్కి; వసివాడి= మిక్కిలి వాడిపోయి; ఊర్పులవెక్కన్ = నిట్టూర్పుల వేఁడిమిచే; విమలాంగి= నిర్మలమగు శరీరము కలది - రత్నాంగి; అనున్.

242. కుడువం...యమ్మునన్ = తిని, కట్టుకొనుటకుఁ దగిన వయస్సులో;

243. కట్టిఁడి=క్రూరుఁడు; దొడ్డరాజు = గొప్పరాజు యొక్క;

244. అశరీరి = ఆకాశవాణి; వృథా=వ్యర్థముగా; పోలియ... నేమి? = చచ్చినను, చావకుండినను కూడ నొక్కటియే.

245. అలకలా? = ముంగురులా? చిట్టాడునాఁడు = తప్పటడుగులు వేయు కాలమున; నడయాడు = తిరుగులాడుచున్న; మమతన్ = ప్రేమతో; కదియన్ = సమీపింపఁగా - (స్వరమునుబట్టి కోయిల అనుకొని.)

246. మూర్ఛాక్రాంతుండు = మూర్ఛపోయినవాఁడు; సంతాపంబునన్ = దుఃఖములో.

247. వృథా = నిష్కారణముగా; జీవ...వచ్చితిని = ప్రాణములు తీయుటకు వచ్చితిని; సైఁచియున్ = క్షమించియు; అడఁగితోయి? = దాఁగియున్నావా? చీరుచున్ = పిలుచుచు.

248. ఇట్టట్టు=ఏదో విధమున-స్వల్పముగా; గాసి=బాధ; లలనలు = స్త్రీలు; ఏయరుదు? = దుర్లభమా? - కావలసినందఱు లభింతు రనుట, తనువు= శరీరము.

249. చదలు...కొల్కి=ఆకాశవాణి; పురారిపట్టి=శివునికుమారుఁడు; అలరిన = ఒప్పిన; దండన్=దగ్గరను; గాదిలిసుతుఁడు = ముద్దుకుమారుఁడు; దీమసము ఏది=ధైర్యము చెడి; తలంక నేటికిన్? = భయమంద నేల?

250. మేరు...దృష్టి=మేరువు విల్లుగాఁ గల శివునియొక్క అపారమగు దయతోఁగూడిన ప్రసన్నదృష్టి; కాయ...న్నది=మునుపటి శరీరమును పొంది - మహిమలు పొందు విధి యున్నది; అతనికిఁగాన్ = అతనికొఱకై; కుందకుఁడు = దుఃఖింపకుఁడు; ఏమి బ్రాఁతి? = ఏమి లెక్క? ధరన్=భూమిపై; శాశ్వతుఁడై, మనున్=స్థిరముగా నుండును.

251. అక్కఱపడి = అవసరము ఉండి; అంత = అంతయును.

252. మరులు = మోహము - పుత్త్రప్రేమ; పాలనసేయకునికి = పాలింపకుండుట; సరగునన్ = వేగముగా.

253. అనుమానము = సందేహము; వగల...వలదు = దుఃఖములచే కృశించి పోవద్దు.

254. తహతహవీడ్కొని = దుఃఖమును విడిచి; వైవారిన = పొందిన;

255. నిచ్చలు = ఎల్లపుడును; కృపాలుండై = దయగలవాఁడై; సగపాలు = సగముభాగము; నిష్ఠాసీనుండు = నియమముతోఁ గూర్చున్నవాఁడు; రేచ...ఖులును = శ్వాసము విడుచుట, పూరించుట, బిగబట్టుట అను ప్రాణాయామపద్ధతులును; కతిపయ = కొన్ని; అఖండగండోపలంబు = పెద్ద బండరాయి; మూఁడాతలంబునన్ = తలపయి;

256. మోసులువెళ్లి = మోపులెత్తి; చొకారములై=అందమైనవై; తలి.. గట్టి=చిగుళ్లను తిరస్కరించి - (ఎఱ్ఱని వయి అనుట.) తమ్ములయొమ్మెలు = తామరల విలాసములు; చూఱపట్టి = కొల్లగొని - వానిని మించి.

257. ప్రమోదించి = సంతోషించి; మాఱుపట్టి = మీనసాథుఁడు; పాటు అడఁగఁజేసి = శ్రమతీర్చి.

258. జుట్టవ్రేళ్లను = చూపుడు వ్రేళ్లను; లాతపుఁగోల = యోగుల చేతిదండము, అవలంబము, ఉడిగి = తన చేతి యాధారము వదలి; నాఁడు నాటికిన్ = దినదినమునకు, అలవడి = అలవాటుపడి; కొంకు = జంకు.

259. సిద్ధ . గట్టి = ఔషధసిద్ధులగు యోగుల గుంపునకు పెద్దఁ జేసి.

260. చెలులయాసలు = స్త్రీలపైఁ గోరికలు. క్షుత్పిపాసలు = ఆఁకలిదప్పులు; బంగారుగట్టు = బంగారు కొండ; మెట్టినది = త్రొక్కిన చోటు; (శరీరమునకు ముదిమి రోగము లేకుండఁజేయునది కాయసిద్ధి; పల్కినది జరుగుట వచస్సిద్ధి.)

262. సంప్రునన్ = అనుమతితో; మెట్టి = తొడిగి; పజ్జన్ = ప్రక్కను; విస్మయాన్వితులు = ఆశ్చర్యముతోఁ గూడుకొన్నవారు.

263. మొగములు తెలిసి = ముఖములు ప్రసన్నములయి; అలరిరి = సంతోషించిరి.

264. ఇక్కరణిన్ = ఈ రీతిని; నీచక్కిన్ = నీప్రక్కను.

265. రాక = వచ్చుట. రాజ్యభోగేచ్ఛన్ = రాజ్యము ననుభవింప వలె నను కోరికతో.

266. సర్వ......ఖ్యాతి = సమస్తభూమండలమును పరిపాలించెడి కీర్తి; తిరముగాన్ = స్థిరముగా - శాశ్వతముగా; గంధ...సేన = మదపు టేనుఁగుల గుంపులు, గుఱ్ఱములు, భటులు - మున్నగు సేన; జీవ...ప్రాప్తి = ప్రాణవంతమగు - (అనినట్లు జరిగితీరు) వాక్కులు లభించుట.

267. వంశకరుఁడు = వంశము నిలుపువాఁడు; తడవయ్యెను = జాలమాయెను; ఉపచరించి = ప్రార్థించి.

268. అచ్చటు = అచోటు; ప్రతి = సమానము.

269. గణుతింపన్ = కొనియాడఁగా; కుంభినిన్ = భూమిపయి; సదా = శాశ్వతముగ.

271. కలహో...నిధీ! = కలహో...హాల = యుద్ధము నారంభించుట యందలి సంతోషముచే; పులకిత=గగుర్పొడిచిన; భుజ = భుజములయొక్క; పరాక్రమ = శౌర్యముచే; ఆర్జిత = సంపాదింపఁబడిన; నానా.. నిధీ! = అనేకములగు జల, వన, స్థల, గిరి దుర్గములతోడి గొప్పరాజ్యమునకు నిధియైన వాఁడా? (రఘునాథరాయల సంబోధనము.)

272. శ్వేళ...శాల!=శివుని. చంద్రుని జయించు స్వభావము కల స్వచ్ఛమగు కీర్తి ఎక్కువగా కలవాఁడా! ధారాళ...భాంగణా! = ఎడ తెగక కారుచున్న మదజలము గల ఏనుఁగుల గుంపుచే ప్రకాశించుచున్న సభాభవనపు ముంగిలి కలవాఁడా! ఘనా...చోలగ!— ఘన = గొప్పవై; అవేల = హద్దుమీఱిన; గరిష్ఠ = గొప్ప; దాన = దానములతోను; పదవీ =

పదవుల (ఉద్యోగముల)తోను; పరితోషిత = సంతోషపెట్టఁబడిన; కాళగాత్రమీ చోళ = కాళేశ్వరము, గోదావరీ ప్రాంతము, చోళదేశములందలి, కవి = కవులయొక్కయు; ద్విజ = బ్రాహ్మణులయొక్కయు; స్తుతివచోలగ! = స్తోత్రవాక్యములను పొందినవాఁడా! — వారిచే స్తుతింపఁబడినవాఁడా! చోలగ...భంజనా! = చోలగుని గర్వమును నశింపఁజేసినవాఁడా!

273. అరాతి...పాణా! = శత్రురాజులను ఛేదించుటలో ప్రకాశించు కత్తి కలవాఁడా! నరా...బాగా! = రాజురూపున నున్న మన్మథుఁడా! స్థిరా...రీణా! = సీతారాముల సేవయందాసక్తి కలవాఁడా! విరాజ...వీణా! = ప్రకాశించు నరువదినాలుగు కళలయందును నేర్పరి యగువాఁడా! - రఘునాథరాయా!

# అనుబంధము-I

కొన్ని ప్రతులలో మాత్రము గన్పట్టు పాఠాంతరములు.

## ప్రథమాశ్వాసము.

1-వ పద్యమునకు ముందు కొన్ని ప్రతులలో,

క. శ్రీధుర్యశౌర్యధైర్య
శ్లాఘరమూర్ధన్య యాదిగర్భేశ్వర వి
ద్యాధిక వితరణదీక్షా
రాధాసుత యచ్యుతేంద్ర రఘునాథనృపా.

అను పద్యమును, "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా..." అను వచనమును కలవు.

2. ఒక ప్రతిలో ఆరంభములో 1-2 పద్యములకు మాఱు,

"ఉ. శ్రీసతిపత్యుఁ డైన సరసీరుహనేత్రుఁడు...ఆ
బ్జాసన పాకశాసనహుతాశన ముఖ్యసురేంద్ర రక్షితో
ద్భాసదయాసముద్రుఁడు సదానతరుద్రుఁడు భద్రుఁ డర్మిలిన్
భాసురలీల లోకములు ప్రస్తుతికెక్కఁగఁ బ్రోచుఁగావుతన్.

చ. ఘనతమ చంచరీకపరికల్పితవేణి శుకానురాగసం
జనితవిపంచికాకలితసారసవా(పా)ణిసుధాసమగ్రసు
స్వనయుతమంజువాణి వరచారువిలోకన హంస...ణి యా
వనజజురాణి...మృదువాక్యసమృద్ధి యొసంగుఁ గావుతన్.

క. త్రిజగన్మంగళదాయకు
నిజభక్తత్రాణనిరతు నిర్మలచరితున్
అజమునిపూజితచరణుని
గజముఖుఁ దగు నేక దంతు గణపతిఁ గొలుతున్.

సీ. వరవేద శాస్త్రార్థ వల్మీకి వాల్మీకి
వాసుదేవస్తుతోల్లాసు వ్యాసు
రమణీయగాత్ర ప్రభారవిభారవి
గరపీరకరకంఠ హృదయు వ్యాసుఁగాళిదాసు (?)
పద్మాకటాక్ష సంభవభూతి భవభూతిఁ
తార్కిక చర్చితోద్దండి దండిఁ
గలితశబ్దార్థ సంఘట్టు నన్నయభట్టు
భీమలజ్జకవిధ్వాము భీము
సుజననుతరాజ తిక్కనసోమయాజి
భూరు కవిరాజు బమ్మెరపోతరాజు
మొదలుగాఁ గల సుకవుల పదములముగఁ
దలఁచి యంజలిగావించి తగ నుతించి.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవిజనవందనంబును గావించి యే నొనర్పం బూనిన సారంగధరోపాఖ్యానంబునకుఁ గథాప్రారంభం బెటువలె నుండెను.

సీ. ద్విజరాజవిలసనోత్తేజమై యుండియు
నక్షత్రశూన్యపుణ్యాచయంబు
చక్రేశ్వరానంద సంయోగమయ్యును
పంకజవిధ్వస్త భాసురంబు
ఆర్యసంశ్రయధామమై యొప్పచుండియు
విగతవిరూపాక్ష విమలతలము
శూద్రసత్తమ వర శోభితంబయ్యును
శూద్రకరహితవిశోక యంతము
ఖండనోద్దండమండలాఖండ తండ
చండదోర్దండపాలితమండలంబు
మలయుమాలపదేశసన్మధ్యమంబు
సాంద్రసుకరము రాజనరేంద్రపరము.

వ. అందు." అని యున్నది.

3. ఈ క్రిందిపద్యములు లొక ప్రతిలో నుండి మఱికొన్నింట కన్పట్టి కున్నవి; (సంఖ్యలు ఇప్పటిముద్రణమున పద్యముల సంఖ్య.)

5-వ ప. 'ఆఙనికిన్...తిలకంబుల్.' దీని నాలవపాదమున "ధీతిలకం బలరఁగా సుధీతిలకఁబుల్" అని శ్రీ . పిచ్చయ్యశాస్త్రిగారి పాఠము.

14. నెలపూదాలుపు . లేదే.

15. ఒక ప్రతిలో లేదు.

21. ,, 39, 50, 51, 55-లు లేవు.

62, 63, 64 ,, లేవు. వానికి మాఱుగా వేఱొకపద్య మున్నది. (చూ. పుట 38, అడుగున.)

4. 65-వ పద్యము మొదలు 113-వ పద్యమువఱకును గల పద్యములకు మాఱుగా ఒక ప్రతిలో నీక్రింది పద్యములు కలవు:

"క. సామీ! పులుఁగులు మన వన
సీమల వింత లయి చేటఁ జేరిగిన పగిదిన్
ఆముకొని యిటుల తెరపలి
తామే తూశ్చె త్తినట్లు జనరిన వెందున్.

క. భూమీధవ మెకములు వన
భూమిని శ్రీరాముసేనపోలిక నెందున్
భూమీనిసగతి నున్నవి
వామలు మీరు...వచ్చి...నె గనన్.

క. అనినన్ రాజమహేంద్రుఁడు
కనుగవ ననురాగరసము గాన్పింప వడిన్
చనుదెందు పయనమై యట
కని యట సారంగధరున కనురక్తిమెయిన్.

మ. యువరాజా వనభూమికేగి యచట న్నుద్దండ మహాజీవముల్
...కల్లుమెకంబులం బుల్గ (?)ల ..సాధించి వేత్రుంచి భూ
ధవ హృద్యంబగు వేట నామదికి నుత్సాహంబు పుట్టించి నీ
యువరాజ్యంబును రాజ్యమున్ ప్రియముచే నొప్పారఁ బాలింపుమా.

క. అని కొన్ని రాజనీతులు
గొనకొని సుతునకుఁ దెల్పి కూరిమి మంత్రుల్ (?)
అనుమతి సేయఁగఁ దన దగు
మనమున కెనయైన హయము మహిఁ బాఁ గొనియెన్

ఉ. అంతట వాహయోత్తమము నామహీవల్లభుఁ డెక్కి వేడ్కచేఁ
బంతముతోడ సద్భటులు బల్లిదులై కొలువర్లు గొల్వఁగాఁ
గొంతల జాగిలంబులను జేకొని పోరులు రాఁగ నేఁగెఁ దా
సంతస ముప్పతిల్ల మృగసంఘము లున్న వనంబులోనికిన్.

లయగ్రాహి :—

ఈరములు దూరుతరి పేరెములు వారుచును
మారుకొను బెబ్బులులు కారెనుములున్ భూ
దారములు లేళ్లు జోకారయగు దుప్పులును
కారుకొనుదున్నలు నపార మగు జింకలును
భీరమున నుండఁగ బటార మగు వింటఁ బెను
నారి మొరయింపుచు మిరామగునమ్ములన్
సాదె నిగుడించి పరివారములు మెచ్చఁ బరి
మారిచె మృగావళుల భూరమణుఁ డంతన్.

గీ. గండభేరుండ చమరవేదండ సింహ
శరభశంబర ఖడ్గాది వరమృగాళి
దునిమి తూటాడి మహిభర్త తోరమైన
వేఁటకై చనె దండకావిపినమునకు.

క. అలయుచు జనపతి చల్లని
జలములు గలకొలను గాంచి జలమాని ముదం
బొలయఁగఁ దత్తీరంబునఁ
బలపల విరు లురుల పూల పందిరిలోనన్.

క. శయనించిన శైత్యం బతి
శయమౌ మందానిలంబు సౌరభయుతమై

నయ మొలయుచు నొలయఁ గుశే
శయకర్ణిక మారుకొనుచు జనపతి యుండెన్.

సీ. అంత నక్కడఁ బార్థివాధిపసూనుండు
తన చెలికాండ్ర నందరను బిలిచి
మంత్రినందనులు తన్న(న్ని)ంచి గొలువఁగ
నుత్సవం బేపార నుచితవృత్తి
నొనర నాటలఁ బాటలనదేటతో మాట
లమరంగ జంత్రవాద్యములు వెలయ
జూదంబు జనన చోద్యంబులను ప్రొద్దు
గడపుచు బెడిదంపు గడిమి దనరు

గీ. మత్తకరులను బోరించి తత్తరమునఁ
దగరులను దాక వేయించి ధైర్యమహితు
లైన మల్లురఁ బెనగించి యాదరించి
డెందమున మోదము ప్రియంబు పొందు పడఁగ.

క. శ్రీరంగధాము కృపనిటు
సారంగధరుని చరిత్ర సక్కవి జన హృ
త్సారంగాభేద్యదకను
సారంగా నార్యజనుల సమ్మదలీలన్.

కొన్ని ప్రతులలో 71, 72, 73 పద్యములకు మాఱుగా 74 మాత్రమే యున్నది.

కొన్ని ప్రతులలో 93, 94, 95, 98, 101, 103, 104, 106 లు లేవు.

„ 121 సీసపద్యపాదములు తాఱుమాఱుగ నున్నవి.

„ 135 తర్వాత ఆశ్వాసాంతపద్యములు లేవు. ద్వితీయాశ్వాస మారంభింపఁబడినది.

## ద్వితీయాశ్వాసము.

1-వ పద్యమునకు మాఱు తృతీయాశ్వాసాది 'శ్రీధుర్య' అను పద్యము కలదు.
కొన్ని ప్రతులలో ద్వితీయాశ్వాసము 2-ప.తో ప్రారంభ మగుచున్నది.

„ 19, 20 లేవు.
„ 25, 26, 27, 28, 29 నిపాతము.
„ 40 లేదు.
„ 44, 45 లు 45, 44 లుగా ముందు వెనుకలై యున్నవి.
„ 47 నుండి 50 వఱకు గ్రంథపాతము.
„ 47 ఎ. గీ. నుండి 59 వఱకు గ్రంథపాతము.
„ 70 వ పద్యము 72-కు తర్వాత నున్నది.
„ 92 లేదు. కొన్నిట 92 మూఁడవ పాదమునుండి
93 మూఁడవపాదము వఱకును గ్రంథపాతము.
„ 110 పాతము.
„ 120 పెద్దపాదములు 3, 4 ముందువెనుకలుగా నున్నవి.
„ 143 లేదు.
„ 161, 162, 163 ప.లు లేవు. ఒక ప్రతిలో నిందు
గ్రంథపాతము కలదు.
„ 172 మొదలు 179 వఱకు కొన్నింట గ్రంథపాతము.
„ 207 కొన్నింట లేదు.
„ 230 - వచనము కొన్నింట లేదు.
„ 255 - ప. కొన్నింట లేదు.

## తృతీయాశ్వాసము

ఇందలి మొదటి పద్యమునకు మాఱు ద్వితీయాశ్వాసాదిపద్యమును
దానికి మాఱుక్కడనిదియును కొన్నింట కలదు.

„ 31 వ ప. లేదు.
„ 45 „
„ 52 „

కొన్నిప్రతులలో 60 వచనమునకు తర్వాత ముద్రితప్రతులలో "మతకరి మాటలు" అను 62-వ ప. ఉన్నది.

" 65 ఒక ప్రతిలో లేదు.

" 70, 77, 78 పద్యములు కొన్నిట లేవు.

" 91 ప. కొన్నిట లేదు; కొన్నిట అధిక పాఠ మని యున్నది.

" 91 మొదలు 97 వఱకును. ఒకప్రతిలో లేవు.

" 96-కు తర్వాత 106-వ పద్యము కలదు.

" 106-వ ప. 96-కు తర్వాత నున్నది.

" 111 ప. లేదు.

" 137 వచనము లేదు.

" 141 తర్వాత "వ. అంత" అని కలదు.

" 143-వ ప. లో 2, 3 పాదములు ముందు వెనుకలుగ 3, 2-లుగ నున్నవి.

" 153-లో "వేసియు...యల్లలన" అను సంతవఱకు కొక ప్రతిలో గ్రంథపాతము.

" 166-వ ప. లేదు.

, 172-వ ప. తో నొకప్రతి యంతరించినది.

" 196, 197 ప. లు కొన్నిట లేవు.

" 229-వ ప. ఒకప్రతిలో లేదు.

" 236, 237 ప.లో రెంటను 2-వ పా. 4-వదిగాను,3-వది 2-వదిగాను, 4-వది 3-వదిగాను తాఱుమాఱై యున్నవి.

" 253 "అధిపసమ్ము...వలదు" అను పాదములకు బదులుగా నొకప్రతిలో "చివురుఁగాలుఁ గేలుగవదోయి వచ్చి యుంపెసఁగు మీఁద నమ్మునీంద్రుకరుణ" అని యున్నది.

కొన్ని ప్రతులలో 259-వ పద్య మొకప్రతిలో లేదు.
,, 271-వ ప. మొకప్రతిలో 272-వదిగా నున్నది.
తృతీయాశ్వాసాంతపద్యములకు మా జీక్రింది పద్యములు
ఒకప్రతిలో కలవు.

మ. హారకోదండనిదారణా రఘుకులా
ధ్యక్షావిశాలాక్ష భా
సుర కౌసల్యకుమారకాజ నకాంశుభ (?)
వత్ ప్రతాపాఢ్య సం
సరణాబ్ధితరణిరుణిను జరధ
శార్ఙ్గాది దివ్యాయుధా(?)
కరుణాసాగరపూర్ణచంద్రకరిఖ
గరాట్కంకశరణామర్త్యాకృతీ. (?)

క. నవ వికసిత పక్షా (?)
ప్రవిమల శ్రీవత్సవక్ష పద్మాధ్యక్షా
భవహార శ్రిత సురపక్షా
భవనుత గజరాజపక్షభార్గవ శిక్షా.

మాలిని. సురుచిరమణిభూషా సూర్యపుత్ర ప్రపోషా
సురముని జలసేవ్యా సుస్థిర...ల్యకావ్యా
అ...అంబ ..నా...జువిదారా అబ్ధికన్యావిహారా
భరిత శుభ సుశీలా బాలగోపాలబాలా.

# పద్యకావ్యములు



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చ తెనుఁగు రామాయణము | ... | 2 | 8 |
| అనంతుని ఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యునిది... | ... | 1 | 0 |
| అనుభవసారము, పాలకురికి సోమనాథప్రణీతము | ... | 1 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) సటీక | ... | 8 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక ... | | 1 | 12 |
| ఆంధ్రమహాభారతము:— | | | |
| ఆదిపర్వము, టీక (పాతది) | ... | 8 | 0 |
| ఆదిపంచకము | ... | 11 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వం | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆరణ్యపర్వము | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆనందరంగరాట్ఛందము, మూలము | ... | 2 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 4 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 4 |
| కవికంఠోక్తి | ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ |
|---|---|---|---|
| కవిజనాశ్రయము | ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | ... | 1 | 4 |
| కవిజనరంజనము | ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము, సూరనార్యునిది | ... | 4 | 0 |
| డిటో టీకతో | ... | 6 | 0 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| క్రీడాభిరామము, శ్రీవల్లభరాయప్రణీతం... | | 1 | 8 |
| గయోపాఖ్యానము, ద్విపద (కృష్ణార్జునసంవాదము) గోపమంత్రిది | ... | 0 | 8 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) | ... | 2 | 0 |
| జైమినిభారతము | ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 4 |
| దసరాపద్యములు | ... | 0 | 3 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధనాభిరామము | ... | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు | ... | 2 | 4 |
| నాచికేతోపాఖ్యానము, మల్లికార్జునకవి | ... | 1 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 12 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టు బాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్ చెన్నపురి. 1.